# ప్రేమ సాగరుడు
# అవతార్ మెహెర్‌బాబా
# జీవిత చరిత్ర

## 2వ భాగం

రచయిత :
నిట్టు భీమశంకరం

ప్రచురణ :
అవతార్ మెహెర్‌బాబా
ఆంధ్ర సెంటర్ — కాకినాడ

అవతార్ మెహెర్ బాబా
జీవిత చరిత్ర 2వ భాగం

ఈ రెండవ భాగము
అవతార్ మెహెర్ బాబావారి
16వ అమరతిథి పవిత్ర దినమున
ప్రకటించడమైనది

అవతార్ మెహెర్ బాబా-ట్రస్టు
అహమ్మద్ నగర్ వారి-
సౌజన్యముతో



ముద్రణ :
స్వతంత్ర ఆర్టు ప్రింటర్స్,
మాచవరం పోస్టు, విజయవాడ-4.



అవతార్ మెహెర్‌బాబా

అవతార్ మెహెర్ బాబా కీ జయ్

# ముందుమాట

భగవంతుని లీలలు చిత్ర విచిత్రములు మూగవానిని వాచాలునిగను, కుంటి వానిని గిరిశిఖరము నధిరోహించునటులను చేయును.

ఏ దివ్యశక్తి యీ లోకమున ధర్మచ్యుతి కలిగినపుడెల్ల రామ, కృష్ణ, బుద్ధాది రూపముల నవతరించి, దుష్టశిక్షణ, శిష్టరక్షణ, ధర్మ ప్రతిష్ఠాపన మొనర్చెనో, ఆ దివ్యశక్తియే నేటి యుగమున శ్రీ అవతార్ మెహెర్ బాబా రూపమున అవతరించి, యీ లోకంలో ప్రేమ బీజాలు వెదజల్లినది. గత యుగాలలో తాను నాటిన ప్రేమ, ధర్మ మార్గాలు కాలక్రమమున అడుగంటగా, నేడు వాటికి పునరుజ్జీవనం కలిగించి, మానవతను మేల్కొల్పి, వారి గమ్యస్థాన మేమిటో తేటతెల్లముగ వివరించి, తిరిగి తాను భూలోకంలో అవతరించు వరకు వలయు విశ్వప్రణాళిక నేర్పరచినారు, శ్రీ మెహెర్ బాబా.

ఆయన కేవలం మన కొరకై యీ భూమిని అవతరించిన కరుణామయుడు. ఆయన తన దివ్యాధికారముతో 'తానే ఆ పరమాత్మ'నని వక్కాణించినారు.

ఆ దయామయుడు ప్రపంచమంతా పెక్కు పర్యాయములు పర్యటించిరి. పెక్కురకు తన దర్శన, స్పర్శన భాగ్యముల ననుగ్రహించిరి. ఆ దివ్యపురుషుని జీవిత చరిత్రను పెక్కురు ప్రేమికులు రచించిరి. అట్టి వారిలో ఆంధ్ర దేశమందలి శ్రీ నిట్ట భీమశంకరం గారొకరు. వారు పెక్కు సంవత్సరములు శ్రమించి, అనేక గ్రంథములను పరిశీలించి, పెక్కురి అనుభవములను గ్రహించి, అనేకుల డైరీలను చూసి, దాదాపు అయిదువేల పుటల గ్రంథాన్ని రచించిరి. తెలుగు వారికి వారిచ్చిన యీ కానుక చిరస్మరణీయము.

కీర్తిశేషులు బాబా ప్రేమికులునైన శ్రీ N. V. రమణయ్యగారు మిక్కిలి శ్రమకోర్చి, యీ గ్రంథము యొక్క మొదటి సంపుటాన్ని ప్రచురించిరి. రెండవ సంపుటము ముద్రణ కాక పూర్వమే ఆయన బాబాలో లీనమైరి. తత్ఫలితముగా యీ గురుతర బాధ్యత బాబా ప్రేమికుల భుజస్కందములపై పడినది.

బాబా ప్రేమికుల ఆంధ్ర సెంటరు సహవాస్ సమావేశం నిజామాబాదులో ఏప్రిల్ 1979 జరిగినప్పుడు సోదరులు ఆది కే. ఇరానీ, జాక్ సి. స్మాల్ గార్ల సమక్షంలో యీ గ్రంథ ముద్రణను గురించి కొన్ని నిర్ణయములు గైకొనబడినవి. అవి, బాబా ప్రేమికులు అచ్చువేయబోయే ప్రతి సంపుటమునకును ముందుగా కనీసం ఒక వంద రూపాయలు యివ్వవలయుననీ, గ్రంథం అచ్చు అయిన తరువాత ఆ వంద రూపాయలకు ఎన్ని ప్రతులు వచ్చునో అన్ని ప్రతులు ఆ ప్రేమికునకు యివ్వబడుననీ, ఆ ప్రేమికుడు ఆ ప్రతులను అమ్మవచ్చును లేదా కానుకగా యివ్వవచ్చుననీ — ఈ రీతిగా ఆ ప్రేమికుడు అటు తరువాత ముద్రించబోయెడి ప్రతి సంపుటము యొక్క ముద్రణకూ — గ్రంథ ముద్రణ పూర్తి అయేటంత వరకు ప్రతి పర్యాయమూ వంద రూపాయలు అడ్వాన్సుగా యిచ్చుచుండవలయుననీ.. నిర్ణయింపబడినది. ఈ విధముగు ముద్రణ బాధ్యత అవతార్ మెహెర్ బాబా ఆంధ్ర సెంటరు తరఫున నన్ను వహించమని కోరుట ద్వారా, నాడచ్చట సమావేశమైన బాబా ప్రేమికులు, బాబాను యీ రీతిగా చిరస్మరణీయముగా నుండెడి విధముగా సేవించెడి సదవకాశమును, నాకు కలుగజేసి, నన్ను బాబా సేవలో ధన్యునిగా నొనర్చిరి.

ఆంధ్ర, ఆంధ్రేతర ప్రాంతాలలోని ఆంధ్ర ప్రేమికులు, నాతో సహకరించి, బాబా సేవలో తోడ్పడుతారనే విశ్వాసముతో నేనీ గురుతర బాధ్యతను స్వీకరించితిని. అనుకొన్న ధనం చేతికి రాకపోయినప్పటికీ, గుంటూరు సహవాస్ లోనే సోదరులు ఆదీ చేత యీ రెండవ సంపుటాన్ని ఆవిష్కరింప చేయిద్దామనుకొన్నాము. కాని అటుల జరగలేదు. ఏది ఎప్పుడు ఎటుల జరుగవలయునో ఆయనకే తెలుసు.

ఇప్పుడీ రెండవ సంపుటాన్ని మీ ముందుంచు చున్నాను. స్వీకరించుడు.

ఇట్లు
చింతా సర్వారావు

జై బాబా

# అవతార్ మెహెర్ బాబా చరిత్ర

## రెండవ భాగము

*గుప్త గ్రంథము :*

పాశ్చాత్య శిష్యులచే బాబా పరివేష్టింపబడి యుండగా ఒకనాడు బాబా "నేను మౌనం పూనిన వెంటనే ప్రారంభించి ఒక సంవత్సరంలో వ్రాసి ముగించిన పుస్తకము ఇప్పుడు ఒక బ్యాంకులో సురక్షితముగా నున్నది. నేను చెప్పినప్పుడే దీనిని బయటకు తీయవలెను అని నా యాజ్ఞ అందులో మొదట సంపూర్ణ మానవుడు మరల మరల ఈ భూమి మీదే గాక అనేక లక్షల భూములమీద లక్షల సార్లు ఎట్లు జన్మించుచుండునో అందుచేత, ఎట్లు అతనికి వయసు. కాలమును లేవో ఈ పుస్తకమునందు తెలుపబడినది శాస్త్రజ్ఞులు యీ విషయములు గ్రహించుట ముఖ్యము. అందుచేత కాలము, యుగవిభాగములు, భగవత్సాక్షాత్కారము గురించి ఈ భూమియొక్క స్థానము, భూమియొక్క అంత్యకాలము, ఆ సమయం లోనే భూమి క్రొత్తగా పరిణామము చెందుట, మొదటి మానవుని యొక్క పరిణామము, భగవంతుడు మొదటిసారిగా తెలుసుకొన బడుట, గుడ్డు ముందా, కోడి ముందా అనే సమస్యకు జవాబు మొదలయిన విషయములు 1926 సం॥లో రచింపబడిన ఈ గ్రంథమునందు విపులీకరింపబడినవి". అని వివరంగా చెప్పారు.

బాబావద్ద వుంటే ఎన్నో నేర్చుకోవచ్చు. ఎప్పుడు నిశ్శబ్దంగా వుండాలో, ఎప్పుడు నవ్వాలో, ఎప్పుడు సంతోషంగా వుండాలో, ఎప్పుడు ఉత్సాహం కనపర్చాలో అన్నీ తెలుస్తాయి.

ఒకరోజున ఒక ముఖ్యవిషయం గురించి బాబా కిట్టీని పిలిచారు. అకస్మాత్‌గా బాబా ఆమె చెప్పేది వినడం మానేశారు. బాబా ఆయన అక్షరఫలకంమీద "నీవు చెప్పేది నేను వినడంలేదనుకోకు. నేను చైనా నుంచి వస్తూన్న ముఖ్యమైన సందేశాలను అందుకొంటున్నాను." అన్నారు. వారు సరిగా అప్పుడు చైనా గురించే మాట్లాడుకొంటున్నారు. అప్పుడు బాబా శాన్‌ఫ్రాన్సిస్కో [కాలిఫోర్నియా]కి వెడదామని అక్కడ నుంచి చైనా దేశానికి వెళ్ళడానికి ఆలోచిస్తున్నారు. చైనాలో

ఒక ముఖ్యమైన ఆధ్యాత్మికపు పని నిమిత్తం హెర్బర్టుతో మాట్లాడాలని అంటున్నారు.

ఈ సంభాషణ అయిన తరువాత బాబాకోసం ఏదో చెయ్యాలని ఏర్పాటు చేసింది. ఆమె బాబాను—

"బాబా ! నా చేత ఇలా చేయించేది ఏమిటి ? మీ కున్నటువంటి పర వశీకరణ శక్తియా లేక నాకు మీయందున్న ప్రేమా ?" అని అడిగినది. అందుకు బాబా—

"ప్రేమ; అత్యున్నత స్థాయిలో వున్న ప్రేమయే" అని జవాబిచ్చారు.

లండన్ డెయిలీ పత్రికా విలేఖరికి బాబా ఇంటర్‌వ్యూ యిచ్చారు. ఈ సంభాషణ వివరాలు ఆ పత్రిక ఏప్రిల్ 13వ తేదీ సంచికలో ప్రచురింపబడినాయి.

బాబా :– "నేను ఒక మెస్సయ్యనని మీరు అక్షరాలా శబ్దార్థ ప్రకారంగా తీసుకోకండి" అన్నారు. పడమటి లండన్‌లో వారి గదిలో కూర్చుని యుండగా ఈ మాటలు బాబా చెప్పారు. బాబా తెల్లటి సద్రా తొడుగుకొని ఉన్నారు.

మండలిలో ఒకరు :– విలేఖరికేసి తిరిగి "మీరు మంచివారని బాబా అంటున్నారు. మిమ్మలను కలిసినందుకు బాబా సంతోషిస్తున్నారు."

విలేఖరి :– ఆంగ్లేయులకి మీ సందేశం ఏమిటి ?

బాబా :– పాశ్చాత్య ప్రపంచము భౌతికత్వమే ప్రధానంగా తీసుకొంటోంది. అయితే అది పూర్తిగా చెడ్డదికాదు. మన జీవిత వికాసానికి అది విలువయినదే. కాని పాశ్చాత్యులు ఆధ్యాత్మిక సత్యాలకేసి తిరగాలి. మతాలతోను, చర్చిలతోను సంబంధం లేకుండా ఆధ్యాత్మికత్వానికి చెందిన జీవితంలో ఒక స్థానం వుండాలి.

విలేఖరి :– ఎప్పుడు మీ సందేశం ప్రపంచానికి బహిరంగంగా ఇవ్వగలరు ?

బాబా :– ఒక నెలలో నేను అమెరికాకు వెళ్ళుచున్నాను. అక్కడ నేను మౌన విరమణ చేయడానికి సాధ్యం కావచ్చు.

విలేఖరి :– మీ వద్దకి వచ్చి అడిగినవారికి మీరు ఏమి బోధిస్తారు ?

బాబా :– వారి వ్యక్తిగత అవసరాలను బట్టి. నేను ప్రపంచం మొత్తంతో మాట్లాడినపుడు నా బోధన విశ్వవ్యాప్తంగా వుంటుంది.

విలేఖరి :– మీరు అద్భుతాలు చేస్తారట నిజమేనా ?

బాబా :- అవసరమయితే

బాబా మండలిలో ఒకరు :- అద్భుతాలు చెయ్యండి చూద్దాం అని ఎవరైనా కోరితే బాబా చెయ్యరు.

బాబా అప్పుడు ఇండియాలో ఏ విధంగా కుష్ఠురోగుల సేవ చేశారో, వారికి స్నానాలు చేయించారో, వారు రోగం తగ్గి ఆరోగ్యం ఎలా పొందారో చెప్పారు. అంటురోగా లున్నవారిని కూడా ఏ విధంగా ఆరోగ్య వంతుల గావించినదీ బాబా చెప్పారు.

విలేఖరి :- చనిపోయినవారిని మీరు బ్రతికిస్తారా ?

బాబా :- అవసరమయినట్లయితే - అయినా మీరు ఈ అద్భుతాల గురించి ఎందుకింత పట్టుదలగా వున్నారు. ["క్రీస్తు చైతన్య స్థితి"] పొందిన ఎవరికయినా అద్భుతాలు చెయ్యడమంటే పిల్లల ఆటవంటిదే.

బాహ్యంగా కనపడే అన్నిటికంటే భౌతికం కాని ప్రపంచంతో ఆధ్యాత్మిక ఐక్యత సాధించడం చాలా గొప్పది.

విలేఖరి : - బాబాజాన్ మీకు ఇదంతా బోధించిందా ?

బాబా :- లేదు. ఆమె నాకు బోధించలేదు (నాలో శక్తు లున్నాయని నాకు తెలుసును. ఆమె వాటి అర్థం నాకు తెలియజేసింది. అది ఒకరు బోధించేది కాదు. అది జీవించి అనుభవించాలి.)

విలేఖరి :- మీ శిష్యులకు అనుచరులకు జీవిత విధానం ఏదయినా విధించి శిక్షణ ఇచ్చారా ? మీరు శాకాహార భోజనం ప్రోత్సహిస్తారా ? ఉపవాసాలు విధిస్తారా ?

బాబా :- వ్యక్తిగత అవసరాలను బట్టి ఇండియాలో నా శిష్యులలో ఒకడు నాలుగేండ్లు నీరు మాత్రం త్రాగుతూ, కొంచెం పాలు తీసుకుంటూ జీవించాడు.

విలేఖరి :- మీరు గాంధికి ఆధ్యాత్మిక సలహాదారా ?

బాబా :- గాంధి నన్ను రాజపుతానా ఓడలో కలిశారు మేము ఆధ్యాత్మిక అనుభవాల గురించి మాట్లాడుకున్నాము. గాంధి నన్ను అమెరికాలో కలుసుకోవాలనుందని అన్నాడు. అతని రాజకీయపు పని ముగించి నా వద్దకు రమ్మని చెప్పాను.

విలేఖరి :- అయితే రాజకీయాలకి ఆధ్యాత్మిక జీవనానికి సంబంధం లేదంటారా ?

బాబా :- ఏపాటి సంబంధంలేదు చివరికి ఆధ్యాత్మికానుభవం విశ్వవ్యాప్తమై నపుడు ప్రపంచంలోని రాజకీయాలు అన్నీ అందులోకే వస్తాయి.

అన్ని జాతులను కూడా ఒక త్రాటిమీదకు తీసుకువస్తాను. నేను భారతదేశం కోసం మాత్రమే పని చేయడంలేదు.

బాబా శిష్యుడొకడు విలేఖరితో ఇండియాలో బాబాకి అనేక వేల మంది అనుచరులున్నారని, వారు ముఖ్యంగా బొంబాయి, మద్రాసు రాష్ట్రాలలో ఉన్నారని చెప్పాడు.

బాబా ఇంగ్లండులో బహిరంగసభ పెట్టడం అసంభవమని చెప్పారు. అది పరిస్థితులమీద ఆధారపడి ఉంటుందన్నారు. ప్రయాణం చేసేటప్పుడు ఓడమీద ఒక పెద్ద సభ జరిపినట్లు బాబా అక్షర ఫలకంతో ప్రసంగం చేసినట్లు చెప్పారు.

అమెరికా బాబాను రమ్మనుచున్నట్లు, వచ్చేముందు అక్కడ జరిగే ప్రకటనలు ఆ ఏర్పాట్లు తెలిపే ఉత్తరాలు బాబా చూపించారు.

ఒక శిష్యుడు కౌంటెస్ టాల్‌స్టాయికి భక్తురాలయిన ఒక స్త్రీ వ్రాసిన ఉత్తరంలో బాబా ఆమెకు కలిగిన కంతని ఏ విధంగా కుదిర్చాలో వ్రాయబడిన సంగతి చూపించాడు. అలాటివన్నీ భక్తుల యొక్క నమ్మకంబట్టి వుంటుందని అన్నాడు.

విలేఖరి :- ఏ మత ప్రవక్తనుంచి మీరు తత్త్వశాస్త్రం అభ్యసించారు ? క్రీస్తా ? బుద్ధుడా ?

బాబా :- ఏ ఒక్క ప్రవక్తనుంచీ కాదు. క్రీస్తు, బుద్ధ, కృష్ణ, ఇవి చైతన్య స్థితులకు పేర్లు, కానీ మనుష్యులవి కావు.

బాబా కెన్సింగ్టన్‌లో ఎడ్వర్డ్ మెరిట్ అనే శిల్పి యొక్క స్టూడియోలో 1932 ఏప్రిల్ 13 వ తారీకున తమ శిలా ప్రతిమ అతడు తయారుచేయడం కోసం కొంతసేపు అతనితో గడిపారు. కూర్చున్న బాబాను పైకి చూడమని అలాగే కదల కుండా ఉండమని ఆ శిల్పి చెప్పినట్లు ఆచరించి ఆయన రూపమును అతడు అన్ని కోణాలనుంచి పరికించి చూచుటకు సహాయపడిరి. తెల్లటి ఆయన దుస్తులు లేకపోతే డి ఆర్టగ్నన్‌ను ఆయన జ్ఞప్తికి తెస్తున్నారు. డి ఆర్టగ్నన్ ఫ్రాన్స్ దేశమందలి ఒక మహావీరుడు, బాబా యొక్క శిరోజాలు అస్సేరియా దేవతలాగ రెక్కలు విప్పు కున్నట్లు ఇరువైపులా భుజాల మీదకు విస్తరించాయి.

ఆ సమయమున ఈ క్రింది సంభాషణ జరిగెను –

"సాధు పురుషుల జీవితాలు పరికిస్తే పురుషుడు దివ్యానుగ్రహం పొందేందుకు స్త్రీ అవరోధంగా వుంటుంది. ఏమంటారు ?"

బాబా ఇలా సమాధానం యిచ్చారు–"కాదు. (దివ్యానుగ్రహం పొందడానికి పురుషుడు తద్వారా వికాసం పొందడానికి స్త్రీ చాలా ముఖ్యమయిన పాత్ర నిర్వహిస్తుంది. ఆమె పురుషునితో సమానురాలు. ఆమె పాత్ర నిజాయితీతో నిర్వహిస్తే అంతా బాగుంటుంది) కాని ఆమె తన పరిసరాలకు లొంగిపోతే ఆ వివాహం జయప్రదం కాదు. అప్పుడే విడాకులు వస్తూంటాయి.

"మరి సాధువులు అవలంబించిన బ్రహ్మచర్య వ్రతం మాటేమిటి ?" బాబా– అది ముఖ్యం కాదు. కొందరు పురుషులు వివాహ మాడెదరు. ఇతరులు పెళ్ళి చేసుకోకుండానే వుంటారు. పెళ్ళి చేసుకున్నందువల్ల పురుషుడు ఆధ్యాత్మికంగా వెనుకబడి యుండడు.

"(స్త్రీ ఆమె ప్రేమచేత అతనిని సత్యము తెలుసుకునేలా చేయగలదు. అయితే ఆమె ప్రేమను పెంపొందించుకోవాలి. కామాన్నికాదు. అదే సుఖానికి కావలసినది.)

మరల మెర్రిట్ మరికొంత మట్టిముద్దను తీసుకొని తన పనిని కొనసాగించాడు. బాబా పైకి చూస్తూ కూర్చున్నారు.

"ప్రపంచంలోని స్త్రీ లందరకు నేను ఒక సందేశం యిస్తే బాగుండును. కానీండి దానిగురించి ఆలోచించాలి."—అన్నారు బాబా. అప్పుడే ఒక మట్టిముద్ద చేతితో తీసుకున్నాడు. బాబాను ఆకాశంకేసి చూడమన్నాడు.

బాబా విగ్రహాన్ని ఈ శిల్పి తయారుచేసి ఇండియా పంపించాడు.

ఒక శుక్రవారంనాడు అంటే బాబా వచ్చిన తొమ్మిది రోజులు తరువాత బాబా హాంప్‌సెడ్‌లోకి కిమ్ యింటికి వెళ్ళారు. అక్కడికి టీ సమయానికి చేరుకున్నారు. బాబాతోకూడా యిద్దరు శిష్యులున్నారు. కిట్టీ యింట్లోంచి జిల్లా మాత్రం బాబాతో వెళ్ళింది. మిగిలినవారంతా రస్సెల్ రోడ్‌లోనో లంకాస్టర్ గేట్ వద్దనో ఉండిపోయారు.

శనివారం ఉదయం బాబా మెరెడిత్ స్టార్‌కి కబురు చేశారు రమ్మని అతడు వచ్చాక బాబా అతనితో ఒక గంట మాట్లాడిన తరువాత మెరెడిత్ చాలా ఆనందంగా

వెళ్ళిపోయాడు. శనివారం ఉదయం కిమ్ భర్త అయిన డెస్మొండ్‌తో గడిపారు బాబా. బాబా వారి మండలి, నలుగురినీ ఆ మధ్యాహ్నం రయిలులో తూర్పు చల్లకూంబ్ వెళ్ళమన్నారు. కిట్టీ వారిని వాటర్లూ స్టేషన్‌దాకా టాక్సీలో సాగనంపింది. ఒక్క రోజయినా బాబాను ఎదలడానికి వారికి యిష్టంలేదు.

బాబా ఒక రోజున వారిని కిమ్‌తో బజారుకి పంపి వారికి కావలసిన ఉన్ని దుస్తులు వగైరా కొనిపించారు. వారిని వాటర్లూ స్టేషన్‌కి పంపించిన తరువాత ఆ సాయంకాలం బాబా సినీమాకు వెళ్ళారు. అందులో రాన్ఫోరిన్ అనే హాస్యగాని నటనచూచి నవ్వారు.

## ఈస్ట్ చల్లకూంబ్‌లో మకాం :

బాబా ఈస్ట్ చల్లకూంబ్‌కి బయలుదేరేముందు కిట్టీని తమ గదిలోకి పిలిచి ఈస్ట్ చల్లకూంబ్‌కి వస్తావా ? అని అడిగారు. బాబా అడగకముందే ఆమె బాబాను చల్లకూంబ్‌కి తీసుకు వెడదామని కారు సిద్ధంగా వుంచుకుంది. పైగా ఆమెకి అక్కడ చేసుకోవలసిన ముఖ్యమైన పనులున్నాయి. అనుకున్న సమయానికి ముందే – అంటే 17 వ తేదీ మధ్యాహ్నం 3-20 గంటలకే ఈస్ట్ చల్లకూంబ్ చేరుకున్నారు. బాబాకు స్వాగతం చెప్పడానికి బాబా వెళ్ళేసరికి ఎవరూ లేకపోయారు. కొంచెంసేపటికి కెన్నెల్‌రాస్-మెరెడిత్ బావమరిది – (బాగ్‌పైప్) ఊదుతూ బాబాకు స్వాగతం యిచ్చాడు. బాబా వచ్చినట్లు తెలిసి కొందరు భారతీయులు పరుగెత్తుకుని వచ్చి బాబాకు నమస్కరించారు వారితో బాబా కరచాలనం చేశారు.

బాబాను దర్శించడం కోసం కొందరు పత్రికా విలేఖరులు వచ్చారు. వారు బాబాను ఫొటోలు తీయడానికి వేచియున్నారు. మెరెడిత్ స్టార్ ఆశ్రమానికి ఒక ప్రక్కనుంచి కిట్టీ తీసుకుని వెడుతోంది. ఇంతలోనే మిసెస్ ఇన్వ్, మిసెస్ లాసి స్మిత్ పిల్లలతోసహా వచ్చారు. మెరెడిత్ మార్గరెట్లు కూడా వచ్చారు. వారు రాగానే కిట్టీ బాబావద్ద సెలవు తీసుకుని జిల్లాకి అక్కడ వుండుటకు ఆహ్వానం లేనందున కిట్టీ ఆమెను తిరిగి లండన్ తీసుకువెళ్ళడానికి వెంటనే బయలు దేరింది. బాబా వుండమన్నారు. కాని పై కారణం చేత ఆమె జిల్లాను తీసుకుని లండన్‌కి ఆ రాత్రికే చేరుకుంది. ఆమె తరువాత వచ్చి బాబాను చేరుకుంది.

బాబా తూర్పు చల్లకూంబ్ వచ్చినట్లు అందరికీ తెలిసిపోయింది. చాలా మంది బాబాను చూదామని వచ్చారు. పత్రికా విలేఖరులు అనేకమంది పాశ్చాత్య శిష్యులతో బాబాను ఫొటో తీశారు. బాబా రాగానే భారతీయ దుస్తులు వేసుకుందా మనుకున్నారు. కాని ఆశ్రమానికి వెళ్ళవలసిన సందు బురదగా వుంది. ఆ బురద లోనే కిట్టీతో ఒక ప్రక్కనుంచి, మెరెడిత్ ఒక ప్రక్క, మార్గరెట్ ఒక ప్రక్క ఉండగా బాబా నడిచి వెళ్ళారు. ఫొటో తీసేముందు బాబా దుస్తులు మార్చుకున్నారు. బాబాయొక్క పాశ్చాత్య శిష్యులు ఒకరోజు ముందుగానే-16 ఏప్రిల్, 1932-అక్కడికి వచ్చారు. ఇన్నాళ్ళు బాబాను వదలియుండి ఇప్పుడు మరల ఆయనను కలిసినందుకు వారంతా చాలా ఆనందిస్తున్నారు పాశ్చాత్యులందరూ చాన్జీ చెప్పిన మీదట బాబాను వీలయినంత దగ్గరగావచ్చి కూర్చున్నారు.

పత్రికా విలేఖరులు ఫొటోలు తీశారు. తరువాత బాబాతో ఇంటర్‌వ్యూ కోరగా బాబామండలి వారితో బాబా సంభాషణలు చేయరని చెప్పారు. పోనీ ఏదయినా సందేశం యిస్తారా అని అడుగగా, బాబా యీ క్రింది విధంగా చెప్పారు—

"రిట్రీట్"కి రావడం అంటే స్వంత యింటికి వచ్చినట్లే వుంది. ఇక్కడ ఆధ్యాత్మికత్వం ఆచరణలో పెట్టబడింది. ఈ వాతావరణంలో ఇక్కడ యిచ్చే శిక్షణ వారి ఆదర్శాలు ఈడేరేలా చేస్తుంది.

(మనస్సు, హృదయము సమంగా వుండాలి. భౌతిక, మానసిక, ఆధ్యాత్మిక సమానత్వం వుంటేనే శాశ్వతమయిన ఫలితాలు కలుగుతాయి.)

ఇప్పటి క్లిష్టపరిస్థితిని అధిగమించి వ్యవహారాలన్నీ మామూలుగా జరగడానికి పాశ్చాత్యులు ఆధ్యాత్మిక వికాసముయొక్క ప్రాముఖ్యతను అర్థం చేసుకోవాలి. జీవితము యొక్క ప్రతి విభాగంలోను, కళ, విజ్ఞానము, దినచర్య అన్నిటిలోను దైవత్వం వికసించాలి.

అనంత చైతన్యం ఉపయోగించాలి. అప్పుడే నిజమయిన శాంతి చేకూరగలదు.

ఇప్పటి మోస్తరుగా భౌతిక విషయాలకే ప్రాధాన్యత ఇస్తే ఇంకా వైషమ్యాలు ఎక్కువవుతాయి. వాటివల్ల మానవాళికి బాధ లెక్కువవుతాయి." అని బాబా తమ సందేశంలో చెప్పారు.

ఆశ్రమంలో తోటలో అన్నిచోట్లా పుష్పాలు చక్కగా వికసించి ఉన్నాయి.

సంవత్సరం క్రితం బాబా వచ్చి వెళ్ళిన తరువాత మెరెడిత్ స్టార్ తన 'రిట్రీట్'లో ఒక కొత్త రాతి భవనం కట్టించాడు. వచ్చిన వారందరికి అందులో వసతి ఏర్పాటయింది. గత రెండు సంవత్సరాల నుంచీ బాబాకోసం ఆశ్రమం నడు పుతూ అక్కడ సమావేశపరచిన వారంతా బాబా దర్శనార్థం వచ్చారు. బాబా అక్కడ వున్న ఏడు రోజులు వారందరినీ కలుస్తూ సంభాషిస్తూ గడిపారు. ఆ రాతి భవనంలో అందరూ కూర్చోడానికి ఒకపెద్ద గది, వంటశాల, ఆరుగురికి వేరేగదులు వున్నాయి. వానికి ఎడమ ప్రక్కగావున్న ఖాళీ స్థలంలో గుడారాలు వేయబడ్డాయి. సద్గురువుకి సన్నిహితంగా ఉండడం, అక్కడ భుజించడం, నిద్రపోవడం-అది యొక అదృష్టం. బాబా దిగిన యింట్లోనే ఒక గదిలో ఉండమంటే అది యెంత భాగ్యము! అది ఏప్రిల్ మాసం. వసంత కాలం తోటలో పువ్వులు చెట్లు పూయడం ఆ పూలు విక సించడం ప్రారంభించాయి. ప్రతి రోజున మధ్యాహ్నం హాయిగా స్వేచ్ఛగా తల విరియబోసుకొని బాబా ఆ కొండలలోను, కోనలలోను తిరిగి వచ్చేవారు. ఆయనతో ఎవరికి యిష్టం అయితే వారు కూడా వెళ్ళేవారు. ఒకనాడు ఆయనకోసం వారు ఒక మేక పిల్లను తీసుకువచ్చారు. బాబా ఎత్తుకుని ఆడుకున్నారు దానితో. అది ఎంత సాధువుగా వుందో! దానికి క్రొత్తలేదు. బాబా చేతుల్లో ఇమిడిపోయింది. అప్పుడు బాబాను ఫోటో కూడా తీశారు.

ఒకనాటి మధ్యాహ్నం బాబాతో అందరూ సముద్ర తీరానికి వెళ్ళారు. వెళ్ళి అక్కడ రాళ్ళమీద కూర్చున్నారు. కొంతమంది స్నానాలు చేశారు. కొంతమంది ఆటలాడారు. బాబా వారందరికి చాలా సహాయం చేశారు. అప్పుడు బాబా ఒక సందేశం యిచ్చారు.

బాబా సూర్యునివలె ఉన్నారు- ఎవరయినా పరిశుద్ధమయిన హృదయం కలిగి వుంటే సూర్యకిరణాలను స్వీకరించగలరు. అందుచేత బాబాను తలుచుకుంటూ హృదయాన్ని పరిశుద్ధం చేసుకోండి. తరువాత బాబాను ప్రేమించండి.

బాబా సముద్రమువలె అందరినీ దుర్బలులను, బలమైనవారిని, జబ్బుమనుష్యు లను, ఆరోగ్యవంతులను, పాపులను, సత్పురుషులను, మన స్థిమితంలేని వృద్ధులను అందరినీ స్వీకరిస్తారు.

బాబా అనంతమైన మహాసాగరమువలె నున్నాడు. బాబాను తెలుసుకోవా లంటే అహంకారం పూర్తిగా నశించిపోవాలి.

క్రిందటి సంవత్సరం బాబా వచ్చినపుడు ఆయనతో చాలామంది వారంరోజులు పారిస్‌లో వున్నారు. అప్పుడు పాశ్చాత్యులు పిలిచేవరకు ఒక్కొక్కరు వేచియుండి బాబా ప్రక్కనో ఎదురుగానో ఆయన పాదాలవద్దనో పిలిచాక వెళ్ళి కూర్చున్నారని వారి క్రమశిక్షణ ఎంతో మెచ్చుకున్నారు బాబా. మంచి చోటుకోసం అందరూ తొందరపడి ముందుకు పరుగెత్తలేదని బాబా చాలా సంతోషించారు.

ఒక మధ్యాహ్నం బాబా గ్రామఫోన్‌మీద పాశ్చాత్య సంగీతం విన్నారు. భారతీయ శిష్యులు భారతీయ వాయిద్యాల మీద సంగీతం వినిపించారు. కాని అది 20 నిమిషాలే జరిగింది. పాశ్చాత్యులు ఇంకా వింటే బాగుండును అని అనుకున్నారు. ఆ తరువాత పిల్లల పార్టీ జరిగింది. మిగతా రోజులలో బాబాకి, ఎప్పుడయినా మెరెడిత్ మార్గరెట్‌లతో కూర్చుని మాట్లాడినపుడు తప్ప దర్శనార్థులను చూడడంతోటే సరిపోయింది. బాబాను దూరాన్నుంచయినా చూదామని అనుకుంటే ఆయన పాశ్చాత్య శిష్యులకు వీలుకాలేదు. బాబాతో సహవాసం చేసేటప్పుడు ధ్యానము అక్కరలేదని చెప్పినా మెరెడిత్ మూర్ఖతవల్ల ధ్యానం మాత్రం తప్పక ఉండాలని పట్టుబట్టి అక్కడ నివాసులకి విధించేవాడు. బయట నుంచి వచ్చిన వారందరూ సహానభావంతో మెలగేరు. స్వేచ్ఛలేని తన శిష్యులను చూస్తూంటే బాబాకి కూడా కష్టంగానే వుండేది. వారందరిని "మీరంతా ఇండియా వచ్చి నాతో వుందురుగాని లెండి" అని సంతోష పెట్టేవారు. ఆ శుభదినం ఎప్పుడు వస్తుందా అని వారంతా ఉవ్విళ్ళూరుతున్నారు వచ్చి అక్కడ బాబా మండలిని అందరినీ పరిచయం చేసుకోవాలని నిరంతరమూ బాబా సహవాసం చెయ్యాలనీ వారిఆశ.

ఒకనాటి మధ్యాహ్నం సముద్రతీరాన ఉన్న కొండలకి తీసికెళ్ళి మెరెడిత్ తాను అక్కడ ఒక రాత్రంతా కూర్చుని ధ్యానం చేసిన ఒక గుహ బాబాకి చూపించాడు. అది చాలా ఏటవాలుగా వున్న కొండ బాబా సులభంగా దిగినా మిగిలినవారు చాలా కష్టపడి దిగారు. కాకా అంత చురుకుగా దిగలేకపోయాడు. చాన్జీకి గుండె జబ్బువల్ల ఆయాసం వచ్చేసింది దిగేసరికి. బాబాకి ఈ సంగతి తెలిసి నెమ్మదిగా దిగమని మధ్య మధ్య కాస్సేపు కూర్చుంటూ దిగమని చాన్జీని హెచ్చరించారు. అయిదు నిమిషాలు కూర్చున్నాక బాబా అందరిని లేచి రమ్మన్నారు. ఇంటికి వెళ్ళిన తరువాత కాకా, చాన్జీలాంటి కొందరిని ఒక గంట పరుండమని విశ్రాంతి తీసుకోమని బాబా ఆదేశించారు. పరుండినపుడు వేడి నీళ్ళ సీసాను దగ్గర పెట్టుకోమన్నారు వెచ్చదనంకోసం. పరుండే ముందు వేడి వేడి టీ త్రాగమన్నారు.

అక్కడ మూడు రోజులున్న తరువాత నాలుగో రోజున బాబా మౌనం విరమించి మాటలాడే ముందు వారికి 9 రోజులు సంపూర్ణ విశ్రాంతి కావాలన్నారు. అయితే బాబా విశ్రాంతికి ఎక్కడ బాగుంటుంది అని కొంతసేపు అందరు చర్చచేసి ఇటలీలో బాగుంటుందని ఒకరన్నారు; స్విట్జర్లాండులో మూడు స్థలాలు పేర్కొన్నారు. బాబా "లుగానో" ఎన్నుకున్నారు. అది స్విట్జర్లాండ్‌లో ఇటలీకి సమీపంగా వున్నది.

లుగానోకి ఎవరు బాబాతో వెళ్ళేవాళ్ళు అనే ప్రశ్న వచ్చింది. బాబా అందరినీ రమ్మంటున్నారు. ఇదివరకు పారిస్ వచ్చినవాళ్ళంతా రావాలంటున్నారు అది అంత సాధ్యంగా కనబడటంలేదు. ఒకామె పెళ్ళిచేసుకుంది. ఆమె వచ్చి అంతకాలం వుండలేదు. ఇంకొకర్తె ఉపాధ్యాయ పదవిలో వుంది. 9 రోజులయినా తప్పక వుండాలి. అందరూ రావాలన్నారు బాబా. ఇంక పైవాళ్ళెవరూ అంటే బాబా దర్శనార్థం వెళ్ళేవారు వచ్చేవారు ఎవరూ ఉండరు.

ఈ ప్రయాణం దృష్టిలో వుంచుకుని గురువారంనాడు కిట్టీని లండన్ పంపిస్తూ కుక్స్ ఆఫీసుకి వెళ్ళి టికెట్లు రిజర్వేషన్‌లు వగైరా చేసిపెట్టమన్నారు. కిట్టీ కారులో శనివారంనాడు తిరిగి వచ్చింది. ఆదివారం ఉదయం 6 గంటలకు బాబాని తీసుకుని లండన్ ప్రయాణం చేయడానికి సిద్ధంగా వుంది.

బాబా ఆశీర్వాదంతో డబ్బు సమకూడింది. లుగానోలో అందరకూ కూడా హోటెల్ ఏడెన్‌లో ఉండడానికి గదులు దొరికాయి. ఈ పని అంతాచేసి, కిట్టీ రైళ్ళు ఎప్పుడు ఎక్కడనుంచి బయలుదేరతాయో అన్ని సంగతులు తెలుసుకుని మరీ వచ్చింది. అయితే బాబాను ముందుగా అడుగుతేగాని ఏదీ ఏర్పాటు చేసెయ్యకూడదు. బాబా చాన్సీతో మాట్లాడుతూ "బాబా మీ వెనకాల వుండేటప్పుడు మీరు ఏంచేస్తున్నారో బాబాతో చెప్పి చేస్తుంటే ఏదీ కూడా తప్పుదారిలోకి వెళ్ళదు" అని హామీ యిచ్చారు. ఆయనతో చెప్పకుండా చూసి రమ్మంటే కాల్చివచ్చినట్లు ఏదో చేసేసి చక్కావస్తే అప్పుడొస్తుంది తిరకాసు. పాశ్చాత్యులు స్వతంత్రభావాలు కలవారు గనుక ఈ పద్ధతిలో పడటం వారికి ముందు కష్టంగానే వుంటుంది. పైగా బాబాకి ఈ వివరాలన్నిటితోటి ఏమి పని? అవన్నీ ఆయనకి చెప్పి విసిగించడమెందుకు అనే భావనకూడా తప్పే. ఎందుచేతనంటే ఆయనతో చెప్పకుండా చేసిన ఏ చిన్న పనయినా తలక్రిందులు కావచ్చు. నీకు ముఖ్యంగా తోచనివి చిన్న చిన్న వివరాలనుకున్నవి బాబాకు ముఖ్యంగా తోచవచ్చు.

ఒక రోజున మధ్యాహ్నం తూర్పు చల కూంబ్‌లో వుండగా బాబా అందరినీ ఆయన గదిలోకి పిలిచారు. అంతకుముందే ఒకడు ఇంకొకరిని తప్పు బట్టి అరుస్తున్నాడు. అందరియెదుట ఆ అరిచిన వాడిని రెండోవాని తప్పేమిటో చెప్పమన్నారు బాబా. ఆమెకు గర్వం వున్నదని, అహంభావం వున్నదని, దానితో ఆమె ఒప్పుకోక తప్పలేదు.

24 వ తేదీ ఆదివారం ఉదయం 6 గంటలకు బాబా నిశ్శబ్దంగా ప్రయాణమై కిట్టీతో కారులో వెళ్ళిపోయారు లండన్‌కి. అందరూ వచ్చి ఆయన్ను సాగనంపారు. దారిలో టీ తీసుకున్నారు. దారిలో కారు రెండు మారులు చెడిపోయి ఆగిపోయింది. అందుచేత 32 రస్సెల్ రోడ్‌కి చేరేసరికి సాయంత్రం టీ సమయం అయింది. అలసినాగానీ సుఖంగా చేరేరు.

ఆ రాత్రి స్టెఫనీ అనే ఆమె బాబాను, ఆయన శిష్యులను భోజనానికి రమ్మని పిలిచింది. బాబాకు ప్రత్యేకంగా భారతదేశపు కూర చేసి పెడతానంది. కిట్టీ దేవి జెరార్డ్ వీధిలో ఉన్న ఆంగ్లో-ఇండియన్ హోటలు నుంచి భోజన సామగ్రి తెప్పించి తన యింట్లో బాబాకి భారతీయ శిష్యులు వంట చేసిపెట్టేలా ఏర్పాటు చేసింది. అందు చేత బాబా యిక్కడే భోజనం చేస్తామన్నారు. అక్కడ వున్న మూడు రోజులు ఆ విధంగానే జరిగింది. ఆ హోటలును చదువుకుంటున్న ఇద్దరు భారతీయులు నడుపుతున్నారు. వారిద్దరికి బాబా అంటే యిష్టం. అందుచేత వారికి మంచి కూరలు అవీ పంపించేవారు. బుధవారంనాడు లుగానో వెళ్ళడానికి కిమ్ వెళ్ళడమా మానడమా బాబాతో తేల్చుకుందుకు కిమ్ భర్త డెస్మాండ్ వచ్చి బాబాతో మాట్లాడేడు. కిమ్‌ని పంపించడానికి అతడు అంగీకరించాడు. వచ్చినందువల్ల కిమ్‌కి సంసార బాధ్యతలు బాగా తెలియడమేగాక డెస్మాండ్ యెడల, పిల్లల యెడల ఎక్కువ ప్రేమతో తిరిగి వస్తుంది. లుగానో నుంచి అని బాబా డెస్మాండ్‌తో చెప్పారు. అతనికి కావలసిందే ఇది. ఆ సాయంత్రమే జిల్లా ఈస్ట్‌బోర్న్ వారి అమ్మమ్మ తాతగారివద్ద నుంచి వచ్చింది.

మరునాడు ఉదయం కిట్టీ కుక్సు ఆఫీసుకు వెళ్ళి ప్రయాణానికి అన్ని ఏర్పాట్లు పూర్తిచేసుకుని వచ్చింది.

కిమ్ బాబాకి ఒక బుట్టనిండా పువ్వులు పంపించింది. ఆమెను బాబా లుగానో తీసుకువెడుతున్నారని సంతోషం పట్టలేకుండావుంది. జిల్లాకు కూడా వెడదామని వుంది. ఆమె చదువుకుంటూన్న పిల్లగనక స్కూలు ఒకటి అడ్డు వచ్చింది. ఆమె

నిద్దురలో కూడా 'బాబా' అని కలవరిస్తోంది. విచారంతో ఆమె స్కూలుకి తిరిగి వెళ్ళిపోవలసివచ్చింది బుధవారం మధ్యాహ్నం.

లుగానో నుంచి తిరిగి వచ్చిన తరువాత, మే 14 వ తారీకున బాబా అమెరికా వెళ్ళడానికి ప్రయాణం పెట్టుకున్నారు. అందుకుగాను క్వెన్‌టిన్ టాడ్ వెళ్ళి స్టీమరుకి టిక్కెట్లు కొని రిజర్వేషన్ వగైరా అన్నీ చేయించారు సౌథామ్‌ప్టన్‌లో బ్రెమెన్ అనే ఓడ ఎక్కి బయలుదేరేలాగ ఏర్పాటయింది. బాబాతో కూడా ఆయన మండలితో బాటు టాడ్, మెరెడిత్, మార్గరెట్ స్టార్ కూడా వెడుతున్నారు. బాబా జూన్ నెలలో తప్పకుండా మాట్లాడతానని చెప్పారు గనుక – అప్పటికి బాబావద్ద ఉందామని కూడా వెడుతున్నారు. అందుకు జూన్ 14 తేదీ కూడా నిర్ణయించాడు బాబా. లండన్‌లో దిగుతూన్న కిట్టీ మొదలయినవారు (బాబా మౌన విరమణ చేసినపుడు ఆయన మొదటి మాటలు "నేను కృష్ణుడను; నేను బుద్ధుడను; నేను క్రీస్తును" అని వుంటాయి అని చెప్పారు) బాబా మొదటి మాటలు అందరూ ఒకచోట వుండి వినడానికి పథకం వేసుకున్నారు.

## లుగానో మకాం

గురువారం ఉదయం 9 గంటలకు అందరూ విక్టోరియా స్టేషన్‌కి డోవర్ వెళ్ళే రైలుకివెళ్ళారు. స్టెఫనీ యింటివద్ద వున్న బాబా శిష్యులు తిన్నగా అక్కడికి వెళ్ళారు. బాబాతో బయలుదేరినవారు ఆదీ (జూనియర్), డా॥ ఘనీ, చాన్‌జీ, ఆదీ (సీనియర్) బెహ్రాం, కాక అయిదుగురు స్త్రీలు – మింటా, డెలియా, కిమ్, కిట్టీ, మార్గరెట్ – బాబాతో కలిసి పన్నెండుగురు. టాడ్, వర్దమ్ దంపతులు, మేరీ కింగ్, డెలియా, డిలియాన్, డెస్మాండ్ మరికొందరు బాబాను పంపించడానికి విక్టోరియాస్టేషన్‌కు వచ్చారు

డోవర్ నుంచి కెలే స్టీమర్‌లో వెళ్ళేటప్పుడు బాబా పరివారంలో మింటాకి, డెలియాకి సీ సిక్‌నెస్ వచ్చింది.

ఏప్రిల్ 28 వ తేదీన సాయంకాలం 6 గంటలకు పారిస్ చేరుకుని స్టేషన్‌లో భోజనం చేశారు. బాబా చాలా కొద్దిగా తిన్నారు. బాబా ఏదో ఆలోచిస్తున్నట్టు అంతరికంగా ఏదో పని చేస్తున్నట్టు కనిపించారు. రైలుకి ఇంకా వ్యవధి వుంది గనుక పారిస్ వీధులలో కొంచెంసేపు తిరిగి వచ్చారు.

బాబా మండలి ఒక పెట్టెలోను, బాబా, వారితో వున్నస్త్రీలు మరియొక పెట్టెలోను లుగానో వెళ్ళే రైలు ఎక్కారు.

బాబా తలకి ఏదో తొడుక్కుని ఒత్తిగిలి పరుండి వెంటనే ఆధ్యాత్మికమైన పని చేయడం ప్రారంభించారు. ఆయన చేతి వ్రేళ్ళు వడిగా కదులుతున్నాయి మధ్యలో బాబా లేచి కూర్చుని మిగతా వారంతా సరిగా వున్నారా లేదా? అని పరకాయించారు. మరల పరుండి వారి పని తిరిగి ప్రారంభించారు. తెల్లవారుజామున 2 గంటలదాకా అలా పనిచేసి 5 గంటలదాకా నిద్రపోయారు

తెల్లవారింది. కొంతసేపయిన తరువాత రైలు లూసర్న్ కాసారానికి (ఇంక రెండు గంటలలో) చేరుకుంటుంది. రైలు మార్గానికి ఇరువైపులా మంచుతో కప్పబడిన పర్వతాలు కనిపిస్తున్నాయి. బాబాకు సంతోషంగా వుంది. కాశ్మీర్, హిమాలయాల అందం గురించి బాబా చెప్తున్నారు. ఒక రోజున అందరనూ అక్కడికి తీసికెడతానని బాబా అన్నారు. ప్రయాణంలో కూడా పగలయినా తలమీద తెల్లటి గుడ్డ వేసుకుని ఒక సభ చేస్తున్నానని చెప్పారు. అదికూడా ఆధ్యాత్మిక కార్యమే. ఆయన వ్రేళ్ళు వడిగా కదులుతున్నాయి. బాబా అలాగ ఆధ్యాత్మిక మయిన పని చేసేటప్పుడు ఆయన కళ్ళలో నల్లగ్రుడ్లు లోపలికి తిరిగిపోతాయి. అప్పుడు ముఖం చూడడానికి భయంకరంగా వుంటుందని తలమీద ముసుగువేసుకుంటాను—అని చెప్పారు బాబా.

లూసర్న్ వద్దకు వచ్చేసరికి ఎండ బాగా కాస్తోంది. అందరికీ కావలసిన వెచ్చదనం యిచ్చింది. భారతీయులు అక్కడి ప్రకృతి దృశ్యాలు మెచ్చుకుంటూంటే పాశ్చాత్యులకు ఆనందంగా వుంది.

రైలులో కాఫీ తెప్పించుకుని వారి దగ్గరవున్న బిస్కట్లు వగైరాలతో తీసుకున్నారు లుగానో చేరుకునేసరికి 11 గంట అయింది. లూసర్న్ దాటిన తరువాత మళ్ళీ మబ్బు వేసింది. మరల చల్లగా అయిపోయింది వాతావరణం. వాన కూడా కురిసింది. లూసర్న్‌లోనే వెచ్చటి ఎండలో ఉండిపోతే ఎంత బాగుండును అని పాశ్చాత్యులంతా అనుకున్నారు. రైలులో వెడుతూంటే జలపాతాలు మనోహరంగా కనిపిస్తున్నాయి.

లుగానోలో 'హోటలు ఏడెన్' నుంచి బస్సు వచ్చింది. ఆ బస్సులో ఎక్కి అందరూ హోటలుకు వెళ్ళారు. హోటలు ఒక తటాకం ఒడ్డున వుంది. డాబా మీదకి ఎక్కితే చాలా చక్కని దృశ్యం కనిపిస్తోంది. ఆ హోటలు బాగా సదుపాయంగా వుంది. అందరికీ రెండవ అంతస్తులో గదులు ఏర్పాటయినాయి. ఆ అంతస్తు అంతా వారికే కేటాయించబడింది. ప్రతి గదికి ముందు వసారా (బాల్కనీ) వుంది.

అందునుంచి చూస్తే చెరువు, దాని అవతల మంచుతో కప్పబడిన పర్వత పంక్తులు కనిపిస్తాయి.

బాబా పూర్తి విశ్రాంతి కావాలని లుగానోకి అందుకే వచ్చారు కాబోలు అనుకున్నారు పాశ్చాత్యులు. డా॥ మనీ వారితో బాబా ఎప్పుడూ విశ్రాంతి తీసుకోరు అని చెప్పేదాకా బాబా నిరంతరం ఏదోఒక పనిచేస్తూనే వుంటారని వారికి తెలియదు. అక్కడ అందరూ బాబా చేసే పరీక్షలకి ఆగగలరో లేదో, ఆగితే వారు ఎలా ఆ అనుభవాన్ని తీసుకుంటున్నారో బాబా చూస్తారు.

వాతావరణం బాగాలేదు. మాయ తనకు చేతనయినదంతా చేసి బాబాకి ఆయన అనుచరులకు కష్టాలు కల్పిస్తుంది. అయినా బాబా ఒక రోజున అందరనూ మౌంట్ జెనెరోసోకి తీసుకు వెడతానన్నారు. హోటలు వెనుకనున్న కొండమీద ఒకనాటి మధ్యాహ్నం గడిపారు. బాబా అక్కడ వారి శిష్యులతో గూటీబిళ్ళ ఆడేరు. సాయంత్రం అయేసరికి అందరిని తీసుకుని హోటలుకి వచ్చేశారు.

ఒకనాటి మధ్యాహ్నం 3 గంటలయింది. బాబా ఆకస్మాత్తుగా ఆకలిగా వుందన్నారు. అప్పుడు వెనకవైపున వున్న కొండ దిగి వున్నారు. బాబా అలా ఆకలిగా వుందనగానే పాశ్చాత్యులు అందరూ నవ్వి "ఇప్పుడెలాగ మనం పైకి ఎక్కి వెళ్ళాలికదా" అనుకున్నారు. కిట్టీ కారు దిగి అనతి దూరంలో ఒక యిల్లు కనిపిస్తూంటే అక్కడికి వెళ్ళి తలుపు తట్టింది. ఈమె ఎవరూ చూడకుండా వెళ్ళింది. లోపల్నుంచి జవాబు రాలేదు. తిరిగి వెళ్ళి వెనుక వైపున వున్న వంట యింట్లో వున్నవారితో వెన్న, రొట్టె కావాలి అని అడిగింది – తనకు వచ్చీరాని జర్మన్‌భాషలో. వారికి అర్థమయింది. అది తీసుకువచ్చి బాబాకు యివ్వగా ఆయన అభీష్టం నెరవేరిందని ఎంతో సంతోషించారు. ఆధ్యాత్మికంగా బాబాను సేవించేవారికి ఇది యొక్క విశిష్టమైన సంఘటన. బాబా అనుచరులకు ఇది యొక్క పరీక్ష– ఎంతవరకు ఆయన కోరిక తీర్చడానికి వారు ప్రయత్నిస్తారు అని.

ఇలాగే ఒకనాటి సాయంకాలం 8 గంటల తరువాత బాబా ఆకలి వేస్తోందన్నారు. వేయించిన బంగాళా దుంపల తరగలు [చిప్స్] కావాలన్నారు. ఎలాగయితేనేం కిట్టీ వెళ్ళి కొన్ని యిళ్ళు తిరిగి, చివరికి ఒక హోటలులో అవి సంపాదించుకు వచ్చి యిచ్చింది. ఇంతా కష్టపడి తీసుకు వస్తే బాబా ఒక ముక్కయినా తిన్నారో లేదో. బాబా పని అవి రాకముందే చేసేశారు.

మాటలాడని బాబా బోర్డుమీద అక్షరాలు కూడా చూడకుండా సంజ్ఞలచేత తెలిసేలా ఒక్కొక్కరిని ఒక్కొక్క సంజ్ఞతో పోల్చేవారు. పెద్ద భుజాలవాడు కాకా అనీ, సులోచనాలు పెట్టుకున్నవాడు చాన్‌జీ అనీ, మార్గరెట్‌కి చిరతలు, క్విన్టిన్‌కి శిరోవేష్టము, చైనాలో వున్న హెర్బర్ట్‌కి ముక్కు బాగా వుంది అని చెప్పడానికి చూపుడు వ్రేలు బొటన వ్రేలు కలిపి ఒక వలయంగా చూపుట - ఈ విధంగా ఒక్కొక్కరికి ఒక్కొక్క సంగతి ఒక గుర్తు బాబా చూపుతారు. అది వారి అనుచరులు సులభంగా తెలుసుకుంటారు.

ఒకనాటి రాత్రి బాబా పరుండి ఉన్నారు, అర్థరాత్రివేళ ఆదీ (సీనియర్) ని ప్రక్కగదిలో అతడు వుండగా చప్పట్లుకొట్టి పిలిచారు. ఆదీ బాబా గదిలోకి వచ్చాడు. బాబా ఆయన గడ్డము వైపుకు చూపించి చేతితో పైకి ఆకాశము వంకకు చూపారు. ఆదీకి ఏమీ అర్థంకాలేదు. 'సరే' అని బాబా అతన్ని తన గదికి వెళ్ళ పొమ్మన్నారు.

ఉదయాన్నే లేచి బాబా శిష్యులకు వివరించి చెప్పారు. అప్పుడు ఒక టెలిగ్రాం వచ్చింది. అందులో బాబా తండ్రి మరణించినట్లు తెలుపబడింది. టెలిగ్రాం రాకమునుపే గత రాత్రి ఇది బాబాకు తెలిసింది. వెంటనే ఆదీని పిలిచి చెప్పారు. గడ్డంకేసి చూపించుట బాబా తండ్రి అని చెప్పడమే. షెరియార్‌జీకి గడ్డము వున్నది. పైకి చూపిస్తే ఆయన స్వర్గానికి వెళ్ళారు అని బాబా సూచించారు. మిగిలిన అనుచరులంతా విచారించారు. కాని బాబా సోదరులు, ఆదీ, బెహ్రాం అంత విచారించినట్లు కనబడలేదు. బాబా తమ వద్దకు వచ్చారని ఇప్పుడు షెరియార్జీ తమతోనే వున్నారనీ బాబా వివరించారు. అందుచేత విచారించే పనిలేదని బాబా చెప్పారు. అప్పటికి రెండు సంవత్సరాలుగా బాబా వారి తండ్రి అయిన షెరియార్జీని కలుసుకోలేదు.

ఒక రోజున ఉదయాన్నే బాబా అందరినీ నావలో చెరువుచుట్టూ షికారుకివెడదా మన్నారు. కిట్టీకి ఎందుకో కోపంవచ్చి మీరంతా పదండి నేను వచ్చి కలుసుకుంటా నని చెప్పి అక్కడికి వెళ్ళకుండా ఒక్కర్తీ ఏకాంతంగా కొండమీద కూర్చుని ఆలస్యంగా వచ్చింది. అప్పటికే అందరూ బాబాతో భోజనానికి కూర్చున్నారు. మిగిలిన స్త్రీలు కిట్టీని ఎక్కడికి వెళ్ళావని అడిగారు. షికారుకెళ్ళానని చెప్పింది. కొంతసేపయిన తరువాత బాబా కిట్టీని వచ్చి భోజనం చెయ్యమని ఆదీ (సీనియర్) చేత కబురు పంపారు.

ఒక రోజున బాబా చిన్న బస్సులో బయలుదేరి లొకార్నో వెళ్ళివచ్చారు. మొదటి ప్రపంచ యుద్ధం అయిన తరువాత ఇరు పక్షాలవారు సంధి కుదుర్చుకుని అక్కడే ఖరారునామా పత్రాలమీద సంతకాలు చేశారు. మరల చలి ప్రారంభించి కొద్దిగా తుంపర కూడా పడుతోంది. వీరు వెళ్ళే బస్సులో ఎవరో క్రొత్తవారు ఇద్దరు ఎక్కారు. బాబా తన బృందంకోసం తెప్పించిన బస్సు అది. డ్రైవరు ఎవరో ఇద్దర్ని ఎక్కించుకున్నాడు. బాబాకి ఇది ఇష్టంగా లేదు. కిట్టీ దేవీకి ఈ సంగతి చెప్ప మన్నారు బాబా. కిట్టీ ఆ ఉదయంనుంచి బాబాకు ముఖం చూపించకుండా తప్పించుకు తిరుగుతోంది. కిట్టీ వచ్చి వెనుక నున్న బాబా వద్దకు వచ్చి కూర్చుని ఏం చేద్దామం టారు ? అని అడిగింది. బాబా చాలా విచారంగా కనిపించారు. ఆయన కిట్టీని "నీ యిష్టం వచ్చినట్లు నీవు పడవలో మాతో రాకుండా వెళ్ళిపోతే నాకు సంతోషంగా వుంటుందనుకున్నావా ?" అని అడిగారు. దీనితో కిట్టీ ఒక పాఠం నేర్చుకొంది. బాబా చెప్పిన పని అక్షరాలా చేయాలని. ఇంతలోనే సూర్యరశ్మి ప్రకాశవంతంగా వచ్చింది. ప్రయాణం బాగా సాగింది. ఆనందంగా ఉన్నారందరూ.

లొకార్నోలో సంధి పత్రాలు సంతకం చేసిన చోటుకి, చర్చికి వెళ్ళారు. చర్చిలో బాబా 10-15 నిమిషాలు ఏకాంతంగా కూర్చున్నారు. బాబా క్రీస్తుగా సిలువ వేయబడినది తానేనని అనుచరులతో చెప్పారు. అందుకే ఆయన తన టోపీని తీసి వేయలేదు. (గౌరవ సూచకంగా) జీసస్ తల్లి మేరీ చిత్రపటము. మేరీ మేగ్దలీన్ చిత్రపటము చాలా బాగున్నాయని బాబా మెచ్చుకున్నారు.

కొండమీద వున్న చర్చిలోంచి ఈవలికివచ్చి క్రిందకి దిగుతూంటే బాబా ఒక వృద్ధుని కలిశారు. అతడు చర్చి బయట ఒక బెంచిమీద కూర్చుని వున్నాడు. అతని గడ్డము మనోహరంగా వుంది. అతడు అంధుడులా వున్నాడు. అతడు భిక్షను అడుగుతున్నాడు. బాబా ఆ భిక్షకుని ప్రక్కన కూర్చుని అతని చేతిని తమ చేతి లోకి తీసుకున్నారు. బాబా తమతో కూడా వున్న శిష్యులను అతనికి కేదయినా ధర్మం చేయమన్నారు. వారు అతనికి ఒక షిల్లింగు ఇచ్చారు. బాబా అతడు మంచివాడని, అతనిని తాము బాగా ఎరుగుదుమని చెప్పారు.

ఇరుగుపొరుగున నున్న ఒక యింటి నుంచి పింగ్‌పాంగ్ బల్ల తెప్పించి బాబా శిష్యులతో ఆడారు. హోటలువారు దానికి ఒక అనువైన స్థానము యిచ్చారు. తరుచుగా ఎప్పుడు ఆడాలనివుంటే అప్పుడు శిష్యులు పింగ్‌పాంగ్ ఆడుతూండేవారు. డా॥ ఘనీ మంచి ఆటగాడు. అతడు బాబాతో బాగా ఆడేడు. బాబా చెప్పగా

మార్గరెట్ క్రాస్కీ హోటల్లో నాట్యం చేసింది. గ్రామఫోన్ పెట్టుకుని సంగీతం విన్నారు.

పింగ్‌పాంగ్ బిల్ల తెచ్చుకోకముందు ఇంకో హోటలుకు వెళ్ళి ఆడుకొనేవారు ఒక రోజున అక్కడ వృత్తిగా ఆడే ఆటగాడు వచ్చి బాబాతో ఆడేడు. అతడు ఎన్ని పాయింట్లు ఎవరికి వచ్చాయో లెక్కపెట్టడం మొదలు పెట్టాడు. అది బాబాకు యిష్టం లేదు బాబా ఆడుతున్నప్పుడల్లా ఏదో ఆధ్యాత్మికపు పని చేస్తూండేవారు. సాయంకాలాల్లో సినిమాకు వెళ్ళేవారు లేకపోతే ఏదయినా ఇంకొక ప్రదర్శనకు వెళ్ళేవారు. ఒక రోజున స్పానిష్ కళాకారులు వచ్చి నృత్య ప్రదర్శనం యిచ్చారు అది చాలా బాగుందని బాబా మెచ్చుకున్నారు

ఆ రాత్రి భోజనాలు చేసుకుని బాబా మండలి క్రిందకి దిగడానికి ఆలస్యం చేశారు. ప్రదర్శనానికి వెళ్ళడానికి రెండు టాక్సీలు మాట్లాడేరు. కొంతమంది ఇది అనవసరం ఖర్చు అనుకున్నారు. బాబా ఏమిటి సంగతి ? అని అడిగి తెలుసుకున్నారు. డబ్బు ఖర్చు అవుతోందని బాధ పడవద్దని డబ్బు యెడల అంతరాసక్తికలిగివుండరాదని చెప్పారు. బాబా ప్రేమతో ఖర్చుచేసినది వ్యర్థము కాదని చెప్పారు

## బాబా ప్రతినిధి

మరియొక రోజున బాబా చెప్పిన ప్రకారం మోంట్ జెనెరాసోకితీసుకువెళ్ళారు. మంచుమీద నడుస్తూ వెళ్ళారు. ఆ యెత్తు నుంచి చూస్తూ మూడు తటాకాలు కనిపించేయి ఆ వూళ్ళో-లుగానో, కోమో. లూసర్న్. అది చాలా మనోహరమయిన స్థలం. ఉదయం 9 గంటలకు నౌకలో బయలుదేరారు. భోజనం వారితో కూడా తీసుకువెళ్ళారు.

అందులో ఒక వృద్ధుడు నిరాడంబరంగా వుండి పేదవాని దుస్తులు వేసుకుని బాబ నిలబడినచోటుకు ఎదురువైపున వున్నాడు. అతడు మరో వైపుకి తిరిగి వున్నాడు. బాబా అతనిని చూపించి మండలితో అదుగో చూడండి అతడు నా యేజంటు (ప్రతినిధి) అన్నారు. మండలిలో ఒకరు మాకు ఎలా తెలుస్తుంది బాబా ! అని అడిగాడు. అప్పుడు బాబా డాక్టర్ ఘనీ చేతిలో నుంచి కర్రతీసుకుని నేను ఈ కర్రతో కొట్టినట్లుగా అతడు కూడా కొడితే మీరు నమ్ముతారా అని బాబా అడిగారు. అడిగి ఆ కర్రతో బాబా రెండుమూడుసార్లు కర్రతో (డెక్‌మీద) కొట్టారు ఆ వృద్ధుడు బాబాను చూడకుండానే తన కర్రను కూడా అలాగే అన్నిమార్లు కొట్టాడు

బాబా మరల యింకొక మాదిరిగా కొట్టారు అతడు కూడా అలాగే కొట్టాడు. ఇంకా మీకు నమ్మకం కుదరలేదా అని కర్ర తిరగేసి క్రింద కొట్టారు బాబా. అతడు కూడా అలాగే తిరగేసి కొట్టాడు. తరువాత ఒక శిష్యుని ద్వారారొట్టె,వెన్న అతనికి పంపించగా అది అతడు తిన్నాడు.

బాబా అన్నారు. బాదాతో అతడు కర్రను క్రింద కొట్టడం ద్వారా మాట్లాడేడు. వారికి వున్న సంకేతాల ప్రకారం ఒకరి నొకరు అర్థం చేసుకున్నారు. ఆ సమయంలో ఆ స్విస్ పనివానిని అతడున్న మూడవ భూమిక నుంచి నాలుగవ భూమికకు అతనిని తీసికెళ్ళారు బాబా. బాబా అప్పగించే పని చేయడానికి ఇది అవసరం అయింది. ఆ చెరువు మీద నావలో చివరకు వెళ్ళేసరికి అక్కడ నుంచి ప్రకృతి దృశ్యం బహు రమణీయంగా వున్నది. నావలోంచి దిగి ఆ కొండలలో నుంచి వెళ్ళే ఒక రైలు ఎక్కి వెళ్ళారు. ఆ కొండలపై నుంచి లోయలలోకి చూస్తూ చాలా హృదయంగమంగా వున్నది. మంచుతో కప్పబడిన ఆ పర్వతాలు చూడటానికి ఎంతో అందంగా వున్నాయి. కాశ్మీరులో ఇలాగే వుంటుందని బాబా చెప్పారు. జెనెరాసో పర్వతం పైకి ఎక్కారు. మంచు చాలా పడింది. అక్కడ చలి విపరీతంగా వేస్తోంది కొంతమంది ఇంకా పైకి ఎక్కుదామని ఎక్కారు. కొంతమంది అక్కడే విశ్రమించారు. చాన్‌జీ ఈ కొండ బాబా ఎక్కారు గనుక ముందు దీనికి చాలా ప్రాముఖ్యత వస్తుంది అన్నాడు. కొంతమంది అక్కడి ప్రదేశాలు అన్నీ చూపించే వారు (గైడ్లు) ఉన్నారు. అక్కడి దృశ్యాల ఫొటోలు కూడా అమ్మేవారున్నారు. ఒక భార్య భర్త వీరితోపాటు అక్కడి దృశ్యాలు చూడటానికి వచ్చారు. బాబా అంటే వారికి యిష్టమే. ఆయనకేసే చూస్తూ వున్నారు ఇంకొక డెవరో కెమేరాతో వచ్చి బాబాను ఫోటోగ్రాపు తీశాడు. సూర్యుడు బాగా ప్రకాశిస్తున్నాడు. కొందరు ఒక బల్ల దగ్గర పెద్ద గొడుగు క్రింద కూర్చున్నారు. అక్కడే ఒక్కటే హోటలు వుంది. వేడి పానీయాలు ప్లేట్లు అవీ యిచ్చారు ఆ హోటలువారు. బల్లల దగ్గర కూర్చుని త్రాగారు. వీరు తెచ్చుకున్న బంగాళాదుంపలు ముక్కలు, మీగడ వగైరాలు తీసి తిన్నారు. రైలులోను, ఇలాటి చోట హోటలులో కంటె బాబా బాగా తింటారు.

భోజనంచేసి ఆ యెండలో అందరూ కాస్సేపు క్రింద పరున్నారు. కొంత సేపటికి చలివేయడం ప్రారంభిస్తే ఆ హోటలులోకి వెళ్ళారు. అక్కడ పింగ్‌పాంగ్ కూడా వుంటే బాబా సంతోషించి కొంతసేపు శిష్యులతో ఆడుకున్నారు. ఆ హోటలు

యజమాని వారందరిని ఆ రాత్రి అక్కడే పడుకోమన్నాడు. బాబా మొదట్లో అక్కడ రెండు రోజులుండామని అనుకున్నారు. కాని వాతావరణం బాగా లేదు. బాబా అప్పుడు శిష్యులందరినీ పిలిచారు. కొంచరు నవ్వుతున్నారు. బాబా అత్యంత సహనం కలవారు. వారందరినీ బాబా చెప్పేది వినేటట్లు చేశారు. అబ్దుల్ ఘనీ అప్పుడు "బాబా ఏదో చెబుదామని అనుకుంటున్నారు. ఈ సంగతులు బాబా ఇదివరకు చెప్పలేదు. మీరు నవ్వుతూ పేలుతూ వుంటే బాబా చెబుదామనుకున్నదేదో చెప్పడం మానేస్తారు. అప్పుడు నష్టపోయేది మీరే. అందుకని మీ నవ్వు నిగ్రహించుకుని సావధానులై బాబా చెప్పబోయేది వినండి" అన్నాడు.

బాబా అప్పుడు సప్త భూమికల గురించి చెప్పారు. ముఖ్యంగా ఆరవ భూమిక నుంచి ఏడవ భూమికను మానవుడు ఎల్లా చేరుకునేదీ చెప్పారు. వారందరికి అర్థం అయేవరకు బాబా వివరించారు. ఇది అయిన తరువాత బాబా కూడా వారందరితోను సరదాగా ఉన్నారు అందరూ బయటకు వెళ్ళి క్రిందకు లోయలోకి వెళ్ళి అవతల కొండపైకి ఎక్కారు. ఒకరి కొకరు సహాయం చేసుకుంటూ అందరూ ఒక వరుసలో ఒకరి చేతులు ఒకరు పట్టుకుని ఎక్కేసేరు. అందరికంటె ముందు బాబా వెళుతున్నారు. మళ్ళీ వెనక్కి ఆ హోటలువద్దకు వెళ్ళారు అక్కడ టీ తీసుకున్నారు సాయంత్రం అయిదు గంటలకు బయలుదేరే రైలుకోసం కనిపెట్టుకుని వున్నారు. తిరుగు ప్రయాణంలో బాబా ఒకరికి ఎక్కువ సన్నిహితులయారని మరియొకరు ఒకరిని చూచి ఒకరు అసూయపడసాగారు ప్రేమ, సంపూర్ణ నిర్మలము కానిచో ఇలాగే వుంటాయి భావాలు. బాబా విధానాలలో ఇలాటి అసూయాభావాలు రేకెత్తించడం ఒకటి. దీనివలన ఎవరికి వారే బాబా యెడల ఎక్కువ ప్రేమను కనబరుస్తారు. బాబా ఒక్కొక్కరికి ఒక్కొక్క పద్ధతి అవలంబిస్తారు. ముఖ్యంగా లుగానోలో ఉండగా ఈ పాశ్చాత్య స్త్రీ లోని అసూయ, అహంభావము, గర్వము అన్నీ రేకెత్తించి పైకి పొంగేలా చేశారు బాబా. ఒకరిని చూచి ఒకరు అసూయపడుతూ భేదాభిప్రాయాలతో వున్నారు. కిమ్‌కీ, మింటాకీ మధ్య డెలియాను రాయబారిగా నియమించారు బాబా. డెలియాను తరువాత నీవు నా పని బాగా చేయగలిగావని మెచ్చుకున్నారు. మార్గరెట్ అందరినీ చక్కగా అర్థం చేసుకునేది.

చలి ఎక్కువగా వుండుటచేత రెండు రోజులు ముందే లుగానో విడిచి వెళ్ళిపోదామని బాబాతో చెప్పారు శిష్యులు. బాబా సరే అని అక్కడనుంచి పారిస్ వెడదామన్నారు. ఆ మర్నాడు ఫ్రాన్సు దేశాధిపతి అయిన ప్రెసిడెంటుని ఎవరో తుపాకీతో

కాల్చి చంపేశారని వార్త వచ్చింది. బాబా మండలిని పిలిచి హిందుస్తానీలోను, పాశ్చాత్య స్త్రీ మండలిని పిలిచి ఇంగ్లీషులోను చెప్పారు. బాబా వారి ఏజంట్లు త్వరితంగా పనిచేస్తున్నారనీ, వస్తే ప్రపంచ యుద్ధం వస్తుందనీ లేకపోతే దాని బదులు ప్రపంచం పడవలసిన బాధను ఆయనే తనమీదకు తీసుకుంటానని చెప్పారు. అప్పుడు నానా జాతుల మధ్య చిన్న తగాదాలేవో వుంటాయన్నారు. ఏ సంగతీ మర్నాడు చెప్తానన్నారు. తమ ప్రియతముడు ఇంత బాధ ప్రపంచంకోసం పడాలనే ఆలోచన కలుగగానే కొంతమంది ఏడ్చేశారు. మరి కొంతమంది మేము కూడా మీ బాధ పంచుకుంటామన్నారు. "మీరంతా నాకోసం పనిచేస్తే ఈ పని మీరు చేయాలి" అన్నారు బాబా.

బాబా మాట్లాడేముందు రెండు వారాలు చాలా జబ్బుగా వుంటానని అంతకుముందే శిష్యులతో చెప్పారు అమెరికాలో జూలై (1932) ఏర్పాటు చేశారు. ఏదో ఒక ప్రత్యేక ఉద్యమానికి ముందు శారీరకమైన బాధ పడడం బాబా విధానం కాబోలు. ఆయన రూపు మారుతుంది. ఆయన కడుపు ఉబ్బుతుంది. రెండు వారాలు అలా జరిగింది. ఆ పని అయిపోయిన తరువాత తిరిగి బాబా యథాప్రకారంగా వుంటారు.

మిలాన్ నుంచి ఎనిడ్‌కార్ఫ్, లుగానో వస్తానని బాబాకు ఫోన్‌చేసింది బాబా అంగీకరించలేదు. ఎందుచేతంటే బాబాయే కొద్ది రోజులలో లుగానో నుంచి పారిస్ తరలివెడదా మనుకుంటున్నారు అందరితోను. పైగా ఇప్పటికే పాశ్చాత్య వనితలలో వారిలో వారికి సమరసభావం తక్కువైంది. ఇంగ్లండులో బయలుదేరేముందు డెస్మాండ్‌కి ఇచ్చినమాట నిలబెట్టుకోవడంకోసం బాబా ఆంతరికంగా పని చేస్తున్నారు. దీనివలన బాబాకు కొంత బాధ కలుగకపోలేదు. దానికేగాక మిగతావారికి కూడా కొన్ని కష్టాలు కలిగాయి. ఒక మారు వాతావరణం చాలా తీవ్రమయేసరికి ఒకామె ఆగలేక చర్చికి పరుగెత్తుకువెళ్ళి అక్కడ ప్రార్థన చేసుకుంది. ఆమె ఎక్కడుందో కనుగొని తీసుకురావడానికి బాబా ఇంకొకామెను పంపించారు.

కొన్ని సాయంకాలాలు హోటలులోనే కూర్చుని భారతీయ సంగీతం విన్నారు.

పైన చెప్పినప్పుడు ఆమె చర్చినుంచి రాగానే బాబా 'సెయింట్ అగస్టైన్ ఒప్పుకోళ్ళు' అనే పుస్తకంనుంచి "ఎవరయితే తన గురువుకోసం బాధలు పడటానికి సిద్ధంగా లేరో...." అనేది చూపించి చదివించారు. "భావికార్యం కోసం నేను అందరిని పరీక్ష చేస్తున్నాను. ఎవరు బాధపడటానికి ఎంతవరకు సిద్ధపడతారో అని చూస్తున్నాను" అన్నారు బాబా. ఒకరితో "నీవు పరీక్షకు బాగా తట్టుకోగలిగావు"అనేవారు.

మే 7వ తేదీ శనివారంనాడు మధ్యాహ్నం రైలుకి బయలుదేరి అందరూ మర్నాడు ఉదయం 8 గంటలకు పారిస్ చేరుకున్నారు. బాబా అమెరికా వెళ్ళే ముందు వారం రోజులు రస్సెల్ రోడ్, 32వ నెంబరు ఇంట్లో (కిట్టీ డేవీయిల్లు) ఉంటానని చెప్పారు.

బాబా ఇంగ్లాండులో వుండగా 'జాన్ బుల్' అనే పత్రిక బాబా గురించి అసత్య ప్రచారంగల వ్యాసం ప్రచురిస్తూ ఆయన నాసిక్ ఆశ్రమం ప్రభుత్వంవారు బలవంతంగా మూయించారని వ్రాశారు ఈ విషయం చదివి బాబా ఇది నిజంకాదనీ బహిరంగంగా చెప్పేవరకు ఆయన తిరిగివచ్చినప్పుడు తమ యింటిలో దిగడానికి వీలుండదని కిట్టీ డేవీ తండ్రి లండన్‌నుంచి తన కుమార్తె కిట్టీకి తెలియపరిచారు. వారు వేరే చోటు చూసుకోవాలని వ్రాశారు. ఆ ఉత్తరం కిట్టీ తీసుకుపోయి బాబాకు చూపించగా "నీ వేమీ ఆందోళనపడకు, ఇది మంచిదే, నాకు వ్యతిరేకులు కూడా వుండాలి. బాబా పరివారం అందరిని పిలిచి కిట్టీని ఉత్తరంలోని సంగతులు అందరికీ చెప్పమన్నారు. అప్పుడు కిట్టీకి సంగతి వివరించి తన తండ్రికి ఇలా జవాబు వ్రాయమన్నారు" బాబా నీ ఉత్తరం చూచారు. అదంతా దస్తూర్ అనే వానివల్ల జరిగిందట అతడు ఇదివరకు బాబా శిష్యుడుగానే వుండేవాడట. బాబా తనకోసం అద్భుతాలు చేయుటకు నిరాకరించారని ఎదురు తిరిగి ఈ విధంగా అసత్య ప్రచారం చేస్తున్నాడట అతడు తన తప్పు తెలుసుకుని మరల బాబాను చేరి క్షమాపణ చెప్పుకుంటాడు. ఈ విధంగా అతడు ఎదురు తిరగడం బాబా ఆధ్యాత్మిక కార్యానికి చాలా మంచిదన్నారు

కిట్టీ మొదలయినవారు తనవారు ఆ వ్యాసం ఎలా తీసుకుంటారో అని విచారిస్తున్నారు. వెంటనే లండన్ వెళ్ళి అక్కడ క్రొత్త ఏర్పాట్లు చేయడం ఒక్కటే మార్గం అని వారు అనుకున్నారు. కిట్టీని పిలిచి ఆమెచేత బాబా 'ఏమీ విచారించవ'ని వాగ్దానం చేయించుకున్నారు.

మే 7 వ తారీఖున ప్యారిస్ ప్రయాణానికి రైలులో రెండు పెట్టెలు బాబా పార్టీ వారే ఆక్రమించుకున్నారు రాత్రి భోజనానికి సాయంత్రం టీకి వారు తమతో కూడా తెచ్చుకున్నదానితో పూర్తి చేసుకున్నారు.

పారిస్‌లో గత డిసెంబరు (1931)లో దిగిన హోటలులో ఇప్పుడు కూడా వెళ్ళి అందులో దిగారు. బాబా పరివారం అందరూ వేడినీళ్ళ స్నానాలుచేసి ఉదయం అల్పాహారాలు చేశారు. బాబా రాకుండానే ఈ అల్పాహారం కొందరు ముగించడం బాబాకు ఇష్టం కాలేదు ఆయన అనుమతిలేనిదే ఇలా ఎన్నడూ జరగలేదు. అందు

చేత బాబావారితో భుజించడానికి నిరాకరించారు. ఆయన గదిలోనికి వెళ్ళి అక్కడే ఒక్కరూ భోజనం చేశారు.

మార్గరెట్ స్కూలుకి వెళ్ళడానికి కిట్టీ గదులు ఏర్పాటు చేయడానికి లండన్ వెంటనే వెళ్ళాలి. మొదటిరోజున పారిస్‌లో ఒక పెద్ద టాక్సీ ఏర్పాటు చేశారు. నగరంలో తిరగడానికి. బాబా సాయంకాలం "ఫోలీస్ బెర్జెర్" అనే ప్రదర్శనానికి. మండలి సినిమాకి వెళ్ళారు. మర్నాడు కెలాకి రైలులో టిక్కెట్లుకొని ప్రయాణానికి ఏర్పాటు చేశారు. ఆ ప్రకారంగా మరుసటిరోజున లండన్‌కి పయనమై వెళ్ళిపోయారు.

లండన్ చేరిన తరువాత ఒక పాశ్చాత్య శిష్యురాలు (డెలియా) ఈ వారం రోజులు బుగానోలో ఉన్నందుకు ఎన్నో సంవత్సరాల అనుభవం కలిగినట్లయింది అని చెప్పింది. ఇటువంటి అనుభవం బాబాతో వెళ్ళినవారందరికి కూడా కలిగిందని తరువాత తెలిసింది. బుగానోలో వుండగా బాబా పాశ్చాత్య స్త్రీలను పిలిచి "తెల్లవారింది లగాయతు మీరు చేసే ప్రతి పని కూడా ఈ పని బాబా చేస్తున్నారు. అని అనుకుంటూ మీ పనులు మీరు చేసుకుంటే అది ఉత్తమమయిన ఆధ్యాత్మిక అభ్యాసమవుతుంది" అని చెప్పారు.

బాబా పాశ్చాత్య దేశాలలో ఉన్నపుడు పాశ్చాత్యులలాగే వుంటారు. ప్రాచ్య దేశాలలో ప్రాచ్యులలాగే ఉంటారు. ఆయన పిల్లలతో పిల్లవానిలా ఆడగలరు. ఎవరికయినా స్నేహితునిలా వుంటారు. తండ్రిలా, గురువుగా, ఆధ్యాత్మిక ప్రియునిగా అన్ని రకాలుగాను అందరికీ ఆయన ఎలా కావాలంటే అలా ఆయన ఉంటారు. మన భావనలోనే వుంది అంతా. తరుచు నవ్వు పుట్టించేలా సంభాషిస్తారు. ఎంతో మరియాదగా ప్రవర్తిస్తారు. ఆయన కఠినంగా ఉన్నా అలా వుండడం ఆ సందర్భంలో న్యాయమే అనిపిస్తారు. ఒక్క ముక్కలో చెప్పాలంటే బాబా జీవితం గొప్ప ఆదర్శం చూపుతుంది. అయినా ఆయన ఎప్పుడూ నేను చేసేలా చేయడానికి ప్రయత్నించవద్దు. నేను చెప్పినట్లు చేయగలిగితే చాలు అని శిష్యులను తరచూ హెచ్చరిస్తూంటారు.

పారిస్ నుంచి ముందుగా వచ్చిన కిట్టీ, మార్గరెట్‌లు మే 8 వ తేదీన లండన్ వచ్చి బాబా ఉండడంకోసం ఏది కుదురుతుందేమోనని ప్రయత్నం చేస్తున్నారు లంకాస్టర్ గేటులో ఫెలోషిప్ క్లబ్‌లో గదులు, భారతీయులకు కూడా దొరుకుతాయి. చవుకగా కూడా ఉంటాయి.

మే 9 వ తారీకున బాబా లండన్‌కి వస్తారని కిట్టీ బాబాను డోవర్‌కి వెళ్ళి కలుసు కుంది బాబా పరివారంలో ఎవరూ ఉత్సాహంగా కనిపించలేదు. అందరూ ప్రయాణంతో అలసిపోయి వున్నారు. బాగా ముందుగా వెళ్ళబట్టి కిట్టీ బాబాకు మిగిలినవారికి రెండు కారేజీలతో భోజనం తెప్పించి యిచ్చింది. వేడి వేడి టీ కూడా తెప్పించింది.

బాబా వచ్చిన తరువాత పెలోషిప్ క్లబ్‌లోనే దిగారు వారి మండలితో. కిట్టీని, మార్గరెట్‌ను కూడా బాబా ఆ హోటలులోనే ఉండమన్నారు. బాబా అక్కడ రద్దీ ఎక్కువగా వుందని ఆ హోటలుశాఖ యింకొకటి 46 వ నెంబరు యింటిలో వుంటే అందులోకి మారేరు. అది కొద్ది యిళ్ళ అవతలే వున్నది. ఆ శాఖలో బాబాకోసం తీసుకున్న గది విశాలంగా వున్నది. అందులో గాలి కూడా బాగా వేస్తుంది. క్లబ్‌లో మండలివారంతా వున్నారు. ఈ శాఖలో బాబాతో ఆదీ (సీనియర్) ఇంకొకడు మాత్రం ఉన్నారు. ఇక్కడ భోజనం బాగాలేదని ఇంకొక భారతీయ భోజన హోటలు నుంచి భోజనం తెప్పించిపెట్టారు బాబాకి. బాబా అది బాగానే వుందన్నారు.

లుగానో నుంచి వచ్చాక బాబా మే 9 వ తేదీన 'సన్ డిస్పాచ్' అనే పత్రిక యొక్క విలేఖరితో సంభాషించారు. పత్రికకి యిచ్చిన ఒక సందేశంలో బాబా యిలా చెప్పారు—

> "ప్రతిదానికీ మూలాధారమయిన అనంతతత్వంతో నేను ఐక్యత పొందాను. ఇది క్రీస్తు చైతన్యము యొక్క స్థితి. ప్రజలు నన్ను మెస్సయ్యా అన్నా, రక్షకుడన్నా, విమోచనకారుడన్నా నాకేమీ కాదు."

బాబా అసాధ్యమని అనుకున్నది కావాలని అడుగుతూంటారు. అయ్యో! బాబా అడిగారే ఆ వస్తువు లేదే అని విచారించకుండా ఎలాగయినా అది దొరుకు తుందేమో అని శిష్యులు చేసే ప్రయత్నంలోనే వుంది విశిష్టత. దొరికిందా లేదా అని కాదు బాబా చూసేది. ఎవరిని అడిగారో వారు తగిన ప్రయత్నం చేశారా లేదా శక్తివంచన లేకుండా నిజాయితీతో అని బాబా చూస్తారు. కొంత ఆందోళన ఆ శిష్యుని మనసుకు కలుగుతుంది. తద్వారా బాబా వారి ఆంతరికకార్యం పూర్తిచేస్తారు.

'జాన్ బుల్'లో ప్రచురించిన వ్యాసం బాబాను విమర్శచేస్తూ వ్రాసినది. బాబా అనుచరులతో ఇటలీ వదలిన తరువాత అక్కడ పత్రికలలో ప్రచురితమయినది అందులో ఉన్నవీ, లేనివీ బాబాకి ధనికులయిన స్త్రీలు శిష్యురాండ్రుగా వున్నారని

మొదలయినవి వ్రాసి విషప్రచారం చేశారు. ఈ సంగతి విని బాబా నవ్వి వూరుకున్నారు దానికి జవాబుకూడా తమ మండలిని వ్రాయనివ్వారుకాదు.

బాబా అమెరికా వెళ్ళేటప్పుడు ఒక కుక్కపిల్లను తీసుకుని వెడతాను కావాలన్నారు. ఒక కుక్కపిల్లను, స్త్రీలలో ఒకరు బాబాకి యిచ్చారు. మింటా, కిట్టీ, మార్గరెట్ వగైరాలను కిమ్‌కో అని బాబా ఎలాగయితే పేరు పెట్టారో ఆ కుక్కపిల్లను బాబా 'మిక్కో' అన్నారు. బాబా దానిని రెండు రాత్రులు పెట్టుకుని తరువాత అమెరికా వెళుతూ డెలియాకి యిచ్చి దీనిని జాగ్రత్తగా చూస్తూవుండు అని అప్పజెప్పారు.

బాబా యింక అయిదు రోజులలో (14 వ తేదీన) అందరినీ వదలి అమెరికా వెళ్ళిపోతున్నారని పాశ్చాత్యులందరూ విచారంగా వున్నారు.

ఈ అయిదు రోజులూ ఊపిరి సలపనంత పని తగిలింది. బాబాను చూడడానికి ఎందరో వచ్చారు. మెరెడిత్, మార్గరెట్ స్టార్‌లు, స్టెపనీ యింట్లో బస చేశారు. క్వెన్‌టిన్‌టాడ్‌కి అసలు తీరుబడే లేదు బాబాతో అతడు అమెరికాకు వెళ్ళవలసివుంది. బాబాకు, పరివారానికీ, తనకు టిక్కెట్లు వగైరా ఏర్పాట్లుతో అతడికి పని ఎక్కువగానే వుంది.

ఒకనాటి మధ్యాహ్నం బాబా మెరెడిత్ తల్లిని చూడటానికి వెళ్ళారు. కిట్టీ మిగతావారు కెన్నెత్‌రాస్‌తో బాబా మండలిని షాపులకి తీసుకెళ్ళి వారికి కావలసిన సూట్లు కొనుక్కోడానికి సహాయపడ్డారు

మెరెడిత్ మార్గరెట్ స్టార్, క్వెన్‌టిన్‌టాడ్, వీరు బాబాతో అమెరికాకి తీసికెళుతున్నారు గనుక వారికి కావలసిన బట్టలు వగైరా కొనుక్కోడానికి బాబాయే డబ్బు యిచ్చారు. మెరిడిత్ తల్లి డబ్బుకి ఇబ్బంది పడుతూంటే ఆమెకి కూడా బాబా డబ్బు సహాయం చేశారు

బాబా మెరిడిత్ తల్లిని చూడటానికి వెళ్ళి అయిదు గంటలకు తిరిగివస్తానన్ని చెప్పారు. కాని మిగతావారందరిని కూడా ఆ సమయానికి రమ్మని ప్రత్యేకంగా చెప్పలేదు. వీరంతా హైడ్ పార్క్‌కి వెళ్ళి అక్కడ నుంచి స్ట్రాండ్‌కి బస్సుమీద వెళ్ళారు. అక్కడ చాలా షాపులు చూశారు. కాని ఎందులోనూ తగిన వస్తువులు లేక ఉన్నవి మండలికి నచ్చలేదు. సమర్‌సెట్ హౌస్ దగ్గర ఎ. బి. సి. లో టీ తీసుకున్నారు. కెన్నెత్‌రాస్‌ని సహాయంగా యిచ్చి మండలికి అతడు బట్టలు కొనిపెడతాడని కిటీ

లంకాస్టర్ గేట్‌కి వెడదామని తొందరగా వెళుతోంది. కొద్ది నిమిషాలలో వాటర్లూ బ్రిడ్జి రోడ్డుమూల ఒక షాపులో బాబా చెప్పిన ధరలలో సూట్లు వుండడం చూచింది. వెంటనే ఆమె వెనక్కి వెళ్ళి ఒక టీ అంగడిలో నుంచి వస్తున్న మండలిని కలుసుకుంది. వారికి ఈ సూట్లున్న దుకాణం చూపించి కిట్టీ లోపలికి కూడా వెళ్ళకుండా తిన్నగా బాబా దిగిన ఫెలోషిప్ క్లబ్‌కి వచ్చింది. పాపం చాలా అలసిపోయింది. గబగబా పైకి ఎక్కి వచ్చినందున ఆయాసంగా కూడా వుంది బాబా మిగిలినవారితో కూర్చున్నారు ఎవరూ మాట్లాడటంలేదు. వాతావరణం గంభీరంగా వుంది. ఏదో తప్పు జరిగింది కాబోలు అని ఆమె అనుకుంటూ వుండగానే మిగతా శిష్యులు ఆమెను మండలిని అయిదు గంటలకు తిరిగి ఎందుకు తీసుకురాలేదు ? అని బాబా అడుగుతున్నారని చెప్పారు. కిట్టీ వారిని ఎక్కడ వదిలి పెట్టిందో చెప్పి వారికి అయిదు గంటలకు తిరిగి రావాలని తెలియదు అని స్పష్టంగా చెప్పింది. అందుకనే ఆమె ముందు వచ్చేసింది వారెక్కడ వున్నారో చెప్పడానికి అని బాబాతో చెప్పింది. ఈ జవాబు బాబాకు తృప్తి కలిగించలేదు. బాబా లేచి అటూ యిటూ పచార్లు చేస్తున్నారు ఆయన అక్షరాల బోర్డుమీద ఇలాటి దిదివరకెప్పుడూ జరిగి యుండలేదు అన్నారు మండలి ఆయనకు అవిధేయత చూపుటకు సాహసించలేదు బాబా వెంటనే ఆ షాపుకి టెలిఫోన్ చేసి వారు అయిదు గంటలకు ఎందుకు రాలేదో బాబా చెప్పినట్లు ఎందుకు చేయలేదో సంజాయిషీ అడుగమన్నారు. కిట్టీ తానేనా పాపం అదృష్టమే అనుకుని ఆ దుకాణానికి ఫోను చేసింది మండలి అక్కడే వున్నారని తెలిసింది. ఫోను వద్దకు డా॥ ఘనీ వచ్చారు తరువాత కెన్నెత్‌రాస్ మాట్లాడేరు అయిదు గంటలకు రావాలని బాబా యొక్క ఆజ్ఞ అని ఎవరికీ తెలియదన్నారు. అందుచేత బాబా ఆజ్ఞోల్లంఘనం అన్న ప్రశ్నే లేదన్నారు. సాధ్యమయినంత త్వరలో మండలి బజారు పని ముగించుకుని వచ్చేశారు వచ్చి బాబా అలా ఆజ్ఞాపించారని ఎవరికీ తెలియదని ఒక్క చాన్‌జీ తప్ప బాబా ఆజ్ఞ ఇంకెవరూ వినలేదని చాన్‌జీ లడ్గేట్ సర్కస్ వద్దనున్న కుక్స్ ఆఫీసుకు వెళ్ళాడని చెప్పారు. బహుశా ఆ ఆజ్ఞ చాన్‌జీకి ఒక్కడికే యిచ్చారేమో.

ఒక సాయంకాలం హౌస్ ఆఫ్ కామన్స్‌కి (పార్లమెంటు) వెళ్ళారు. ఏర్పాటు ప్రకారం ఫీల్డ్సుని తీసుకుని లంకాష్టర్ గేటుకి (బాబా ఉన్న క్లబ్‌కి) జార్జి లాన్స్‌బరీ రావలసియుండెను – కాని అతడు పని వత్తిడివలన రాలేకపోయారు. అయినా పార్లమెంటులోకి వెళ్ళడానికి టిక్కెట్లు పంపించారు. టిక్కెట్లు అందరకూ చాలనందున వెళ్ళడానికి సంకోచిస్తున్నారు 8 గంటలయింది. 9 గంటలయింది. బాబా ఇంకా

వెళ్ళడానికి నిశ్చయించలేము. చివరకు ఎలాగయితేనేం టాక్సీలో బయలుదేరారు. పార్లమెంటు సభ కూడివున్నది. గాలెరీలు అన్నీ నిండుగా వున్నాయి. బాబా మిగతా వారు వేచియుండవలసివచ్చింది. బాబా తిరిగి వెళ్ళిపోతామన్నారు. ఇంతలో అక్కడ డ్యూటీలో వున్న పోలీసు వచ్చి ముగ్గురికి మాత్రం చోటు వుందన్నాడు. చూడవచ్చిన వారి విజిటర్ల పుస్తకంలో సంతకం పెట్టారు. అప్పుడు ఇలాటి భవనానికి రావడం తన పేరు సంతకం పెట్టడం ఇది మొదటిసారి అని బాబా చెప్పారు.

తరువాత బాబా శిష్యులతో నేషనల్ గాలెరీకి వెళ్ళారు. బాబాను అక్కడ వదలి బాబాకు మంచి పరిచారకుడు దొరుకుతాడేమో అని సెయింట్ మార్టిన్ చర్చికి వెళ్ళారు కిట్టీ వగైరాలు. అది గురువారం. ఆ రోజు కాకపోతే ఇంక సేవకుడు దొరకడు. లుగానో వెళ్ళినప్పటి నుంచి సేవక బాలునికోసం చూస్తూనే వున్నారు. భారతీయ మండలి ఇండియాలో ఎన్నో సంవత్సరాల నుంచి చూస్తున్నారు. కిట్టీ సెయింట్ మార్టిన్స్ చర్చి కార్యదర్శికి ఫలానా గుణాలు కలిగిన పిల్లవాడు కావాలి అని ఇదివరకే వ్రాసింది. ఆమె చర్చికి వెళ్ళేసరికి కార్యదర్శి ఎక్కడికో వెళ్ళింది. ఒక అరగంటలో ఆమె తిరిగి వచ్చింది. ఆమె థేమ్సు నదికి దక్షిణాన వున్న ఎవరికో టెలిఫోన్ చేసింది కిట్టీ. ఆమెయే వార్డెన్‌తో మాట్లాడింది. అక్కడ 15 ఏళ్ళ కుర్రవాడు ఉన్నాడని ఏ పనైనా చేయడానికి సిద్ధంగా వున్నాడని చెప్పారు అమెరికా వెళ్ళడానికి కూడా తయారుగా వున్నాడన్నారు అయితే అతనిని వెంటనే పంపగలరా అని అడిగింది కిట్టీ. అతడు పరున్నాడని, లేపి ఒక గంటలో పంపుతామని చెప్పారు. కిట్టీ వెంటనే లంకాస్టర్‌గేట్‌కి ఫోన్ చేసింది బాబాకి ఈ బాలుని సంగతి చెబుదామని. ఫోన్ మార్గరెట్ ఎత్తింది. తరువాత ఘనీ వచ్చి బాబా చాలా అలసిపోయివున్నారని అందరినీ పరుండమని చెప్పారనీ బాబాని లేపడంకంటె ఆ పిల్లవానిని ఉదయాన్నే రమ్మని చెపితే మంచిదని అన్నాడు. ఆ పిల్లవాడు సెయింట్‌మార్టిన్స్‌కిరాగా అతనిని మరల వాడుండే చోటుకి పంపి కిట్టీ లంకాస్టర్ గేట్‌కి వచ్చేసరికి అర్ధరాత్రయింది. మార్గరెట్ వచ్చి కిట్టీని తనకోసం బాబా వేచివున్నారని వెంటనే ఆయనవద్దకు వెళ్ళి గుడ్‌నైట్ చెప్పమని చెప్పింది. కిట్టీ వెళ్ళేసరికి బాబా అందరిని పరుండమని చెప్పి బాబా తను మంచం మీద ఆ పిల్లవానికోసం ఎదురు చూస్తూ కూర్చున్నారు. ఘనీ ఆ పిల్లవానిని రాకుండా చేయడం చాలా అపచారం అయింది. కిట్టీ అంతా వివరించి చెప్పింది. ఆదీ (జూనియర్) ఘనీని అందుకు తెలివిమాలిన వాడు అన్నాడు. ఘనీ పాపం బాబాకు చాలా నిజాయితీతో పని చేస్తాడు. ఘనీవల్లనే అసలు కిట్టీ సేవక బాలుని అన్వేషణార్థం

బయలుదేరింది. అన్ని విధాలా తగిన కుర్రవాడు కావాలని – బలమయినవాడు, బాగా ఎదిగినవాడు, శక్తికలిగినవాడు, ఆధ్యాత్మికంగా మనసు కలిగినవాడు కావాలని ఘనీ చెప్తూ వచ్చాడు. ముందు ముందు బాబా చేయవలసిన ఆధ్యాత్మికపు పనిలో ఆ కుర్ర వాడు సహాయం కావలసివస్తుంది. కాని ఘనీ యెడల బాబా మెత్తబడలేదు. "ఆ పిల్ల వాడు ఉదయాన్నే 6 గంటలకు రాకపోయినట్లయితే ఘనీ ఇండియాకు తిరిగి వెళ్ళ వలసి వుంటుంద"ని బాబా శాసించారు తమతో అమెరికాకు తీసుకువెళ్ళనని చెప్పే శారు. బాబా కిట్టీ వగైరాలను వెళ్ళి పరుండమని చెప్పేరు ఆ పిల్లవాడు తెల్లవారే సరికి వచ్చాడు. గాని అతనిని చూడగానే బాబా వాడు తగినవాడు కాదని చెప్పేశారు.

ఇంతకుముందే బాబా ఆదీ (సీనియర్)ని ఇండియాకు పంపించారు బాబా అనుమతి లేనిదే ఆదీ మండలిలో ఇద్దరు కారు ఎగువకు తోస్తూంటే సాయంచేశాడని సాకుచెప్పి పంపించేశారు బాబా. అది ఒక మిషపెట్టి పంపించారు కాని బాబా ఇండియాలో ఆదీ వల్ల కావలసినపని వుండివుంటుంది. అయినా బాబా విధేయత విషయంలో చాలా కఠినంగా వుంటారు. ఆయన ఇచ్ఛకి వ్యతిరేకంగా సంచరించినా, ఆయన చెప్పినమాట వినకపోయినా బాబా ఊరుకోరు. వాళ్ళ అవిధేయతని క్షమిం చరు. ఈ విషయంలో పాశ్చాత్యులకు గురుశిష్య భావం క్రొత్త గనుక వారియెడల అంత తీవ్రత కనబరచారు బాబా. సమయం వచ్చినప్పుడల్లా మాత్రం పాశ్చాత్యులకు, ప్రాగ్వాసులకు తేడాగురించి చెప్పేవారు.

ఆదీ వెళ్ళేటప్పుడు కిట్టీ "నీవు వెళ్ళి పోడానికి విచారపడటంలేదా ?" అని అడిగింది. అందుకు ఆదీ "ఎందుకు విచారం ? నేను బాబా పని చేయడానికి వెడు తున్నాను. నాకు ఇంకేదీ అక్కరలేదు. నాకు ఆయనతో వుండాలనే వుంటుంది. కాని ఆయనకోసం పనిచేయడం నా ప్రధమ కర్తవ్యం" అన్నాడు.

లుగానో సేవక బాలుని కోసం హోటళ్ళన్నీ గాలించారు కాని అక్కడ వున్న స్విస్ వారికి ప్రయాణాలంటే సహజంగా అయిష్టత వలన వారెవరూ పనికి వచ్చారు కాదు. అందుచేత అక్కడ ఆ అన్వేషణకి అపజయం కలిగింది. కిట్టీ ఈ విషయంలో లండన్‌కి విల్ సగ్గెట్‌కి ఫలానా గుణాలున్న బాలుడు కావాలి, దొరికితే లుగానో పంపించవలెను అని ఉత్తరం వ్రాసింది.

చివరికి అతడు ప్రయత్నించి ఒక బాలుని పంపుదామని అనుకున్నాడు. అతనిని లుగానోకి పంపడానికి పాస్‌పోర్ట్ సమయంలో దొరికిందికాదు. ఇంతలో బాబా లుగానో వదిలివెళ్ళారు.

అయినా బాబా లండన్ వచ్చేటప్పుడు బాబాను కలుద్దామని విల్‌సగ్గెట్ చూచిన బాలుని తీసుకుని ఆతని తల్లి యూస్టన్ రైల్వే స్టేషన్‌కి వచ్చింది. యూస్టన్ లండన్‌లోనే వున్న ఒక చిన్న స్టేషన్. బాబా వచ్చే రైలు ఆగుతుంది ఆమె వచ్చేముందు ఆమె స్నేహితు లెవరో ఈ సంగతి తెలుసుకుని బాబా గురించి 'జాన్‌బుల్'లో ప్రచురించిన వ్యాసం ఆమెకు పంపి ఆమెను రావద్దనికూడా సలహా యిచ్చారు. అయినా ఆమె తన తనయుని ఖర్చులు భరించి బాబా అమెరికా తీసికెళతానంటున్నారని పంపుదామనే నిశ్చయంతో తీసుకువచ్చింది. ఈ నిర్ణయం తీసుకునేముందు ఆమె విల్‌సగ్గెట్‌తో మాట్లాడింది. లండన్‌లో ఎంప్లాయిమెంట్ ఎక్స్చేంజివారితో సంప్రదించింది ఆమె భర్త లండన్‌లో దక్షిణాన ఎక్కడో పనిచేస్తున్నాడు. కిట్టీ వచ్చి యూస్టన్ స్టేషన్‌లో ఆ తల్లిని పిల్లవానిని కలిసి వానిని బాబాకు చూపడానికి తీసుకువెళ్ళింది. బాబా వానిని చాలా దయగా చూచారు అయినా కిట్టీయే అతడు తగిన బాలుడు కాడని అనుకున్నది ఆ మర్నాడు బాబా కిట్టీ ఆ బాలుని తల్లివద్దకు తీసుకువెడతానంటే జాగ్రత్తగా అప్పచెప్పమని చెప్పారు. బాబా ఆ బాలుని "నీవు నాతో అమెరికా వస్తావా?" అని అడుగగా వాడు వస్తానన్నాడు. తల్లిదండ్రులు అంగీకరిస్తే తీసుకుని వెళ్ళడానికి నా అభ్యంతరం లేదు అన్నారు బాబా. ఆ తల్లి మర్నాడు బాబా వద్దకు వచ్చి ఆమె భర్త తన బాలుని పంపుటకు అంగీకరించుటలేదు లని చెప్పింది. ఆమె రావడానికి ముందు భర్తతో కూడా స్కాట్‌లాండ్‌యార్డ్‌కి (ఇంగ్లండులో పోలీసుశాఖకి ముఖ్యస్థానము) వెళ్ళి 'జాన్‌బుల్' ప్రచురణ గురించి వారి అభిప్రాయం అడిగింది. వారికి అక్కడ ఏమీ సహాయం కలుగలేదు. ఇల్లెక్కి ఆ వ్యాసమంతా నమ్మకం లేదు. కాని ఆమె భర్త అంగీకరించలేదు అని బాబాతో ఆమె చెప్పలేకపోయింది. ఆమెకి తన బాలునికి ఒక గొప్ప అవకాశం పోతోందని విచారించింది. అయినప్పటికి బాబా ఆ బాలుని తీసుకువెడితే సంతోషిస్తానంది. బాబా వీలులేదని నిష్కర్షగా చెప్పారు. వారు వెళ్ళిపోయారు బాలుడుకూడా ఆశాభంగంతోటే తిరిగి వెళ్ళాడు ఈ సంఘటన వలన విల్‌సగ్గెట్ తన పనిలో కొన్ని కష్టాలు ఎదుర్కొనవలసి వచ్చింది. కాని ఈ బాలుని సాంగత్య మాత్రాన యువకులలో మంచి పని చేయగలిగారు బాబా.

ఒక రోజున బాబా జంతు ప్రదర్శనశాలకి వెళ్ళి వేగంగా చూచి వచ్చేశారు. ఇంకొకనాడు సినిమాలు చూచారు. బాబా లండన్‌లో వున్నప్పుడు ఐర్లాండు నుంచి వచ్చిన బ్రూస్‌హాలెన్‌ని మరికొందరు అతని భారతీయ స్నేహితులను కలుసుకున్నారు

ఒక రాత్రి ఒక భారతీయ భోజనశాలలో తింటూవుంటే పూల్‌వర్త్‌కి వెళ్ళలేదని డా॥ ఘనీ, కిట్టీకి జ్ఞాపకం చేశాడు. బల్లదగ్గర భోజనం చేస్తూంటే బాబా

కేసి తిరిగి ఏమిటి ఆలోచిస్తున్నావు ? అని అడిగారు. అప్పుడు కిట్టి డా॥ ఘనీని వూల్‌వర్త్‌కి తీసికెళ్ళమంటారా ? అని అడిగింది. బాబా వీలులేదన్నారు. అప్పుడు ఎవరో 'బాబా వద్దంటే వద్దు' అన్నారు. అప్పనని బాబా తల వూపారు.

మర్నాడు బాబా అమెరికాకు వెళ్ళిపోతారని అందరూ బాబాతో కొంతసేపు గడపాలని వచ్చారు. వెళ్ళేముందు రెండు గంటలయినా బాబా అందరితో కొంత సేపు కాలక్షేపం చేస్తారు. బాబా ప్రేమికులందరూ ఆయన చుట్టూ కూర్చున్నారు. కొంతసేపు సంగీతం విన్నారు. కొంతసేపు మౌనంగా కూర్చున్నారు.

బాబాతో అమెరికా వెళ్ళవలసిన భారతీయులు, పాశ్చాత్యులు అందరూ ఒక పెద్ద బస్సులో ఎక్కి సామానంతా అందులోనే సర్దుకుని కూర్చున్నారు. తరువాత టాక్సీలో బాబా వెళ్ళారు.

వాటర్లూ స్టేషన్‌కీ నార్మన్ ఫ్రాంక్లిన్, మేరీబాకెట్, విల్‌బాకెట్, ఫౌల్డ్స్ దంపతులు, హాగ్గర్ట్స్ దంపతులు, ఇన్స్ దంపతులు, అంతకుముందే వచ్చారు బాబాకు వీడ్కోలు చెప్పడానికి. కిమ్, కిట్టీ, డెలియా, మార్గరెట్ సౌథామ్ప్టన్ వరకు బాబాను ఓడలో ఎక్కించి రావడానికి బాబాతో కూడా రైలులో వెళ్ళారు. రైలులో తన నృత్యశాలలో నేర్చుకునే విద్యార్థినుల గురించి మార్గరెట్ బాబాతో చెప్పింది. అందులో ఒక పిల్లను బాబా ముఖ్యంగా చూడాలనుకున్నారు. అంతకు ముందురోజున మార్గరెట్ క్రాస్కి నివాసస్థానానికి మే బిల్ రైయిన్ ఇంటికి వెళ్ళి వచ్చారు బాబా అక్కడనుంచి వారి నృత్యశాలకి వెళ్ళి అక్కడ నాట్యం నేర్చుకునే వారినికూడా బాబా చూచారు. వారిని ఆ నాట్యం నేర్పే మార్గరేట్ మే బిల్‌లను బాబా దీవించి వచ్చారు అమెరికా నుంచి వచ్చి ఇండియా వెళ్ళేముందు ఇటలీకి బాబా వెడితే అప్పుడు నాట్యం నేర్చుకునే పైన చెప్పిన బాలికను బాబావద్దకు తీసుకు రమ్మని మార్గరెట్‌తో చెప్పారు. బాబా చెప్పినట్లే తరువాత మార్గరెట్ చేసింది. బాబా ఆ బాలికను ఇండియాకు కూడా తీసుకురమ్మని చెప్పేరు. మార్గరెట్‌తోటి బాబా వద్దకు ఆ బాలిక ప్రయాణం చేసింది భారత దేశానికి.

సౌథాంప్టన్ తరువాత బ్రెమెన్ ఓడ సముద్రంలో కొంతదూరంలో వుండగా చిన్న స్టీమరుమీద ఎక్కి అందులోకి వెళ్ళారు. ఈ ఆఖరి గంటలో బాబా ఓడమీద అందరినీ తమతో కూర్చోబెట్టుకున్నారు అందరికీ లెమనేడ్ (నిమ్మరసం) ఇప్పించారు. బాబాతో కూడా అమెరికా వెళ్ళేవారు బాబా భారతీయ మండలి కాక, క్వెంటిన్‌టాడ్

మెరెడిత్‌స్టార్, మార్గరెట్‌స్టార్ ఈ ముగ్గురూను. బ్రెమెన్ చాలా పెద్ద ఓడ. మండలివారు టూరిస్ట్ క్లాసులో ప్రయాణం చేస్తున్నారు బాబా. ఆదీ (జూనియర్) పాశ్చాత్యులు రెండవ తరగతిలో ఉన్నారు. ఇంతలోనే స్టీమరు బయలుదేరేముందు కూసే కూత కూసింది. బాబాకు వీడ్కోలు చెప్పడానికి వచ్చిన కిట్టీ వగైరాలు లేచి బాబాకు (గుడ్‌బై) చెప్పారు. బాబా తల ప్రక్కకి త్రిప్పి బుగ్గలు వారివైపుకి త్రిప్పగా వారు ఒకరి తరువాత ఒకరు వరుసగా ఆయనను ముద్దుపెట్టుకున్నారు ఇంతలో మండలివారు టిక్కెట్లు స్టీమరు అధికారులకు చూపించి తీసుకువస్తున్నారు ప్రయాణం సుఖంగా జరుగుగాక అనే శుభాకాంక్షను అందరూ బాబాకు చెప్పారు చెప్పి తిరుగుముఖం పెట్టారు. చిన్న స్టీమరులో ఎక్కారు తీరానికి తిరిగి వెళ్ళడానికి. ఒక అరగంట అందులో వేచియున్న తరువాత అది బయలుదేరింది. బాబా, టాడ్, మెరెడిత్‌లు డెక్‌మీదకు వచ్చారు; వీరిని జూచి చేతులు ఊపారు. వీరందరికి నిజంగా ఏడుపు వచ్చేసింది బాబా వెళ్ళిపోతున్నారని బాబా గదికి ప్రక్కనే టాడ్ గది అమరింది. అదీ, మార్గరెట్, మెరెడిత్ దగ్గరలోనే ఇంకొక గదిలో వున్నారు బాబా కూడా తమ ప్రియ శిష్యులను వదలి వెళ్ళుటకు విచారంగానే వున్నారు. ఆ దినం రాత్రిదాకా బాబా తమ గదిలోనే గడిపారు వెళ్ళినవారిని గురించి తమతో వస్తున్న టాడ్ వగైరాలతో పేరుపేరునా చెప్పి మాట్లాడారు. గ్రామఫోన్ తెప్పించి పాల్‌రోబ్‌సన్ రికార్డులు పెట్టుకుని ఆ పాటలు విన్నారు. అవి బాబాతో వచ్చిన పాశ్చాత్యులకు చాలా యిష్టమైన పాటలు చిన్న స్టీమరులో కిట్టీ వగైరాలు భోజనం చేసి సౌథాంప్టన్ నుండి రైలులో లండన్‌కి వెళ్ళిపోయారు. రాత్రి భోజనానికి ఇళ్ళకి చేరుకున్నారు

బాబా వెళ్ళిపోయిన తరువాత వారి సన్నిహిత ప్రేమికులు కిట్టీ వగైరాలు ఏదో శక్తి కోలుపోయినట్లుగా బలహీనంగా మానసికంగా కూడా నీరసంగా వున్నారు.

మొదటి వారంలోనే అందరూ బాబాకి కేబిల్స్ యిచ్చారు. కిట్టీ యిచ్చిన కేబిల్‌లో "బాబా! ఒక ముద్దు రూపంలో నీ ప్రేమతో నా పెదవులను మూయవలెను" అని తెలిపింది. ఆమెకు బాబా యెడల లైంగిక భావం లేదు. ఆయన దివ్య సనాతన పురుషుడనే భావం ఎల్లప్పుడు వుంది. ఒక్కొక్కరికి బాబా కేబిల్ ద్వారా జవాబులు యిచ్చారు ఓడలోనుంచి. కిట్టీకి యిచ్చిన జవాబులోను మిగిలినవారికి యిచ్చిన కేబిల్స్‌లోను ఆఖరున ఇలా వుంది ——

"నేను సంపూర్ణ జ్ఞానమును, ప్రేమను, ఆనందమును, ప్రేమకు మూలాధారమును. మీరు ఒకనాడు ఇది తెలుసుకుంటారు. నన్ను ఎక్కువగాను ఇంకా ఎక్కువగాను ప్రేమిస్తూ నా సేవ చేస్తూ ఉండండి."

బాబా వారందరి మీద దివ్యప్రేమామృతాన్ని ప్రసరింప జేశారు. బాబా కరుణ వల్లనే ఆ ప్రేమను వారు స్వీకరించి తిరిగి వారందరిని వారివారి ప్రేమను కనపరిచేలా చేశారు. ఆయన దివ్యసహాయం లేకపోతే సాధారణ మానవులయిన వారికి దివ్య ప్రేమ యేమిటో ఎలా తెలుస్తుంది ? నిజంగా అంత ప్రారంభదశలోనే వారి సాంగత్యంలోకి వచ్చినవారు ఎంత అదృష్టవంతులో కదా ! ఎవరికి ఎంత ప్రేమ స్వీకరించడానికి శక్తి అర్హత వున్నాయో వారికి అంత ప్రేమను ఆయన యిచ్చారు. ఆ ప్రేమ స్వీకరించిన ప్రభావం చేతనే వారంతా ఆయన యెడల అంత భక్తి, ప్రేమ, శ్రద్ధ కనబరచి ఆయన ఆనందానికి ఏమి చేయాలో అంతా చేస్తూ శక్తి వంచన లేకుండా బాబా సేవ చేస్తున్నారు. వారి జీవితాలనే వారికి అర్పించి వారి అనుబంధాలతో బాబా ప్రేమకి ముడివేసుకున్నారు. బాబాయే వారికి నీవు ఈ పని చెయ్యి; నీవు ఇది చెయ్యి: ఈ పని నీవు ఈ విధంగా చెయ్యి అని పని అప్ప జెప్పడమే గాకుండా అది చేసే విధానం కూడా సుబోధికం చేస్తారు. తరచుగా వారితో

బాబా "ఆ చిరకాలంలోనే ఆధ్యాత్మికంగా ప్రపంచంలో విప్లవాత్మకమైన మార్పు వస్తుంది ఆ తారుమారుకి ఎంత గొప్పపని చేయవలసివుందో మీకేమయినా తెలుసునా? అందుకు ఎట్టిదైనా ఎదుర్కోడానికి తగిన ధైర్యము, స్థయిర్యము నలుమూలల నుంచి వచ్చే తుఫాను గాలులకు తట్టుకోగలిగే శక్తి వుండాలి" అని చెప్పేవారు.

బాబా ఇంకా వారికి—"నేను ఇప్పుడు మీరు అటువంటివారు కాగలరో లేదో అని పరీక్ష చేస్తున్నాను. మిమ్మల్ని ఈ మాయలోనుంచి తప్పించడానికి, ఈ మాయతో ఉన్న మీ బంధాలను సడలించడానికి ప్రయత్నం చేస్తున్నాను. మీలో కొందరు చిన్న పిల్లలవలె – "మాకు అదంతావద్దు మమ్మల్ని ఇలాగే వుంచండి." లేక "మాకు అది కావాలి. ఇది కావాలి" అని మీరు అంటే నా పని ఇంకా కష్టతరం అవుతుంది. ఇది అందరికీ పరీక్షా సమయం. దీనివల్ల మీ ప్రేమ ఇనుమడిస్తుంది. అయితే నాకు పని ఎక్కువ అవుతుంది" అంటారు. బాబా వారికి వ్రాసిన ఉత్తరాలలో "విరహం అనే బాధ పడితేనే గాని మరల కలిసినపుడు కలిగే ఆనందం ఎలాటిదో అనుభవించలేరు" అని అన్నారు. నిజమే చీకటి లేకపోతే వెలుతురు యొక్క ఉపయోగము, దాని విలువ ఎవరు తెలుసుకోగలరు ?

బ్రెమెన్ ఓడలో ప్రయాణం చేస్తున్న రోజులు అందరూ చాలా సుఖంగా గడిపేరు. బాబా వారి శిష్యులతో డెక్‌మీద షికారు చేస్తూనో, కేబిన్‌లో పలు విధము లయిన ఆటలు ఆడుకుంటూనో, ఓడమీద పింగ్ పాంగ్ ఆడుతూనో, సినిమాలు చూస్తూనో గడిపేరు.

న్యూయార్క్‌కి మే 19వ తేదీ గురువారం నాడు చేరుకున్నారు. బాబా వద్దకు 48 మంది పత్రికా విలేఖరులు, ఫొటోలు తీసేవారు అనేక మంది వచ్చారు. రాజకుమారి నొరీనామాచె బెల్లీ, గ్రహం ఫెల్ప్స్ స్టోక్స్, ఎలిజబెత్ పాటర్సన్, ఆమె భర్త కెన్నెత్ పాటర్సన్, మాల్కం, జీన్‌స్లాక్స్, అనితాడి కార్లో ఇంకా ఎంతో మంది బాబా ఓడ దిగేసరికి వచ్చి బాబాకి స్వాగతం యిచ్చారు. పైన పేర్లు చెప్పినవారు డాక్‌లోకి ఓడ రాగానే ఓడమీదకే వెళ్ళారు.

మొదటిసారి బాబా అమెరికా వచ్చిన 18 మాసాలకి మరల యిప్పుడు అమెరికా భూమిమీద అడుగుపెట్టారు.

బాబా ఓడదిగి ముందు తిన్నగా గ్రహాం స్టోక్స్ యింటికి వెళ్ళారు ఆ యిల్లు న్యూయార్క్ నగరంలో గ్రోక్‌స్ట్రీట్‌లో 88వ నెంబరు. ఇది యొక అంద మయిన పాతయిల్లు. ఉండడంకూడా న్యూయార్క్‌లో పాతనగర భాగంలో వున్నది. దానికి దగ్గరిగానే ఒక హోటలులో మండలివారు దిగారు. బాబాతో కూడా మెరెడిత్, మార్గరెట్‌స్టార్, కాకా, టాడ్ వీరంతా స్టోక్స్ యింటిలోనే బసచేశారు. స్టోక్స్ భార్య లెట్టిస్, చాలా సరదా అయిన మనిషి. ఆమె చాలా దయగలది. ఆమెకి బాబా అంటే ప్రేమ వుందిగాని బాబా అంటే ఆమె ఏమీ అర్థం చేసుకోలేదు. స్టోక్స్ యింటిలో ఇద్దరు పరిచారికలున్నారు. వారి పేర్లు అన్నా, ఎమ్మా. అన్నా వంట చేస్తుంది. ఆమె చాలా లావుగా వుంటుంది. ఎమ్మా చక్కని పిల్ల. వారిద్దరికీ బాబా అంటే భక్తి ఏర్పడింది. అక్కడవున్న కొద్దిరోజులు అందరికి పని ఎక్కువగా వుంది.

రోజంతా బాబా తమను చూడవచ్చిన వారిని చూస్తూ వారితో సంభాషిస్తూ వున్నారు. బాబాను దర్శనం చేసుకున్నవారిలో ఎలిజబెత్ పాటర్సన్ తల్లిదండ్రులు (చాపిన్ దంపతులు) ఉన్నారు. వారు బాబాను దర్శనం చేయడం భవిష్యత్తులో మిర్టిల్ బీచ్‌లో 500 ఎకరాల భూమి బాబా పనికోసం ఒక కేంద్ర నిర్మాణానికి సమర్పించడానికి పునాది అయింది.

సాయంకాలాల్లో బాబా కారులో షికారుకో లేక సినీమా చూడటానికో వెళ్ళే వారు. బాబాను చూద్దామని అనుకున్నవారి పేర్లు నొరీనా ఒక పెద్ద జాబితా తయారు చేసింది. బాబా యెవరి యిళ్ళకు వెళ్ళలేదు గాని, అనిత తల్లి కాన్సర్‌తో బాధపడు తోందని ఆమెను చూడటానికి మాత్రం వెళ్ళారు.

ఒకరోజు సాయంకాలం బాబా మోటారుకారులో న్యూయార్కులోని సెంట్రల్ పార్కు గుండా వెళుతున్నారు. ఎలిజబెత్ పాటర్సన్ కారు నడుపుతోంది. బాబా వెనుక ఇంకా రెండు కార్లలో బాబా పరివారం కొంతమంది వస్తున్నారు. అందులో మొదటి కారును జూలియన్ డామూ అనేవాడు నడుపుతున్నాడు. ఇతడు ఒక చిత్రలేఖకుడు. 1931 సం॥లో మొదటిసారిగా బాబా అమెరికా వచ్చినపుడు బాబా యొక్క చిత్రాన్ని ఇతడు లిఖించాడు. గతరాత్రి డామూర్ తన కారును ప్లాజా హోటలు వద్ద ఉంచాడట ఉదయమే చూడగా కారులో పెట్టి తాళం వేసిన సామాను అతనిది కనిపించలేదట. ఎవరో దొంగిలించి వుండాలి. బాబా అంటే బామూర్‌కి భక్తి కుదిరింది. అందుచేత ఈ సంగతి కార్లు ఆగిన తరువాత బాబాతో చెప్పుకున్నాడు. చాలా విచారిస్తున్నాడు కూడాను – ఆ దొంగను తిడుతూంటే బాబా "నీకు ఉన్న సామాను అంతేనా ? ఇంకా ఏమయినా ఉన్నదా ?" అని అడుగగా "ఇంకా లేకేం. ఉన్నాయి" అని జవాబిచ్చాడు. అయినా ఆ దొంగమీద కోపం పోలేదు బామూర్‌కి. బాబా అప్పుడు అక్షర ఫలకం మీద–"నేను నీలో ఉన్నాను. మరి నేను ఆ దొంగలో కూడా ఉన్నాను" అన్నారు. అప్పుడు డామూర్ గ్రహించి ఆ దొంగను తిట్టడం మానేసి సామాను పోతేపోయిందని సమాధాన పడ్డాడు.

22 వ తారీకున (మే 1932) స్టోక్స్ యింట్లో బాబాకి ఒక పెద్ద సత్కార సభ ఏర్పాటు చేశారు. 300 మంది దాకా అతిధులు దానికి హాజరు అయ్యారు. బాబా ఒక చిన్న గదిలో కూర్చుని వున్నారు. ఒక్కొక్కరే ఆయన వద్దకు రాగా బాబా వారితో కరచాలనం చేశారు. కొద్దిమందితో ఆయన మాట్లాడి ఒక ప్రత్యేకమయిన సందేశం యిచ్చారు. వారందరు వెళ్ళిపోకముందు వారు కూర్చుని వున్న సభలో మెరెడిత్ బాబా ఈ సందర్భంలో యిచ్చిన ఆ సందేశాన్ని చదివాడు. మర్నాడు ఉదయం వ్యాఖ్యానాలతోను, బాబా ఫొటోలతోను, పత్రికలలో ఈ సందేశం ప్రచురించారు. ఆ సందేశము యీ విధముగా నుండెను —

## బాబా సందేశం:

"మిమ్మల్ని నేను మరల చూచుటకు చాలా సంతోషిస్తున్నాను. మొదట నేను వచ్చినపుడు కలిసినవారు మీలో చాలామంది వున్నారు అందుచేత మిమ్ములను నేను పాత స్నేహితులులా భావిస్తున్నాను.

మీలో కొందరు పత్రికలలో నా గుఱించి, నా పని గురించి నిస్సందేహంగా చూచి వుంటారు. ఈ పత్రికా ప్రకటనలు చాలావరకు తప్పుదారిన పట్టించేలా వున్నాయి. విలేఖరులు నా పని అర్థంచేసుకోకపోయినా వారి ప్రకటనలు ఒక సంచలనాన్ని రేకెత్తించడానికి దోహదం చేసినా ఆశ్చర్యపోనక్కరలేదు.

నేను ఏ మతాన్ని, నమ్మకాన్ని, సమాజాన్ని స్థాపించుటకు ఉద్దేశించడంలేదు. అలాటి సంస్థలు ఇప్పటికే చాలా ఎక్కువగా వున్నాయి. నిత్య జీవితంలో ప్రజలను వారి ఆదర్శాలు – తెలుసుకొనేటట్లు చేయడానికి, సహాయపడడానికి నేను వచ్చాను. ఆధునిక జీవితంలోవున్న విస్తృతమయిన అసంతృప్తి, సిద్ధాంతానికి ఆచరణకి మధ్యను ఆదర్శానికి, అది పొందడానికి మధ్యను వున్న అగాధంవల్ల కలిగింది. ఆధ్యాత్మిక భౌతిక దృక్పథాలు, సన్నిహితంగానూ ఒకటయి వుండడానికి బదులు బాగా విడిపోయినవి. ఆధ్యాత్మికానికి భౌతికానికి గాని లేక ఆధ్యాత్మికానికి నామ రూపాలకిగాని మధ్య మూలాధారమయిన వైరుధ్యం ఏమీలేదు. శిరస్సుకి, హృదయానికి సామరస్యం కలిగేలా శాశ్వతమయిన జ్ఞానం కలగడానికి సమన్యగాలోచనకై నిరంతరమూ అభ్యాసం చేయడమే అందుకు తగిన మార్గము. ఈ జ్ఞాన ప్రకాశాన్నే నేను కలిగించ దలిచాను.

తమ స్వంత అనుభవాలద్వారా భగవంతుడు ఒక్కడే సత్యమని సర్వమూ భగవానుడే అని ఉత్తమమయిన గూఢమతవాదులు తెలుసుకున్నారు. మీకు అది తెలియక పోయినా మీలో ప్రతి యొక్కరిలోను ఉన్నతోన్నతమైనది (భగవంతుడు) గుప్తంగా వున్నది. కాని అది మీరు తెలుసుకొని జీవించుటకు, అనుభవించుటకు అది వ్యక్తం కావాలి.

ఈ సత్యాన్ని బుద్ధిచేత తెలుసుకోవడం నమ్మకం కలిగించుకోనడము చాలదు. నిజమైన జ్ఞానము అంతిమ సత్యంతో (భగవంతునితో) ఏకమవడంతో అంతమవుతుంది. నా శాశ్వతస్థితి అయినటువంటి క్రీస్తు చైతన్యస్థితి ఈ చరమ స్థితియే. ఈ జ్ఞానోదయానికి అడ్డంకులు కొన్ని మానసిక వైఖరులు, అహంకారంతో కూడిన కొన్ని కోరికలు. వీటినే ప్రాచ్యులు సంస్కారాలంటారు. ఈ కోరికలయొక్క మొత్తం సముదాయము ఇతరులతో తనను వేరుపరుస్తున్నాయి. పరిణామము అటువంటి విభేదాత్మను అవసరంగా కల్పిస్తుంది. లేకపోతే శరీరంలో వుండగా ఆధ్యాత్మిక చైతన్యం ఎప్పటికీ కలుగనేరదు.

మొట్టమొదటలో పరిణామము ప్రారంభించినపుడు మనము అన్నిటికి మూలాధారంతో ఐక్యమయి యుంటిమి. అప్పుడు ఎన్ని జన్మలు ఎత్తి అయినా ఎన్ని రూపాలు పొందినా చివరకు మరల ఆ స్థితికి తిరిగి రావాలని మనకు వాంఛ యుండినది. చైతన్యము భౌతిక పదార్థముతో సమంగా కలిసినపుడు మూలానికి తిరిగి రావడం పునర్జన్మలోనే సాధ్యమవుతుంది. శ్వేతజాతుల సంయోగమునకు అమెరికా ముందంజ వేయుచున్నది. అందుచేత అచిరకాలంలో నేను గొనివచ్చు ఆధ్యాత్మిక మైన తిరుగుబాటునకు ఉత్తమమైన పునాది యగుచున్నది. అమెరికాకు బ్రహ్మాండమైన శక్తి యున్నది. కాని ఆ శక్తి తప్పుదారిన బడినది. నేను దానిని ఆధ్యాత్మిక సృజనాత్మక మార్గములలోనికి త్రిప్పెదను.

ఇప్పుడు కొద్దిరోజులు కాలిఫోర్నియా వెళ్ళుచుంటాను. అక్కడ నుంచి దూర ప్రాచ్యమునకు ఆధ్యాత్మిక కారణాలవలన ఒకరోజు పనిమీద పోవలసియున్నది. జూన్ నెలాఖరుకి తిరిగి కాలిఫోర్నియా వచ్చెదను. అప్పుడు జూన్ 29 వ తేదీన నేను మాటలాడెదను. నా రాక ఆలస్యమయితే జూలై 12 వ తేదీన తిరిగి వచ్చి జూలై 13 వ తేదీన మౌనము చాలించి మాటలాడెదను.

నేను మాటలాడినపుడు నా ఆధ్యాత్మిక శక్తి గురించి నేను జ్ఞాన ప్రదానం చేయుటకు సమర్థత గురించి అనేకమయిన రుజువులు కనిపిస్తాయి.

అస్తిత్వానికి, ప్రేమకి మూలమయినటువంటి సత్యము జీవితములో అన్ని విభాగాలలోను పరమ మయినదని మానవులు తెలుసుకుంటారు నా యొక్క పని నా యొక్క లక్ష్యములు అత్యంత ఆచరణయోగ్యములు. ఆధ్యాత్మికానికి నష్టం కలిగేలా భౌతికమునకు ప్రాధాన్య మిచ్చుట ఆచరణ సాధ్యం కాదు. ఆధ్యాత్మిక ఆదర్శాలను అభ్యాసంలో పెట్టకుండా ఉండడం యోగ్యం కాదు. కాని నిత్య జీవితంలో ఆదర్శమును ఆచరించడం, జీవించే ఆత్మకు ఒక అందమయిన రూపాన్నిచ్చి సోదర భావాన్ని – అది ఇప్పుడు వున్నట్లుగా ఒక సిద్ధాంతం మాత్రమే కాకుండా – ఆచరణలో నిజమని నిరూపించుట – అనుష్ఠానమంటే అసలు అదే.

నా యొక్క పని గొప్ప ఉత్సాహాన్ని కలిగిస్తుంది. కొంత విరుద్ధభావాన్ని కలిగిస్తుంది. అది తప్పదు. కాని వ్యతిరేక భావంవల్ల ఆధ్యాత్మిక కార్యానికి బలం వస్తుంది. అలాగే నా పని యందుకూడా జరుగుతుంది. ధనస్సు యందు బాణాన్ని ఎక్కుపెట్టి ఎంత బలంగా నీ వైపుకి వింటి త్రాటిని లాగుతావో అంత వేగంతోను బాణం లక్ష్యంకేసి దూసుకుపోతుంది."

ఒక నీగ్రోజాతి స్త్రీ వచ్చి బాబాను ఆమె యొక్క జాతికి సహాయం చేయమని కోరినది.

న్యూయార్క్‌లో ఉన్నప్పుడు బాబా ఒకరోజున బ్రాడ్వేలో ఒక సినిమా చూడటానికి వెళ్ళారు. వారితో అప్పుడు 18 మంది కూడా వెళ్ళారు. సినిమా పూర్తి కాకుండానే బయటికి వెళ్ళి బ్రాడ్వేలో ఎక్కువగా వున్న జనంలో కలిసి నడుస్తూంటే ఎవరో ఒక వ్యక్తి బాబా కళ్ళలోకి చూశాడు. బాబాను గుర్తుపట్టినట్లుగా వుంది అతని చూపు. అతడు బాబాకేసి తిరిగి తిరిగి చూశాడు. సినిమా నుంచి అర్ధాంతరంగా బయటకు రావడానికి కారణం ఇతడే కావచ్చును.

మే 23వ తారీఖున బాబా హడ్సన్ నదీతీరాన వున్న హార్మన్ అనే గ్రామానికి పయనమై వెళ్ళారు. బాబా మొదట అమెరికా సందర్శించినపుడు ఆయన అక్కడే బస చేశారు. అక్కడే ఆశ్రమం స్థాపించారు అక్కడ వున్న యిల్లు, తోట వగైరా మళ్ళీ వచ్చినపుడు బాబా ఉపయోగిస్తారని అలాగే వుంచారు.

న్యూయార్క్ నుంచి వచ్చిన కొద్దిమందితో బాబా ఆ యింటిలో వున్నారు అక్కడే వారిని దర్శించడానికి వచ్చినవారితో సంభాషించారు.

మే 24వ తారీకున ఎలిజబెత్, నొరీనా, అనితా ఈ ముగ్గురు ఎలిజబెత్ కారులో హార్మన్‌కి వెళ్ళారు. బాబా వారికి చిరునవ్వుతో స్వాగతం యిచ్చారు. వారిని కౌగిలించుకున్నారు. అప్పటికే ఎవరెవరో బాబా వద్దకు వచ్చియున్నారు. వచ్చినవారికి జీన్ మొదలగువారు మర్యాదచేసి అల్పాహారాలు యిచ్చారు. తరువాత బాబా ఆ బంగాళా ప్రక్కన వున్న తోటలోనుంచి పొలాలలోకి షికారుకు వెళ్ళారు.

## ఎలిజబెత్‌ని తారీకు వ్రాసి పెట్టుకోమన్నారు

బాబాతో ఇంకా కొందరు ఆ పొలాల గట్లమీద ఎవరిమట్టుకు వారు షికారుగా ఇష్టంవచ్చినట్లు తిరుగుతున్నారు. హాయిగా ఆ గ్రామీణ వాతావరణం అనుభవిస్తున్నారు. బాబాకు ముందుగా అక్షరపలకం చేతితో పట్టుకుని కాకా నడుస్తున్నాడు. బాబాతో సమంగా బాబా ప్రక్కనుంచి ఎలిజబెత్ పాటర్సన్ నడుస్తూవున్నది ఆ పొలాల్లో గట్లమీద ఎన్నో అడవి పూవులున్నాయి. బాబా ఒకచోట ఆగి ప్రక్కనున్న ఒక చిన్న పూవు కోసి ఎలిజబెత్ చేతికిచ్చారు. కాకావద్ద నుంచి అక్షర ఫలకం తీసుకుని దానిమీద ఎలిజబెత్‌తో—

"ఈ పువ్వు ఎల్లప్పుడు నీ వద్ద నుంచుకో. ఈవేళ తారీకు వ్రాసిపెట్టుకో (24 మే). దాని అర్థం నీకు ఎప్పుడో ముందు తెలుస్తుందిలే" అని బాబా చెప్పారు.

ఇంటికి వెళ్ళిన తరువాత ఎలిజబెత్ తన న్యూ టెస్టమెంటు పుస్తకంలో ఆరోజు తేదీని వ్రాసుకుంది. * (24-5-1932) ఆ పుస్తాన్ని తనకి యిస్తూ బాబా అన్న మాటలు కూడా వ్రాసుకుంది. తరువాత ఎలిజబెత్ జీవితంలో ఆ తారీకు మరువలేనిదయినది.

క్వెన్‌టిన్‌టాడ్ బాబాకి వారి మండలికి వారితో వెళ్ళేవారికి కాలిఫోర్నియాకి అక్కడి నుంచి దూర ప్రాచ్య దేశాలకి ప్రయాణానికి టిక్కట్లు కొనడంకోసం, మిగతా ఏర్పాట్లు చేయడంకోసం న్యూయార్క్‌లో వుండిపోయాడు. డా॥ ఘనీ యూరప్ వెళ్ళడానికి అక్కడనుంచి ఇండియాకు వెళ్ళడానికి కూడా బాబా కావలసిన ఏర్పాట్లను టాడ్‌ని చేయమన్నారు.

26 మే తేదీ ఉదయం 11 గంటలకు క్వెన్‌టిన్‌టాడ్ చికాగో ఎక్స్‌ప్రెస్‌లో బయలుదేరాడు. ఆ రైలు హార్మన్‌లో ఆగింది. అక్కడ బాబా పరివారంతో కూడా ఆ రైలులో ఎక్కారు, బాబాతో మాల్కమ్, స్లాక్స్, జీన్‌లు కూడా రైలుఎక్కారు. నోరీనా ఎలిజబెత్‌లు తరువాత ఎలిజబెత్ కారులో కాలిఫోర్నియాకి వస్తారు,

చికాగోకి 27 తేదీ శుక్రవారం సాయంకాలం చేరుకున్నారు. అక్కడ ఇంకో రైలులోకి మారాలి. అందుకు కొంత వ్యవధి వుండడంచేత నగరంలోకి కారుమీద బాబాను శిష్యులు తీసుకువెళ్ళారు. చికాగోలో తటాకం ఒడ్డున కారులో తిరిగారు. అక్కడ 1933 లో ఏర్పాటు చేయబోయే ప్రదర్శనానికి నిర్మాణాలు చేస్తున్నారు. చికాగోలో స్టేషన్‌లో బాబాను పత్రికా విలేఖరులు మరల కలుసుకున్నారు, బాబాను ఫోటోలు తీశారు. ఫోటో తీసినపుడెల్ల బాబాతో మెరిడెత్, మార్గరెట్లు వుండేవారు. వారేకాకుండా బాబా ఎలిజబెత్‌ను కూడా ప్రక్కన వుండమని అనేవారు.

కాలిఫోర్నియా వెళ్ళడానికి టెక్సాస్ నగరంలోనుంచి వెళ్ళారు. ఎండ ఎక్కువగా వుండుటచే ప్రయాణంలో ఉక్కగా వుంది. అందువల్ల బాబా వారి శిష్యులు రైలులో జల్లు స్నానాలు చేశారు.

---

* సరిగా 20 సంవత్సరాలు తరువాత అదే తారీకున (24-5-1952) ఎలిజబెత్ బాబాను కూర్చోపెట్టుకుని మిర్టిల్ బీచ్ నుంచి కాలిఫోర్నియా వెళుతూంటే ఓక్లహోమా సమీపంలో ఘోరమయిన ప్రమాదం జరిగింది. అప్పుడు బాబా అమెరికా భూమిమీద వారి రక్తాన్ని చిందించారు. ఎలిజబెత్‌కి చాలా దెబ్బలు తగిలాయి. ప్రక్కఎముకలు ఎన్నో విరిగిపోయాయి.

ఆదివారం ఉదయానికి 8 గంటలకు పసదెనా పట్నానికి వెళ్ళారు. బాబా తెల్లటి సూటు ధరించారు. చాలా సంతోషంగా వున్నారు. అక్కడ మార్క్‌జోన్స్ అతని భార్య ప్రిసిల్లా, అతని చెల్లెలు, ఆమె భర్త ఇంకా అతని స్నేహితులు చాలా మంది బాబా దర్శనార్థం వచ్చారు. మార్క్‌జోన్స్ మాల్కంకి చాలాకాలంనుంచి స్నేహితుడు. మాల్కం హాలీవుడ్‌కి బాబాను తీసుకువెళ్ళినపుడు మార్క్ యింట్లోనే బాబాకి బస ఏర్పాటు చేశాడు. వచ్చినవారిలో సెలెస్ట్ దోమోబా అనే సుందరి కూడా వుంది.

## హాలీవుడ్ :

పసదెనా మీదుగా బాబా పరివారంతో హాలీవుడ్ నగరానికి వెళ్ళారు. అక్కడ భవనాలు అందంగా సుందరమైన ఉద్యానవనాలతో యొప్పుచుండుట జూచి బాబా చాలా ఆనందించారు. చిన్నదిగావున్నా మార్క్‌జోన్స్ యిల్లు చాలా చక్కగా వుంది.

మార్క్ యింటిలో బాబా. మెరెడిత్, ఎలిజబెత్ ఉన్నారు. ప్రక్క యింటిలో మాల్కం, కాకా వగైరాలు దిగారు సమీపంలోనే మిషన్ హోటల్ అనే హోటలులో మార్గరెట్ స్టార్, జీన్, మిగతావారు దిగారు. బాబా వచ్చిన కొద్ది సేపటిలోనే పత్రికా విలేఖరులు, ఫొటోలు తీసేవారు చాలా మంది వచ్చారు. ఆ రాత్రే బాబాకి ఒక సన్మాన సభ ఏర్పాటయింది. మార్క్‌జోన్స్ హాలీవుడ్‌లో ఒక పాఠశాల నడుపుతున్నాడు. అందులో చదువుకుంటున్నవారు చర్చికి సంబంధించినవారు చాలామంది బాబా దర్శనార్థం వచ్చారు.

మరునటి రోజున ఫిలిం తారలు నివాసగృహాలున్న బెవర్లీహిల్స్‌కి కారులో షికారు వెళ్ళారు. ఆ ప్రదేశం చాలా సుందరంగా వున్నది. ఆ సాయంకాలం మేబీటీ అను సినిమానటి వచ్చి బాబాను దర్శించి చాలా సేపు మాట్లాడింది. తరువాత రోజున – మే 31 వ తేదీ – బాబా పారమౌంట్ స్టూడియోలకు వెళ్ళి చూశారు. మెరెడిత్, మార్గరెట్ బాబాకు ఇరువైపుల వుండి కూడా వెళ్ళారు. ఒకచోట "ది డెవిల్ అండ్ ది డీప్" అనే చిత్రంలో తల్లులా బాంక్‌హెడ్, గేరీ కూపర్, చార్లెస్ లాటన్ నటిస్తున్నారు. క్వెన్‌టిన్‌టాడ్‌కి తల్లులాతోను చార్లెస్‌తోను పరిచయం ఉండుటచే బాబాకి వారిని పరిచయం చేశాడు. ఒకటి రెండు రంగాలు షూటింగు చేస్తూండగా బాబా చూశారు. ఆ మధ్యాహ్నం తల్లులాతో బాబా ప్రత్యేకంగా సంభాషణ చేశారు. మార్క్‌జోన్స్ యింటిలో, ఆనాటి సినీమా ప్రపంచంలోని సొగసుకత్తెలలో ఈమె యొక్కతె. ఆమెతో సంభాషణ అయిన తరువాత మెట్రో గోల్డ్విన్ మేయర్

స్టూడియోలకి బాబా వెళ్ళి చూశారు. అక్కడ లెవిస్ స్టోన్ నటిస్తున్న ఒక సినీమా షూటింగు చూశారు. తరువాత అక్కడ వర్జీనియా బ్రూస్‌ను కలిశారు. అప్పుడే పూర్తి యయిన ఫిలిం ఒకటి బాబాకు ఆ స్టూడియోలో చూపించారు. అది గ్రేటా గార్బో అను ప్రఖ్యాత సినీతార నటించిన 'మాతాహరి' అను ఫిలిం. అక్కడ నుంచి ఫాక్స్ ఫిలిం స్టూడియోలకి వెళ్ళారు. అక్కడ టామ్‌మిక్స్ అను నటుడు ఒక ఫిలింలో నటిస్తున్నాడు. అతనిని బాబాకు పరిచయం చేశారు. ఆ నటుని ప్రఖ్యాతమైన గుర్రమును బాబా చూచారు.

ఆ రాత్రి తల్లులా గ్రేటాగార్బోతో బాబా గురించి మాటలాడింది. మర్నాడు (మంగళవారం) జశ్చా హీపెట్జ్ భార్యయగు ఫ్లారెన్స్ విదోర్ బాబా దర్శనార్థం వచ్చింది. ఆ రోజున చాలామందితో బాబా సంభాషించారు. ఆ సాయంకాలం మేరీ పిక్‌ఫోర్డ్, డగ్లస్ ఫేర్‌బాంక్స్ బాబా గౌరవార్థం ఒక సన్మానం ఏర్పాటు చేశారు. బాబాను మార్క్-జోన్స్ కారులో తీసుకుని వెళ్ళాడు. బాబాతో మెరెడిత్, ప్రిసిల్లా, మార్గరెట్, క్వెన్‌టిన్ టాడ్, బెవెర్లీ హిల్స్‌కి వెళ్ళారు. అతడు (మార్క్-జోన్స్) దారితప్పుట చేత బాబా శిష్యులందరు చేరిన తరువాత వీరంతా వెళ్లారు. ఆ సన్మాన సభకి గేరీకూపర్ చార్లెస్ ఫారెల్, డగ్లస్ ఫేర్‌బాంక్స్ (జూనియర్) లాటీ పిక్‌ఫోర్డ్, కౌన్టెస్ డెంటిస్ డి ఫ్రానో-వీరంతా వచ్చారు. ఆ సాయంకాలం చాలాసేపు బాబా మేరీ పిక్‌ఫోర్డ్‌తో గడిపారు. తరువాత ఒక్కొక్కరితో వేరేవేరే సంభాషించారు. అక్కడ బాబా చాలాసేపు వున్నారు. మేరీ పిక్‌ఫోర్డ్ ప్రాచ్యతత్వ శాస్త్రం చదువుతోంది. ఆమెకు ఆలెన్‌బూన్ సహాయము చేయుచుండెను. బెవెర్లీ హిల్స్‌లోని "పిక్‌ఫేర్" భవనమునకు [మెరీ పిక్‌ఫోర్డ్ - డగ్లస్ ఫేర్ బాంక్స్‌ల నివాస గృహము] వెళ్ళినపుడు ఒక సందేశాన్ని యిచ్చారు బాబా—

## హాలీవుడ్‌లో చలనచిత్ర ప్రపంచానికి బాబా యిచ్చిన సందేశం

చలన చిత్రాలలో కనిపించేవారితో సాంగత్యం కలుగజేసే ఈ అవకాశము వలన నేను కాలిఫోర్నియా రావడానికి మిక్కిలి సంతోషిస్తున్నాను. ఈ రాత్రి ఈ సమావేశము ఏర్పాటయినందుకు నాకు ఆనందముగా నున్నది.

చలనచిత్ర నిర్మాణములోను. వాటి సరఫరాలోను ఉన్న మీకు మీ చేతిలో ఏమి శక్తి వున్నది నేను మీకు చెప్పనక్కరలేదు. ఆ శక్తి ఉపయోగించడంలో ఉన్నటువంటి బాధ్యతను మీరు బాగా గుర్తించుచున్నారని నాకు సందేహము లేదు.

జన సామాన్యము యొక్క భావములను రేపగలిగినవాడు వారిని తన యిచ్చ వచ్చిన రీతిని త్రిప్పగలడు. భావ ప్రేరేపణకు చలనచిత్రముల కంటె శక్తివంత మయిన సాధనము మరియొకటి లేదు. వినోదముకొరకు ప్రజలు నాటక సినీమా శాలలకు వెళ్ళెదరు. కథ బలంగా వుంటే వారు కొంత మార్పు వచ్చెదరు. వారి హృదయములను, మనసులను ఆ కథా రచయితకి, దర్శకునికి, నిర్మాతకు, తార లకు సమర్పించెదరు వారికి తెలిసినదానికంటె ఎక్కువగానే ఆ ఆదర్శమును అనుసరిస్తారు.

పత్రికలు రేడియోలు ప్రజల ఆలోచనలమీద ప్రభావం కనపరుస్తాయి. కాని దృశ్యములకు కలిగినంత శక్తి వాటికి లేదు అన్నిటికంటె ఎక్కువగా దృశ్యములే భావములను మలచును.

ఇప్పుడు ప్రపంచ మందంతటను అందరను బీదలను భాగ్యవంతులను ఒకే మోస్తరుగా క్రుంగజేసే ఒక మందస్థితి ఆవరించియున్నది. దీని నుంచి విముక్తి బడయుటకు అందరూ అలమటిస్తున్నారు. ఫిలిం కంపెనీలు, చిత్రశాలలు. తారలు కూడా దానివలన బాధపడుతున్నారు ఈ మందస్థితి అంతమొందించే శక్తి వారికుంటే వారు తప్పక సంతోషముతో చేసియుండెడివారు. ఈ సందర్భంలో చలనచిత్రములు ఎట్లు సహాయము చేయగలవు ?

ఈ మందస్థితి ప్రమాదవశాత్తుగా రాలేదు. కేవలము అత్యధికవస్తూత్పత్తి చేతగాని మరి ఆర్థికోల్బణము వలనగాని ఇది కలుగలేదు. అవి ఈ పరిస్థితికి తక్షణ కారణాలయినా అసలు ఇట్టి మందస్థితి మానవ పరిణామ కారకులయినవారు గావించి నదే యిది. మానవుడు తన భౌతికములయిన ఆస్తులను వదులుకోవాలి. అప్పుడే నిజంగా అనుభవించడం ద్వారా మానవుడు తన ఉనికి భౌతికాతీతమయిన ఆధ్యాత్మిక మయిన కారణాల మీద ఆధారపడి వుందని తెలుసుకుంటాడు. అప్పుడు మానవుడు నేను తీసుకురాబోయే సత్యమును స్వీకరించుటకు సిద్ధంగా వుంటాడు.

మానవుడు పరిమితిగల ఒక విభిన్న వ్యక్తిగా దేశ కాల పదార్థముల యొక్క మాయచేత బంధింపబడినవాడుగాక స్వభావ సిద్ధముగా శాశ్వతుడని సాధన సంపత్తిలో అనంతుడని ఆ సత్యమునం దిమిడియున్నది. ప్రపంచ మాయ తాను ఊహిస్తున్న ఒక స్వప్నము-అతని చైతన్యశాలలో ఆడబడే ఒక నాటకము - ఈ నాటకమునకు అతడే రచయిత, నిర్మాత, దర్శకుడు, తార కూడాను. తన పాత్రలో తాను లీనమై తన నిజస్థితిని మరచి తాను సృష్టించుకున్న పాత్ర ద్వారా తాను ఒక ప్రాణిగా తడబడుచున్నాడు.

తన నిజమైన స్వభావం తాను తెలుసుకోవాలి. తన ఆధ్యాత్మికత్వముమీదే భౌతిక ప్రకటనలన్నీ ఆధారపడియున్నట్లు అతను గమనించాలి. అప్పుడు అన్ని పరిస్థితులలోను సైర్యము గలిగి స్థిమితముగా ఉంటాడు. అప్పుడింక మందస్థితి అక్కడలేదు. అది అదృశ్యమై పోతోంది.

అయితే చలన చిత్రాలు ఇది తెలుసుకునేందుకు మానవునికి ఎట్లు సహాయ పడతాయి? ప్రదర్శింపబడుచున్న చిత్రముల స్వభావము మార్చనక్కరలేదు. ప్రేమ, శృంగారము, సాహస కృత్యములు—ఇవి మౌలికమైన విషయములు. ఇవి సాధ్యమయినంత వినోదకరంగాను, ఉత్తేజకరంగాను, గుండెలు ఝల్లుమనునట్లును చిత్రీకరించాలి. వీటి ఫలితాలు విస్తృతంగా వుంటే మంచిది.

ఇందులో మార్చవలసిందేమిటంటే మనసునకు హత్తుకునేది అంటే దేనిమీద ఒత్తిడి కలుగజేస్తారో అది ఉదాహరణకి ధైర్యం ఒక గొప్ప సద్గుణము. కాని అది సరిగా ఆచరణలో పెట్టకపోతే ఒక వ్యసనం క్రింద మారవచ్చును. అలాగే ప్రేమ కూడాను. అది మనలను జ్ఞానపు ఔన్నత్యమునకు తీసికొని వెళ్ళగలదు. నిరాశపు లోతులకును తీసుకుపోగలదు. క్రీస్తు సాంగత్యమునకు ముందర స్థితికి ఆయన సాంగత్యమునకు అనంతర స్థితికి మేరీ మాగ్డలేన్ జీవితంలో ఈ ప్రేమ ఎట్టి భేదమును జూపెనో చూడండి. అంతకన్న మంచి ఉదాహరణ ఇవ్వడం కష్టం.

ఈ రెండు విశేష పరిస్థితులకు మధ్య అనేక విధాలయిన ప్రేమ ప్రదర్శిత మయినది. ఒకదాని కంటె ఒకటి మంచిదిగా కనబడుతుంది. శారీరక వాంఛను కన బరిచే ప్రేమ కూడా మంచిదే. అది తన స్వంత యిష్టాయిష్టాలను త్రోసి పుచ్చి తన ప్రియతముని అన్నిటికంటె యెక్కువగా సేవించేలా చేస్తుంది.

ప్రతి మానవ సంబంధము ఏదో ఒక రూపంగా ప్రేమమీద ఆధారపడి వుంటుంది. ఆ ప్రేమ స్వభావాన్నిబట్టి—అది శాశ్వతమైనదో లేక తాత్కాలికమైనదో—ఆ సంబంధము ఫలపడుతుంది లేక అంతరిస్తుంది. ఉదాహరణకి, వివాహము సుఖ వంతముగాను లేక దుఃఖకరముగాను, ఉన్నతిని కలుగజేసేదిగాను లేక నీచదశ కలిగించేదిగాను, శాశ్వతముగాను లేక అశాస్వతముగాను, దానిని ప్రభావితము జేసే ప్రేమనుబట్టి పరిణమించును. శారీరక ఆకర్షణనుబట్టి జరిగే వివాహములు చిరస్థా యిగా ఉండవు. తుదకు అవి తప్పక విడాకులకుగాని, ఇంకా విషాద సంఘటనలకు గాని దారితీయును. పరస్పరముగా సేవచేయాలి అనే కోరికతోనుండి ఉత్తేజము కలుగ

జేసే వివాహములు, అందమునందును, ఐశ్వర్యము నందును ప్రవర్థమానములై సంబంధించిన వారందరికి శ్రేయస్సును కలుగజేసేవిగా పరిఢవిల్లును.

జ్ఞానము యొక్క ఉన్నతులను అందుకోవడానికి పురుషులును, స్త్రీలును భయము, కోపము, లోభము, మోహములను జయించునట్లు మనము వారికి సహాయము చేయవలయును. ఆత్మను వేరుగాను, పరిమితమైనదిగాను, అది కేవలము ఒక భౌతిక మూర్తిమంతము అని దానికి ఒక భౌతిక ప్రారంభము, అంతము, కలవని భావించుట వలన ఆ యా గుణములు వారికి కలుగు చున్నవి. ఆత్మ నిజముగా అపరిమితమయినది. అవిభాజ్యమయినది అయిన ఆధ్యాత్మికసారము. అది స్వభావసిద్ధంగా శాశ్వతమయినది. సాధన సంపత్తిలో అనంతమయినది. మారుతున్న ఈ ప్రపంచమునందు ఈ శాశ్వత సత్యాన్ని తెలుసుకోవడమే జీవితంలో సాధ్యమయిన ఒక గొప్ప కల్పన. ఇది ఎప్పుడైతే అనుభవ పూర్వకంగా తెలుసుకుంటాడో, ప్రతి జీవిలోను తనను చూచి గుర్తిస్తాడు. అన్ని ప్రాణులు తన జీవంలాగే అనుభూతి పొందుతాడు. అందరి ప్రయోజనములు తనవి గానే భావిస్తాడు. మృత్యుభయము, ఆత్మరక్షణవాంఛ, పదార్థ సేకరణయందు ఆసక్తి, ప్రయోజనములందు వైరుధ్యము. తీరని కోరికలవలన క్రోధము ఇవన్నీ అదృశ్యమైపోతాయి. మానవుడు ఇంక గతమందలి అలవాట్లచేత బంధితుడు కాడు. భవిష్యత్తులోని ఆశలవలన అతడు చలింపడు. వర్తమానమందలి ప్రతి క్షణమును పూర్తిగా అనుభవిస్తూ జీవించును. ఈ సాహసకృత్యము కంటె జీవితమందలి ఇంకొక ఉత్తమ రసానుభూతి లేదు. ఇది ప్రదర్శించడానికి చలన చిత్రాల కంటె ఉత్తమ సాధనము లేదు. ఎక్కువ అవగాహనను, ఎక్కువ సత్యానుభూతిని, మంచి జీవితాలను, ప్రేరేపించే కథలు మత సంబంధమయినవిగానే ఉండనక్కరలేదు. మతము, కర్మకాండ, నమ్మకము, స్వర్గ నరకాలు, పాపాలు, వీటి గురించిన అభిప్రాయములు — ఇవన్నీ అసలు నిజాన్ని కప్పిపుచ్చి తేటతెల్లమొనర్చేకంటే ఎక్కువగా కలవరపరుస్తాయి. ఉత్తేజపరచడానికి బదులు ఏమీ తోచకుండా చేస్తాయి. నిర్మల ప్రేమ, నిస్వార్థ సేవ, సత్య దర్శనము, నిత్య జీవితమునందు ఆ అనుభూతిని ఎటువంటి శ్రమ పరిస్థితులలోనైనా ప్రతిబింబింపజేయుట, యిల్లు, వ్యాపారము, బడి, కళాశాల, స్టూడియో, పరిశోధనశాల ఇలా అనేక ముఖాల ప్రసారితమై అత్యున్నత ఆనందమును, పరిశుద్ధతను, ప్రేమను, అన్నిటికంటె గొప్ప శక్తిని, అన్నివిధాలా ఆనందమును చేకూర్చును.

ఇదే అత్యుత్తమ అనుష్ఠానము. అటువంటి పరిస్థితులను తెరమీద కల్పించుట వలన ప్రజలు ఆధ్యాత్మిక జీవితమును జీవించి అనుభవించాలిగాని ఊరికే వాచా చెప్పేది కాదని, అదే, అదిమాత్రమే మనం మన జీవితాలలో నిరంతరముగా కృషి చేసి స్థాపించాలని ఆరాటపడే శాంతి, ప్రేమ, సామరస్యాలు కలుగజేస్తుంది."

మరుసటి రోజున బాబా పరివారముతో మరల పారమౌంట్ స్టూడియోలకి వెళ్ళారు. అక్కడ "లవ్ మి టు నైట్" (ఈ రాత్రి నన్ను ప్రేమించు) అనే చిత్రము మారిస్ షెవలియర్, జీనెట్ మాగ్డొనాల్డ్‌తో నిర్మాణం చేస్తుండగా చూచారు. ఇంకా 'ది బ్లాండ్ వీనస్' అనే చిత్రానికి వాన్‌స్టెర్న్ బర్గ్ దర్శకత్వం వహించుట చూచారు. అక్కడ బాబా ఒక అరగంట ఉన్నారు. బాబా మార్లీన్ డీట్రిచ్‌ను కూడా కలిశారు.

ఆ మధ్యాహ్నం కారులో బాబా శాంటా మానికా వెళ్ళి అక్కడ ఎర్నెస్ట్ లూబిచ్‌తో తేనీటి విందారగించారు తల్లులా బాంక్‌హెడ్, గ్రేటా గార్బోను బాబా దర్శనార్థం తీసుకు వస్తానని చెప్పుట చేత శాన్ ఫ్రాన్సిస్కో వెడదామనుకున్న ప్రయాణం రద్దు చేస్తున్నానని శాంటా మానికా వెళ్ళేటప్పుడు కారులో చెప్పారు.

ఆ సాయంకాలము బాబా పరివారముతో కూడా బాబా గౌరవార్ధము నికర్‌బోకర్ హోటలులో ఏర్పాటు కాబడిన ఒక బ్రహ్మాండమయిన (ఆతిధ్యానికి) విందుకి వెళ్ళారు. దానికి 1000 మంది ప్రముఖులు హాజరయారు. బాబాకు వారందరినీ జీన్ పరిచయం చేసింది. ఆ విందులో బాబాకు ఇరువైపులా మెరెడిత్‌స్టార్, మార్గరెట్‌స్టార్ కూర్చున్నారు. వచ్చిన వారందరూ బాబా వద్దకు వచ్చి కరచాలనం చేశారు. కాథరైన్ గార్డ్‌నర్ అను నామె బిడ్డ కృష్ణమూర్తిని మెచ్చుకొనుచుండెను. ఆమె కూడా ఓజై నుంచి వచ్చినది. ఈ సత్కారం అయిన తరువాత హోటలు మానేజరు వచ్చి బాబాకు వారి పరివారానికి హాలీవుడ్‌కి తిరిగి వచ్చిన తరువాత ఉచిత వసతి సౌకర్యములను కలుగజేతుమని చెప్పెను. ఆ రాత్రి కిమ్‌కో గురించి అనవసర చర్చ చేస్తూ మెరెడిత్ బాబాను చాలా రాత్రి వరకు మెలకువగా ఉండునట్లొనర్చెను. ఇందుకు మండలివారికి మెరెడిత్ మీద చాలా కోపము వచ్చెను.

మర్నాడు గురువారం ఉదయం బాబా శాన్‌ఫ్రాన్‌సిస్కో ప్రయాణం అపు చేశానని చెప్పారు. గురువారం రాత్రి మోటారులో వెళ్ళి శుక్రవారం పగలు అంతా అక్కడ దర్శనార్థులతో సంభాషించి, తిరిగి ఆ రాత్రంతా ప్రయాణంచేసి హాలీవుడ్‌కి

రావడం ప్రయాసకర మయినది. శనివారం రాత్రి హాలీవుడ్ నుంచి హానోలూలూకి బయలుదేరవలసియున్నది. అక్కడ నుంచి బాబా చైనాకు వెళ్ళి తిరిగి కాలిఫోర్నియా రావలసియుండెను. బాబా "మాంటెరీ" అనే ఓడలో ప్రయాణం చేయుటకు ఏర్పాటు చేయబడెను. అందులో వెళ్ళి హానోలూలూలో రెండు రోజులుండి "ఎంప్రెస్ ఆఫ్ జపాన్" అనే ఓడలో చైనాకు వెళ్ళెదరు.

ప్రాచ్య-పాశ్చాత్య దేశములను ఆధ్యాత్మికముగా కలుపుటకు బాబాకు ఒక సేవకుడు కావలెనని చెప్పిరి. అట్టి పరిచారకుని కొరకు అందరు అన్వేషించుచుండిరి. బాబా చాలామంది యువకులను చూచి తుదకు కార్ల్ ఫిలిప్స్ అనువానిని ఎన్నుకొనిరి. కాని ఆ కుర్రవానికి చైనా దేశమునకు పోవుటకు వాషింగ్టన్ నుండి సకాలములో పాస్‌పోర్టు రావడం దుర్లభమయ్యెను. కాని అతడు హానోలూలూ బాబాతో వెళ్ళుటకు ఎట్టి అభ్యంతరము లేదు. హవాయి ద్వీపములు అమెరికా క్రింద వున్న దేశమే. కార్ల్ ఫిలిప్స్ యొక్క తలిదండ్రులు వ్రాతమూలకంగా బాబా అతనిని తీసుకువెళ్ళుటకు అంగీకారము నిచ్చియుండిరి. వారి తనయునికి ఇటువంటి మహదవకాశము కలిగెనని వారు మిక్కిలి సంతోషపడిరి.

క్వెన్‌టిన్ టాడ్ కుక్సు ఆఫీసుకు వెళ్ళి కావలసిన ఏర్పాట్లను చేసెను. గురువారం మధ్యాహ్నం మేరీ పిక్‌ఫోర్డ్ వచ్చి బాబాతో మాటలాడెను. ఆ రోజు సాయంకాలం బాబా క్వెన్‌టిన్‌ను తీసుకుని తల్లులా బాంక్‌హెడ్ యింటికి భోజనానికి వెళ్ళారు. ఆ సమయమందున బాబాను గ్రేటా గార్బో వచ్చి సందర్శించవలసి యుండెను. కాని ఆమె రాలేకపోవుట వలన బాబాకు ఆశాభంగము కలిగెను. గ్రేటాకు క్రితం రాత్రి బొత్తిగా నిద్రలేమిచేత షాంపేన్ త్రాగుటచేతను ఆమె ఈ రాత్రి తల్లులా యింటికి వచ్చే పరిస్థితిలో లేకపోయెను.

హాలీవుడ్ తారలలో కెల్ల గ్రేటా గార్బో ఎక్కువ ఆధ్యాత్మిక చింతన కలది యని బాబా చెప్పిరి. అందువలన ఆమె రాకపోవుట బాబాకు చికాకు కలిగించెను. ఇందుకోసం తల్లులా స్టూడియోలకు వెళ్ళవలసియున్నా రెండు గంటలసేపు బాబాతో కూర్చుని యుండెను. స్టూడియోవారికి ఎంత నష్టమయినను బాబాతో కొంత సమయం గడిపే అవకాశమును జారవిడుచుటకు ఆమె యిష్టపడలేదు. ఆమె వ్యక్తిగతంగా తన స్వంత జీవనము గురించి ఎన్నో ప్రశ్నలువేసి అనేక విషయాలు బాబా వలన తెలిసికొనెను. అనేక సంగతులపై ఆమె బాబా సలహాలను బడసెను. ఆమె వెళ్ళేముందు బాబాకు తల్లులా తన ఛాయా చిత్రాలు మూడు యిచ్చెను.

బాబా క్వెన్‌టిన్‌తో కొంతతడవు కారులో షికారుకి వెళ్ళారు. శుక్రవారం (జూన్ 3 వ తేదీ) అంతా బాబాను చూచుటకై వచ్చినవారితో సంభాషణలతో సరిపోయెను.

ఆ సాయంకాలం హాలివుడ్‌లో గ్రామన్స్ చైనీస్ థియేటరుకి బాబా తమ పరివారంతో వెళ్ళారు. ఆ సినిమా హాలులో "గ్రాండ్ హోటల్" అనే సినిమా చూస్తున్నారు. అందులో గ్రేటా గార్బో 'గ్రుసిన్స్కియా' అనే పాత్ర నటిస్తోంది. బాబా అక్కడికి వెళ్ళగానే సిడ్నీగ్రౌమన్ అనే ఆ సినిమా మానేజరు అమిత గౌరవంగా బాబాకు స్వాగతం యిచ్చాడు. గార్బో వేసిన పాత్ర చాలా సమర్థవంతంగా వుందని బాబా మెచ్చుకున్నారు. అందులో కథ సుప్రసిద్ధ అనా పావ్లోవా జీవితంలో ఒకానొక ఘట్టమును గురించి అయివున్నది. ఈ ప్రదర్శనలో ప్రజలు ఏకాగ్రతతో యున్నారు బాబా తమ అంతరంగ ఆధ్యాత్మిక కార్యమును చక్కగా నెరవేర్చ కొనిరి.

మర్నాడు శనివారం హాలీవుడ్‌లో గడిపిన ఆఖరి రోజు. అందుచేత అక్కడ దిగడిపోయే మెరెడిత్, మార్గరెట్, మాల్కమ్, జీన్ వగైరాలతో బాబా వారికి చెప్ప వలసినవన్నీ చెప్పారు. క్వెన్‌టిన్, సెలెస్ట్ దోమోలా సహాయంతో కార్ల్ ఆ సాయంకాలం బాబాతో ప్రయాణం చేయడానికి వీలుకోసం తంటాలు పడుతున్నాడు. ఆ మధ్యాహ్నం బాబా మేరీ డ్రెస్లెర్ యింటికి భోజనానికి ఆహ్వానింపబడగా క్వెన్‌టిన్‌టాడ్ ఆయనను ఆమె యింటికి తీసుకుని వెళ్ళెను. ఆమె అతనికి ఒక పాత స్నేహితురాలు. ఆమెను క్వెన్టిన్‌టాడ్ బాబాకు పరిచయం చేశాడు. ఎంతో మనోహరంగా వున్న ఆమె నివాసమునకు బాబా ఎంతో దయతోను, గౌరవంతోను ఆహ్వానించింది. అక్కడ భోజనానికి పైవాళ్ళెవరూ రాలేదు. శాంటా బార్బరా నుంచి వచ్చిన మేరీయొక్క స్నేహితురాలొకర్తె మాత్రం వున్నది. మేరీయొక్క కార్యదర్శి కూడా విందులో పాల్గొంది. మేరీ గొప్ప సినిమా నటి. ఆనందదాయక మైన రంగాలలోను, మానవ సహజమయిన కరుణా రసమును ఒప్పించుటలోను ఆమె ప్రతిభ బాగా రాణిస్తుంది. నాలుగు నిమిషాలలోనే ఆమె బాబాతో ఎంతో స్నేహంగా మాట్లాడుతోంది. ఎన్నాళ్ళనుంచో పరిచయం ఉన్నట్లుగా, ఆమె బాబాను షికారుకు తీసుకువెళ్ళి అక్కడ ఏకాంత ప్రదేశంలో – వనాల్లో – ఆయనతో నాట్యం చేయాలని వుంది అని చెప్పింది. ఇంకా ఆమె "ఆ సమయంలో బాబా నాలుగు మాటలు మాట్లాడినా ఎవరితోనూ చెప్పను" అంది. ఆయన చెప్పిన ప్రకారం కాలిఫోర్నియాలో ఏ రోజున మాట్లాడతారో అప్పుడు వచ్చి ఆయన ప్రక్కనే వుంటానని మాట యిచ్చింది.

హాలీవుడ్‌లో నుండగా బాబా కాలిఫోర్నియాకు ఒక సందేశాన్నిచ్చారు.

## బాబా సందేశం

పరమ చైతన్యస్థితి గురించి భగవత్సాక్షాత్కారము గురించి చాలా చెప్పబడినది వ్రాయబడినది కూడాను. అందువలన ఏది సరియయిన మార్గము? వెంటనే అది పొందుట ఎంతవరకు సాధ్యము? అను ఆలోచనలో పడి ప్రజలు దిగ్భ్రమ చెందుచున్నారు గ్రంథములు అవలోకిస్తున్న వేదాంతులు వారి తెలివికి తగినన్ని విజ్ఞాన విషయాలు సేకరించుకోవడంతో ఆగిపోతారు. ఉన్నతోన్నతమైన చైతన్య స్థితి అందరిలోనూ నిగూఢంగా ఉంది. భగవంతుని అంశ అందరిలోనూ ఉంది. అది వ్యక్తం కావాలి. ఈ చైతన్య స్థితి పొందే పద్ధతి ఆచరణ యోగ్యముగా నుండవలెను. అది ప్రపంచంలో ఉంటూ వున్న మానసిక భౌతిక పరిస్థితులనుబట్టి పలచుకోవలెను.

ఆచారాలు, కర్మకాండలు పురోహితులచే అనుసరింపబడుచున్నవాటిచేత పొందుటకు చేసెడి ప్రయత్నములు నిస్సారము లయినవి. అందువలన సాధారణముగా మత విషయాలంటే ప్రపంచంలో అన్నిచోట్లా శ్రద్ధ తగ్గిపోయింది. ఉన్నతమయిన ఆధ్యాత్మికి స్థితిలో ఉన్నప్పటికి ఇండియాలో ప్రస్తుతము అనేకములయిన ఆచార కర్మల అనుష్ఠానముల వలన కులవర్ణ భేదా లెక్కువ అయి, ఈ కర్మకాండయొక్క బాహ్యారూపాలు మాత్రం మిగిలి నిర్జీవములై, నిస్సారములై యున్నవి. అటువంటి వ్రతాలు, అనుష్ఠానాలు, క్రియలు అహంకారాన్ని తగ్గించుటకు బదులు బలిష్ఠము చేస్తాయి. అది బలపడిన కొలది దానికి రాజస మెక్కువయి కలహానికి కాలు దువ్వుతుంది. ప్రత్యేకమయిన ఆత్మను తెలుసుకొనే ప్రయత్నంలో "నేను యిష్టుడను" "నాకు జీవించడానికి హక్కు వుంది." ఈ మొదలయిన ఆలోచనలద్వారా ఆ వ్యక్తి వినాశనకర్త యగుచున్నాడు. క్రైస్తవ ప్రపంచమునందు ఆయుధాలను ఉత్పత్తిచేయడంలో సాగుచున్న పోటీ "ఒక దవడమీద కొడితే రెండోది చూపించు" అను జీసస్ యొక్క ఉపదేశాన్ని విస్మరించియే జరుగుచున్నది కదా! ఇందులో నేను చెప్పిన అహంకారం ద్యోతకమగును.

పరిణామ నిశ్రేణిలో ఖనిజము, వృక్షములు, జంతువులలో నుండి గుప్తముగా నున్న మనసు క్రమముగా వికసించి మానవ శరీరములోనికి వచ్చుసరికి పూర్తియైన చైతన్యమును పొందును.

ఈ చైతన్యమును సృజించుటకే అనంత జ్ఞానానంద సముద్రుడయిన పరమాత్మ నుండి ఈ విశ్వముద్భవించినది. అయితే మానవ రూపమునందు ఒక చిక్కు ఏర్పడినది. ఆ చిక్కును విప్పుటకే ప్రవక్తలు, ఆధ్యాత్మిక గురువులు అప్పుడప్పుడు ఈ భూలోకమునందు జన్మించిరి. మానవ రూపమునందు పూర్ణ చైతన్యము కాక ఇది వరకటి జీవితముల ఫలితముగా 'నేను' అనెడి జీవాత్మ పరిణామము చెందుచున్నది.

అహంకార రూపమయిన ఈ జీవాత్మ కొన్ని తీరిన కోరికలతోటి, కొన్ని తీరని వాంఛలతోటి కూడుకొనియున్నది. పరిమితముగా, బలహీనముగా, సుఖరహితముగా ఉన్నట్లు స్వయంకృతమైన ఒక మాయానుభూతిని అది పొందుచున్నది. అందువలన పరిమితమైన ఈఅహంకారమును క్రమముగా నిగ్రహించుటద్వారా ఆత్మ అభివృద్ధిని గాంచుచున్నది. తుదకు మానవ రూపములో నుండియే పూర్ణచైతన్యమును కలిగియుండి అనంతమైన దివ్యమైన, ఆ పరమాత్మగా పరివర్తనము చెందుచున్నది. మానవుడు ఈ దివ్యచైతన్య స్థితిలోనికి వచ్చినపుడు తన నిజరూపమును అందరిలోనూ, అన్నింటిలోనూ ప్రతిబింబించుకొనగలిగి యుండును. ఎటువంటి పరిస్థితులలో తాను ఉన్నప్పటికిని మానవులకు నిస్వార్థమైన సేవ చేయుచూ, వారి యెడల పవిత్రమయిన ప్రేమను చూపగలిగినచో అదే అహంకారమును గెలిచి ఆ దివ్య చైతన్య స్థితిని చేరుకొనుటకు ఉత్తమమయినది. సులభమయినది అగు మార్గము.

అన్ని నైతిక అభ్యాసములు, మత సంస్కారములు. ఈ స్థితికి మార్గదర్శకములే.((మనకోసం తక్కువగానూ, ఇతరులకోసం ఎక్కువగానూ మనం జీవించిన కొలదీ ఐహిక భోగవాంఛలు తగ్గిపోవును. ఇదే ఇంద్రియ నిగ్రహమునకు, క్రమముగా ఆత్మ పరివర్తనమునకు సహాయపడును.) అహంకారము మాత్రము చివరివరకు తల యెత్తుచుండును. క్రీస్తు చైతన్యస్థితికి గొంపోవు ఏడు ముఖ్య ఘట్టములలో ఆరు ఘట్టములు అధిగమించనంతవరకు అహం పూర్తిగా నాశనము కాదు. అప్పుడే అది దివ్య 'అహం' రూపములో మరల సాక్షాత్కరించును. (జీసస్ 'నేనూ నాతండ్రియు ఒకటే' అని చెప్పినపుడు పరిమితమగు ఈ జీవాత్మలోనూ, అనంతమగు పరమాత్మలోనూ ఒకే సమయమునందు జీవించు దివ్య చైతన్యస్థితినే పేర్కొనెను.)

ఇది సద్గురు సాంగత్యం లేకుండా తనంతట తానుగానే పనిచేయువాని కొరకు చెప్పబడిన మామూలు విధానము. పూర్ణసద్గురువు సహాయ మున్నచో ఇది యంతయు సులభతరమైపోవును. ప్రపంచములో నున్న నైతిక అభ్యాసములను వేయి సంవత్స

రములు ఆచరణలో పెట్టినా సాధించలేని ఫలితమును సంపూర్ణ సద్గురువుని దివ్యేచ్ఛకు పూర్ణార్పణ అయినచో, ఆయన యొక్క ఆదేశములను సంకోచించకుండా అమలు జరుపుటకు సిద్ధముగా నుండుటవలన సాధించవచ్చును. సద్గురువు తాను విశ్వాత్మతో ఐక్యభావము నొందియుండుటజేసి ప్రతి మానవుని మనసునందు తాను ఉండగలుగు చున్నాడు. కావున గుప్తముగా నున్న పూర్ణ చైతన్యమును జాగృతి నొనర్చుటకు అతడు ఇటువంటి అసాధారణ ఫలితములు పొందగలుగుచున్నాడు. భౌతికముగా ఉత్తమ ఫలితమును పొందవలెనంటే సంపూర్ణత్వమునందు మానవత్వము, చురుకయిన రంజకత్వము, మిళితమై యుండవలెను.

నేను క్రీస్తు చైతన్యస్థితిని సర్వదా అనుభవించు చుందును. నేను మాటలాడు నపుడు-అచిరకాలములోనే మాటలాడు ఉద్దేశము నాకు కలదు—నా నిజమైన ఆత్మను వ్యక్తపరచెదను. ప్రపంచ మంతటిని ఆధ్యాత్మికముగా నొక మెట్టు ముందుకు తీసికొని పోవుటయే గాక నా వద్దకువచ్చిన వారందరిని జ్యోతిర్మయమగు సత్యము వైపునకు తీసికొని వెళ్ళెదను. క్లుప్తముగా ఇదీ ప్రపంచములో నేను గావించు కార్యము".

బాబా హాలీవుడ్‌కు ప్రత్యేకముగా నొక సందేశ మిచ్చిరి.

## బాబా సందేశము

మనుష్యుల నెదుర్కొనుచున్న సాంఘిక సమస్యలకు నా పరిష్కారమేమియని నేను అమెరికా వచ్చినప్పటి నుండియు నన్ను చాలా పర్యాయములు అడిగినారు. నిరుద్యోగ సమస్య. మద్యనిషేధము, నేర నిర్మూలనము ఈ సమస్యలకు నా జవాబు ఏమయి యుండునని-అందువలన వ్యక్తిగతముగాను, అంతర్జాతీయముగాను బయలు దేరిన పోరాటములు నమసిపోవునట్లు, అశాంతి ప్రబలిన ఈ జగత్తునందు శాంతి వాతావరణమును సృజించి ఉపశమనకారి యగు నొక మనోహరమగు లేపనమును పూయగలనేమోయని యడుగుచున్నారు.

దీనికి జవాబు ఎంత సులువుగా కనబడునో అర్థము చేసికొనుట అంతకష్టము. అది తేలికగా తెలుసుకొనుటకు ఇప్పుడు వివరించెదను.

మన యొక్క అన్ని చిక్కులకు-వ్యక్తిగతము గాని, సాంఘికము గాని-మూలకారణము స్వార్థ చింతనము.ఉదాహరణకు:ఎవరి ప్రయోజనములకై ఎన్నికోబడినారో వారి బాగు కోరక రాజకీయ నాయకులు లంచములను స్వీకరించుచున్నారు.

దేశోపకారము చేయదలచి మద్యనిషేధ చట్టము అమలుపరచినపుడు చట్టవిరుద్ధముగా స్వప్రయోజనము కొరకు దొంగసారా వ్యాపారము సాగించుచున్నారు. ఇలాగే దేశమందలి చట్టములను ధిక్కరించి స్వార్థము కొరకు ప్రజలు అనేక విధములుగా నేరస్థులగు చున్నారు. వ్యక్తులు, వ్యక్తి సంఘములు స్వంత లాభములకై మానవులను విరివిగా ఉపయోగించు కొనుచున్నారు. ప్రస్తుతము వాడబడుచున్న నీచమగు స్వార్థపరత్వము వలననే ప్రజానాగరికత పురోగమించుటకు కనిపెట్టబడిన నూతన సాధనములు ఉపయోగములోనికి రాకుండా, చవుక పనిముట్లు పనికిరాకుండా పోయినచో వారికి నష్టము వాటిల్లునను భయముచే అడ్డుతగులుచున్నారు. ఈ కారణము చేతనే ప్రజలు ఆకలి కడుపులతో నొకచోట మాడుచుండగా దయావిహీనులయిన స్వార్థపరులు బజారుధరలు దిగిపోకుండా ఆహార ధాన్యములను రాసులుగా నాశనము చేయుచున్నారు. ప్రపంచ ఆర్థిక పరిస్థితి బాగుపడుటకు అవసరమయినప్పటికి బంగారమును వెలికి దీయక పెద్ద మొత్తములుగా దాచివేయుచున్నారు.

ప్రజా శ్రేయస్సుకు స్వార్థ ప్రయోజనకరములగు పనులు ఎట్లు అవరోధములుగా ఏర్పడుచున్నవో చూపుటకు పైన తెలిపినవి కొద్ది ఉదాహరణములు మాత్రమే. ఈ స్వార్థమును తొలగించుడు. మీ వ్యక్తిగత సాంఘిక సమస్యలన్నియు తీరిపోవును.

వ్యక్తిగతముగా స్వార్థ ప్రయోజనము లేకుండా చేయుటకు మనఃపూర్వకముగా పూనుకొనినప్పటికిని ఒక సద్గురువు సహాయము లేనిదే అది పూర్తిగా నెరవేర్చుట సాధ్యపడదు: సద్గురువే తన ఇచ్ఛా మాత్రముచేత సత్యము ద్యోతకమగునట్లొనరించ గలడు. ఆత్మయొక్క నిజ స్వభావమును కనుగొనలేక దానికొక అసత్యపు రూపము కల్పించినందువలననే స్వార్థపరత్వము పొడసూపుచున్నది. ఈ దురభిప్రాయమును రూపుమాపి సత్యము అనుభవమునకు వచ్చినపుడే స్వార్థచింతన తుడిచివేయుటకు సాధ్యపడును. నేను మాటలాడినపుడు అందరిలోనూ వ్యాపకమై యున్న ఆ అద్వైత పరమాత్మను ప్రకాశింపజేయుట కుద్దేశించియున్నాను. ఇది జరిగినచో ఆత్మ పరిమితమయిన ప్రత్యేక వ్యక్తిత్వము గలిగినదను అభిప్రాయము. దానితో స్వార్థము కూడా అంతరించును. పోటీకి బదులు సహకారము వచ్చును. భయము పోయి నిశ్చయ జ్ఞానము కలుగును. దురాశపోయి ఔదార్యము,దాతృత్వము జనించును. స్వప్రయోజనమునకు ప్రజల అమాయకత్వము నుపయోగించుకొనుట సమసిపోవును.

అక్షరఫలకముద్వారానే నా అభిప్రాయముల దెలియజేయుచు ఏడు సంవత్సరములు నేను మౌనముగా ఎందుకున్నానని అడుగుచున్నారు. అచిర కాలముననే

ఎందుకు మౌనభంగము గావించనున్నాననీ, ఇప్పుడు నేను చెప్పినదానిప్రకారం మానవ చైతన్య పరివర్తనమునకు నేను మాటలాడుటకు ఉన్న సంబంధమేమి యని కూడా నన్ను అడుగుచున్నారు.

ప్రస్తుత నిర్మాణము ననుసరించి మానవకోటి ఆలోచనలను వెలిబుచ్చుటకు **మూడు** చైతన్య స్థితులు-మూడు ఉపాధులు కలిగియున్నది. అవి యేవి యన:

1) మానసిక శరీరము గతానుభవ ముద్రలనుబట్టి ఇందు ఆలోచనలు ఉత్పత్తి పొందుచుండును. ఇవి మానసిక దేహమునందు బీజ రూపములలో నిగూఢమై యుండును. లేక అవి మొదటి వాంఛారూపమును పొందవచ్చును. అందులకు మొదట అవి.

2) సూక్ష్మలేక కామమయ శరీరము—ద్వారా రావలసియున్నది. ఈ శరీరము పంచ జ్ఞానేంద్రియములతో నిర్మాణమయియున్న స్వప్నములో వలె తీరని కోరికలుగా అవి అక్కడే ఉండిపోవచ్చును. లేదా కార్యాచరణ రూపమున అవి

3) పంచ కర్మేంద్రియములుగల స్థూలశరీరము ద్వారా వ్యక్తము గావచ్చును.
పైన చెప్పిన మూడు ఉపాధులకు గల అవస్థాత్రయమేది యనగా—

1) స్వప్నరహితమగు సుషుప్తిలోవలె విగత చైతన్య స్థితి.

2) స్వప్నావస్థలోవలెను లేక తెలియనటువంటి, రూపము పొందనటువంటి, తీరని వాంఛలతో యున్నటుల స్వల్పచైతన్య స్థితి.

3) జాగ్రదవస్థ :-

నిత్యజీవితమునందు పని చేయుచున్నప్పటివలె —

ఆలోచన మానసికములోనుంచి సూక్ష్మమునకు అక్కడినుంచి భౌతికముగా వ్యక్తమగు ఈ క్రమమే మానవ ఇచ్ఛా ప్రకటన మనవచ్చును.

సార్థకముగా భావప్రకటన చేయవలెనన్నచో ఈ మూడు ఉపాధులు నిర్మలముగా నుండవలెను. వాటి అంతస్సంబంధము సామరస్యముగా నుండవలెను. శిరస్సు-హృదయము కలిసి పనిచేయవలెను. బుద్ధి-చిత్తవృత్తి సమముగా నుండవలెను. ఆధ్యాత్మిక జ్ఞానమునకు భౌతిక వర్తనము ఫలితమని ఎరుంగవలెను.

అవతార పురుషునికి (దైవ - మానవునికి) ఆలోచనలుగాని కోరికలుగాని ఉండవు. ఆయనద్వారా ఈశ్వరేచ్ఛ పూర్ణమైన వ్యక్తీకరణమునకు ప్రసరించితీరును. అది ఆధ్యాత్మిక శరీరము నుండి - ఇది సాధారణ మానవుని యందు వికసించి యుండదు-భౌతిక కార్యాచరణకు తిన్నగా ప్రసరించును, ఆయనకు మామూలుగానే అతీతమగు చైతన్య స్థితి ఉండును. ఆయన నుండి నిరంతరము అనంతమైన ప్రేమ జ్ఞానము, అఖండమైన ఆనందము, శాంతి, శక్తి ప్రవహించుచునే యుండును.

దృష్టినిగాని, స్పర్శనుగాని ఉపయోగించి నప్పటికంటె, ఆయన మాటలాడి నపుడు సత్యము ఎక్కువ శక్తివంతముగా వ్యక్తమగును. ఆ కారణముచేతనే అవతారపురుషులు కొన్ని సంవత్సరములపాటు మౌనము వహింతురు. విశ్వము నంతకు సత్యమును వ్యక్తము జేయుటకే వారు మౌనభంగ మొనర్చెదరు. కావున నేను మాటలాడునపుడు ఈశ్వరేచ్ఛను ప్రకటనము జేతును. అప్పుడు విశ్వ వ్యాప్తముగా చైతన్య పరివర్తనము సంభవించును.

మధ్యాహ్నం 3 గంటలకు అందరూ కలిసి జోన్స్ యింటికి వెళ్ళారు. కాలి ఫోర్నియాలో బాబా కలిసినవారిలో చాలా భక్తి శ్రద్ధలు చూపించిన వ్యక్తి సెలెస్ట్ దోమోలా. సాయంకాలం నాలుగు మెతుకులు నోట్లో వేసుకొని 6 గంటలకు మార్క్ జోన్స్ బాబాని బృందాన్ని కారులో ఎక్కించుకుని హార్బరుకి తీసుకు వెళ్ళాడు, క్వెన్‌టిన్ ఇంకా కొందరు సెలెస్ట్ కారులో వెళ్ళారు. రాత్రి 8 గంటలకు స్టీమరు దగ్గరకు చేరుకొన్నారు.

మాట్సన్‌లైన్ వారి "మాన్‌పెరీ" అనే ఓడలో ఎక్కారు బాబా. చాలామంది జనం బాబాకు వీడ్కోలు ఇవ్వడానికి వచ్చారు. రాత్రి 11 గంటలకు స్టీమరు బయలు దేరింది. కార్ల్ కూడా బాబాతో వెళ్ళాడు. ఈ స్టీమరు ప్రయాణంలో వానికి సముద్ర ప్రయాణంలోచేసే జబ్బు చేసింది. ఈ కుర్రవాడు అంత ఉపయోగంగా లేదు సరికదా అవిధేయతగాను, ఆలోచనారహితంగాను, స్వార్థంతోను ప్రవర్తింపసాగేడు, బాబా రెండవ రోజున అతనిని లాస్‌ఏంజల్స్‌కి పంపించేయడానికి నిశ్చయించుకున్నారు. హానోలూలూలో దిగిన తరువాత. కాలిఫోర్నియాలో బాబా గురించి విన్న ప్రయాణికులు కొందరు బాబా ఆ స్టీమరులో ఉన్నారని తెలిసి ఆయన దర్శనంచేసుకున్నారు. రుస్తుం ఇరానీ బాబా చైనా వస్తారని షాంగ్‌హై వచ్చియున్నాడు. బాబా అతనిని హానోలూలూకి రమ్మని అక్కడ కలవమని ఆదేశించారు

## హోనోలులూ

కాలిఫోర్నియా నుంచి హోనోలూలూకి పసిఫిక్ మహా సముద్రంలో "మాంటెరీ" అనే స్టీమరులో చేసిన ప్రయాణము చాలా ఉల్లాసకరంగా వుండెను. చలి వెయ్యలేదు. గురువారం ఉదయం 8 గంటలకు హవాయి ద్వీపాలు దృగ్గోచర మయాయి. మొదట "మౌనాలోవా" అనే ద్వీపం వెళ్ళిపోయింది. తరువాత ఓవాహూ ద్వీపం వచ్చింది. దానికి రాజధానియే హోనోలూలు. డైమండ్ హెడ్ చుట్టి వెళ్ళిన. తరువాత వైకీకి సముద్రతీరం కనిపించింది. ఆ తీరమందు సుందరమగు భవనాలు హోటళ్ళు ఉన్నాయి. రాయల్ హవాయియన్ హోటలు, మోనా హోటలు అన్నిటి కంటె పెద్దవి; ఆకర్షవంతము మనోహరము అయినవి హాలేకులని హియుమాలు హోటళ్ళు.

"మాంటెరీ" ఓడకు అది ప్రథమ సముద్ర ప్రయాణము. ప్రయాణీకులను ఒడ్డున జేరవేయుటకు వచ్చిన టెండర్ అనే స్టీమరులో వచ్చి "మాంటెరీ"కి స్వాగతం చెబుతూ రాయల్ హవాయియన్ బాండు (సంగీతపు సెట్టువారు) వాయిద్యాలు వాయించారు. మాట్సన్ కంపెనీ (మాంటెరీ ఓడ యజమానులు) అధికారులు వచ్చి అందరికి పూలమాలలు వేసి సత్కరించారు. బాబా పూలమాల వేయించుకో లేదు. రుస్తుం బాబా కోసం ప్రత్యేకంగా తెచ్చిన మాల మాత్రం వేయించుకున్నారు. రుస్తుం చైనా నుంచి వచ్చి బాబాను కలుసుకుందుకు టెండర్‌లో వచ్చి మాంటెరీ ఓడ మీదకు ఎక్కి వచ్చాడు.

ఎలిజబెత్ పాటర్సన్ యొక్క స్నేహితులగు హచ్చిన్స్ దంపతులు వచ్చి బాబాకు స్వాగతం యిచ్చారు. బాబా రుస్తుంతో కూడా మోనా హోటల్‌కి పరివారంతో వెళ్ళారు. ఆదీ, చాన్జీ, క్వెన్టిన్ సామానులు తీసుకువెళ్ళేందుకు వెనక ఉండి పోయారు.

మోనా హోటలు వైకీకి బీచ్‌లో వుంది. 2 1/2 మైళ్ళు కారులో వెళ్ళాలి. ఆ హోటలుకి. హోనోలూలూ నగరంలోకి ఆదీ, క్వెన్టిన్ వెళ్ళి కుక్స్ ఆఫీసులో టిక్కట్లు విషయం ఏర్పాటు చేశారు. మోనా హోటలు ప్రక్కన రాయల్ హవాయియన్ హోటలు ఆవరణలో నున్న కొబ్బరితోపులోకి మధ్యాహ్నం 3-30 గంటలకి బాబా శిష్యులతో వెళ్ళి కూర్చున్నారు. అక్కడ బాబా హవాయియన్ నృత్యగానాలు చూచి ఆనందించారు. నృత్యం చేసిన కళాకారిణులు గడ్డితో చేసిన పొట్టి పరికిణీలు కట్టుకున్నారు. హవాయి నృత్యానికి ఇది యొక విశేషము. హోనోలూలూలో ఎక్కడ

జూచినా సంగీతము, నృత్యాలు, పాటలు, పుష్పాలు, మంచి సూర్యరశ్మి కను పిస్తాయి. పువ్వులు చాలా చవుక. చిన్న హోటళ్ళలో భోజనం బాగానూ వుంటుంది. సరసమైన ధరకూ లభిస్తుంది.

కొబ్బరి తోటలో నృత్యం చూచిన తరువాత కారులో నగరంలోకి షికారుకి వెళ్ళారు హోనోలూలూ నగర బాహ్యప్రదేశమున నున్న అనాస తోటలు చూచారు. అక్కడ కావలసినంత అనాస రసం త్రాగారు. బాబా క్వార్ల్ అనే కుర్రవానిని లాస్ ఏంజెల్స్‌కి పంపించేస్తానని చెప్పారు. శనివారం రోజున ఒక అమెరికన్ స్త్రీని తీసుకు వెళ్ళమని చెప్పారు. బాబా మౌనభంగం చేయడం కూడా వాయిదా వేస్తానని చెప్పారు బాబా చైనా, ఇండియా దేశాలకు వెళ్ళి అక్కడనుంచి ఇటలీ వెడతా నని చెప్పారు. ఈ లోపుగా క్వెన్‌టిన్‌ని తిన్నగా జూలై ఆఖరుకి ఇటలీ వెళ్ళి అక్కడ బాబా ఉండటానికి తగిన బంగళా చూడమని చెప్పారు. క్వెన్‌టిన్‌ను ఇప్పుడు కాలిఫోర్నియా వెళ్ళి ఈ సంగతులు అందరికి చెప్పమన్నారు. అతడు మెరెడిత్‌కి మార్గరెట్‌కి న్యూయార్క్‌కి టిక్కట్లు కొని యిచ్చి అక్కడ నుంచి ఇంగ్లండు వెళ్ళడానికి 500 డాలర్లు బాబా అతనికి ఇమ్మన్నారు. మెరెడిత్‌ను తూర్పు చల్లకూంబ్‌లో నుండి బాబా పని కొనసాగించమని చెప్పారు.

ఆ సాయంత్రం బాబా సినీమాకు వెడతానన్నారు. కాని అంత బాగాలేదు. ఆ రాత్రి అందరూ బాబా గదిలో భోజనం చేశారు. మర్నాడు ఉదయం హచ్చిన్స్ సతి ఆమె చెల్లెలుతో వచ్చి బాబాను చూచింది. ఆ మధ్యాహ్నం మరల కారులో బాబా పట్నంలో తిరిగి వచ్చారు.

బాబా క్వెన్‌టిన్‌తో కలసి హుయిమాలు హోటలుకి నడచి వెళ్లారు. ఆ హోటలులోనే అతడు పనిచేసి ఉంటాడు. అతడు వచ్చే గురువారం "మారిపోసా" అనే ఓడలో బయలుదేరి వెడతాడు. ఆ రాత్రి ఇంకో సినీమాకు వెళ్లారు బాబా. మర్నాడు ఉదయం ఏడుముప్పావు గంటలకు బాబా, చాన్జీ, క్వెన్‌టిన్, మిసెస్ వాల్టర్ డిల్లింగ్‌హామ్ యింటికి అల్పాహారానికి వెళ్లారు. వెళ్ళి అక్కడ చెట్లక్రింద తోటలో ఉదయపు భోజనం చేశారు. బాబా నారింజ రసం మాత్రం పుచ్చుకున్నారు. అక్కడి నుంచి వెళ్ళి కార్లోని స్టీమరు ఎక్కించారు. తరువాత "ఎంప్రెస్ ఆఫ్ జపాన్" అనే ఓడలో బాబాకి పరివారానికి ఏర్పాటయిన కేబిన్‌లు చూసుకున్నారు. బాబా ఆ ఓడలో ఎక్కి జపాన్ వెళ్ళునపుడు అమెరికానుంచి వచ్చినవారు ఇంకా కొంతమంది స్నేహి తులు వీడ్కోలు యిచ్చారు. బాబా హవాయి వదలి వెళ్ళేటప్పుడు, అమెరికా నుంచి

తమ ఆత్మ వెళ్ళిపోయినట్లుగా కొందరు శిష్యులు భావించారు. క్వెన్‌టిన్ టాడ్ న్యూయార్కు నుంచి "అగస్టస్" అనే ఓడలో జినోవా వెళ్ళదానికి ఏర్పాటు చేసుకున్నాడు. అలా అతడు సకాలంలో వెళ్ళాడుగనుకనే అక్కడకు బాబా వచ్చినపుడు బస చేయడానికి విల్లా ఫయొరెన్జా అనే బంగళా కుదర్చ గలిగాడు.

## చైనా రాక :

బాబా చైనా వస్తున్నామని చైనారోనే వుండమని కిట్టీడేవీ సోదరుడయిన హెర్బర్ట్‌కి కేబిల్ యిచ్చారు. హెర్బర్ట్ నాంకింగ్ విశ్వవిద్యాలయంలో ప్రొఫెసరుగా పనిచేస్తున్నాడు. బాబా వస్తున్నారని ఆయన ఆజ్ఞ ప్రకారం పెండు, జాల్, గుస్తాద్‌జీ నాన్‌కింగ్‌లో హెర్బర్ట్‌తో కూడా వున్నారు.

జూన్ 22 వ తేదీన జాల్ హెర్బర్ట్ బాబాను షాంగ్‌హైలో కలిశారు. బాబాతో చాన్జీ, బ్రహమ్, ఆదీ, కాకా వున్నారు. చైనాలో అడుగుపెట్టేసరికి బాబా తెల్లటి సూటు వేసుకుని, పనామాహేట్ పెట్టుకుని పాశ్చాత్య దుస్తులలో వున్నారు. నాన్కింగ్‌లో బాబా పరివారము వుండటానికి హ్వాంగ్‌పూనది ఎదురుగా ఒక హోటలులో గదులు ఏర్పాటు చేశారు.

బాబా రాగానే అందరూ టీ తీసుకున్నారు. చైనీయులు గుంపులలోకి వెళ్ళి వారిని చూడాలని బాబా అభిలాష వ్యక్తపరచారు. హెర్బర్ట్ బాబాను శిష్యులను తీసుకుని నది ఒడ్డుకు తీసుకువెళ్ళి అక్కడినుండి ఫ్రెంచివారుండే పేటలోకి తరువాత బ్రిటిషు వారుండే పేటకి వెళ్ళారు. నాన్కింగ్ రోడ్‌లో ట్రామ్‌లో వెళ్ళారు. చంకింగ్ రోడ్‌లో అక్కడ వుండే చైనీస్ దుకాణాలు అందంగా వెలిగించిన దీపాలతో కలకలలాడుతున్నాయి. గుఱ్ఱపు పందెములు మైదానము వద్ద టిబెట్ రోడ్డుమీద తిరిగారు. ఆ వీధులు జనసమ్మర్ధంగా వున్నాయి. గుమాస్తాలు ఆఫీసులు నుంచి పొడుగాటి గౌనులు తొడుగుకొని యిళ్ళకు వెడుతున్నారు. ఉల్లాసమైన వదనాలతో రిక్షావాళ్ళు వేసుకున్న దుస్తులు బీదరికాన్ని చెప్పక చెప్పతున్నాయి. వీధే నడిచేవారిని నడవవద్దని తమ రిక్షాలలో కూర్చుంటే తీసుకుపెడతామని అంటున్నారు. పొట్టి చొక్కాలు వేసుకుని కూలీలు తిరుగుతున్నారు. వీధులలో చైనీయుల దుకాణాల ముందు కాగితాలతో లాంతర్లు చేసి వ్రేలాడగట్టారు. చైనా భాషలో గుడ్డలమీద అక్షరాలు వ్రాసి దుకాణాలకి కట్టారు. ఇరుకైన సందులలో సుగంధ ద్రవ్యాల దుకాణంలో నుంచి సువాసనలు విరజిమ్ముతుండగా ఆ సందులలో తిరుగుతూ బాబా చాలా సంతోషించారు చైనీయులు వీరికేసి "ఎవరురా ఈ

విదేశీయులు" అని వింతగా చూస్తున్నారు. ఆ చైనా నగరము మూడు భాగాలుగా వుంది. చైనావారున్న భాగము, బ్రిటిషు వారున్నది, ఫ్రెంచి వారున్నది. ఈ నగర భాగాలలో రాత్రి భోజనాలయిన తరువాత బాబా ట్రాంలో ఎక్కి తిరిగారు. తరువాత టాక్సీ కార్లలో ఆ యా నగర భాగాలలో బాగా రద్దీగా వుండే వీధులలో తిరిగారు. బాగా వెలిగించిన వీధులు, దీపాలతో అలంకరించిన దుకాణాలు, హోటళ్ళు, ఆట పట్టులు వున్న వీధులలో నుంచి వెళ్ళారు.

23 వ తేదీ గురువారంనాడు బాబాను దర్శించడానికి వచ్చినవారిని కొంత మందిని చూచారు. అనేకమంది బౌద్ధులతో హెర్బర్ట్‌కి పరిచయం అయింది. వారందరితోను బాబాను గురించి మాట్లాడే అవకాశం అతనికి కలిగింది. అందుచేత టింగ్, మిస్‌టి, అల్లాం. మొదలయినవారు బాబా వద్దకు వచ్చారు. బాబా గౌరవార్థం ఆ సాయంకాలం పెద్ద విందు ఏర్పాటు చేశారు. హెర్బర్ట్‌కి ఇది పరీక్షా సమయం. ఒక వైపున అతని ఉద్యోగపు పని చూసుకోవాలి. మరియొక వైపున బాబాకు ఏమి కావాలో పని చేసిపెట్టాలి. 8-9 మందికి ఇండియా వెళ్ళడానికి స్టీమరు ప్రయాణానికి ఏర్పాటు చేయమని షాంగ్‌హైలోని స్టీమరు కంపెనీలకి వెళ్ళమన్నారు బాబా. బ్యాంకులకు డబ్బు మార్చడానికి తిరిగాడు. బాబాతో మిక్కిలి అనుభవంలేని హెర్బర్ట్ మనసులో నొచ్చుకోవడం ప్రారంభించాడు. "చాన్జీని నన్ను తెగ తిప్పుతున్నారు ఈయన. ఆయనకి ఏం కావాలో ఆయనకే తెలియదులాగుంది. అసాధ్యమయినవి చేయమంటారు. సాయంత్రం అయిదు గంటలకు రిక్షాలలో తిరిగి తిరిగి హోటలుకు వెడుతూంటే నాకు అలసట వచ్చేసింది. నా ఉద్యోగం నేను చేసుకోవాలని నా కడుపుకోసం నేను సంపాదించుకోవాలని బాబాకు తెలియదులా గుంది. నాకింకా ఇతర పను లుంటాయనేనా ఆయన తెలుసుకోలేకపోతే ఎలాగ ?" అని అతడు వాపోతూ తనతో సాయంత్రం రిక్షాలో వస్తున్న చాన్‌జీతో చెప్పుకున్నాడు.

అతని మనసులో ఇలా ఆలోచిస్తుండగా బాబా హెర్బర్ట్‌ని గదిలోకి పిలిచి "ఇలాగ నీవు విచారిస్తూంటే నాకు నీవు ఏ పనీ చేయలేవు. నాకోసం పనిచేసి ప్రయోజనం లేదు." అని బాబా మందలించారు.

ఆ సాయంకాలం ఒక చైనీయుల హోటలుకి వెళ్ళి అందరూ వారి ఆచారం ప్రకారం పుల్లలతో తీసుకుని తినడానికి ప్రయత్నించారు. తరువాత గుర్రపు పందెముల మైదానము వెనుకగా నడిచి ఏడు రిక్షాలు కట్టించుకుని అందులో కూర్చుని

కెధే థియేటరులో రాత్రి 9-30 గం॥లకు సినీమాకు వెళ్ళారు. అది ఫ్రెంచి నగరంలో వున్న పెద్ద సినీమా.

ఆ రాత్రి 11 గంటల రైలులో బాబా నాంకింగు వెళ్ళవలసివుంది. స్టేషన్ లోకి రైలు వచ్చేసింది. ఇంకా బాబా రాలేదని హెర్బర్ట్ కంగారు పడుతున్నాడు. ఇంక రైలు బయలుదేరడానికి వేళ అవుతూంటే బాబా టాక్సీలో వచ్చారు. ఇంత సామాను ఏమిటి? శుద్ధ అనవసరం అనుకున్నాడు హెర్బర్ట్. దానితో కూలీలు తంటాలు పడుతున్నారు. బండి అందుతుందంటావా? అని బాబా హెర్బర్ట్‌ని అడిగారు. ప్రయత్నం చేశారు. ఒక సెకండు క్లాస్ పెట్టెలోకి ఎక్కారు బాబా పరివారం. అందులో చోటులేదు. తెల్లవార్లూ కూర్చునే వెళ్ళాలి. బాబాతో ముగ్గురికి మాత్రం పరుండేందుకు ఇంకో పెట్టెలో దొరికింది చోటు. బండి కదులుతూంటే అందులోకి ఒక సమర్థుడయిన పోర్టరు సామానును తోశాడు. హెర్బర్ట్ మిగిలినవారికి చోటు చూడడం వారందరికి ఏం కావాలో కనుక్కొని చల్లని పానీయాలు ఏర్పాటు చేయడం ఇవి చూసుకున్నాడు.

మర్నాడు ఉదయం 8 గంటలకు (శుక్రవారం 24వ తేదీ)నాంకింగులో పెండు. గుస్తాద్‌జీ, హెర్బర్ట్ సేవకులు, బాబాను కలియడానికి స్టేషన్‌కి వచ్చారు. అయిదు గదులు హెర్బర్ట్ వారందరికోసం ఏర్పాటు చేశాడు. మొత్తం 9 మంది అందులో దిగారు. అంతా ఉదయం భోజనాలు ముగించారు. షికారుగా బయలుదేరి వెళ్ళి నగరంచుట్టూ ఉన్న పెద్ద గోడమీద ఎక్కి నడిచారు. ఆ గోడ అవతల పెద్దసరస్సు వున్నది. గోడ 60 అడుగుల ఎత్తు వున్నవి. దానికి కుడివైపున నగరమున్నది. ఎదురుగా ఊదాపర్వతం వున్నది. మధ్యాహ్నంపూట ఒక ఫ్రెంచివాడు తన కారులో వచ్చి బాబా పరివారంతో చేరాడు. తరువాత సన్ యట్ సెన్ మెమోరియల్ చూచి ఇంటికి చేరుకున్నారు. బాబా సరస్సు యొక్క దృశ్యాన్ని చూచి బాగుందన్నారు. 23 మైళ్ళ పొడుగున్న గోడ, యాంగ్‌ట్సీనది ఇవన్నీ చూచి వీటిని గురించీ ఇంకా అనేక సంగతులు ఆ సాయంకాలం మాట్లాడుకున్నారు సంగీతం రికార్డులు పెట్టుకుని విన్నారు బాబా. భారతీయ ఆధ్యాత్మిక గానం భారతీయ వాయిద్యాలతో చాలా మనోహరంగా వుంది.

ఆదివారంనాడు ఆ చైనా నగరంలోని నేషనల్ సినీమాకి వెళ్ళారు. క్రిక్కిరిసి వున్న ఆ నగర వీధులలో తిరిగారు బాబా. ఆ సందుల్లో వెళ్ళేటప్పుడు ప్రక్క

సన్న గోడలకు రాచుకుంటుందేమో కారు అన్నంత ఇరుకుగా వున్నాయి సందులు. ఎడా పెడా తెరచివున్న దుకాణాలలో అనేక రకాల సరుకులు అమ్ముతున్నారు. ఇలా వెళ్ళి బాబా పరివారంతో కన్‌ఫ్యూసియస్ ఆలయానికి చేరుకున్నారు. చైనావారు మళ్ళీ వచ్చే బుద్ధుణ్ణి మిలోఫూ అంటారు. హెర్బర్టువద్ద మిలోఫూ విగ్రహంవుంటే బాబాకి యిచ్చాడు. అది లక్క బొమ్మ.

బాబా చైనా దేశానికి వచ్చినట్లు సౌత్ చైనా మార్నింగ్ పోస్టు అనే పత్రికలో సుదీర్ఘమైన వార్త వ్యాఖ్యాన సహితంగా వేశారు. చైనా నుంచి బాబా తిరిగి అమెరికాకి వస్తారేమో అని ఎదురు చూచారు అమెరికాలో బాబా కార్యమునకు సంబంధించిన ఒక మహాసభ కీడ్‌మౌంట్‌లో ఏర్పాటయింది. ఆ సమయంలోనే బాబా అమెరికాకి ఇప్పుడు తిరిగి రానడంలేదని పంపిన కబురు చేరింది. దానితోబాటు మాట్లాడడం కూడా వాయిదా వేశారని కూడా వ్రాశారు. ఈ సంగతి తెలియగానే అమెరికాలోని కొందరు కార్యకర్తలకు ఆశాభంగం కలిగింది.

నాంకింగ్ నుంచి బాబా రైలు మీద షాంగ్‌హై వెళ్ళారు. స్నేహితులు, హెర్బర్టు సేవకులు నాంకింగ్ స్టేషన్‌లో బాబాకి వీడ్కోలు యిచ్చారు. షాంగ్‌హై నుంచి 'కైజర్-ఇ-హింద్' అనే ఓడ మీద బయలుదేరి యూరప్ వెళ్ళారు. వారికి ఇటలీలో అస్సిసీకి వెళ్ళాలని వుంది. సెయింట్ ఫ్రాన్సిస్ పూర్వం అక్కడ వుండి ఆ ప్రదేశాన్ని పవిత్రం చేశాడు. క్వెన్‌టిన్ టాడ్ ముందుగానే ఇటలీకి వెళ్ళి బాబాకి ఆయన పరివారానికి శాంటా మార్గెరిటాలో ఉండటానికి విల్లాఫయోరింజా అనే బంగాళా ఏర్పాటు చేశాడు. జూలై 25వ తేదీన మార్గరెట్, మేబిల్, ఆడ్రే అక్కడికి చేరుకున్నారు. 28వ తారీఖున డెలియా, అమింటా వచ్చారు. బాబా 28కి మార్సేల్స్ చేరుకున్నారు. జూలై 30వ తేదీనాడు బాబా మార్సేల్స్ నుంచి శాంటా మార్గరిటాకి మండలితో వచ్చారు. మండలిలో చాన్‌జీ, కాకా, హెర్బర్ట్, కిట్టీ వున్నారు. మిగిలినవారికి ఆశ్చర్యం కలుగజేద్దామని ఫలానా రోజున వస్తున్నట్లు తెలియపరచకుండానే బాబా వచ్చి స్టేషన్‌వద్ద నుంచి విల్లాకి నడిచివచ్చారు. విల్లా ఫయోరింజాకి బాబా వచ్చేసరికి సరిగా 8-30 గంటలయింది. జూలై 30వ తారీఖున, అది వేసవికాలం. బాబా వచ్చిన సమయానికి అందరూ సముద్రతీరానికి సముద్రస్నానంకోసం వెళ్ళివున్నారు. కొందరు స్నానాలు చేస్తున్నారు. మరి కొందరు స్నానాలు ముగించుకుని బట్టలు ధరిస్తున్నారు. హోటలు ముందు రోడ్డుమీద అకస్మాత్‌గా బాబాను చూచి అందరూ పరుగెత్తుకుని వచ్చి బాబాకు ప్రణామం చేశారు. ఇన్ని దూర ప్రయాణాల తరువాత

బాబాను మళ్ళీ కలిసి వారి దర్శనం పొందినందుకు ఈ పాశ్చాత్య శిష్యులకి చాలా సంతోషం కలిగింది. తరువాత మూడు వారాలు వేసంగి సెలవుల్లా గడిపారు. బాబా వారితో "ఇదే మీరు నాతో గడపడానికి మీకు గొప్ప అవకాశం. తరువాత ఆపై నన్ను మీరు చూడలేరు. అప్పుడు నా శిష్యులు పనిచేస్తారు." అని అంటూ వుండేవారు.

బాబా వచ్చిన రోజున ఆకాశం నిర్మలంగా వుంది. అందరు డాబామీద భోజనం చేశారు. బాబా మాత్రం మేడ మీద వసారాలో భోజనం చేశారు. ప్రతీ ఉదయము గాల్లో పెడాలే అనే చోటున వున్న రాళ్ళ వద్దకు వెళ్ళేవారు. కొన్ని ఆధ్యాత్మిక కారణాల వలన అక్కడ బాబా స్నానం చేయలేదు. మిగిలినవారిని మాత్రం స్నానం చెయ్యమన్నారు. కాకా బాబాకు పెద్ద గొడుగు పట్టాడు. ఆయన ఊరికే నీళ్ళలో కాళ్ళు పెట్టుకుని రాళ్ళమీద కూర్చునేవారు. రెండు మారులు పడవమీద షికారుకి వెళ్ళారు. ఈ గాల్లో పెడాలే అనే స్థలము కెర్వారాకిని శాంటా మార్గెరిటాకిని మధ్యగా వున్నది. బాబా వచ్చిన సంగతి ప్రజలకి తెలిసిపోయింది. గాల్లో పెడాలే వద్ద బాబా కూర్చున్నారని తెలిసి కొందరు పడవలలో ఆయన ముందునుంచి అటూ యిటూ వెళ్ళడం ప్రారంభించారు.

విల్లా ఫయోరింజాలోవున్నపుడు చుట్టుప్రక్కల బంగాళాలవారు ఫయోరింజాకు వచ్చి సద్దు చేయకుండా కూర్చునేవారు. ఆయన సామీప్యంలో ఉంటేనే చాలునని.

ప్రతిరోజు ఉదయం బాబా శిష్యులాండ్రు వున్న గదులకి వెళ్ళి చూచేవారు. సాయంకాలాల్లో గ్రామఫోను రికార్డులు పెట్టుకుని వినేవారు. బాబాకి హవాయి, స్పానిష్ పాటలు పాల్ రోబ్‌సన్ పాడిన ఆధ్యాత్మిక గీతాలు చాలా యిష్టం.

బాబా యొక్క అభిలాష ఏమిటంటే అస్సిసీ వెళ్ళి అక్కడ 24 గంటలసేపు ఏకాంతంగా వుండాలని; సెయింట్ ఫ్రాన్సిస్ ఉండిన ఆ పుణ్యస్థలంలో అతని యందలి ప్రేమచేత కొంత సమయం అక్కడ గడపాలని వుంది బాబాకి. అక్కడ బాబా ముఖ్యమయిన ఆధ్యాత్మిక మయిన పని చేయదలచుకున్నారు. అందుచేత హెర్బర్ట్‌ని అస్సిసీ పంపించి అక్కడ బాబా ఏకాంతంగా వుండటానికి తగిన ఒక గుహను వెదకి వుంచమన్నారు, బాబా ఆ వారాంతానికి అస్సిసీ వస్తామని హెర్బర్ట్‌తో చెప్పారు.

ఆగస్టు 1వ తేదీ సోమవారంనాడు హెర్బర్ట్ బయలుదేరి వెళ్ళాడు. ఆ వారం రోజులలోను బాబా శాంటా మార్గెరిటా నుంచి రాపల్లోకి, పోర్టోఫినోకి, వెళ్ళి చూచి వచ్చారు.

బాబాకి పోర్టోఫినో అంటే చాలా యిష్టం. వారి బృందంతో 'మీరు మళ్ళీ నా కోసం ఇటలీకి వస్తారు' అని బాబా అన్నారు. "మీరు నన్ను చదవడం నేర్చు కోండి మీరు నన్ను అర్థం చేసుకోగలిగితే మీకు సర్వమూ అర్థమయినట్లే" అని బాబా వారితో చెప్పారు.

## పాశ్చాత్య దేశాలకు సందేశాలు :

పాశ్చాత్య దేశాలకు బాబా ఈ క్రింది సందేశాన్నిచ్చారు :—

("నేను నా యీ శరీరానికి పరిమితుడనై లేను. మీకు కనిపించడం కోసం అది యొక చొక్కావలె నేను ధరిస్తున్నాను. మీతో సంభాషించడం కోసం. నన్ను అర్థం చేసుకోవాలని ప్రయత్నించకండి. నా లోతు అగాధమైనది. నన్ను మీరు ప్రేమిం చండి. అంతే. నేను నిరంతరము క్రీస్తు చైతన్యాన్ని అనుభవిస్తున్నాను. నేను మాటలాడినపుడు నా నిజమైన పరమాత్మను వ్యక్తం చేస్తాను. ప్రపంచానికి అంతకీ ఆధ్యాత్మికంగా ముందుకు ఒక్క త్రోపు యివ్వడమే కాకుండా నా వద్దకు వచ్చిన వారి నందరిని వెలుగు వైపుకి సత్యం వైపుకి తీసుకువెడతాను.")

ఇంకొక రోజున బాబా ఇంకొక సందేశం యిచ్చారు పాశ్చాత్య దేశాలకి—

"నేను మాటలాడినపుడు అందరిలోనూ ఉన్న ఒకే ఒక్క పరమాత్మను వ్యక్తపరుద్దామని అనుకుంటున్నాను. ఇది గనుక జరిగితే మానవుడు తాను వేరుగా వున్న ఒక వ్యక్తిననే అభిప్రాయము పోతుంది. దానితో స్వార్థం కూడా పోతుంది. పోటీ బదులు సహకారము, భయానికి బదులు నిశ్చయత్వము వస్తాయి. అలాగే లోభం పోయి ఉదారత్వము వస్తుంది. ఒకరిని బాధించి తాను లాభం పొందడమనేది రూపుమాసిపోతుంది...

"నేను ఆధ్యాత్మిక విప్లవం తీసుకువచ్చినపుడు వివిధ జాతులకు, వివిధ దేశాలకు లాభాలు చేకూరుతాయి. ఆ లాభాలు ప్రతి దేశమునకు, జాతికి గల శక్తిని బట్టి వుంటాయి – ఆ శక్తిని సరియైన మార్గంలో వినియోగం కాకపోయినప్పటికి, శక్తి ఎంత ఎక్కువగా ఉంటే అంత యెక్కువ లాభాలు కలుగుతాయి.

"నేను మాటలాడినపుడు నా ఆధ్యాత్మిక శక్తి అనేక విధాలుగా రుజువు అవు తుంది జ్ఞానం కలుగజేసే శక్తి నాకు వుందని కూడా బాగా తెలుస్తుంది. సత్యము ప్రేమకి, అస్తిత్వానికి మూలము. అది జీవితంలో అన్ని రంగాలలోను వర్తిస్తుందని పరిపాలన చేస్తుందని ప్రజలందరు తెలుసుకుంటారు."

"భగవన్మానవుడు (అవతార పురుషుడు) మాటలాడినపుడు సత్యమును తెలియ జేయడానికి దృష్టిగాని, స్పర్శగాని ఆయన ఉపయోగించినపుడు కంటె ఎక్కువ శక్తి వంతముగా సత్యము ప్రకటిత మవుతుంది. ఆ కారణం కోసమే అవతార పురుషులు

అనేక సంవత్సరాలు మౌనం అవలంబించి వుంటారు. వారు దైవేచ్ఛను తెలియ బరచుటకే మాటలాడుతారు. అప్పుడు ప్రపంచ వ్యాప్తంగా చైతన్యం మారిపోతుంది."

ఇండియాలో వున్న శిష్యురాండ్రు తన గోపికలని బాబా అనేవారు. "అలాగే మీరు కూడా నన్ను ప్రేమిస్తున్నారు. నా హృదయంలో మీ కొక ప్రత్యేక స్థాన మున్నది" అన్నారు బాబా వారితో.

శాంటా మార్గెరిటాలో వుండగా బాబా దర్శనార్థం స్టెఫనీ హగ్గర్డ్ అనే అతడు వచ్చాడు. అంతా కలిసి ఒక పెద్ద బగ్గీలో కొండమీదకు వెళ్ళారు. అక్కడే బాబా శిష్యులకు, శిష్యురాండ్రకు ద్రాక్ష సారాయం ఇచ్చారు త్రాగమని. బాబా ఇస్తే అది వద్దనకుండా త్రాగాలి. దానికొక ప్రత్యేక విశిష్టత వుంది.

పాశ్చాత్య శిష్యులు బాబాతో శాంటా మార్గెరిటాలో మూడు వారాలు గడిపారు అక్కడ అన్ని విధాలా బాగుంది. వెచ్చని యెండ, నీలి సముద్రము, అందమయిన తీరము. వారు బస చేసిన హోటలుకి వెనుక ఆకుపచ్చని కొండలు, నడవడానికి ద్రాక్ష తోటల నీడలు, అన్ని విధాలా ప్రకృతి దృశ్యాలు మనోహరంగా వున్నాయి. ప్రతి ఉదయం సముద్ర తీరానికి అనేక విధాలుగా నీటిలో పడి ఆడుకుంటూ స్నానాలు చేస్తూ వుంటే బాబా విల్లాలో బాల్కనీ (వసారా) మీదనుంచి చూస్తూ వుంటే తెల్లగా దుస్తులు వేసుకున్న బాబాను వారు చూడగలిగేవారు.

డాబా మీద ఆటలాడుకునేవారు. థామస్ అనే పేరు పెట్టుకుని బాబా నాట్యం నేర్చుకునేవారు బాబా శిష్యురాలు నాట్యంలో ఆరితేరిన ఒకామె బాబాను నేర్పేది.

ఇలా అనేక విధాలుగా బాబా వారి జీవితాలలో ప్రవేశించి ఆటలాడే సఖుడు గాను, స్నేహితుడుగాను, వారిలో ఒక చిన్న పిల్లవాడుగాను, వారందరికి తండ్రి గాను వుండేవారు

బాబా బృందం కొన్ని రాత్రులు ఆధ్యాత్మికంగా పని చేస్తూవుంటే వారంతా చూస్తూ వుండేవారు. ఆయన పనిచేసేటప్పుడుగాని, అంతకు ముందుగాని పేకాట ఆడే వారు. పెలవు రోజుల్లా ఈ విధంగా గడుపుతూంటే మధ్య మధ్య ఒకరిమీద ఒకరికి అసూయ కలిగేది. దానితో ఎండ పోయి మబ్బు ఆవరించినట్లు వాతావరణం కొంచెం క్లిష్టంగా మారేది. అలాటి సమయాల్లో ఆ చిక్కులోంచి బయటపడడానికి బాబా వారికి అనేక పాఠాలు నేర్పేవారు. బాబాచేత అస్సిసీకి పంపబడిన హెర్బర్ట్ ఏమి చేశాడో చూదాము.

## సెయింట్ ఫ్రాన్సిస్ ఉండిన అస్సిసీ పట్నం :

హెర్బర్ట్ ఇదివరలో ఎప్పుడూ ఇటలీ వెళ్ళలేదు. అతనికి ఇటాలియన్ భాష రాదు. అతనికి కావలసిన శాకాహార భోజనం అక్కడ దొరకడం కష్టం. ఆగస్టు

2 వ తారీకున అతడు మధ్యాహ్నం 3-30 గంటలకు అస్సిసీ చేరుకున్నాడు. ఇతడు ఇదివరలో సెయింట్ ఫ్రాన్సిస్ గురించి చదవడమే కాకుండా అతని నుద్దేశించి ధ్యానము కూడా చేసి వున్నాడు. అందుచేత బాబా అతనికి అప్పజెప్పిన పని చేయడానికి సంతోషంతోనే వెళ్ళాడు. అస్సిసీకి చుట్టూ ఒక గోడ వున్నది. స్టేషన్ వూరుకి ఒకటిన్నర మైళ్ళుంది. ఆ వూరిలో రాతికోట ఒకటి వున్నది. మౌంట్ సుబాసియో అనేకొండ వరకు కూడా అక్కడక్కడ డాబాయిళ్ళు వున్నాయి. వూళ్ళో ఎటువైపు జూచినా చర్చిలు వున్నాయి. ఆ వూరు ముక్కోణాకారంగా వుంది. అక్కడ వున్న కోట పేరు రోకా మాగియోర్. అది సెయింట్ ఫ్రాన్సిస్ సమాధి మీద ఫ్రా ఎలియాస్ చేత నిర్మించబడింది. ఆ కోట ఆ ముక్కోణానికి పశ్చిమ కోణంలో వుంది. వూరు చుట్టూ వున్న గోడలు తూర్పు వైపుకి పొడవుగాను, ఎత్తుగాను వున్నాయి. తూర్పు వైపున సెయింట్ క్లేర్ చర్చి, సెయింట్ రూఫినో కెథిడ్రల్, ఒక కాలేజీ వున్నాయి. కోణం లోపల ఒక చిన్న కోట వున్నది. దాని పేరు రోకా మినోర్. తూర్పు వైపున గోడకి రెండు గేట్లున్నాయి. ఒకటి పోర్టా నోవా అనేది. అది క్రింద కోణానికి దగ్గరగా వుంది. శాన్ డామియానో అనే చోటికి ఫాలినో అనే చోటికి ఆ గేటులోనించి వెళ్ళాలి. రెండవ గేటు పోర్టా కాప్పుసిని అందులోనుంచి వెళ్ళే రోడ్డు మౌంట్ సుబాసియోకి వెళుతుంది. కార్సెరి విహారానికి వెళ్ళడానికి అదే దారి. అది నాలుగు మైళ్ళ దూరం వుంది గేటు వద్దనుంచి

హెర్బర్ట్ అస్సిసీలో ఒక గది చూసుకుని అందులో సామాను పెట్టుకున్నాడు. తరువాత ఊళ్ళో తిరుగుతూవుంటే ఒక రోమన్ కాథలిక్కు పూజారిని కలుసుకున్నాడు. ఫ్రాన్సిస్‌కి సంబంధించిన ఒక గుహలో ధ్యానం చేయాలని వుందని అతనితో చెప్పాడు. ఏదయినా గుహ చూపిస్తాడేమో అని. కాని ఆ రోమన్ కాథలిక్ పూజారి హెర్బర్ట్ ప్రొటెస్టెంట్ అని తెలుసుకోగానే అతనికి అట్టే ఏమీ సహాయం చేయలేనన్నాడు. సెయింట్ ఫ్రాన్సిస్‌కి సంబంధించిన అన్ని స్థలాలలోను చర్చిలు, విహారాలు, రాతి విగ్రహాలు ఉన్నాయి. మిగిలిన పుణ్యక్షేత్రాల వలెనే ఇదికూడా ఒక వ్యాపారస్థలం అయిపోయింది. ఒక చివరి నుంచి రెండో చివరికి పోర్టానోవా గేటుదాకా హెర్బర్ట్ నడిచాడు. అక్కడి నుంచి సుబాసియో కొండ యెక్కదామనుకున్నాడు. అప్పటికే సాయంకాలం 5గంటలయింది. అతడు కార్సెరీ రోడ్డున వెడుతున్నాడు. ఆ రోడ్డు ఎత్తు ప్రదేశానికి వెడుతోంది. రోడ్డు దుమ్ముతో వుంది. ఆ కొండమీద ఒక సాధువుల విహారం వుందని అతనికి తెలియదు. వెళ్ళగా

వెళ్ళగా చాలా రమణీయంగా వుంది. అచ్చటి ప్రకృతి. ఒక వైపు వరిచేలున్నాయి. కుడి వైపున స్పోలెటో లోయ వున్నది. కొండ యెక్కుతూ గుహలేమయినా వున్నా యేమో అని చూస్తున్నాడు. కాని అతని కంటికవేమీ తగలలేదు. ఆ దారి ఒక అర్ధ చంద్రాకారంగా వున్న గేటులోకి వెళ్ళింది. ఆ గేటు మీద మత సంబంధ మయిన చిత్రాలేవో వున్నాయి. అందులో నుంచి చిన్న చిన్న రాతి గృహాల వద్దకు వెళ్ళాడు. ఒక యింటి వద్ద గంట వాయించాడు. సన్నటి దారి కలిగి ఇరు ప్రక్కలా చెట్లు దట్టంగా ఉన్నాయి ఆ యింటికి. కాళీ స్థలంలో ఒక బావి వుంది. సమీపంలోనే సెయింట్ ఫ్రాన్సిస్ గుహమీద కట్టిన ఒక గుడి వుంది. రెండవ వైపున చివరన ఒక పిట్టగోడ కట్టబడి వుంది. దాని అవతల వైపున దిగువన లోయ వుంది. అక్కడ కొత్త వారికి స్థలాలన్నీ చూపించే చెప్పేవాడొకడువున్నాడు. గైడ్ వచ్చేరాని ఫ్రెంచి భాషతో హెర్బర్ట్ అతనితో మాటలాడాడు. ఆ స్థలానికి యాత్రికులు వస్తూంటారని అతడు చెప్పాడు. హెర్బర్ట్ ఆ పరిసరాలన్నీ గాలించాడు. అక్కడ ఒక ఇరుకయిన గుహ కనిపించింది. అది శవపేటిక ఆకారంలో వుంది. ఫ్రాన్సిస్ అందులో పరుండే వాడట. కాని అది బాబా కూర్చోడానికి ఉపయోగించదు. ఎందుకంటె ఇరుకయినదని ఒక కారణము. రెండవది యాత్రికులు అది చూడడానికి వస్తూంటారు. ఇంకో గుహ దాని సమీపంలో వుందిగాని అది దీనికంటె అధ్వాన్నంగా ఉంది. ఎందుచే తంటే రోడ్డే నడిచే వారికి అది కనిపిస్తూ వుంటుంది. చీకటి పడుతోందని హెర్బర్ట్ వెనక్కి తిరిగి తన గదికి చేరుకున్నాడు.

తరువాత రోజులలో అస్సిసీలో శాన్ ఫ్రాన్‌సెస్కో అనే పెద్ద చర్చికి హెర్బర్ట్ వెళ్ళాడు. అందులోని శిల్పకళ చూశాడు. జ్ఞాపకార్థము అస్సిసీలో ఒక జపమాల కొన్నాడు ఆ వూళ్ళో చూడవలసిన ప్రదేశాల గురించిన ఒక పుస్తకం కొన్నాడు. తరువాత అది బాబా కార్యదర్శి చాన్‌జీ తీసుకున్నాడు. హెర్బర్ట్ సెయింట్ ఫ్రాన్సిస్‌కి జ్ఞాన స్నానం చేయించిన ఆన్‌రూఫినోఅనే స్థలానికి వెళ్ళి చూచాడు, అతడు చదివిన శాంటా చియారా అనే బడికి వెళ్ళాడు ఫ్రాన్సిస్ ప్రియతమ అయిన క్లేర్ శరీరము అక్కడ ఒక గాజు పెట్టెలో భద్రపరచబడి వుంది. అతని తండ్రి నివాస గృహం మీద కట్టబడిన ఒక చర్చిని -చియసా నోవా- చూచాడు.

హెర్బర్ట్ హోటలులో తారసిల్లిన ఒక స్త్రీతో ఆంగ్లమునందు మాట్లాడాడు సెయింట్ ఫ్రాన్సిస్ గురించినభోగట్టా అడిగితెలుసుకున్నాడు. అక్కడ ఒక సాధువు కలిశాడు. హెర్బర్ట్ నాలుగు గంటలు ధ్యానము చేయాలి ఒక గుహలో అని

చెప్పగా అతడు అంతసేపు ధ్యానము చేయుట అపాయకరమని చెప్పెను. అంతసేపు ధ్యానము చేస్తే పిచ్చి యెత్త వచ్చునని కూడా చెప్పెను. కాని అందులో తనకి వున్న అభిరుచి, శ్రద్ధ అతనికి తెలియజేసెను. అప్పుడు సెయింట్ ఫ్రాన్సిస్ అతని నలుగురు శిష్యులు మౌంట్ సుబాసియో మీద వేరే వేరే గుహాలలో కూర్చుని ధ్యానం చేశారని చెప్పాడు. అప్పటికి 700 సంవత్సరాలయినా ఫ్రాన్సిస్ అనుచరులు ధ్యానము చేసిన గుహలు ఇప్పుడు కూడా కనపడవచ్చునని చెప్పాడు. ఫ్రాన్సిస్ ధ్యానము చేసిన గుహ మీద చర్చి నిర్మాణం జరిగిందన్నాడు. ఆ ప్రకారం సుబాసియో కొండమీద హెర్బర్ట్ నాలుగు వైపుల వెదుకగా ఒకచోట కొండ ప్రక్కన ఒక గుహ కనపడింది. దానికి ఒక రాతిగోడ కొంతవరకు అడ్డముగా వున్నది. దాని పైకప్పు కర్రతోను, పెంకులుతోను వుండెడిది. కాని యిప్పుడు అదంతా శిథిలమై పోయినది. ఆ రాతి గోడలలో చెట్లు మొలిచి వేళ్ళు వ్రేలాడుచున్నవి. క్రింద దారే వెళ్ళే జనానికి కనబడకుండా దిగువన పొడుగుగా పెరిగిన చెట్లు గుహను కప్పుచున్నవి. అయితే అది చెత్తాచెదారం పగిలిన పెంకుముక్కలు, ఎండిన ఆకులతో నిండి చెమ్మగా వున్నది. హెర్బర్ట్ అవన్నీ తీసివేసి గుహ శుభ్రము చేసెను. కొన్ని మొక్కలు, చెట్ల కొమ్మలు ఆ గుహ ద్వారానికి అడ్డంగా పెట్టాడు హెర్బర్ట్. అందువలన గుహలోకి వెళ్ళేటప్పుడు బయటకు కనిపించ కుండా వుంది.

బాబా హెర్బర్ట్‌ని అస్సిసీ పంపేటప్పుడు – "గుహను కనుగొని అందులో రోజుకి 4 గంటల చొప్పున ధ్యానము చేయవలయును. ఆఖరు రోజున (శుక్రవారం) 8 గంటలు ధ్యానము చేయాలి" అని చెప్పారు. అక్కడి శాంతికి భంగం లేకుండా వుంటుందా ? వుండదా ? అని హెర్బర్ట్ ఇలా చేయడం వలన పరీక్షగా చూడగలిగాడు. ఈ గుహ అన్ని విధాలా అంత బాగా లేకపోయినా ఇంక వేరే యేదీ లేక ఇదే హెర్బర్ట్ ఏర్పాటు చేశాడు. అందులో ధ్యానానికి కూర్చునేముందు గుహలోని క్రిమి కీటకాదులను అవలికి తోలేసి అవి మళ్ళీ రాకుండా చిన్న మంట వేశాడు. అందువలన చెమ్మగా వున్న గుహ పొడిగా అయింది. ఒక్కడూ అందులో కూర్చునేసరికి ఆ ఒంటరితనము, ఆ నిర్మానుష్య వాతావరణము, చుట్టూ ఆ అడివి, అంతా అతనికి తోచకుండా చేశాయి. మనస్సు నిబ్బరం చేసుకుని కూర్చోలేక పోయాడు. ధ్యానంలో మనసు కేంద్రీకరించడం కష్టం అయింది; అతనికి ఏ పోలీసు లయినా చూచి ఎందుకిక్కడ కూర్చున్నావని అడిగితే ఏమి చెయ్యాలనే భీతి కలిగింది. అయినా పట్టుదల చివరకు జయించింది.

శుక్రవారంనాడు అతడు కావలసిన సామానంతా ఆ గుహకి చేరవేశాడు. నీళ్ళ సీసాలు, కంబళ్ళు, అగ్గిపెట్టెలు, కొవ్వత్తులు, టార్చిలైటు, అగరు వత్తులు,

టీ తయారు చేయడానికి ఒక స్టౌ, వర్షం వస్తే ఉంటుందని ఒక గొడుగు, ఇవన్నీ కొని పట్టుకువచ్చాడు. తాను మాట్లాడిన సాధువు నడిగి కొన్ని కాశీసీసాలు, జంతానా ఒకటి తెచ్చాడు. పై కప్పులో కాశీలుంటే కొమ్మలతో కప్పాడు, ఇలా అన్ని ఏర్పాట్లు చేసి బాబా కోసం శనివారం నాడు కనిపెట్టుకుని వున్నాడు. బాబా ఆ రోజున 2 గంటలకు వస్తానని చెప్పారట. 4 గంటలయినా బాబా కారు రాలేదు. బాబా సమయ నియమం పాటిస్తారు కదా రాలేదేమా అని ఆలోచిస్తున్నాడు. బాబా బయలు దేరి యుండకపోతే రావటం లేదని టెలిగ్రాం కూడా రాలేదు.

## బయలుదేరేముందు బాధ :

శాంటా మార్గెరిటాలో ఆగస్టు 5 వ తారీకు శుక్రవారం రోజున బాబా మండలితో ఆయన గదిలోనే అందరిని కూర్చోమని చెప్పారు. అర్ధరాత్రివేళ బయలుదేరుతామని బాబా వారితో చెప్పి ఆయన ఒక గంటసేపు పరున్నారు. ఆయన చేతులు ఏవో సంకేతాలు చేస్తున్నాయి. అందుచేత ఆయన నిద్ర పోవటంలేదని తెలుస్తోంది. గదిలో నిశ్శబ్దం తాండవిస్తోంది. అస్సిసీలో ఆయన పనిచేసే ముందు రెండు సంగతులలో ఏదో యొక్కటి జరుగవచ్చునని బాబా చెప్పారు. ఒకటి - తుఫాను రావచ్చును, లేదా రెండోది - బాబాకి జబ్బు చేయవచ్చును. ఒక శిష్యుని బాబా దగ్గరగా రమ్మని పిలిచారు. ఆయని ఒడలు ఎక్కువగా నెప్పి పెడుతోంది. ఆ నెప్పులు క్రమంగా ఎక్కువయాయి. ఆయన బయలుదేరలేనంత ఎక్కువగా బాధపడుతున్నారు. అర్ధరాత్రివేళ కారు బయలుదేరవలసి యుండెను గాని బాబాకి వంట్లో సుస్తీగా యుండుటచేత 2-30 గంటలకు గాని ఆయన కారులో బయలు దేరడానికి వీలు లేకపోయింది. గొప్ప ఆధ్యాత్మిక కార్యం చేయబోయే ముందు బాబాకు ఇలా జబ్బు చేయడం మామూలు. బయలుదేరే ముందు బాబా మండలి తోనే వున్నారు. కాకా, టాడ్ కొంచెం నిద్ర పోదామని ప్రయత్నం చేస్తున్నారు. బాబా సంతోషంగానే వున్నారు. ఆయనకి లోపల శరీరంలో ఏదో బాధ వున్నా పైకి ఆనందంగానే వుంటారు. కొంచెంసేపు గ్రామఫోన్ రికార్డులు వేసుకుని సంగీతం విన్నారు. బాబా ఆ గది వదలి ప్రక్క గదిలోకి వెడుతూ అందరినీ పిలిచారు వెనుకనే రమ్మని. ఆయన ఒక మంచంమీద పరున్నారు. త్వరలోనే బాబా ఎక్కడికో దూరానికి వెళ్ళిపోయారు. ఆ సమయంలో ఆయనతో మాట్లాడ రాదు. ఆయన శరీరం ఎవరూ తాకరాదు. కాని బాబా వారి శిష్యులను ఆ సమయంలో ఆయనకి దగ్గరగా వుండమన్నారు. అప్పుడప్పుడు కళ్ళుతెరిచి వారంతా అక్కడ

వున్నారా లేదా అని బాబా చూస్తూనే వున్నారు. డెలియా, కిట్టీ కిటికీ దగ్గరకు వెళ్ళి నిలబడియుంటే వారిని తమ మంచం దగ్గరగా వుండమని బాబా పిలిచారు. కాని వారు అదొక మాదిరి మనస్థితి కలిగియున్నందున వారు అక్కడే నిలబడి చూస్తున్నారు. బాబా మరల నిద్రపోతున్నట్లు కనిపించారు. అది అందరు మామూలుగా పోయే నిద్ర కాదు. ఆయన ఏదోపని చేస్తున్నారు. ఆయన వ్రేళ్ళు గాలిలో కదులుతున్నాయి. ఏదో పని చేస్తూనో, చేయిస్తూన్న పనికి సమ్మతిస్తూనో ఉంటారు. 12 గంటల నుంచి 1 గంట దాకా బాబా మంచంమీద లేచి కూర్చున్నారు. అప్పుడు బాబా కిట్టీని డెలియాని తమ వద్దకు వచ్చి కూర్చోమంటే ఎందుకు రాలేదని అడిగారు. ఆయన అంత బాధ పడుతున్నారు గనుక అందరను దగ్గరగా వుండమన్నారు. ఎందుకు బాబా దగ్గరగా వుండమన్నారో కారణం తెలిస్తే ఆ కిటికీ దగ్గరే బయటకు చూస్తూ నిలబడి వుండేవారు కాదు వారు. బాబా యిష్ట ప్రకారం చేయకపోతే బాబాకి బాధ ఎక్కువవుతుందని బాబా అన్నారు. ఇటలీలో ఒకమారు బాబా వివరించి చెప్పారు, పనికోసమే బాబా వారందరి యొక్క విధేయత కావాలని అన్నారు. బయలుదేరేముందు ఒకటి, రెండు గంటలు చాలా బాధపడ్డారు బాబా. ఆ నొప్పి ప్రసవవేదన అంత బాధాకరమయినదని బాబా అన్నారు. జీసస్ ముఖంలో ఎటువంటి భావాలతో ఇటాలియన్ కళాకారులు చిత్రలేఖనం చేశారో-పీటా అనే చిత్రాలు లిఖించినపుడు-అటువంటి భావాలే బాబా ముఖంమీద కనుపించాయి. ఎలాగో ఆ బాధతోనే సరిగా 2-30 గంటలకు బాబా, చాన్‌జీ,కాకా, కిట్టీలతో ఫయొరింజానుంచి బయలుదేరి రాపల్లో దారిని వెళ్ళారు. కారు సినార్ పావసె అనేవాడు నడుపుతున్నాడు. దారిలో సెస్ట్రీ లెవంటె బరాకో పాస్ మీదుగా లాస్పెజియా రోడ్డునే వెళ్ళారు. పావెసె అంత జాగ్రత్త కలిగిన మంచి డ్రైవరు కాదు. అతనిలో కొంత అస్థిరత వుంది. కారు వెళ్ళే రోడ్డుమీద ఒకమారు వెనుకనుంచి ఇంకో కారువచ్చి గుద్దుకునే ప్రమాదం తప్పింది. ఆ రోడ్డు అనేక మలుపులు తిరుగుతూ అపాయకరంగా వుంది, తెలతెల వారుతూ ఉండగా ఆ మసక వెలుతురులో చూస్తే కారు వెళ్ళేటప్పుడు రెండువైపులా ఎంత అందమయిన దృశ్యాలున్నాయో కనిపిస్తున్నాయి.

5-30 గంటలయే సరికి లాస్పెజియా నుంచి దిగుతోంది కారు. కొంచెం సేపట్లోనే సూర్యోదయం అవుతోంది. ఆ దృశ్యం ఎంత సుందరంగా వుందో! 7 గంటలయే సరికి పిసా చేరుకున్నారు. దారిలో వయా రెగ్గియామీదుగా వెడుతూ అక్కడ నేషనల్ హోటలులో అల్పాహారాలు తీసుకున్నారు. కారు నడిపిన పావసె

తప్ప ఎవరూ నిద్రపోక పోయినా అందరూ బాగావున్నారు. పావసె రెండు గంటల స్లేపు పరున్నాడు. మళ్ళా 9 గంటలకు బయలు దేరారు. లాస్పెజియావద్ద బాబా బాధపడుతూన్న నెప్పి కిట్టీ, దేవీకి సంక్రమించింది. పిసావద్ద కాకాకి ఏదో బాధ కలిగింది. బాబాకి కలిగిన బాధ వారిద్దరికీ బదిలీ చేసేశారు. వారిరువురు ఆయన బాధను పంచుకున్నారు. సియెనా వద్దకు వెళ్ళేసరికి అందరూ సుఖంగా వున్నారు. అప్పటికి మధ్యాహ్నం 12 గంటలయింది. అక్కడ ఒక అరగంట ఆగి చల్లని పానీయాలు త్రాగారు. మరల 12-30 గంటలకు బయలుదేరి పెరుగియా వెళ్ళే దారిలో భోజనం చేశారు.

## అస్సిసీలో ఏకాంతవాసం :

అస్సిసీకి బాబా ఇంకా రాలేదని హెర్బర్ట్ ఆదుర్దాపడుతున్నాడు. బాబా కారు అక్కడికి చేరేసరికి సాయంత్రం 5 గంటలయింది. అంటే 3 గంటలు ఆలస్యంగా చేరారన్న మాట.

హెర్బర్ట్ ఒక వారంరోజులు ఒక్కడూ ఎలా తంటాలుపడి బాబా యొక్క ఏకాంతవాసానికి చాలా మంచి ఏర్పాట్లు చేశాడో మనకు తెలుసు.

ఊరికి కొన్నిమైళ్ళ దూరంలో మౌంట్ సుబాసియో ప్రక్కన కొండలలో కార్సెరి అనే ఆశ్రమం సెయింట్ ఫ్రాన్సిస్ ఆయన అనుచరులయిన సాధువులు నిర్మాణం చేశారు పూర్వం. దిగువను అడవిలో అనేక చిన్న చిన్న గుహలున్నాయి. అక్కడికి అనేకమంది ధ్యానం చేసుకునేందుకు వెడుతూంటారు. వాటిలో సగం ఒక గోడతో కప్పబడిన ఒకగుహ కనబడింది. అది కొన్ని కొమ్మలతో కప్పబడింది. అందుచేత కనుగొనడం కష్టమయింది.

ఈ గుహ సెయింట్ ఫ్రాన్సిస్ స్వయంగా ఉపయోగించినదే. సాయంత్రం 6-30 గంటలకు విండ్‌సర్ హోటలులో తేలికగా భోజనాలు చేశారు. చాలాదూరం కారులో వెళ్ళారు. ఆఖరుభాగం కాలినడకను వెళ్ళారు. క్రిందుగా వున్న గోడ మీదనుంచి గెంతి వెడుతున్నారు. ముందు హెర్బర్ట్ నడుస్తూ దారి చూపుతున్నాడు.

వారు కనుగొన్న గుహ బాబాయొక్క ఏకాంతానికి చక్కగా సరిపోయింది. అన్నీ ఆలోచించే ఆ గుహ ఏర్పాటు చేశాడు హెర్బర్ట్; వారు ఆ అడివిలోకి వెళ్ళే సరికి పొద్దుగూకింది. పిట్టల కిలాకిలా రావాలుకూడా మాని పోతున్నాయి.

బాబా గుహలోకి వెళ్ళి కూర్చున్నారు. హెర్బర్ట్ కొన్న జపమాల బాబా ఆయన వద్ద వుంచుకున్నారు. ఎవరూ బాబా ఏం చేస్తున్నారో అని గుహకేసి చూడ డానికి ప్రయత్నించరాదని బాబా స్పష్టం చేశారు. ఆయనకేసి చూడకూడదు ఆయనను అసలు ఎవరూ తాకరాదు.

హెర్బర్ట్, చాన్‌జీ బయట రాత్రంతా కావలి యుండాలి. మర్నాడు ప్రొద్దున్న 9 గంటలకు కాకా వచ్చి వారిని పంపించే వరకు వారు ఉండాలి. కిట్టీ, డేలీని మర్నాడు ఆదివారం ఉదయం 7 గంటలకు చర్చి ప్రార్థనలకు వెళ్ళమని, వెళ్ళేటప్పుడు కాకాని తీసుకు వెళ్ళమని బాబా చెప్పారు. సెయింట్ ఫ్రాన్సిస్ సమాధివద్దకు వెళ్ళి వారిని ఆ సమాధిని ముద్దు పెట్టుకోమని బాబా చెప్పారు. కాకా, కిట్టీ వగైరాలు చాన్‌జీ హెర్బర్ట్‌లను అక్కడ వదలి బాబా గుహలోకి వెళ్ళి కూర్చున్నాక హోటలుకి వెళ్ళి పోయారు.

చీకటి పడుతోంది. దూరాన అస్సిసీ పట్నం గులాబీ రంగులో కనిపిస్తోంది. సంధ్యాసమయం గనుక ఆకాశం అంతా గులాబీ రంగుతో నిండింది ఆ దృశ్యం ఎంత అందంగానో వుంది. 8-40 గంటలకు తిరిగి పట్నానికి వెళ్ళేటప్పుడు గుహలో బాబాను వదిలేశామనే ఆలోచన వచ్చింది. కాకాకి, మిగతావారికి, కాకా తనకి వచ్చినట్లు ఇంగ్లీషులో బాగా మాట్లాడుతూంటే కిట్టీ ఆశ్చర్య పోయింది. కిట్టీతో మెరెడిత్ ఇండియా రావడం టోకా ఆశ్రమంలో వుండడం అతనితో కూడా మార్గరెట్, రాప్ కూడా వుండడం ఆ కథంతా చెప్పాడు. ఇక్కడ గుహ వద్ద చాన్‌జీ, హెర్బర్ట్ బయట చలిలో వణుకుతూ గడిపారు రాత్రి. చాన్‌జీ అతనితో ఇండియాలో పంచాగ్ని వద్ద రాత్రి కావలి కాసిన సంగతి చెప్పాడు. అర్ధరాత్రివేళ స్టవ్‌మీద టీ తయారుచేసి గుహద్వారం వద్ద బాబా కోసం వుంచారు.

మర్నాడు ఉదయం 6 గంటలకు హోటలులో పడుకున్న కాకా, కిట్టీ లేచారు. బాబా ఉపవాసం ఉన్నారు గనుక ఆ సాయంకాలం తినవలసిన అల్పాహారాలు హోట లులో సేకరించారు. తరువాత కాకా కిట్టీ కలిసి చర్చికి వెళ్ళారు. చర్చివద్ద కొంత మంది సాధువులు, పూజారులు వీరిని కలిశారు. వీరు సెయింట్ ఫ్రాన్సిస్ సమాధి వద్ద మోకరిల్లి ప్రణామం చేశారు. బాబా ఆజ్ఞాపించినట్లు సమాధిని ముద్దు పెట్టు కున్నారు. తరువాత మౌంట్ సుబాసియో కొండల వద్దకు వెళ్ళేసరికి ఎండయెక్కింది. పాపం కాకాకి ఆయాసం వస్తూంటే కిట్టీ అతనికి మధ్య మధ్య కొంచెం ఆగమని

చెప్పేది. గుహవద్ద చాన్‌జీని హెర్బర్ట్‌ను కలిసేసరికి తొమ్మిదింబావు అయింది. వాళ్ళు రాత్రంతా మెలకువగా వుండి వీరి కోసం యెదురు చూస్తున్నారు.

రాత్రి శాంతంగా గడిచింది. ఆ అరణ్యం అంతా శాంతంగా ఉంది. ఏ గొడవా లేదు. కిట్టీ, కాకాలు వారిరువురిని (చాన్జీ, హెర్బర్ట్‌లను) అస్సిసీ ఊళ్ళోకి వెళ్ళి హోటలులో విశ్రాంతి తీసుకోమని పంపించి వేశారు.

సూర్యు డింకా పైకి వెళ్ళుతున్నాడు. కాని వీళ్ళకి ఎండ తగులకుండా చెట్ల నీడలో వున్నారు. పరిసరా లన్నీ నిశ్శబ్దంగా వున్నాయి. పక్షుల కూతలు తప్ప ఇంకో శబ్దమేమీ వినవచ్చుటలేదు. సెయింట్ ఫ్రాన్సిస్‌ని జ్ఞాపకం చేస్తూ ఆ పక్షులు వీరి దగ్గరకు కూడా భయం లేకుండా వస్తున్నాయి. ఫ్రాన్సిస్ తన జీవితంలో అన్ని జీవుల తోను అత్యంత ప్రేమమయుడై స్నేహం చేసేవాడు. ఆయన వద్ద క్రూర మృగాలు సైతం వాటి నైజమయిన క్రూర ప్రకృతిని మాని సాధువు లయి వుండేవి. సీతా కోక చిలుకలు వీరుకూడా మొక్కలే అనుకుని వీరిమీదే వాలుతున్నాయి.

క్రమంగా ఎండ వేడమి ఎక్కువయింది. నీడలో కూర్చున్నా వేడిగానే వుంది. మధ్యాహ్నం అయేసరికి గుహలో నుంచి ఏవో శబ్దా లొచ్చేవి. శబ్దాలు వస్తున్నా గుహ కేసి వారు చూడలేదు. బాబా చెప్పిన మాటలు జ్ఞాపకం వుంచుకొని. కాని ఒకమారు మరిచిపోయి కిట్టీ గుహకేసి చూచింది. అప్పుడు బాబా కళ్ళు మూసుకొని సూర్యుని కేసి తిరిగి నిలబడియున్నారు, ఆయన యేదో వింత ధ్వనులు చేస్తున్నారు. బాబా చెప్పిన మాట జ్ఞాపకం వచ్చి ఆమె దృష్టిని మరల్చుకున్నది.మళ్ళీ అటు చూడడానికి సాహసించలేదు.

మధ్యాహ్నం ఒంటిగంటయింది. బాబా చప్పట్లు కొట్టారు. కిట్టీ కాకా లేచి గుహద్వారానికి అడ్డంగా వేయబడి వున్న కొమ్మలు తొలగించారు. బాబా అక్షర ఫలకం తీసుకుని కాకాని అస్సిసీ ఊళ్ళోకి వెళ్ళి హెర్బర్ట్ చాన్‌జీలను సరిగా 4-30 గంటలకు బాబా వద్దకు రమ్మనమని చెప్పమన్నారు. కాకా వెళ్ళిన తరువాత కిట్టీ అక్కడే బాబాను కనిపెట్టుకుని వుండాలి.

బాబా గుహ బయటికి వచ్చారు. వారిని దూరంగా తొలగి వుండమన్నారు. బాబాను తాకవద్దని చెప్పారు. ఆయన ఒక్కరూ దిగువకు వెళ్ళి ఆ అడవిలో ఒక అరగంట తిరిగివచ్చి మళ్ళీ గుహలో ప్రవేశించారు.

కాకా బాబా చెప్పిన ప్రకారం అస్సిసికి వెళ్ళాడు. సాయంకాలం 5 గంట లవుతున్నా చాలా వేడిగానే వుంది.

గుహలోను, చుట్టుప్రక్కలా అంతా నిశ్శబ్దంగా వుంది ఆ సాయం సమ యాన రైతులు దూరాన్నుంచి ఒకరి నొకరు పిలుచుకుంటున్నారు. వారి కేకలు అస్పష్టంగా వినవస్తున్నాయి. వాళ్ళు పాటలు కూడా పాడుకుంటూ యిళ్ళకి వెళు తున్నారు. దూరాన్నుంచి చర్చి గంటలు మ్రోగుతున్నాయి.

బాబా చెప్పిన ప్రకారం హెర్బర్ట్, చాన్‌జీ, కాకా, గుహ వద్దకు వచ్చారు. కిట్టీ బాబాను పిలిచింది – వాళ్ళు వచ్చేరని చెప్పడానికి. అలా పిలవకూడదని ఆమెకు తెలియదు. బాబా పలకలేదు. ఆయన నిద్ర పోవటం లేదు. ఏదో ఆంతరికమైన పని చేస్తున్నారు. ఆ ఉన్నత చైతన్య స్థితిలో నుంచి దిగిరావాలి.

ఆయన కళ్ళు తెరిచారు. కాని ఆ కళ్ళలో ప్రాపంచిక మానవ దృష్టి లేదు. ఎదురుగా వున్న కిట్టీని ఆయన ఆనవాలు కట్టినట్లు లేదు. కొంత సేపట్లో ఆయన దృష్టి మామూలుగా అయింది. ఆయన కిట్టీతో — "ఆహా! నీవు ఎంత అదృష్ట వంతురాలవు? మొట్ట మొదట నా దృష్టి నీ మీద పడినందుకు! నీతో నేను మాట లాడినందుకు!" అన్నారు బాబా అక్షరఫలకంమీద.

గుహ లోపలికి మండలిని వచ్చి కూర్చోమన్నారు భవిష్యత్తులో జరగ వలసిన పని గురించి ఆయన వేసిన పథకాన్ని గురించి బాబా మాట్లాడేరు. కొంత రహస్యంగా ఉంచమని బాబా చెప్పారు. ఒక అరగంట అక్షరాలపలక ద్వారా వారితో మాట్లాడిన తరువాత బాబాకోసం చాన్‌జీ వగైరాలు తీసుకు వచ్చిన అల్పాహారాలు బాబా తీసుకున్నారు. ఆయన తీసుకున్నారంటే లాంఛన ప్రాయంగా కొంచెం స్పృశించి నోట్లో వేసుకుని రుచి చూస్తారంతే. ఏవో పళ్ళు, పళ్ళతో తయారుచేసిన సలాడ్ మొదలయినవి ఉన్నాయి. మిగిలినవారు కూడా బాబా ముందు స్పృశించి ఆరగించిన తరువాత ఆయన ప్రసాదంగా వారు తిన్నారు. 7 గంటలవుతూంటే అక్కడికి తెచ్చిన సామానులన్నీ సర్దుకు తీసుకుని అస్సిసికి బయలు దేరారు. నీళ్ళసీసాలు జంకానా ఆ సాధువుకి యిచ్చేశాడు హెర్బర్ట్.

గుహలో కూర్చున్నపుడు బాబా చెప్పారు. ఆయన మండలిలో ఇద్దరు శిష్యులకు పరస్పరం ఒక విధమయిన ఆధ్యాత్మిక సంబంధం వుండినది. వారిద్దరు అయాముకవలవలె ఉండిరి. ఒకడు తన తలమీద ఏదో వలయం తిరుగుతున్నట్లు

భావించి దానిని చేతితో తీసివేయడానికి ప్రయత్నిస్తాడు. టోపీ పెట్టుకుంటే తీసి వేదామనుకున్నట్లు, కాని అసాధారణమయిన ఆనందం అతనికి చేకూరింది. రెండవ వాడు చాలా అలసిపోయి జబ్బుగా వున్నట్లుగా వుండేవాడు. ఈ విధమయిన సంబంధం వారిద్దరికి ఇంకా వుందని బాబా చెప్పారు. ఒకడు లేచి సంతోషంగా వుంటే రెండోవాడు సుస్తీ చేసి పడుంటాడు.

దివ్యమైన ఆ కొండ, దిగువను ఆ అరణ్యము, అందులో నుంచి మెలికలు తిరిగిన ఆ దారి, అన్నీ ఎంతో బాగున్నాయి. అవన్నీ వదలి వెళ్ళిపోతున్నందుకు మండలికి విచారంగానే వుంది. అక్కడ వున్న ఆశ్రమానికి వెళ్ళి హెర్బర్ట్, కిట్టీ అక్కడి సాధువులతో మాటలాడారు. తరువాత వచ్చి బాబాను రోడ్డుమీద కలిశారు. ఆ కొండదారి మధ్య ఒక ఎత్తయిన స్థలం నుంచి అస్సిసి ఊరుకేసి చూశారు. బాబా అప్పుడు ఇంకా పూర్వపు చైతన్యంలో నుంచి మామూలు స్థితికి రాలేదు. ఆయన నడక తాగినవాడి నడకలా వుంది. ఆయన కళ్ళు పైకి తిరిగి వున్నాయి. ఆ స్థితిలో కొండ దిగే దారి ప్రక్కన ఒక దుప్పటీ పరిచి బాబాను కాస్సేపు కిట్టీ, చాన్‌జీ, హెర్బర్టు, కాకాలు పడుండబెట్టారు. ఆయనకి బాగా మెలకువ కలిగిన తరువాత మరల నడక ప్రారంభించారు. బాబా లేచి కిట్టీ మెడమీద, హెర్బర్టు మెడమీద చేతులు అనుకుని నడుస్తున్నారు. ఇలా వున్నాగానీ ఆ సంధ్యా సమయపు అందం చూసి బాబా ఆనందించారు. కొండ దిగేటప్పుడు వేగంగా పడుతోంది అడుగు. అది నడకా కాదు, పరుగూ కాదు. ఈ వేగమయిన నడకవల్ల బాబా మామూలు స్థితిలోకి వచ్చేశారు. అస్సిసీ సమీపిస్తోందనగా బాబాకి ఇంకా నెమ్మదిగా వుంది శరీర స్థితి. ఆ ప్రదేశం అంతా పుణ్య పురుషుడయిన సెయింట్ ఫ్రాన్సిస్ తిరిగినదే. నక్షత్రాలు కనిపిస్తున్నాయి. ఒక మలుపు తిరిగేసరికి ఊరు కనిపించింది. ఊళ్ళో దీపాలు వెలిగించారు. హోటలుకి వెళ్ళే దారిలో ఒక గోడ ప్రక్కన వీధిలో బెర్నార్డు ఆఫ్ క్వింటావిల్ అనే అతని యిల్లు దాటాక ఒక చోటు చూపించి బాబా "ఇక్కడే సెయింట్ ఫ్రాన్సిస్ ఒక రాత్రంతా క్రీస్తు యెడల ప్రేమతో ఏడుస్తూ గడిపాడు" అని చెప్పారు.

హోటలుకు చేరుకున్న తరువాత అందరు కాఫీ తీసుకుని వారి వారి సామానులు సర్దుకుని కారులో పెట్టుకున్నారు. కారు డ్రైవరయిన పావసేని బాబా "వెట్ హెన్" అని ముద్దుపేరుతో పిలిచేవారు. అతడు బయలు దేరడంలో కూడా చాలా జాప్యం చేసేవాడు. పెరుగియా ద్వారా ఫ్లోరెన్సుకి వెడదామని రాత్రి 10,10-30 గంటల మధ్య బాబా బృందం అందరూ కారులో ఇమిడి కూర్చుని బయలు దేరారు.

ఆ రాత్రి ఒక కారు ఎదురుగా వస్తూంటే దానితో బాబా వెళ్ళే కారు ఢీకొనడానికి సిద్ధమయింది. కొంచెంలో ప్రమాదం తప్పింది బాబా దయవల్ల. తెల్లవారుతూ వుండగా అందరూ ఫ్లోరెన్సుకి చేరుకున్నారు. ఒక హోటలుకి వెళ్ళి శుభ్రంగా చేతులు, ముఖాలు కడుగుకున్నారు. మగవారు క్షౌరం చేసుకున్నారు. ఇంకో పియాజా (హోటలు)లో అల్పాహారాలు, కాఫీ తీసుకున్నారు.

అక్కడ వుండగా సెయింట్ ఫ్రాన్సిస్‌కి ఒక ఊటగడ్డ ప్రక్కన క్రీస్తు దివ్య దర్శనం యిచ్చిన స్థలం కనుక్కోవాలని బాబా చెప్పారు. ఫ్లోరెన్సు యొక్క పటం క్వెన్‌టిన్ చూపగా బాబా చూసి ఆ పరిసర ప్రదేశాలన్నీ అందులో పరిశీలించారు. ఫియసోల్ అనే వూరు తరువాత బెర్గాంటో అనే వూరు మాపులో చూపించి అక్కడికి వెడదాం పదండి అని బాబా చెప్పారు.

పావెసే కారు నడిపి నడిపి, అలసిపోయాడు. అంచుచేత బెర్గాంటో వెడదామని ఒక టాక్సీ మాట్లాడుకున్నారు. దాని డ్రైవరు చాలా మంచివాడు. ఆ చుట్టూ ఊళ్ళన్నీ బాగా తెలిసినవాడు. ఆ ప్రదేశాలన్నీ అతనికి పరిచితములే. ఫియసోల్ మీదుగా బెర్గాంటోకి వెళ్ళేసరికి ఉదయం 10 గంటలయింది. అందరు కారు దిగారు. తెలిసినట్టుగా పాతస్థలానికి వెడుతున్నట్లుగా బాబా ముందు నడిచి దారి చూపిస్తున్నారు. అందరూ మౌంట్ సెసేరి అనే కొండ మీదకి సులభంగా యెక్కారు. అక్కడి నుండి ఫ్లోరెన్సు ఆ చుట్టుపట్ల ప్రదేశాలు రమ్యంగా కనిపిస్తున్నాయి.

బాబా అన్నారు — "ఇదివరలో అంటే ఫ్రాన్సిస్ ఉన్న రోజులలో ఈ కొండ మీద ఒక నీటి బుగ్గ వుండెను నిరంతరము నీరు వస్తూండేది" ఆ కొండ మీద కనుపించిన వారిని కొందరిని ఆ ఊట గడ్డ ఎక్కడ వుంది అని అడిగితే మాకు తెలియదంటే మాకు తెలియ దన్నారు.

బాబా హెర్బర్టుతో — "మేము ఇండియాకి వెళ్ళాక నీవు బెర్గాంటోకి వచ్చి కొన్ని రోజు లిక్కడ ఒక గది చూసుకుని అందులో వుండి ఆ నీటి బుగ్గను వెదకి అది ఎక్కడ వుందో కనుక్కోవాలి" అన్నారు తరువాత బాబా బృందముతో విల్లా ఆల్బైన్ అనే ఒక అందమయిన పాత భవనానికి వెళ్ళారు. అది కొన్నాళ్ళు అద్దెకు తీసుకుందామనే ఊహతో బాబా అది చూచారు. ఈ ప్రాంతంలో ఒక యిల్లు కొన్నాళ్ళపాటు తీసుకుందామనే ఉద్దేశం బాబాకి వుంది. బాబా ఆజ్ఞ ప్రకారం విల్లా ఆల్బైన్ తీసుకున్నారు. అక్కడికి తరువాత ఆగస్టు 20 వ తేదీని హెర్బర్టు తిరిగి వచ్చి కొన్నాళ్ళున్నాడు అందులో. బాబా చెప్పిన ఊటగడ్డ ఎక్కడుందో కని

పిస్తుందేమో అని ఆ పరిసరాల్లో చూచాడు. ఒక ఎత్తయిన గోడ ప్రక్కన ఆ ఊట బుగ్గను అతడు చివరికి కనుగొన్నాడు.

అందరూ ఫ్లారెన్స్‌కి తిరిగి వెళ్ళేసరికి బాగా ఎండెక్కి వేడిగా వుంది. అక్కడ దిగ విడిచిన పావపేను, కారును తీసుకుని తిరుగు ప్రయాణం ప్రారంభించేసరికి మధ్యాహ్నం 12 గంటలు దాటింది. స్పెజియా, రాపల్లో, యూపోలీ, పిసా అను పట్టణాల మీదుగా ప్రయాణం సాగించారు. దారిలో వయ రాగ్గియో వద్ద అడవి ప్రదేశంలో ఆగి భోజనాలు కానిచ్చారు.

లాస్పెజియా నుంచి ఫయోరింజాకు రాత్రి భోజనాలకి వస్తున్నామని టెలిఫోన్‌లో చెప్పారు. బరకోక్క పాస్ గుండా ప్రయాణం రమణీయంగా వుంది. ఆ కొండల మీద నుంచి బహు మనోజ్ఞ మయిన దృశ్యాలు చూశారు. శాంటా మార్గెరిటా తిరిగి వచ్చేసరికి రాత్రి 7 గంట లయింది. అక్కడి హోటలులోనివారు వీరిని ప్రయాణం వలన చాలా బడలిక కలిగి వున్నారని పరామర్శించారు. రాత్రి భోజనం చేసేముందు కిట్టీ, హెర్బర్టు స్నానాలు చేశారు.

ఈ ప్రయాణం చేసి వచ్చిన తరువాత ఒక రోజున ఒక మోటారు పడవలో శాన్ ఫ్రుట్టులోసో మండలితో వెళ్ళి వచ్చారు బాబా. అక్కడ ఒక రోజంతా వున్నారు అక్కడి కాసారంమీద షికారు చేశారు. ఆ పడవలోనే భోజనం చేశారు. మధ్యాహ్నం టీ కూడా తీసుకున్నారు. ఆపడవ మీదే శాన్ ఫౌల్ టార్డోకి వెళ్ళారు.

ఆగస్టు 11 వ తేదీ (1932) ఒక ప్రత్యేకమయిన సెలవు రోజు. రెండు గుర్రాలు లాగే రెండు బండ్లను డెలియా, మింటా ఇద్దరూ ఏర్పాటు చేశారు. వాటిలో బాబా పరివారంతో ఎక్కి పోర్టోఫినోకి అక్కడనుంచి వెస్టాకె వెళ్ళారు. ఒక బండి ఎర్రగాను, ఒక బండి పచ్చగాను వున్నాయి. ఆ బళ్ళల్లో అందరూ నవ్వుతూ ఆడుతూ, పాడుతూ వెడుతుంటే దారిన వెళ్ళేవారు రైతులు వగైరాలు చూసి వీళ్ళు పిచ్చి ఇంగ్లీషు వారనుకున్నారు కాబోలు. చాలాదూరం వెళ్ళాక బళ్ళు ఎగువకు వెడుతూంటే బాబా "నాకు ఆకలేస్తోంది ఏదయినా తినాలి" అన్నారు. అప్పుడు క్వెన్‌టిన్‌టాడ్ "ఇంక అట్టే దూరం లేదుకదా. అక్కడికి వెళ్ళేదాకా ఉండడం మంచిది" అన్నాడు. బాబా ఇంక ఏమీ అనలేదు. కాని ఆయన వైఖరి మారి పోయింది ఇలా బాబా అప్పుడప్పుడు అడిగారంటే అది ఆయన చేసే ఆంతరిక మయిన పనికి బాహ్యచిహ్నం అనుకోవాలి. ఆ కొండ మీదకు ఎక్కుతూంటే ఎక్కడ చూచినా పుష్పాలతో నిండిన ప్రదేశాలుంటే అవి చూచి ఆనందించారు.

కొండ మీదకి ఎక్కాక అక్కడ అందరూ కలిసి చెట్ల నీడలో కూర్చుని సరదాగా తిని పడుకుని నిద్రపోయారు. రాత్రికి ఫయోరింజాకి వెళ్ళి చేరారు.

నిర్మలమైన ఆకాశంలో అప్పుడప్పుడు మబ్బులు పట్టినట్లు బాబా శిష్యుల యొక్క అవిధేయతవల్ల ఏదో కలక వస్తూంటుంది. బాబా వారిని ఏమీ అనకుండానే ఒక్క చూపుతోనే దారిలో పెడుతూంటారు.

దగ్గరలోనే వున్న ఒక సినిమాకి వెళ్ళి ప్రతి రాత్రి ఇటాలియన్ ఫిలిములు చూచేవారు. అనేక మారులు ఆరు బయట కూర్చుని తినే హోటలుకి వెళ్ళేవారు. ప్రాచ్య పాశ్చాత్యులు అరమరికలు లేకుండా కలిసిపోయిన వీరిని చూచి ఆ ఇటలీ దేశపు ప్రజలు ఎవరో ఇండియా నుంచి పరివారంతో ఒక మహారాజు వచ్చాడు కాబోలు అనుకునేవారు.

ఒక రోజున ఫయోరింజా నుంచి బాబా స్నానానికి వెళ్ళి సముద్ర తీరాన్నే నడవాలని అనుకున్నారు. అందరూ బయలు దేరారు. బాబా రోడ్డు నుంచి బీచికి వెడదామని దారి తీశారు. బాబా శిష్య బృందంలోని హెర్బర్ట్ అది ఎవరిదో స్వంత స్థలం మనం వెళ్ళకూడదు అన్నాడు. ఆ స్థలం యజమాని తన తాలూకు కుర్చీలు, మెత్తలు, ఫ్లాస్కు వగైరాలు అన్నీ అక్కడ పెట్టుకుని ఎక్కడికో వెళ్ళి ఉంటాడని హెర్బర్ట్ అన్నాడు. బాబా ఈ మాటలు పెడచెవిని పెట్టారు. కిట్టీ బాబా ఉండగా మనకు భయ మేమిటి వెడదాం అని పట్టుపట్టింది. సరే అని అందరూ మెట్లు దిగి ఆ స్థలంలోకి వెళ్ళారు. హెర్బర్ట్ తాను చెప్పినాగానీ బాబా తన అక్క అయిన కిట్టీ చెప్పింది కదా అని సముద్రతీరం అయితే మాత్రం ఇంకొకరి స్థలంలోకివెళ్ళి కూర్చోవడం ఏం బాగుంటుందని కోపం తెచ్చుకుని దూరంగా వాళ్ళతో కలవకుండా ఒక్కడూ వెళ్ళి కూర్చున్నాడు. బాబా వారి దగ్గరకు రమ్మని పిలిస్తే వచ్చాడు కాదు. మిగిలినవారు పిలిచినా రాలేదు. కిట్టీ బ్రతిమాలినా వచ్చాడు కాదు.

అప్పుడు ఒక వృద్ధుడయిన ఇటలీ దేశస్థుడు పొడవయిన కేశములు, గడ్డము కలిగి ఒక చిన్నపిల్లవానితో కాకా ప్రక్కనుంచి వెడుతూ చేతులు జోడించి కాకాకు నమస్కారం చేశాడు. కొంత సేపయిన తరువాత పాశ్చాత్య బృందంతో బాబా సాగర తీరంలో వున్నారని ఆయన వద్దకు వెళ్ళి ఎంతో గౌరవంతో ఆయన కేసి చూసి ప్రణామం చేసి బాబాకు గౌరవ సూచకంగా తన టోపీ మూడు మార్లు తీసి జోహారు చేశాడు. ఒక నెల రోజుల్లో రష్యా వెళ్ళినపుడు మాస్కోలో ఇంకొక బాబా

ప్రతినిధిని హెర్బర్టు కనుగొనవలసి యుండెను. ఇప్పుడు వచ్చిన ముసలివాడు సరిగా ఆ రష్యన్ ప్రతినిధివలెనే అతని కవల సోదరుడా అన్నట్లుండెను. హెర్బర్టు ఇతనిని చూసివుంటే రష్యా వెళ్ళినపుడు అతని పని సులువయ్యేది కదా. అతడు బాబా మాట విననందుకు విచారించారు.

కొంత సేపయిన తరువాత హెర్బర్టు బాబా వున్నచోటుకి చేరాడు. బాబా అతనిని బాగా చివాట్లు వేశారు. హెర్బర్టు "బాబా! ఇంకొకరి స్థలంలో ప్రవేశిస్తూవుంటే చెపితే తప్పా ?" అని బాబాను అడిగాడు. బాబా అందుకు – "నీవు చెప్పవలసినదే–తప్పు లేదు. అయినా నేను నీవు చెప్పినది వినికూడా వెడుతూంటే నీవు ఇంక ఊరుకుని నన్ను అనుసరించాలి" అన్నారు. ఆ ముసలివాని కోసమే బాబా అలా ఆ తీరానికి వెళ్ళారు. అక్కడ ఇంకా బాబా కూర్చుని వుండగానే ఆ స్థలం యజమాని వచ్చి వీరిమీద కోపం చూపించగానే బాబా లేచి అందరినీ తీసుకుని వారువచ్చిన పని అయిపోయింది గనుక రోడ్డుమీదకు వెళ్ళిపోయారు. ముసలివాని రాక సంగతి వగైరా తెలుసుకుని హెర్బర్టు బాబా పిలిచినా తాను రానందుకు చాలా విచారించాడు.

అది ఆగస్టు 17 వ తారీకు. ఫయోరింజాలో ఇది ఆఖరురోజు. ఆ రోజున ఎవరిదారిన వారు అందరూ వెళ్ళిపోవాలి. బాబాను వదలి వెళ్ళటానికి కిట్టీ మొదలయిన వారికి కష్టంగానే వుంది. ఆ మధ్యాహ్నం స్నానాలు చేశారు. అందరూ సామానులు సర్దుకుని శాంటా మార్గరిటా వదలి అనేక బళ్ళలో బయలుదేరి వెడుతూంటే ఆ వూరి వాళ్ళు వింతగా చూశారు. స్టేషన్‌కి చేరాక సామాను లెక్కపెడితే 32 శాల్తీలు వున్నాయి. ఇవన్నీ రైలులో ఎక్కించారు. తరువాత మండలి, ఇతరులు కూడా ఎక్కారు. బాబా కూర్చున్నారు గాని మండలి, మిగతావారు చాలాదూరం వరకు నిలబడి వెళ్ళవలసి వచ్చింది.

జినోవా స్టేషన్‌లో వారు ఇంకో రైలులోకి మారారు. అందులో యింకా జన సమ్మర్దంగా వుంది. అదికూడా మూడవతరగతి పెట్టెయే. రైలు మిలాన్ వెళ్ళేసరికి ఎనిడ్ కార్ఫ్ బాబా బృందంలో చేరింది. ఈ ప్రయాణం కష్టతరమైవున్నందు వల్ల బాబాకి చాలా సరదాగా వుంది రైలు పెట్టెలో మధ్యనడివె దారిలో పెట్టెలు పెట్టుకుని వాటిమీద పరున్నారు, స్త్రీ బృందంవారు. రెండో తరగతిలో ఎక్కుదామనుకున్నా అదికూడా చోటులేకుండా ఇలాగే వుంది. బాబా మూడవతరగతిలో కూర్చున్నా ఆ యిబ్బందికి సర్దుకుని ఎంతో సరదాగా ప్రయాణం చేశారు. బాబా తమ పరివారంతో వెనిస్ నగరంలో దిగారు.

బాబా వారి పాశ్చాత్య బృందంలో ఒక్కొక్కరికి ఒక మారుపేరు పెట్టి ఈ విధంగా పిలిచేవారు.

| పేరు | ముద్దుపేరు | పేరు | ముద్దుపేరు |
|---|---|---|---|
| డెలియా | లేలా | జిల్లా | ముంతాజిమ్ |
| మింటా | షాలిమార్ | మేబిల్ | ఫిరోజ్ |
| కిట్టీ | సరోజా | క్వెన్‌టన్ | నరిద్ |
| మార్గరెట్ | జులెకా | హెర్బర్టు | సుదామ |
| ఆడ్రే | షిరీన్ | నొరీనా | నూర్‌జహాన్ |
| కిమ్ | అయేషా | ఎలిజబెత్ | దిల్‌రుబా |

ఉత్తరాలు వ్రాసేటప్పుడు డెలియాను తన విశ్వాస పాత్రురాలయిన లేలా అనే ఆయన ఉదహరించేవారు. అలాగే మిగిలినవారిని కూడాను.

వెనిస్‌లో హోటల్ ఇంటర్నేషనల్‌లో దిగారు. బాబా పరివారంతో వెనిస్ రావడం ఇది మొదటిసారి. వారు ఆ నగరం యొక్క సౌందర్యం చూచి అబ్బుర పడ్డారు వేడి ఎక్కువగా వున్నా ఎవరూ అది పట్టించుకోలేదు. ప్రసిద్ధ మయిన స్థలాలకి వెళ్ళి చూచారు. లిడో, ఫ్లోరియన్, ఖాద్రి అనే చోట్లకి వెళ్ళి చాలా సమయం గడిపారు. రాత్రి పియాజ్జాకివెళ్ళి సంగీత కచేరీలకు హాజరయారు. ఆఖరు సాయం కాలం త్రిస్తాన్‌కి వెళ్ళారు. ఇంకా ఐసోల్డ్‌కి కూడా వెళ్ళి చూచారు.

సెయింటీ మార్క్స్ స్క్వేర్‌లో ఒక రాత్రి ఒక హోటలులో కూర్చుని వుండగా బాబా–"నేను నిరంతరము సిలువ వేయబడుతూనే వున్నాను" అని శిష్యు లతో అన్నారు. "నా మీదవున్న భారం భరించలేనంతగా వున్నపుడు నా శిష్యులకు కొంత మోయడానికి ఇస్తూ వుంటాను" అన్నారు బాబా. అకస్మాత్తుగా అక్కడ నుంచిలేచి సెయింట్ మార్క్స్ కెథిడ్రల్‌లోకి వెళ్ళి దాని చుట్టూ తిరుగుతూ, ఏదో చూపిస్తూ, లెక్కపెడుతున్నారు బాబా. కాగితం మీద వెయ్యమన్నారు. ఆ కెథిడ్రల్లో ఆర్చిలు, స్తంభాలు లెక్కపెట్టారు. అవతారుని బృందంలో 120 మంది శిష్యు లుంటారు. బాబా అవి లోపల బయట లెక్కపెట్టినపుడు సరిగా 120 వచ్చాయి. ఇది అవతారుని సర్కిల్‌కు సరియయిన సాంకేతిక ప్రతీక అన్నారు. లోపల ఒక వల యంలో 12 వున్నాయి. బాబా అంతరంగ బృందంలో సన్నిహిత శిష్యులు సరిగా 12 గురు ఉన్నారు. బయట లెక్కపెడితే 108. అది తన బాహ్య బృందం.

108 + 12 మొత్తం 120. బాబా- "జీసస్ సిలువ వేతకు ముందు వెనిస్ వచ్చి ఇచ్చోటనే ఆయన తన అనుచరులతో కూర్చుండెను" అని చెప్పారు.

బాబా ఆజ్ఞ ప్రకారం హెర్బర్టు ఫ్లోరెన్స్‌కి 1932, ఆగస్టు 20వ తేదీని వెళ్లాడు. బాబా అతనిని ఒక గండోలాలో స్టేషన్‌కి తీసుకుని వెళ్ళారు. హెర్బర్టు వెళ్ళిపోయి నందుకు అందరూ విచారంగా వున్నారు అతడు రష్యా మీదుగా దీర్ఘ ప్రయాణం చేసి చైనాకు వెళ్ళవలసి యుండెను.

హెర్బర్టు వెళ్ళేటప్పుడు మాస్కోలో పొడుగాటి కోటు తొడిగికొనిన ఒక వృద్ధునికి ఇయ్యమని అతనికి బాబా ఒక వస్తువు యిచ్చారు శాంటా మార్గెరిటాలో సముద్ర తీరానికి వచ్చినవానివలె ఆ వృద్ధుడుండును. ఆ వృద్ధుని పోలిన యొకడు బాబాను కలిసినపుడు హెర్బర్టు లేకపోబట్టి మాస్కోలో వానిని పోల్చుకొనుట కష్టమే యగునని బాబా చెప్పియున్నారు.

మాస్కోలో హెర్బర్టు మూడు నాలుగు రోజులు ఆ వృద్ధుని కోసం వెదకెను. అతడు కనుపించలేదు. ఇంక లాభం లేదని నాంకింగ్ వెళ్ళిపోదామని రైలుకి స్టేషన్‌కి వెడదా మనుకుంటూంటే ఒక చర్చికి బయట కూర్చుని వున్న ఒక వృద్ధుని చూచి బాబా చెప్పిన ఆనవాళ్ళనిబట్టి ఇతడే అయి యుందవలెనని అతని దగ్గరకు వెళ్ళగా అతడు అతనికోసమే కనిపెట్టుకుని యుండెను. అతడే బాబా ప్రతినిధి. బాబా యిచ్చిన వస్తువును హెర్బర్టు అతని కిచ్చెను ఇతడొక పరోక్షమయిన ప్రతినిధి (Indirect Agent) క్రిస్టియానో అనే మారు పేరు గల ప్రతినిధి నుంచి అతడు ఆజ్ఞలను పాలించును.

ఆఖరు రోజున బాబా అందరిని ఆయన వద్దనే ఉండమన్నారు. బాబా వారి ద్వారా చేయవలసిన ఒక ప్రత్యేకమయిన పని వున్నది. అలా ఆఖరిరోజున దగ్గర వుండమని వారితో బాబా చాలా సార్లు చెప్పారు. సరే అని అందరూ అన్నాము. కాని వారెవరూ బాబా ఇచ్చప్రకారం చెయ్యలేక పోయారు. వారు బజారుకి బయలు దేరారు చూదామని. దుకాణాలలో, ప్రదర్శన కిటికీలలో ఆకర్షణీయంగా అమర్చిన వనీ చూస్తూ వారు చాలా ఆలస్యం చేశారు తిరిగి రావడానికి. బాబా వద్దనుంచి వారు దూరమయారు. బాబా వారికోసం మనిషిని పంపవలసి వచ్చింది. ఈ విధంగా అనేక మార్లు బాబా చెయ్యవలసి వచ్చింది. ఆయన వారికి బాబాను విడిచి వెళ్ళవద్దని ఆయన చెప్పిన సంగతి జ్ఞాపకం చేయవలసి వచ్చింది.

ఆ రోజున ఎండవేడిమి చాలా ఎక్కువగా వుంది అందరూ లిడోకి వెడదా మన్నారు. కొందరు స్నానాలు చేదామన్నారు. మరల బాబా అది ఆఖరు రోజు కదా అని వారందరిని బాబా వద్ద ఉండమని చెప్పారు. లిడోకి వెళ్ళేసరికి వారు ఇంక ఊరుకోలేక కొందరు స్నానానికి వెళ్ళారు. బాబాను వదలి గంటపైగా వున్నారు. ఆ గంటసేపు బాబా ఒక్కరూ వున్నారు. ఆయనను ఎక్కడ వదిలేరో అక్కడకు వారు స్నానాల తరువాత వెళ్ళి చూస్తే బాబా అక్కడ లేరు బాబా అన్న ప్రకారం చేసిన వాళ్ళు డెలియా, మార్గరెట్ మాత్రమే. చాన్‌జీ. కిట్టీ లిడో వద్ద బాబాను కలియవలసి వున్నది. వారిరువురు బాబా పనిమీద స్టీమరు ప్రయాణం నిమిత్తం లాయిడ్ ట్రిస్టినో ఆఫీసుకి వెళ్ళారు. కాని వారు లిడోలో ఆయన్ను కలుసుకోలేకపోయారు. బాబాకి వారు కలవలేదని చిరాకు కలిగింది. చింతాక్రాంతులై హోటలుకి తిరిగి వెళ్ళిపోయారు. లిడో విడిచి బాబా వెళ్ళిపోయారని తెలియక లెమనేడ్ త్రాగుతూ అక్కడ మిగిలినవారు ఆలస్యం చేశారు. భోజనానికి హోటలుకు ఆలస్యంగా వెళ్ళారు. వారందరూ బాబాను తిరిగి హోటలులో కలిసేసరికి బాబాతో డెలియా, మార్గరెట్‌లు మాత్రమే వున్నారు. వీరంతా రాలేదని ఆ స్త్రీ లిద్దరు ఎంతో విచారిస్తూ కళ్ళనీళ్ళపర్యంతం అయి కూర్చున్నారు. బాబా వదనం కూడా చింతాన్వితమై యుండెను. ఆయన గొప్ప నటకుడు. ఆయన మండలికూడా అది నిజమే అనుకున్నారు. బాబా అన్నారు – "ప్రాచ్యదేశ వాసులు బాబా పాదాలవద్ద కూర్చుని వుండడానికి ఎంతో తపిస్తారు. కాని పాశ్చాత్యులు బాబానే వారి పాదాల వద్దకి రమ్మంటారు" అన్నారు. పాశ్చాత్యులు బాబాకోసం ఏవిధంగా పనిచేయాలో చెప్పారు. ఇప్పుడు బాబా చెప్పినట్లు వారు విననందున ఆయన యొక్క ప్రణాళికలు మార్చుకుని పాశ్చాత్యులకు బాబా కోసం పనిచేసే అవకాశం ఇవ్వకుండా ఉండాలని నిశ్చయించు కున్నానన్నారు. అందరూ – ఇద్దరు మాత్రం – తప్ప – వారి మాట జవదాటరు గనుక బజారుకి వెళ్ళి దుకాణాల్లో అనవసరంగా ఆలస్యం చేశారన్నారు. బాబా చెప్పేది తేలికగా తీసుకుని నవ్వేసింది మింటా. మిగిలినవారు మాత్రం బాబా చెప్పేది నిజమే అని వారి తప్పు తెలుసుకుని కళ్ళనీళ్ళు పెట్టుకున్నారు. ఆరోజు మధ్యాహ్నం ఎవరికీ భోజనాలు సయించలేదు. ఆ మధ్యాహ్నం ఎవరి ఇష్టంవచ్చినట్లు వాళ్ళు చేసుకోండి అని బాబా వారితో అన్నారు. బాబాకి చాలా పనివుంది గనుక ఆయన ఆ దినశేషాన్ని తమ మండలితో గడుపుతానన్నారు. ఇలా వారిని ఏడిపించాక భోజనాల దగ్గర నుంచి లేచిన తరువాత బాబా అందరినీ క్షమించానన్నారు. ఆ రోజు మధ్యాహ్నం అందరూ బాబాతో కలిసి చాలా సరదాగా కాలక్షేపం చేశారు.

ఆ రోజు 1932 ఆగస్టు 20 వ తేదీ శనివారం. ఆ రోజున ఎవరికివారు విడిపోయారు. బాబా చాన్‌జీతోను, కాకాతోను బయలుదేరి "ఆసోనియా" అనే ఓడ ఎక్కారు. సాయంత్రం 4 గంటలకు ఓడ బయలుదేరింది. మార్గరెట్ క్రాస్కి, డెలియా, ఇంగ్లండుకు వెళ్ళారు. ఎనిడ్ కార్ఫ్ మిలాన్ వెళ్ళిపోయింది. క్వెన్‌టిన్ టాడ్‌ను బాబా యూనివర్శిటీలో చదవమని సియెనాకు పంపించారు. నోరీనా మాచెబెల్లీని అమెరికా వెళ్ళి మరల ఇటలీ రమ్మన్నారు. అమెరికా నుంచి ఆమె రాగానే సియెనా నుంచి జర్మనీ వెళ్ళి బాబా పని చెయ్యాలి. అనేకమంది ఈ దేశాలలో బాబాను దర్శించాలని వేచియున్నారు.

బాబా ఓడ ఎక్కేటప్పుడు ఆయనకు అందరూ వీడ్కోలు ఇచ్చారు. నెమ్మదిగా 'ఆసోనియా' కదిలి బాబాను వారినుంచి దూరంగా తీసుకుపోయింది. బాబాతో కాకా, చాన్‌జీ కూడా ఓడలో వెళ్ళిపోతున్నారు బాబా ఓడమీద నిలబడి చూస్తుంటే ఓడ దూరమయినకొలది ఆయన చిన్నగా అయిపోతున్నట్లు కనిపించింది. కిట్టీకి మళ్ళీ రెండు నెలలలో అక్కడికి వస్తానని బాబా సైగ చేశారు. అప్పుడు మళ్ళీ అక్కడ కలుసుకోమన్నారు. కిట్టీ వగైరాలు వెనుకకు తిరిగి హోటలుకు చాలా విచారగ్రస్తులై వెళ్ళారు. ఆ రాత్రి 8-30 గంటలకు కిట్టీ ఫ్లోరెన్స్ మీదుగా సియెనా వెళ్ళింది.

బాబా మండలితో 'ఆసోనియా' నుంచి అలెగ్జాండ్రియా (ఈజిప్టు)లో దిగారు. ఈజిప్టులో అయిదురోజు లున్నారు. అక్కడ బాబా పిరమిడ్లను చూశారు. ఒక రోజున వారు 11 వ శతాబ్దంలో నిర్మాణం చేసిన పాత కెయిరోలోని కాప్టిక్ చర్చికి వెళ్ళి చూశారు. ముఖ్యంగా అది చూడడానికే బాబా ఈజిప్టులో దిగారు. జోసెఫ్, మేరీ, జీసస్ శిశువుతో హెరాడ్ రాజుకి భయపడి పాలస్తీనా నుంచి పారిపోతూ ఈ ప్రదేశంలో ఒక గుహలో తల దాచుకున్నారు. ఆ గుహ మీదే ఈ కాప్టిక్ చర్చి కట్టారు. బాబా ఆ గుహ చూడాలంటే అది తెరవడానికి ఆ చర్చి పాలకుడు మొదట అభ్యంతర పెట్టాడు. కాని బాబా పట్టుదలతో గుహ ద్వారం తెరిపించి లోపల చూచారు. ఆ పవిత్ర ప్రదేశంలో కొంతసేపు కూర్చున్నారు బాబా.

కెయిరోలో బయలుదేరి సెప్టెంబరు మొదటి వారంలో బాబా ఇండియాకు ప్రయాణం చేసి బొంబాయిలో దిగి తిన్నగా నాసిక్ వెళ్ళిపోయారు.

బాబా ఇండియా తిరిగి వచ్చేసరికి ఆయనకి మెరిడిత్ స్టార్ నుంచి ఒక కేబిల్ వచ్చి సిద్ధంగా వుంది – "అయిదు వందల పౌనులు నాకు వెంటనే పంపించాలి. అంతేకాదు. నాకు భగవత్సాక్షాత్కారం కూడా కావాలి" అని అడిగాడు మెరెడిత్.

ఆ కేబిల్ చూచి బాబా పెద్దగా నవ్వారు. దీనివలన మెరెడిత్ యొక్క అసలు రూపం ఇప్పుడు అందరికీ తెలిసిపోయింది. అతడు అదృష్టహీనుడు. ఓర్చలేని వాడు. ఆశాపరుడు. బాబా కొంగు వదలకుండా ఆయనను అంటిపెట్టుకుని వుండలేక పోయాడు. తన జన్మకు కలిగిన మహద్భాగ్యాన్ని కాపాడుకోలేక అమూల్యమైన అవకాశాన్ని చేతులారా వదలుకున్నాడు.

పైన ఫ్రాన్సిస్ ఆఫ్ అస్సిసీ గురించి వ్రాశాము. ఈ ఫ్రాన్సిస్ ఎవరు. ప్రపంచంలో ఎంతోమంది దైవ భక్తులున్నారు. ప్రియతమ బాబా అస్సిగీ ఎందుకు వెళ్ళారు? అక్కడే ఏకాంతవాసం ఎందుకు చేశారు? అందుచేత సెయింట్ ఫ్రాన్సిస్ గురించి కొంచెము తెలుసుకుందాము.

## సెయింట్ ఫ్రాన్సిస్ :

అది 12 వ శతాబ్దాంతము లేక 13 వ శతాబ్దము ప్రారంభము. ఇటలీలో చర్చి వ్యవహారాలు మందకొడిగా వుంటున్నాయి.

ఒక యువకుడు ఒకనాడు ఇటలీకి గుఱ్ఱపుస్వారీ చేస్తూ వచ్చాడు. అతనికి ఫ్రాన్స్ దేశం అంటే ఎంతో ప్రీతి. అతనికి ఫ్రాన్సిస్ అని వారు నామకరణం చేశారు. సంచారంచేస్తూ అతడు అస్సిసీ అనే పట్టణానికి వచ్చాడు. అది ఒక పెద్ద కొండ దిగువన ఉన్న చిన్న పట్టణం. ఎదురయినవారు అతనికి నమస్కారం చేస్తే అతడు చాలా మరియాదగా జవాబు యిచ్చేవాడు.

గుఱ్ఱంమీద ఆ యువకుడు వెడుతూంటే ఒకచోట ఒక బిచ్చగాడు చేయెత్తేడు. అశ్వారూఢు డయిన అతడు క్రిందికి వంగి దయతోకూడిన ఒక మాటతో కొన్ని చిల్లర డబ్బులు వాని చేతిలో వేశాడు. ఫ్రాన్సిస్ అతని ఉదార స్వభావానికి పేరు పొందాడు. ఇదివరకు ఫ్రాన్సిస్ కుష్ఠురోగులకు అనేకమారులు ధర్మంచేసి యున్నాడు. ఫ్రాన్సిస్ తండ్రి ధనికుడయిన బెర్నడోన్ అనేవాడు.

క్రీస్తు తన ఉపదేశాలలో చెప్పినది ఫ్రాన్సిస్ చదివాడు—

"నీవు అభాగ్యులయిన నా యీ సోదరులకు ఎంత తరుచుగా సహాయం చేస్తావో నీవు అది నాకు చేసినట్లే భావిస్తాను."

ఈ వాక్యం చదివి 'పాపం ఈ కుష్ఠురోగుల కంటె అభాగ్యులెవరున్నారు? అని ఫ్రాన్సిస్ తలచాడు.

ఫ్రాన్సిస్ అనే ఈ యువకుడు ఒకమారు లజరెట్టోకి (కుష్ఠురోగుల ఆశ్రమం) వెళ్ళుచుండగా రోడ్డుమీద ఒక కుష్ఠురోగి కనిపించాడు – ఆ కుష్ఠువానికి రోగం ముదిరి పాపం చేతివ్రేళ్ళు ఊడి పడిపోయాయి. వాని ముక్కు తప్పడ అయిపోయింది. వాని కళ్ళనుంచి ఏదో చూస్తున్నాడుగాని, అవి నయనములు కావు. ఏవో రంధ్రాలవలె నున్నవి. ఆ కనుకొలికలలో పుసి చేరియున్నది. ఎంతో మురికిగా అసహ్యముగా వున్నాడు.

అతనిని చూచి ఫ్రాన్సిస్ గుర్రం దిగాడు. ఇంతకంటె అభాగ్యుడెవ డుండును ? ఆకారము చెడిన వానిచేతిలో డబ్బులు వేశాడు. ఆ చేతిని యెత్తి గానిని ముద్దుపెట్టుకున్నాడు. అంతటితో తృప్తినొందక వానిచుట్టు తన చేతులను పోనిచ్చి 'క్రీస్తు ప్రేమ కొరకు' అనుచూ అతనిని ఆలింగనం చేసుకున్నాడు. తరువాత అతడు మరల గుర్రంయెక్కి వెనుకకు మరలి నెమ్మదిగా వెళ్ళుచుండెను. 20 అడుగులు వేసి ఫ్రాన్సిస్ వెనుకకు తిరిగిచూచెను. ఆ రోడ్డుమీద వున్న కుష్ఠురోగి కనబడలేదు. ఎక్కడికి వెళ్ళేడు ? ఎక్కడా కనపడలేదు. అదృశ్యమైనాడు. అతడు క్రీస్తే అయి యుండవలెను. ఫ్రాన్సిస్ ఎంత ధన్యుడు ?

కొంతసేపయిన తరువాత ఫ్రాన్సిస్ తన గుర్రంమీద శాన్‌డామియానో చర్చి ప్రక్కనుంచి పోవుచుండెను. అతనికి అప్పుడు ఆ చర్చి లోపలికి వెళ్ళి ప్రార్థన చేయాలని ప్రేరేపణ కలిగింది. ఆ చర్చిలో సిలువవేసిన క్రీస్తు విగ్రహం ముందు ప్రార్థన చేస్తూవుండగా "ఫ్రాన్సిస్ ! నా ఇల్లు ఎలా పాడయిపోతోందో చూడటంలేదూ ? దీనికి నాకోసం మరమ్మత్తు చెయ్యి" అనే మాటలు స్పష్టంగా వినిపించాయి అతనికి.

ఫ్రాన్సిస్ చెప్పడంకంటె అతనికి చేయడమే అలవాటు. వెంటనే అతడు వెళ్ళి తన గుర్రాన్ని అమ్మివేశాడు. తన తండ్రి యొక్క కొన్ని బట్టల బేళ్ళ అమ్మివేసి ఆ వచ్చిన సొమ్మును శాన్‌డామియానో చర్చి పూజారికిచ్చి అది పెట్టి ఆ దేవుని గుడి మరమ్మత్తు చేయించమని చెప్పాడు.

ఫ్రాన్సిస్ తన బట్టలబేళ్ళ ఈవిధంగా వినియోగించడం బొత్తిగా సహించ లేక అతని తండ్రి కొడుకనికూడా ఆలోచించక ఫ్రాన్సిస్‌ని పట్టుకుని ఒక గదిలో పెట్టి బంధించాడు. అధికారుల ముందుకువెళ్ళి అపరాధివలె నిలబడుటకు ఫ్రాన్సిస్ నిరాకరించెను. అప్పుడు ఆ తండ్రి అతనిని బిషప్‌వద్దకు తీసుకొనిపోయి ఫిర్యాదు

చేసెను. దొంగతనం చేసిన డబ్బుతో మరమ్మత్తు చేయమని దేవుడు చెప్పలేదు. అని ఆ డబ్బు బిషప్ ఫ్రాన్సిస్ తండ్రి అయిన బెర్నార్డన్‌కి యిప్పించేశాడు.

"ఈ గుడ్డలు కూడా నా తండ్రివే" అని ఫ్రాన్సిస్ తాను ధరించిన గుడ్డలు కూడా విప్పేసి తీసుకో అని తన తండ్రి కిచ్చేశాడు. లోపల మేకులు శరీరం వైపుకి ఉన్న ఒక మేకుల చొక్కా వున్నది అతని శరీరంమీద. ఫ్రాన్సిస్ అన్నాడు:- "ఇప్పటిదాకా పీటర్ బెర్నార్డన్‌ను నా తండ్రి అనుకున్నాను. ఇప్పటి నుంచి ఆ దేవుడే నా తండ్రి" అని అర్ధ నగ్నంగా ఆ చలిలో తిరుగుతూ వుండెను. అలా తిరుగుతూ భగవంతుని స్తుతిస్తూ వుండెను.

కావాలని తెచ్చి పెట్టుకున్న ఈ దరిద్రం ఆతని జీవితం అంతా మంచి స్నేహితునివలె విడువకుండా అతనిని అంటిపెట్టుకుని యుండెను. ఆ పేదతనమే పెన్నిధి వలె స్వీకరించి అతడు సంతోషించు చుండెను.

ఫ్రాన్సిస్ చర్చి ఎలా మరమ్మత్తు చేయడమా అనే నిరంతరము ఆలోచించు చుండెను. చర్చి బాగుచేయించేందుకు డబ్బు యెందుకు. అందులోనూ ఒకరి డబ్బుతో అసలే చేయించరాదు అనుకుని రాళ్ళు పోగుచేసి గొడ్డువలె మోసుకొనివచ్చి కట్టడం ప్రారంభించాడు. సెయింట్ డామియానో చర్చి పూర్తిగా మరమ్మత్తు అయినాక సెయింట్‌మేరీ చర్చికూడా బాగుచేశాడు ఆ విధంగానే కాయకష్టంచేత.

ఈ రోజులలోనే ఒకవంక చర్చి బాగుచేయిస్తూ, ఒకవంక తాను పేదవారికి, కుష్ఠరోగులకు సేవచేస్తూ వారికి కావలసిన సహాయము చేయగలిగినదంతా చేయు చుండెను. దేశభక్తికోసం యుద్ధంలో ప్రాణాలయినా అర్పించవచ్చునుగాని, కుష్ఠువులకు సేవచేయడానికి అమితమైన మనోధైర్యం కావాలి. అది ఎవరోగాని చేయలేని పని.

ఫ్రాన్సిస్‌కి చదువురాదు. చదువుకోవడం అతనికి యిష్టంలేదు. బయటకు వెళ్ళి భగవంతుని స్తుతిస్తూ ఆయన యొక్క బోధనలను ప్రజలకు వినిపిస్తూ వుండేవాడు. ఇతడు చేసే మంచిపని ఒక ధనికుని, ఒక పురోహితుని ఆకర్షించింది. వారిద్దరు బాసటగా ఫ్రాన్సిస్‌తో చేరారు. వారు జీవించే దానికి ఒక విధానం ఉండాలని నిశ్చయించు కున్నారు.

ఫ్రాన్సిస్ భగవంతుని ప్రార్థన చేస్తూ బైబిల్, క్రీస్తుయొక్క శిష్యులయిన మాథ్యూ, లూక్ మొదలగువారి అమూల్యములయిన మాటలను చదివించి వినిపించు

చుండెను. "నాతో ఎవరయితే వస్తారో వారు భోగభాగ్యాలను విడిచి క్రీస్తు జీవితాన్ని జీవించాలి" అని చెప్పేవాడు. క్రమంగా ఇతరులు అతనిని చేరారు.

ఈ విధంగా ఫ్రాన్సిస్‌తో 12గురు చేరారు. తన బృందాన్ని తీసుకుని రోమ్‌కి వెళ్ళి ఫ్రాన్సిస్ పోప్‌ను దర్శించి తన శిష్యులగు వారిని తనను ఆశీర్వదించమని కోరాడు. చింకి గుడ్డలు ధరించిన ఈ పేదవాణ్ని మొదట పోప్ పట్టించు కోలేదు. ఆ రాత్రి పోప్‌కి వచ్చిన కలలో సెయింట్ జాన్ లా టెరాన్ అనే పెద్ద చర్చి అతడు చూచాడు. అది పడిపోతూ వున్నట్లు పడిపోకుండా ఒక చింకి పాతలలో వున్న ఒక చిన్న మనిషి ఆపుతున్నట్లు అతనికి కనిపించింది. ఆ చిన్న మనిషే ఫ్రాన్సిస్ అని పోప్ గుర్తించాడు.

తెల్లవారిన తరువాత పోప్ అతనిని పిలిచి కౌగిలించుకొని అతనిని అతని అనుచరులను దీవించి వారిని సరియయిన బోధకులుగా గుర్తించి బోధలు చేయుటకు తన అధికారాన్ని యిచ్చి పంపించాడు.

ఫ్రాన్సిస్ ఆ విధంగా గొప్ప బోధకుడయ్యాడు. అతడు చరాచర ప్రపంచం లోని అన్నిటిని స్థావరములను, జంగమములను, రాళ్ళను, చెట్లను, జీవ జంతువులను, మానవులను అందరను సమముగా ప్రేమించుచుండెను. అందరూ భగవంతుని బిడ్డలే అని తన సోదరులవలెనే ప్రేమించెను.

జీవితంలో ఫ్రాన్సిస్ ప్రతి చర్యలోను నమ్రత కనపడుచుండెను. ఫ్రాన్సిస్‌కి కడుపులో నెప్పి, కంటికిజబ్బు, శరీరంలో ఏదో ఒక రుగ్మత మనసులో వీటి వలన వ్యథ ఇవన్నీ జీవితంలో క్రీస్తుప్రేమ చేతనే భరించ గలిగెను. దేనికీ ఎన్నడూ ఫ్రాన్సిస్ అసంతృప్తి చెందలేదు. దేవుడు అందరను ఆనందముగా ఉండమని సృజించెను. శారీరకమయిన బాధలు ఆ దివ్యానందానికి ఎప్పుడూ అతనికి అడ్డురాలేదు. ప్రేమతో వెల్లివిరిసి సదా అతడు ఆనందంతో నిండి యుండెడివాడు. శారీరక మనో వేదనలను అతడు లెక్కచేయలేదు. నిజమయిన దైవభక్తుడు ఆనందంతోనే ఉండాలి అతని సిద్ధాంతము.

ఎవరయినా ఫ్రాన్సిస్‌తో వెళ్ళి గమనిస్తే అతడు పిచ్చివాడని భ్రమపడెదరు. ఫ్రాన్సిస్ పక్షులకు, చెట్లకు దేవుని జూచినట్లే నమస్కరించెడివాడు. ఆ దివ్యానందంలో కర్ర బుజంమీద పెట్టుకుని ఫిడేలు వాయించినట్లు చేస్తూ పాడెడివాడు. క్రీస్తు చనిపోయిన విధము (సిలువమీద) తలుచుకుని ఏడ్చెడివాడు.

అస్సిసిలో ఒక గుహలో అనేక అహోరాత్రులు ఉండి భగవద్ధ్యానంలో గడి పాడు. అస్సిసీయే అతని స్థిర నివాసమయ్యేను. ప్రజలలో తిరగడం ఇష్టంలేక దేవుని సాంగత్యంలో ఏకాంతంగా ఉండడమే అతనికి యిష్టం. ఒకనాడు అతనికి ఒక దేవత ఎగిరివచ్చినట్లు కనిపించినది. అతని శరీరంమీద గోళ్ళు గుచ్చినట్లు చిహ్నాలు కనిపించాయి. చేతులమీద, కాళ్ళమీదా, శరీరంమీదా కనిపించాయి. ఇంక కొంచం సేపట్లోనే అతడు శరీరం విడిచి క్రీస్తులో లీనమయిపోయాడు ఆ ప్రేమ మూర్తి. అంతటా శాంతి, ఆనందము ఆవరించింది. బీదతనము దైవప్రసాదమని చివరివరకు దానినే స్వీకరించి ఫ్రాన్సిస్ ప్రేమమయుడై జీవించెను.

ఇంతటి మహిమాన్విత నిరాడంబర జీవితము ఫ్రాన్సిస్ గడిపాడు గనుకనే బాబాకు అతనంటే మిక్కిలి ప్రేమ,గౌరవము కలిగినాయి. అందుకనే అస్సిసి యాత్ర చేసి అక్కడ ఆ మహా భక్తుడు ధ్యానంచేసిన గుహలో ఏకాంతవాసం చేశారు బాబా.

ఇంక అవతార పురుషుని అనంతర చరిత్రలోకి వద్దాము —

బాబా ఆజ్ఞ ప్రకారం 1932 సెప్టెంబరు 26వ తేదీన నొరీనా న్యూయార్క్ నుంచి జినోవా వచ్చింది. అక్కడనుంచి క్వెన్‌టిన్‌తో కలిసి ఆమె వెనిస్, ఫ్లోరెన్స్, అడ్రియానో, వెరోనా, మ్యూనిచ్, బాసెల్, జూరిచ్, హాల్, బెర్లిన్, మురానో, బుడాపెస్ట్ నగరాలలో పర్యటించి ఆ నగరాలలో బాబా నామము, ఆయన యొక్క సత్య ప్రేమ సందేశములు కొంతవరకు వ్యాప్తం చేసినది. ఈ పర్యటనలో అనేక మందిని కలిసి వారు ఇరువురు బాబా గురించి తెలియజేశారు. వారందరు బాబా దర్శనం చేసుకోడానికి ఏర్పాటు చేశారు. వారిలో ప్రొఫెసర్ జంగ్ (స్విడ్జర్లాండ్), ఐన్‌స్టీన్ అనే ప్రఖ్యాత జర్మన్ విజ్ఞాన శాస్త్రవేత్త కూడా ఉన్నారు.

ఇలాగే శీతాకాలంలో బాబా తమ శిష్యులను (కొందరు పాశ్చాత్యులను, కొందరు భారతీయులను) జర్మనీ, ఆస్ట్రియా, ఇటలీ, హంగేరీ దేశాలలోను మరి కొందరను చైనాలోను, అమెరికాలోను పర్యటించుటకు ఆ పర్యటనలో బాబా పని చేయుటకు పంపియుండిరి. అలాగే ఇద్దరు మండలిలోని వారిని ఆస్ట్రేలియా, న్యూజిలాండ్ దేశాలలో తిరిగిరమ్మని పంపించారు తమ శిష్యులను ఈ విధంగా పంపించ డానికి కారణం బాబా యొక్క సత్యప్రేమ సందేశాలను ఆ దేశాలలో వ్యాప్తి చేసి తద్వారా ప్రపంచమునందు ఆధ్యాత్మిక శక్తులు ప్రసరించడానికి కొత్త మార్గాలు ఏర్పరచడమే.

## నాలుగవ పాశ్చాత్య దేశ గమనము :

1932 సం॥ నవంబరు మాసంలో 21 వ తేదీన బాబా యూరప్‌కి నాలుగవ మారుగా పాశ్చాత్య దేశ సంచారమునకై కాంట్‌వెర్డ్ అనే ఓడమీద బయల్వెడలారు. బయలుదేరిన కొద్ది రోజులకో ఓడమీద నుంచి బాబా ఇండియాకి ఈ క్రింది సందేశం పంపించారు.

"ఇండియా ఒక ఆధ్యాత్మిక దేశము. యుగ యుగాల నుంచి ఆధ్యాత్మిక గురువులతోను సాధువులతోను అలరారుచున్న భూమియని అటువంటి అద్వితీయమైన స్థానము అదృష్టవశాత్తు కలిగియున్నది. దేశము దాస్య శృంఖలములచే బంధింపబడ యున్నను, భౌతికముగా సుఖము పొందకయున్నను, ఇండియాలోని ఆధ్యాత్మిక వాతావరణము పోషింపబడవలెను.

"ఇండియా ఆధ్యాత్మిక శక్తి ఉంచుకోగలిగినట్లయితే ఇండియా ఎంత బాధ పడినాఫరవాలేదు. ప్రస్తుతపు బాధయొక్క ఫలితము స్వేచ్ఛ, సుఖము అయియున్నది.

"బంధింపబడి యుండుట, ఆ బంధనములో దుఃఖము అనుభవించిన తరువాత స్వేచ్ఛ, సుఖము యొక్క నిజమయిన విలువలు తెలియనగును. కాని ఈ బాధ ఇంకా త్వరగా అంతం కావాలంటే మిత్రుడన్నా శత్రువన్నా ప్రేమ వుండాలి. మంచితనము. ఓర్పు, తాలిమి వుండాలి. మరియు ఇతరుల తప్పుల గురించి గొడవ చేయుటకు బదులు ఇండియా తన లోపాలను సరిదిద్దుకోడానికి ప్రయత్నించాలి. ప్రధానమైన కులాలవారి మధ్య ద్వేషము వినాశకరమయిన వారి పోట్లాటలు అంతమొందాలి; అప్పుడు ఇండియా యొక్క స్వేచ్ఛ, సుఖము సురక్షితంగా వుంటాయి.

"మతాలు, సాంప్రదాయాలు, మత సంబంధ మయిన కర్మకాండలు, ఉపన్యాసాలు, ఉపదేశాలు ఒక ప్రక్క, మరియొక ప్రక్క భౌతిక ఐశ్వర్యము, ప్రాపంచిక సౌఖ్యాల కోసము ప్రాకులాడటం ఇవేవీ మానవునికి నిజమయిన సుఖాన్ని కలిగించ లేవు- కాని నిస్వార్థ ప్రేమ విశ్వమానవ సౌభ్రాతృత్వము మాత్రమే అవి కలిగించ గలవు."

కాంట్‌వెర్డ్ అనే ఓడమీద బాబా వస్తున్నారు. సముద్రంలో ఒక పడవలో ఆయనకు ఎదురువెళ్ళి కలుసుకునేందుకు నోరీనా, క్వెన్‌టిన్ ఇద్దరూ ఒక మోటారు పడవ సిద్ధం చేసుకుని ఉదయాన్నే ఆరుగంటలకి ఇంకా చీకటిగా వుండగానే అందులో

బయలుదేరి వెళ్ళారు. బాబాకు వారిరువురు స్వాగతం యిచ్చి వెనిస్ నగరానికి తీసుకు వచ్చారు. బాబా ఈ ప్రకారంగా 1932 డిసెంబరు 2 వ తేదీన రెండవమారు వెనిస్‌లో దిగారు. అక్కడనుంచి మిలాన్ మీదుగా పారిస్ వెళ్ళి డిసెంబరు 6 వ తేదీన లండన్ చేరుకున్నారు.

బాబా లండన్‌లో ఈ మారు నైట్స్ బ్రిడ్జి హోటలులో బసచేశారు. అక్కడ 14 వ తారీకు దాకా వుండి ఆ హోటలులో చాలామంది కొత్తవారికి ఇంటర్‌వ్యూలు ఇచ్చారు. బాబా చాలా మంది పాత స్నేహితులను కూడా కలుసుకున్నారు.

ఒకనాడు బాబా వారి శిష్యులతో కూర్చుని—

"నా పని ఇతరులను గమ్యస్థానానికి చేరేలా సహాయపడటమే. ప్రపంచంలో జీవించాలిగాని, ప్రపంచపు మనిషిలాగ ఉండరాదు, అన్నిటితోను, అందరితోను సామరస్యంతో జీవించడం చాలా ముఖ్యం".

అమెరికన్ శిష్యురాండ్రు నొర్రినా, ఎలిజబెత్ పాటర్సన్ బాబాతో వున్నారు. ఆంగ్లేయ ప్రేమికులు వారిని చూడడం ఇదే మొదటిసారి. ఇంక వీరు వారితో కలిసి పని చేయవలసి యున్నది.

నొరీనా ఆమె మొదటి మగడు కార్ల్‌వాల్ ముల్లర్ అనే అతడు రచించిన 'ది మిరకల్' అనే నాటకంలో 'మేరియా కార్మి' అనే పేరుతో మెడొనా పాత్రను అతి చాకచక్యంతో అనేకసార్లు నటించి ప్రఖ్యాతి గాంచినది, అతనిని వదలి ఆమె మాచెబెల్లి రాకుమారుడనే అందగాడిని వివాహం చేసుకుంది. అతడు "మాచెబెల్లి సుగంధాలు" అనే గొప్ప వ్యాపార సంస్థకు యజమాని. నొరీనా అత్యుల్లాసము కలిగిన అందగత్తె. ఆమె, ఎలిజబెత్ ఇరువురు బాబా పనిని నిర్వహించారు. క్రిస్టైన్ (క్రిస్టినా) అనే ఆమె బాబా కొరకు నియమించబడిన ఒక పరిచారిక. తరువాత ఆమె బాబా భక్తురాలయి ఇండియాకు కూడా వచ్చినది. బాబా ఆమె గురించి పరిశుద్ధమయిన వ్యక్తి అని చెప్పారు.

ఒక రోజు ఉదయం నైట్స్ బ్రిడ్జి హోటలులో ఉన్న దినాలలో బాబా తలంటు కోవాలని మార్గరెట్‌కి, కిట్టీకి చెప్పారు. మార్గరెట్ సకాలానికి రాలేదు. అందుచేత. ఈ పని తనకి మహాభాగ్యం అని కిట్టీ ఒక్కతే చేసింది. ఎవరినీ బాబా తమ తలను స్పృశించనీయరు. కాకా నవ్వుస్తూ అక్కడే వున్నాడు. అందుచేత బాబాకి ఎక్కడ ఇబ్బంది కలుగుతుందో అన్న భయం లేకుండా కిట్టీ ఆయన తల రుద్ది నీళ్ళు పోసింది.

పరిశుభ్రంగా స్నానం చేసిన తరువాత ఆయన శిరోజాలు తుడిచి దువ్వేసరికి చంద్రుడు చుట్టూ చేరిన మేఘరాశిలా ఎత్తుగా ఒత్తుగా వున్నాయి ఆ పొడి వెంట్రుకలు.

ఒక రోజున సి.బి. పర్డమ్ వచ్చి బాబా దర్శనం చేసుకున్నాడు. అప్పుడే అతడు బాబా యొక్క చరిత్ర వ్రాస్తానని మాట యిచ్చాడు. దాని ఫలితంగానే నాలు గేళ్ళ తరువాత 'ది పెర్‌ఫెక్ట్ మాస్టర్' అనే గ్రంథం ప్రచురణ జరిగింది. ఈ పుస్తకం ప్రపంచంలో అనేక మందిని బాబా పరిధిలోనికి తీసుకువచ్చి ఆయన ప్రేమికులనుగా నొనర్చినది

విల్, మేరీ బాకెట్ దంపతులు అనేక మారులు వచ్చి బాబాను దర్శించారు. వారు కెంట్‌లోని సెవెన్ ఓక్స్ అనేచోట స్వంత గృహమును కలిగియున్నారు.

నైట్స్ బ్రిడ్జి హోటలులో ఉండగానే బాబా ఒకనాడు ఈ క్రింది విధముగా ఒక ప్రసంగం చేశారు___

"ఆత్మ అన్నిటికీ అతీతమైనది. అది అనంతాత్మలో చేరినది. అందుచేత దాని వ్యక్తిత్వంలో కూడా అనంతమయినదే.

"జీవాత్మ స్థూల సూక్ష్మ దేహాల ద్వారా స్థూల సూక్ష్మ ప్రపంచాల అనుభవాలు పొందుతున్నపుడు మాయా పరిమితులను పొందుతుంది. బాహ్యానికి పరిమితి కలిగినట్లు కనిపిస్తుంది.

"ఆత్మకి మనసు ద్వారానే అనుభవాల ముద్రలు కలుగుతాయి. ఆలోచన రూపాలు కోరికల రూపాలు ముద్రలు కలిగి వుంటాయి.

"స్థూల సూక్ష్మ మానసిక శరీరాలని ప్రతి మానవునికి మూడు ఉన్నాయి. ఈమూడు జీవాత్మ యొక్క అనుభవాల కోసం ఏర్పడిన ఉపాధులు.

"మనసును ఒక గిన్నెతో పోల్చవచ్చును. బుద్ధి ఆ గిన్నెలోని పాలతో పోల్చ వచ్చును. బుద్దికి కోరికలతో సంబంధం లేదు. కాని మనసు కోరికలతో ఎక్కువ సంబంధం కలిగి వుంటుంది.

"బుద్ధి ఆలోచనా శక్తిని కలిగి వుంటుంది. ఆ శక్తి మనసు అనుభవిస్తుంది."

ఒక రోజున ఆక్స్‌ఫర్డ్ నుంచి కొందరు వచ్చి బాబాతో సంభాషించారు. ఆ సంభాషణ యిట్లు సాగింది.

ప్రశ్న : ఇంతకంటె మంచి భర్తగాను మంచి తండ్రిగాను ఉందామంటే ఏది నన్ను ఉండనివ్వకుండా చేస్తోంది ?

బాబా జవాబు : క్రీస్తు గడపిన జీవితంలా జీవించాలని నీవు సాధ్యమయినంత వరకు ప్రయత్నించాలి. సిద్ధాంతాలు తెలుసుకుంటే చాలదు. బుద్ధిచేత అర్థం చేసుకుంటే చాలదు. అంతమాత్రం చేత క్రిష్టియన్ మతం అనుసరించాలంటే కాదు. జీవించాలనే భావం వుండాలి. ప్రేమ ! అది జీవితంలో అనుష్ఠించాలి.

ప్రశ్న : అది నేను ఎలా చేయగలను ?

జవాబు : ప్రేమను వికసింపజేయడానికి ఆచరించాలి. నిత్య జీవితంలో అనుభవించాలి. నీ సుఖం గురించి కొంచెమే ఆలోచిస్తూ ఇతరులను సుఖింపజేయాలని ఎచ్చువగా ఆలోచించాలి. ఇది చేయగలవు నీ కోరికలను తగ్గించుకో— కోరికలంటే స్వార్థపూరితములయిన కోరికలు నీవు రోడ్డుమీద నడుస్తూంటే నీకు పేదతనంతో బాధపడుతున్న ఒక నిస్సహాయుడిని చూస్తే నీవు జాలితో అతనికేసి చూస్తావు, వెళ్ళిపోతావు. కాని తరువాత నీ సోదరుడే ఆ స్థితిలో వుండడం చూచావనుకో. నీవు వెంటనే అన్ని సహకారాలు చేస్తావు. సాధారణంగా ఇలాగే జరుగుతూంటుంది. నిజమయిన క్రైస్తవానికి కావలసిన ప్రేమ వికాసం నీ మనసులో లోపించినట్లు నీకే తెలుస్తుంది. అది చాలా సులభం. ఆచరణయోగ్యం. ప్రజలే దాన్ని చిక్కుపరుస్తారు.

ప్రశ్న . కొత్త బైబిల్ (న్యూ టెస్టమెంటు) ప్రకారంగా ఆలోచించి ఎవరయినా మీరు క్రీస్తు చైతన్యము గురించ తప్పుగా భావిస్తున్నారని అనుకునే వారిని మీరు ప్రేమిస్తారా ?

జవాబు : జీసస్‌ని ప్రేమించి క్రీస్తు యొక్క బోధలు నీ జీవితంలో అనుసరించగలిగితే అది చాలు. మీరు నన్ను అనుసరించక్కరలేదు. మీ ప్రేమతో జీసస్‌ను మీరు అనుసరించి నట్లయితే పరోక్షంగా నన్ను అనుసరిస్తున్నట్లే. అది నాకు తెలిసిన విషయం.

ప్రశ్న : మీ ద్వారా మాత్రమే భగవంతుని చేరగలుగుట సాధ్యమని మీరు నమ్ముతారా ? మీరు క్రీస్తు చైతన్యం అంటున్నారే అది మీరు ఎక్కడ నేర్చుకున్నారు ?

జవాబు : మీరు మీలో భగవంతుని కనుగొనాలని ప్రయత్నిస్తే ప్రత్యేకమయిన ప్రకటీకరణ కనుగొనే అవసర మేముంది ? భగవంతుని పొందడం కష్టం గనుక భగవంతుని పొందినవాని సహాయం అవసరం అవుతుంది.

బాబా లండన్ నుంచి డిసెంబరు 14 వ తారీకున వారి మండలితోను కొద్దిమంది పాశ్చాత్యులతోను బయలుదేరి 15 వ తేదీకి జూరిచ్ వెళ్ళారు. ఈ ప్రయాణం రైలులో మూడవ తరగతిలో ఎంతో ఇబ్బందితో చేసినా బాబా ఆ యిబ్బందులేమీ పట్టించుకోక రైలులో ఉన్నంతసేపూ కూడా చాలా సంతోషంగా వున్నారు. జూరిచ్‌లో ఆయనకు స్వాగతం యివ్వడానికి ఒట్టో హాస్ హేయి అనే కళారాధకుడు ఏర్పాట్లు చేశాడు. అతడు జూరిచ్‌లో ఒక పెద్ద కళాశాలను నడుపుతున్నాడు. నొరీనా మాచి బెల్లీకి అతడు స్నేహితుడు. అక్కడ 11 గంటల నుంచి 1 గంట వరకు మరల మధ్యాహ్నం 3 గంటల నుంచి సాయంత్రం 7 గంటల వరకు దర్శనార్థులతో బాబా సంభాషణలు చేశారు. తరువాత ఆ రోజున చెరువు గట్టుమీద 8 గంటలదాకా షికారు చేశారు.

జూరిచ్‌లో ఆ రాత్రి బాబా శిష్యులతో శావోయ్ మెజిస్టిక్ హోటలులో గడిపారు. బాబా ఆ రాత్రి బయటకు వెళ్ళి తిరిగి హోటలుకి నడిచి వస్తూంటే నడుస్తూ నడుస్తూ రోడ్డుమీద హఠాత్తుగా నిలబడి పోయారు ఒక అరనిమిషం తరువాత ఆయన హోటలుకి నడిచి వచ్చారు. వెంటనే బాబా క్వెన్‌టిన్‌టాడ్‌ను పిలిచి "ఇండియాలో నా ప్రతినిధి ఒకడు నేను అర్జంటుగా ఇండియాకు రావడం అవసరం అని సందేశం పంపాడు. నీవు ఉదయూన్నే కుక్సు ఆఫీసుకివెళ్ళి నాకు ఒక కేబిల్ వచ్చి వుంటుంది. అది తీసుకురా" అని చెప్పారు. క్వెన్‌టిన్‌టాడ్ ఆ ప్రకారంగా తెల్లవారక కుక్సు ఆఫీసుకు వెళ్ళగానే బాబాకు కేబిల్ వచ్చియుండుట జూచెను. అందులో – "మీరు అర్జంటుగా రావాలి. వ్యవహారం పూర్తిచేయాలి" అని వుంది.

16 వ తేదీన (మరునాడు) బాబా వారి బృందంతో బయలుదేరి సెయింట్ గోతార్డ్, చియారియా, లుగానో, మిలాన్ పట్టణాలమీదుగా జినోవాకి రాత్రి 9–15 గంటలకు చేరుకున్నారు

మరుసటి రోజున అనగా 17 వ తారీకున నొరీనాను అమెరికా వెళ్ళమని చెప్పి బాబా 'ఎస్పేరియా' అనే ఓడలో ఈజిప్టుకు ప్రయాణమై వెళ్లారు.

బాబా అలెగ్జాండ్రియా చేరేసరికి డిసెంబరు 29 వ తేదీ సాయంత్రం 5 గంట లయింది. మర్నాడు తెల్లవారకుండా 5 గంటలకు కెయిరోకు వెళ్లారు. వెంటనే బయలుదేరి ఆదీ, బ్రెహమ్, విష్ణు రైలులో పోర్ట్‌సెయిడ్‌కి వెళ్ళారు. వారు పి. ఓ. మల్‌దేరా అనే ఓడలో ఇండియాకు ప్రయాణం చేశారు బాబా, కాకా వగైరా కెయిరోలో వుండిపోయారు. సినార్ మోరన్ డి అనే ఇటాలియన్ ఒకడు పెట్టిన

హోటలులో దిగారు. డిసెంబరు 23 వ తేదీన కెయిరోకి కారులో వెళ్ళి ఇంగ్లీష్ వింటర్ హోటలు హెలోనాన్‌లో క్రిస్టమస్ పండుగ జరుపుకున్నారు.

క్రిస్టమస్‌నాడు కారులో సక్కారాకు బయలుదేరి వెళ్ళి రోజంతా అక్కడ గడిపారు. అక్కడ ఒక పిరమిడ్ యొక్క ఛాయలో కూర్చుని భోజనం చేశారు. మర్నాడు (26 వ తేదీని) కెయిరోకి తిరిగివచ్చి అక్కడ 29 వరకు ఉన్నారు. 1933 జనవరి 3 వ తేదీన బయలుదేరి బోలెరాన్ అనే స్టీమరులో పోర్ట్ సెయిడ్ నుంచి కొలంబో వెళ్ళడానికి నిశ్చయించుకున్నారు బాబా. డిసెంబరు 30 వ తారీకున బాబా టుటన్‌ఖమెన్ మ్యూజియానికి వెళ్ళి చూచారు. 31 వ తేదీన మరల కాప్టిన్ చర్చిని పాత కైరోకి వెళ్ళి చూచారు. బాబా 1933 జనవరి 1 వ తేదీన ఇంకొకమారు వెళ్ళి పిరమిడ్లను, స్ఫింక్స్‌ను చూచారు.

## సింహళ ప్రయాణము :

2 వ తేదీ బాబా పోర్ట్ సెయిడ్‌వెళ్ళి అక్కడ నుంచి అనుకున్న ప్రకారం 3వ తేదీ సాయంకాలం 4 గంటలకి 'బోలెరాన్' అనే ఓడలో సిలోన్‌కి పయనమైనారు.

ఆ ఓడ ప్రయాణంలో రెండవ రోజున క్వెన్‌టిన్‌ను పిలిచి– "ఈ ఓడలో ఒక డచ్ అమ్మాయి కుటుంబంతో వెడుతోంది చూశావా? ఆమె విషయంలో ఏమయినా కనిపెట్టావా?" అని బాబా అడిగారు. మొదటలో క్వెన్టిన్ ఏమీ కనుగొనలేదు. గాని, తరువాత మళ్ళీ చూసినపుడు ఆ పిల్ల కొంచెం కుంటుతున్నట్టు అతడు చూచాడు. బాబాకి ఆ సంగతి చెప్పగా ఆయన అన్నారు— "అనేక సంవత్సరాల క్రిందట ఆమె ఇండియాలో ఒక యోగిగా వుండేది. ఆ యోగి ఉపవాసాలు, ధ్యానాలు చేస్తూ ఉత్తమ చైతన్యంలోకి రావాలని ప్రయత్నించాడు. అప్పుడు అకస్మాత్‌గా అతనికి పక్షవాతం వచ్చి మరణించాడు. అప్పటినుంచి ప్రతి జన్మలోను ఆమె కుంటిగానే జన్మిస్తోంది. పురుష జన్మలోకూడా కుంటివాడుగానే వున్నాడు. ఆమెకు అది నయం చేయాలంటే ఆమె ప్రేమను, ఆప్యాయతను సంపాదించాలి. అది జరిగిన తరువాత ఆమె తరువాత జన్మలలో కుంటితనం పోయి బాగా వుండి ఇతరులకు కూడా అటువంటిది కుదర్చగలదు" అని చెప్పారు.

అది మొదలు బాబా ఆమెతో స్నేహం చేశారు. ఆమెను ఆకర్షించారు. క్రమంగా ఆమె ఆయనతో ఎక్కువసేపు గడపజొచ్చింది. ప్రతిరోజూ బాబాతో ఆమె పింగ్‌పాంగ్, డ్రాట్స్ మొదలయిన ఆటలాడుతూండేది. ఆ ప్రయాణం ఆఖరయే

సరికి ఆమె వైఖరే మారిపోయింది. ఆమె ఆరోగ్యం చాలా బాగుపడింది. కుంటడం కూడ కొంచెం తగ్గింది. అది ఆమెకు బాధ అనిపించడం లేదు. కొలంబోలో దిగే రోజుకి బాబా ఆయన పని ముగించే వుండాలి. అంటే మళ్ళీ జన్మలో ఆమెకు కుంటి వుండక పోవడమేగాక ఉత్తమ ఆధ్యాత్మికస్థానం కూడా లభిస్తుంది. బాబా చెప్పారు. ఆమె యోగిగావుండి చనిపోయిన తరువాత అనేక చిన్న చిన్న జీవితాలు సంపూర్ణ ఆయుర్దాయంతో అయిదు జన్మలు గడిపింది. బాబా ఆమెను ఊరికే చూస్తూనే ఆమె భవిష్యత్తును దిద్దారు.

1933 జనవరి 12వ తేదీన బాబా పరివారంతో కొలంబోలో దిగారు. 15వ తేదీన 3000 అడుగుల యెత్తున వున్న బండారవేలా అనే ఒక కొండ ప్రదేశానికి వెళ్ళారు. అక్కడ వెలన్‌సియా అనే బంగళాలో విశ్రాంతి తీసుకున్నారు. గ్రామానికి అది రెండు మైళ్ళ దూరంలో వుంది. దానికి ఒక అందమయిన తోట వుంది. బాబా 24 గంటలు ఏకాంతంగా వుందామని అనుకుంటున్నా నన్నారు. 24గంటలు ఏకాంతమే గాకుండా ఉపవాసం కూడా వుంటా నన్నారు. అస్సిసీలో చేసినట్లుగానే, దానికి తగిన స్థలమును వెదకాలి. సిలోన్‌లో మొత్తం 18 రోజులు ఉన్నారు బాబా.

వారం రోజులు గడిచాక 19 వ తారీకున బాబా పరిజనంతో కొండలలోకి నడిచి వెళ్ళేసరికి అక్కడ ఒక పాతకాలంనాటిది బౌద్ధాలయం కనపడింది. ఒక బౌద్ధ భిక్కు దాని సంరక్షణ చేస్తున్నాడు. అతడు క్రొత్తగా సన్యాసి అయాడు. అతడు ఆ గుడికి ఎవరినీ రావద్దంటాడు. కొన్ని మెట్లు దిగి ఆ గుడి ప్రాకారం లోపలికి వెళ్ళారు బాబా అనుచరులతో. అక్కడ ఒక తలుపు తెరుచుకుని ఒక నూరేళ్ళ వృద్ధుడు వచ్చాడు అతడు శరీరము, ముఖము, బాగా ముడుతలు పడిపోయిన ముసలివాడు. కాని అతని నేత్రాలు చూస్తే అవి ఎంతో జీవంతో ప్రకాశిస్తున్నాయి. అతడు బాబాను వెంటనే గుర్తుపట్టినట్లు ఆయనతో అతడు సైగలు చేస్తూ మాటలాడాడు. బాబాకి కావలసినది అతనికి అర్థమయింది. కాకా మాటలతోను బాబా సైగలతోను వివరించి అతనికి చెప్పారు. గుడిప్రక్కన ఒక గది వున్నది. అది ఎప్పుడయినా వచ్చిన యాత్రీకులు వుండే గది. 24 గంటలు ముందుగా తెలిపి ఆ గది ఉపయోగించుకోవచ్చునని తేలింది.

ఆ ప్రకారంగా బాబా ఆ గదిలో 24 గంటలసేపు ఏకాంతంగా వున్నారు. తరువాత బాబా కొలంబోకి తిరిగి వెళ్ళిపోయారు. ఆయన పని నిర్వర్తించేందుకు అక్కడే ఏకాంతంలో వున్నారు. ఆ ముసలివానికి 100 సంవత్సరములు నిండినవని బాబా చెప్పారు. అతడు నాలుగవ భూమికలో వున్నాడని కూడా చెప్పారు. సిలోన్

నుంచి బాబా బయలుదేరి వెళ్ళేరోజున ఆవృద్ధుని అయిదవ భూమికలోకి తీసుకువెడతా నని బాబా అన్నారు. ఆ ముసలివాడు మధ్య సిలోనుకి ఆధ్యాత్మిక ప్రతినిధిగా వున్నాడని బాబా చెప్పారు. ఆధ్యాత్మిక ప్రతినిధి ఎవరయినా బాబాను గుర్తించినట్లు బాహ్యానికి కనబడడు అని బాబా విశదీకరించి చెప్పారు.

బాబా జనవరి 26 వ తేదీని కొలంబో వదలి వెళ్ళారు. 29 వ తేదీన బాబా పరివారం అందరూ ఆయన ఆజ్ఞ ప్రకారం ఉపవాసం ఉన్నారు. 30 వ తేదీన బాబా ఇండియాకు బయలుదేరారు ఫిబ్రవరి 1 వ తేదీన క్వెన్‌టిన్ టాడ్‌ను ఇంగ్లండుకి వెళ్ళమన్నారు. క్వెన్‌టిన్ ఫిబ్రవరి 1వ తేదీన "మార్నిక్స్ వాన్ సెంట్ అల్డ్‌గోండ్" అనే స్టీమరు మీద కొలంబోనుంచి ఇంగ్లండుకి పయనమై వెళ్ళిపోయాడు. అతడు ఫిబ్రవరి 14 వ తేదీన జినోవా వెళ్ళి 16 వ తేదీ నాటికి లండన్ చేరుకున్నాడు. బాబా ఫిబ్రవరి మొదటి వారంలో బొంబాయిలోదిగి అక్కడనుంచి తిన్నగా నాసిక్ వెళ్ళారు. బాబా కొద్ది రోజులు నాసిక్‌లో వుండి బొంబాయివచ్చి 6 వ తేదీ నాటికి తిరిగి నాసిక్ చేరారు.

ఫిబ్రవరి మాసంలోనే బాబా నాసిక్‌లో వుండగానే ఒక విద్యార్థి బాబా దర్శ నార్థం వచ్చి బాబాతో ఈ దిగువ విధంగా సంభాషణ చేశాడు. —

విద్యార్థి : మీ ఉన్నత ఉద్యమానికి ఉదాత్తమైన మీ పనిలో మీ అభిప్రాయాలు వ్యక్తం చేయడానికి మీ మౌనం వల్ల మీకు కష్టంగా లేదా?

బాబా : లేదు. బాహ్యాంతరములు రెండూ నా స్వాధీనంలోనే వున్నాయి.

విద్యార్థి : జొరాస్ట్రియనులు అభివృద్ధికోసం మీ దృష్టిని కేంద్రీకరించారా ?

బాబా : నేను విశ్వమానవ అభివృద్ధికోసం పాటుపడుతున్నాను. అందులో జొరాస్ట్రియనుల అభివృద్ధి కూడా వుండనే వుంది.

విద్యార్థి : పత్రికా విలేఖరులతో ఇండియాలోను విదేశాలలోనూ మీకు విసువుగా లేదూ ?

బాబా : నాకు ఎప్పుడూ ఎవరితోను విసువూ, కోపమూ రావు.

విద్యార్థి : మీకు మత సంబంధమయినది గాక, రాజకీయ లక్ష్యం ఏదయినా వుందా ?

బాబా : ఆధ్యాత్మికతత్వంలో మతాలు, రాజకీయాలు, సాంఘిక వ్యవహారాలు కలిసి వున్నాయి.

విద్యార్థి : మీ అభిప్రాయం ప్రకారం ప్రస్తుత ఆర్థిక దుఃస్థితికి కారణం ఏమిటి ? ఇది ముందు ఎలా పరిణమిస్తుంది ?

బాబా : దీనికి స్వార్థపరత్వమే కారణం - ముందు ఇది పోతుంది.

విద్యార్థి : మీ పనియొక్క విధాన మేమిటి ?

బాబా : ప్రేమ, సేవ.

విద్యార్థి : ప్రస్తుత నాగరికత మానవులకు అవమానకరంగా వుందా ?

బాబా : లేదు. అవమానం కలిగించేది నాగరికత కానేరదు.

విద్యార్థి : ఇండియాలోను, పాశ్చాత్య దేశాలలోను జరిగే రాజకీయాభివృద్ధులు మీరు తెలుసు కుంటున్నారా ?

బాబా : అన్ని దేశములలోని అన్ని విభాగాలూ తెలుసుకుంటున్నాను.

విద్యార్థి : ఇంత అభివృద్ధికి ఐశ్వర్యానికి కారణ భూతమయిన పారిశ్రామిక విద్యను ఇంగ్లండు, అమెరికాలు ప్రపంచానికి ఇవ్వగలిగి వున్నాయట నిజమేనా?

బాబా : (పడమటిదేశాలు తూర్పు దేశాలకి భౌతిక విషయాలు చెప్పగలవు. తూర్పు దేశాలు పడమటి దేశాలకు ఆధ్యాత్మిక విషయాలు బోధించగలవు.)

[ దానితో ఈ సంభాషణ అంతమయినది. ]

నాసిక్ నుంచి భోర్ రాజ్యమునందలి రాజకుమారుని ప్రత్యేకాహ్వానము మీద బాబా భోర్ వెళ్ళారు. భోర్ రాజు బాబాకు మహారాజ లాంఛనములు సమర్పించి బ్రహ్మాండమయిన స్వాగతము నిచ్చెను. అక్కడనుంచి బాబా కొల్హాపూర్‌కి అక్కడ బాబా భక్తులు ఆహ్వానింపగా వెళ్ళి మరల నాసిక్‌కు తిరిగి వెళ్ళారు.

బాబా బొంబాయి వచ్చినపుడు మెహెర్ గెజెట్ సంపాదకుడు బాబాను దర్శించగా మెహెర్ గెజెట్ ద్వైమాస పత్రికచేసి ప్రచురించవలెనని బాబా ఆజ్ఞాపించారు. అప్పటి నుండియు దానికి సంవత్సరమున కొక్క రూపాయి చందాగా నిర్ణయింపబడెను.

ఆ రోజులలోనే కొందరు పాశ్చాత్య ప్రేమికులు బాబా ఆహ్వానంపైన 1933 వ సంవత్సరంలో బాబా వద్దకు ఇండియాకు వచ్చి ఉండాలని బాబా నిశ్చయించారు. దీనితో బాబా ప్రేమికులలో నూతనోత్సాహం కలిగింది. బాబా కొందరిని శాశ్వతంగానే తమ వద్దకు వచ్చి ఉండమని చెప్పారు. వారి వారి కుటుంబాలవారు వద్దన్నా మార్గరెట్ క్రాస్కి, మేబిల్, రైయన్‌లు నాట్య కళాశాలను అమ్మివేశారు. మింటా, డెలియా కూడా ప్రయాణమైనారు. ఇంకా ఆద్రే, క్రిష్టినా, క్వెన్‌టిన్‌టాడ్ - ఇతడొక్కడే ఆ బృందంలో పురుషుడు; మిగిలినవారంతా స్త్రీలే- వివియన్ గిసెన్, వీరంతా మొత్తం 11 మంది జినోవా నుంచి 1933 మార్చి 28 వ తేదేని బాబా ఆజ్ఞ ప్రకారం 'విక్టోరియా' అనే ఓడమీద బొంబాయికి పయనమైనారు.

ఈ వచ్చే శిష్యులతో బాబా ప్రత్యేకంగా చెప్పారు. వారు ఇండియాకు ప్రయాణం చేసినపుడు ఓడ పోర్ట్‌సెయిడ్‌లో ఆగుతుంది. అప్పుడు ఎవరూ ఎండలో వుండకూడదని, ఎట్టి సముద్రంలో ప్రయాణం చేస్తున్నంతకాలము ఎండ పనికిరాదని చెప్పారు. పోర్ట్ సెయిడ్‌లో ఆగినపుడు వారు ఒక నాట్యానికి వెళ్ళారు. లెమనేడ్‌లో మంచుగడ్డ వేయకుండా కావలసినంత తీసుకోమని బాబా చెప్పారు. లండన్‌లో వున్నంతవరకు ఆంగ్లేయ బృందాన్ని చేపల ఆహారం తీసుకోవచ్చునని బాబా అనుమతించారు.

ఓడలో మార్గరెట్, క్రాస్కీ మొదలయినవారునాట్యం చేసేవారు, వారిరెండవ తరగతి గదులలో.

వారితో వున్న బరువయిన సామానులు తిన్నగా కొలంబో పంపించెయ్యాలి. అవి వారు జపాను వెళ్ళేటప్పుడు తీసుకుంటారు. ఆరు నెలలకి సరిపోయేలా సామానులు తెచ్చుకున్నారు. బొచ్చుతో వున్న దుస్తులు, ఉన్ని బట్టలు వున్న పెట్టె ఒకటి తిన్నగా అమెరికా పంపించేశారు, నోరీనా. ఎలిజబెత్‌లు.

పాశ్చాత్య బృందం అందరు ఏప్రిల్ 28 వ తేదీన బొంబాయిలో దిగారు. అప్పటికి బాబా బొంబాయికి వచ్చి అక్కడ నుంచి 25 మైళ్ళ దూరంలో వున్న కందవెలిలో బసచేసి ఉంటున్నారు. వారితోకూడా వారి మండలి 12 గురు శిష్యురాండ్రున్నారు. పురుషమండలి వేరే ఇంకొక బసలో ఉన్నారు.

మధ్యాహ్నం 2 గంటలకు పాశ్చాత్యులను బాబా వద్దకు తీసికొని వచ్చుటకు వారు దిగిన హోటలుకు పెద్దకారు పంపబడినది. వారి హడావిడి అప్పుడు చెప్పనలవి కాదు. బాబా వద్దకు వెళ్ళడానికి వేసంగిలో వేసుకునే మంచి దుస్తులు ధరించారు

వారు వెళ్ళేదారికి బొంబాయి హార్బరు మీదుగా వెళ్ళాలి. మేడమీద ఒక సావిటోకి వెళ్ళి అక్కడనుంచి కుడివైపున ఉన్నగదిలోకి వెళ్ళగా అక్కడ ఆడవారు కనిపించారు. వారిలో బాబా సోదరిమణి, మెహెరా, ఆమెతల్లి డాలీ, ఆయనఆధ్యాత్మిక జనని గుల్మాయి, ఇతరశిష్యుల భార్యలు, సోదరీలు, తల్లులు ఉన్నారు. అనేకమయిన చీరలు నేలమీద పక్కలమీద పడివున్నాయి ఆ గదిలో. డాలీకి సుస్తీగా ఉండుటచే ఆమె పరుండి యున్నది. బాబా ఆ గదిలో లేరు. బాబా కోసం వారు ఎడమవైపున వున్న గదిలోకి వెళ్ళగా అక్కడ వీరి కోసమే బాబా వేచియున్నారు. కిట్టీ, డేలీ ముందుగదిలోకి అడుగు పెడుతూనే ఆమెకు కాలు జారింది. ఆమె పడిపోకుండా

గభాలున బాబా వచ్చి పట్టుకున్నారు. స్త్రీలంతా సంతోషంగా వున్నారు. ముందు వారి గౌనులు వగైరా తీసేసి అందరూ మంచి మంచి చీరలు ధరించారు. తరువాత మళ్ళీ వారి దుస్తులలోకి మారారు. క్రింద అప్పుడే బాబాకోసం అనేక స్థలాలనుంచి చాలా మంది స్త్రీలు, పురుషులు, బాలబాలికలు పుష్పమాలలతో వచ్చికూర్చున్నారు. వచ్చిన పదకొండుగురు పాశ్చాత్యులు ఫలహారాలు తీసుకున్నారు.

అనుకున్న సమయానికి బాబా మేడదిగి క్రిందికి వచ్చారు. బాబాతో పాశ్చాత్యులంతా కూడా దిగారు. మెహెరా, జబ్బుగావున్న ఆమె తల్లి డాలీ మాత్రం పైనఉండి పోయారు. తెల్లటి పైజమా, తెల్లటి సద్రా ధరించారు బాబా. వారు ఒక సోఫాలో కూర్చున్నారు. బాబా శిష్యులంతా పాశ్చాత్యులుకొందరు కుర్చీలలోను మిగిలినవారు నేలమీద కూర్చున్నారు. బాబా దర్శనార్థం వచ్చిన వారు ఒక్కొక్కరే వచ్చి బాబా హస్తమును ముద్దుపెట్టుకుని వారి చరణములకడ పుష్పముల నుంచిరి. కొందరు ఊపిరి బిగపట్టుకుని చూస్తున్నారు కొందరికి శరీరము నందు గగుర్పాటు కలిగినది. ఆ దృశ్యము పాశ్చాత్యుల మనసులలో నాటుకు పోయినది.

కొందరికి బాబా వారికి అవసరమయిన సలహాలు యిచ్చారు. మరి కొందరికి వారి ఆశీర్వాదం మాత్రంయిచ్చారు. కొంతమంది సహాయం కోసం వచ్చారు కేవలం ప్రేమకోసం వచ్చినవారు తక్కువ. సహాయం కోసం వచ్చినవారు ఒక వందమంది ఉంటారు. వారు వెళ్ళిపోగానే బాబా మేడమీదకి వెళ్ళిపోయారు.

## పాశ్చాత్య బృంధంతో కాశ్మీర్ పర్యటన :

రాత్రి 8 గంటలకి పాశ్చాత్యులను తిరిగి బొంబాయికి తీసుకు వెళ్ళారు మండలివారు. ఆ మర్నాడు మధ్యాహ్నం మరల బాబా వారితో కొంత సేపు గడిపారు. చైనాదేశం వెళ్ళడానికి ఆ ఉదయమే వచ్చిన అనుమతి పత్రాలు వారుతెచ్చి బాబాకు చూపించారు. బాబా మరల వెళ్ళిపోతున్నారని విని భారతీయ స్త్రీలు విచారగ్రస్తులైనారు. వారిని నోర్రినా అనునయించింది. బాబా ఆదివారం ఉదయమే భండర్దారా వెళ్ళారు. పాశ్చాత్యులందరూ మర్నాటి ఉదయం 6గంటలకు బయలుదేరి ఇగత్పురి వెళ్ళి అక్కడినుంచి భండర్దారా చేరుకున్నారు. భండర్దారా ఒక చక్కటి కొండ ప్రదేశము. ఆ కొండలలో ఒక కొండమీద నుంచి మరియొక కొండమీదకి లోయ మీద కట్టిన ప్రపంచంలో పెద్ద వంతెనలలో ఒకటి వారు చూచారు. దానిమీద నుంచే వెళ్ళారు. వారి దారిలో ఆర్థర్‌లేక్ అనే అందమయిన సరస్సు కుడివైపున కని

పించింది. తరువాత ఒక సుందరమయిన ఉద్యానవనంలోకి వెళ్ళారు. అందులో ఒక బంగళావుంది. అదే వారికి ఏర్పాటయిన వసతి. వెనుక వైపున కొండలున్నాయి. ఆ దృశ్యం వారికి ఒక స్వప్న జగత్తులో ఉన్నట్లు అనిపించింది. ఇక్కడ ఈ మనో హరమయిన పరిసరాలలో ఈ అందమైన బంగళాలో బాబా వారి బృందంతో రెండు మూడు రోజులున్నారు. వారు అక్కడ నుంచి ఆగ్రాకు ఒక రాత్రి రయిలులో ప్రయాణం చేసి చేరుకున్నారు ఆగ్రా నగరంలో వెన్నెలలో కన్నుల పండువుగా తాజమహల్‌ను తిలకించారు. తరువాత షాజహాన్ నిర్మించిన కోట లోపలకు పోయి చూచారు. ఈపాశ్చాత్య బృందములో అందరుకూడా ప్రథమంగానే భారతదేశమును దర్శించుచున్నారు. వారికి ఎన్నాళ్ళ నుండియో కన్న కలలు నేటికి నిజమైనవి. ఈ దేశమునందు అపరిమితమయిన ఆకర్షణ కలిగినది. బాబాను కలుసుకునే ముందు వారిలో కొందరు అమెరికా, యూరప్, వెస్టిండీస్, జపాన్ మున్నగు దేశములో పర్యటించి వచ్చియున్నారు. దేశాటన కన్న వారిప్పుడు కావలసినది బాబాతో సహవాసమే.

బాబాతో కూడా వెళ్ళి కాశ్మీరు దేశమును అక్కడ నుంచి మిగిలిన భారత దేశమంతయు జూచుటకు తరువాత బాబాతో కలిసి కొలంబో మీదుగా చైనా దేశము నకు వెళ్ళవలెనని వారి అభిప్రాయము. బాబాతో కూడా వుండడమే వారి ఆశయము. వారు స్వదేశములనుండి బయలుదేరుటకు ముందు ఎన్నో అడ్డంకులను ఎదుర్కొన వలసి వచ్చెను. వారిట్లు అన్నిటినీ అంద్రనీవదలి బాబా వద్దకు వచ్చుట వారిబంధువు లనేకుల కిష్టములేదు. వారిలో నున్న ఆత్మవాణి తమను భారతదేశమునకు వెళ్ళమన్ని చెప్పుచుండెను. కావున అందరినీ వారెటో సమాధాన పరచి వచ్చారు. కొన్ని పత్రిక లలో కూడా బాబా వద్దకు వారు ప్రయాణ మగుట విమర్శించబడినది. ఆధ్యాత్మిక జీవన మున్న అభిప్రాయమే లేని వారి రచనల కేమి విలువ యుండును? బాబాతో వారున్నారు. ఆయన దివ్య శక్తులను వారు అనుభవ పూర్వకముగా తెలిసికొన్నారు. వారు తప్పవారిని ఎట్లువెళ్ళగలరు? బాధ్యతాయుతములగు పెద్ద పదవులనలంకరించిన వారు సయితము బాబా వద్దకు వచ్చి వారికి శిష్యులగుచున్నారు.

బాబా పాశ్చాత్య దేశాలకు వెళ్ళిన ఫలితముగా ఈ భక్తులు అమెరికాలోను ఇంగ్లండులోను వారి భౌతిక భోగ భాగ్యములతోకూడిన విలాస జీవితమును విడనాడి ఆధ్యాత్మిక జీవితము గడపవలెనని ఎంతటి నియమబద్ధ మయిన శిక్షణాయుతమయిన జీవితమున కయినను ఒడబడి బాబాతో నుండుట కేతెంచారు. బుజముల మీదకు పడు

నల్లని శిరోజములతోను, నిశితములు తేజస్వంతములు అయిన నేత్రయుగ్మముతోను విలసిల్లు ఆయన సుందర వదనారవిందమును కనులార జూచుటకు మరల మరల దృష్టిని సారించుచు తనివి చెందవలెనని వారు వాడా కడకు వచ్చారు. బాబా ముఖ మండల మందలి అనిర్వచనీయమైన ఆధ్యాత్మిక ప్రకాశమును జూచి యనుభవించ వలెనని వారి యభిలాష. తలిదండ్రుల యాపేక్షకు దూరమై పుట్టి పెరిగిన యిళ్ళ నుంచి బయలుదేరి వచ్చి బాబానే వారి తండ్రిగా, గురువుగా, దైవముగా ఎంచివచ్చిన వారి భక్తి, ప్రేమ ఎంతయు ప్రశంసనీయము.

పైన తెలిపినట్లు బాబా వారి మండలితోను పాశ్చాత్య శిష్యులతోను ఆగ్రా నగ రము మీదుగా భూలోక స్వర్గ మయిన కాశ్మీరమునకు తీసుకుని వెళ్ళారు. ఆగ్రా నుంచి ముందు బాబా ముర్రీకి అందరిని తీసుకుని వెళ్ళారు. ముర్రీలో పాశ్చాత్యుల కంత ఆకర్షణీయమైన దేదీ లేదు. అది మరీ ఆంగ్లేయ పట్టణమువలె నుండెను. తరువాత రావల్పిండి మీదుగా ప్రయాణం సాగింది.

రైళ్ళ నుండి దిగడం, కార్లలో ప్రయాణాలు చేయడం, కార్లుదిగి ఒక చోట స్థిరపడ కుండానే మరల ప్రయాణం చేయడం, ఇంకొక స్థలానికి చేరడం – బాబాతో చేసే ప్రయాణాలు ఇలాగే వుంటాయని పాశ్చాత్యులకి కూడా అనుభవం కలిగింది. బాబా యొక్క భారతీయ శిష్యులతో ప్రయాణాలు చేస్తూకలసి మెలసి వుండడంవలన బాబా యొక్క జీవితము నందలి అనేక విశేష సంఘటనల గురించి పాశ్చాత్యులు తెలుసుకున్నారు. బాబా మండలికి పాశ్చాత్య శిష్యుల కంటె కఠిన తరమయిన శిక్షణ నిచ్చినట్లు పాశ్చాత్యు లందరికి విదితమయినది. మండలిలో ప్రతియొక్కరు బాబా కోసం ప్రాణముల సైతం నర్పించ గలరు. పాశ్చాత్యులకుకూడా సత్య మార్గయుత మగు జీవితమునకు పరమావధి బాబాలో గోచరమయినది.

శ్రీనగర్‌కి చేసిన మోటారు ప్రయాణమంతటి సౌందర్యవంతముగా ప్రపంచ ములో మరెక్కడా ఉండదనిపిస్తుంది. స్విట్జర్లాండు కంటె ఎక్కువ గంభీరముగా నుండెను. ఇక్కడి హిమాలయ పర్వతములలో ఏదోనిగూఢమయిన శక్తి యున్నది. ఈ సంగతి ప్రయాణీకులు తలుచుకున్నప్పుడు ఒడలు గగుర్పాటు చెందును.

శ్రీనగర్‌లో జీలమ్‌నదిలో మూడు గృహ– నావలలో బాబాతో వెళ్ళిన బృందము వారందరు బసచేశారు. అక్కడ నుండియే జహంగీర్ చక్రవర్తి యొక్క సుందరోద్యాన వనములను తిలకించుటకు ఇంకా అనేకమయిన చూడదగిన ఇతర స్థలములను జూచుటకు వెళ్ళారు. బాబావారి పాశ్చాత్య బృందముతో మాటలాడుచూ

వారందరు ఇండియాకు రావడానికి ఆధ్యాత్మిక కారణములున్నవని చెప్పారు. కాశ్మీరు లోని ప్రశాంత వాతావరణములో బాబావద్ద వారు ఆధ్యాత్మిక సంతృప్తిని అనుభవించారు. 1929 వ సంవత్సరములో బాబా అక్కడ హార్వాన్ అను స్థలమందు ఒక కొండమీద ఒక సంవత్సరం ఏకాంతవాసం చేశారు. బాబా వారిని ఆ కొండమీదకు తీసుకువెళ్ళి ఆ చోటు చూపించారు. ఆ సుందరమగు పరిసరములు చూచేసరికి పాశ్చాత్యులకు ఆ హార్వాన్ కొండమీద ఉండిపోతే బాగుండునని తోచినది. బాబా ఎక్కడుంటే అక్కడే వారుండాలని సంతోషంగా బాబాతో వారు కొండదిగి వచ్చారు.

కాశ్మీర్‌లో ఒక రోజున బాబా మండలితో నుండగా "బాహ్య పరిణామము అంతః పరిణామము" అను విషయం మీద ప్రవచనం చేశారు. చివరికి బాబా "యాతా వాతా చెప్పేదేమి యనగా నీవు మరల అనంతమయిన ప్రేమ, సుఖము, శక్తి అను ఈ మహాసాగరంలో ప్రవేశించగానే అందులో లీనమైపోతావు. ఇంక దానితో పరిణామము అంతమవుతుంది". అని చెప్పి ప్రవచనం ముగించారు.

## పాశ్చాత్యుల తిరుగు ప్రయాణం :

తరువాత వారికి ఒక పరీక్షలాటి సమస్య ఎదురయినది. హఠాత్తుగా బాబా వారిని ఇండియా వదలి ఎవరి యిండ్లకు వారు వెళ్ళవలెనని పాశ్చాత్య శిష్య బృందాన్ని బాబా ఆజ్ఞాపించారు. వారికోసం డబ్బు సిద్ధంగా వుంచానన్నారు బాబా. మిగతావారు బాబాతోనే వుంటారు. ఈ వార్త ఒకరికి ఆగ్రాలోను, ఒకరికి రావల్పిండిలోను, మరి యొకరికి ముర్రీలోను, మిగిలినవారికి కాశ్మీరులోను వెల్లడించి బాబావారిని బాబా ఆజ్ఞలను పాటించెదరుకదా యని అడిగారు. ఇటీవలే ఇంత ప్రయత్నం చేసి బాబా కోసం ఇళ్ళు వాకిళ్ళు వదిలివస్తే మళ్ళీ వారు బాబాను వదలి వారి దేశం వెళ్ళిపోవడమా? తలిదండ్రుల మాట త్రోసివేసి, స్నేహితుల మాట పెడచెవిని బెట్టి, అందరినీ కాదని ఇంత దూరం వచ్చారు బాబా సహవాసంకోసం. ఆయనే ఇప్పుడు మరలిపొమ్మంటున్నారు. తిరిగి వారి దేశానికి వెడితే వారిని అందరూ అపహాస్యం చేస్తారు. వారు నగుబాటుకు లోనవుతారు. వేళాకోళం చేస్తారు వారిని. అయినాకూడా పరమగురువగు బాబా ఆజ్ఞ పరిపాలించుటే అన్నిటికంటె ఎక్కువైనది. అందుచేత కిమ్మనకుండా అందరూ తిరుగు ప్రయాణానికి సిద్ధము చేసుకున్నారు. బాబా ఏది చెప్పినా వారి మంచికే చెప్తారని అపారమయిన నమ్మకం వారిలో వుంది. అధికోష్ణమయిన శ్రీనగర్ వదలి బాబాతో సమశీతలముగా నున్న బొంబాయికి వచ్చారు. బాబాను వీడి

వెళ్ళేటప్పుడు కళ్ళను నీరు పెట్టనివారు లేరు. ఆ దృశ్యము చూచినవారికి కూడా హృదయం ద్రవించింది

1933, ఏప్రిల్ 27 వ తేదీని అందరూ, పాశ్చాత్య దేశాల నుంచి వచ్చిన పదకొండుగురు, బ్రిటానియా అనే ఓడమీద బయలుదేరారు. రెండవ తరగతిలో వారంతా ప్రయాణం చేశారు. బాబా త్వరలోనే పాశ్చాత్య దేశ యాత్ర చేస్తాననాన్నరు. అందువలన బాబా పునర్దర్శన భాగ్యము కలుగుననే ఆశతో స్వస్థ చిత్తులై ప్రయాణము సాగించారు.

ఇంత అకస్మాత్తుగా బాబాతో కొంత కాలంపాటు ఉందామని వచ్చినవారిని తిరిగి పంపించివేయుటకు కారణము బాబాకేగాని ఎవరికీ తెలియదు. దీనివల్ల బాబా వారి శిష్యులకు ఒక తీవ్రమయిన పరీక్ష ఏర్పాటు చేశారు. దీనివలన వారి ప్రేమ, భక్తి విధేయత వ్యక్తమయినవి.

వారి ప్రయాణం సంతోషకరంగాను సంఘటనా రహితంగాను జరిగింది. ఓడలో నుండి పోర్టుసెయిడ్ వద్ద, ఏడెన్ వద్ద వారు దిగారు. మరల ఎర్ర సముద్ర ప్రయాణంలో ఎండలో కూర్చోవద్దని పానీయములందు మంచుగడ్డ వేసుకోవద్దని బాబా చెప్పిన మాటలు జ్ఞాపకం వుంచుకుని ఆ ప్రకారం చేశారు. ఇలాటి దైనందిన జీవితంలో చిన్న విషయాలలో కూడా బాబా వారికి మార్గదర్శియై యున్నారు.

ఆఖరి నిమిషం దాకా వారి ప్రయాణపు ఏర్పాట్లు బాబా బయట ఎవరికీ తెలియ జేయ నీయలేదు. అందువలననే కాబోలు పత్రికలవారితో కొంత గొడవ జరిగింది. బొంబాయి వదిలే ముందు ఈ బృందంలోని ప్రతి యొక్కరినీ వర్ణిస్తూ డైలీమిర్రర్ అనే పత్రికలో వ్యాసం ప్రచురితమయినది. అందులో వారి చిరునామాల సహితంగా వ్రాశారు. లండన్‌లో ఈ పత్రికచూసి ఈ పాశ్చాత్య బృందంవారి కుటుంబ స్నేహితులు బంధువులు మున్నగువారు వారికి కేబిల్స్ యిచ్చారు – వాటిలో ఎందుచేత తిరిగి ప్రయాణాలు చేస్తున్నారు ? వారు ఇండియా నుంచి అక్కడ ఉండవద్దని పంపించేస్తున్నారా ? అక్కడ గురువుగారి బండారం ఏమయినా బట్టబయలయిందా ? లేక తీసుకు వెళ్ళిన డబ్బు అయిపోయిందా? అని యీ విధంగా పలు ప్రశ్నలు వేసి వాటికి కేబిల్ జవాబు లివ్వడానికి కూడా డబ్బు కట్టారు.

పాశ్చాత్య శిష్యులందరూ మార్సెల్స్ చేరాక అక్కడ పత్రికా విలేఖరులు ఒక డజను మంది ఓడలోకి వచ్చి అందరి తరఫున కిట్టీ, డేలీని అడిగి సంగతులు తెలుసు కున్నారు. తరువాత వారు ఫ్రాన్స్ దేశంలో ప్రచురించిన విషయాలు సత్య దూర

షులు కావు. మార్సెల్స్‌లో దిగిన తరువాత నోరీనా, ఎలిజబెత్‌లు అమెరికా తిరిగి వెళ్ళారు. మిగిలిన వారంతా ఇంగ్లండు వెళ్ళారు.

## అయిదవ పాశ్చాత్య దేశయాత్ర :

జూన్ 4 వ తారీకు దాకా బాబా నాసిక్‌లో వున్నారు. తరువాత బాబా బొంబాయి నుంచి జూన్ 12 వ తేదీన 'విక్టోరియా' అనే ఓడలో బయలుదేరి యూరప్‌కి ప్రయాణ మైనారు. ఇది బాబాయొక్క అయిదవ పాశ్చాత్య దేశ గమనము. ఒక నెలరోజులు పైగా యూరప్‌లో పర్యటించి తిరిగి సెప్టెంబరులో ఇండియాకు వస్తానని బాబా చెప్పారు

బాబాతో మండలి నలుగురు – కాకా, చాన్‌జీ, ఆదీ, పెండు – వెళ్ళారు. 1933 జూన్ 24 వ తారీకున బాబా మండలితో జినీవా చేరారు. అక్కడ అనేకమంది ఆంగ్లే యులు అమెరికనులు కూడా బాబాను కలిశారు- వారికి స్వాగతం యిచ్చిన వార్లిలో ముగ్గురు అమెరికనులు ఉన్నారు. ఇండియానుంచి తిరిగి వచ్చిన బాబా శిష్యురాండ్రు కూడా వచ్చి బాబా పరివారంలో చేరారు. వారు బాబాతో కూడా ప్రయాణాలు చేశారు. వీలయినంత వరకు బాబా ఎక్కడున్నను వారితో కూడా ఉండాలని వారి వాంఛ. బాబాతో అరణ్యమునకైనను వెళ్ళుటకు, ఎక్కడయినను ఉండుటకు, వారు ఎన్ని సుఖము లయినను త్యాగము చేయుటకు, సిద్ధముగా నుండిరి. బాబా ఎప్పుడూ ఎవరితోటీ జీవితమునందు అన్నీ వదులుకుని ఏ అరణ్యములకో పొమ్మని చెప్పలేదు- బాబా తమ భక్తులను ప్రపంచములోనే వుండి దేనికీ అంటకుండా తమ బాధ్యతలను విధులను నెరవేర్చుకొనుచూ అధ్యాత్మిక జీవనము గడపవలెనని చెప్తారు న్యూయార్క్ వంటి మహా నగరములలో తెల్లవారితే ప్రతినిత్యము వెయ్యి ఆకర్షణలు నలువైపుల నుంచి కలుగుచున్నను వాటికి లొంగక వాటన్నిటికీ అతీతముగా ఎట్లు జీవించవలెనో బాబా పాశ్చాత్య శిష్యులకు నేర్పి యున్నారు. భక్తులకు వారి కోరికలను నిత్యావసరములను తగ్గించుకొనుచు ఉండుటయెట్లో బాబా వారికి శిక్షణ నిచ్చియున్నారు.

ఇటలీ, ఫ్రాన్స్, జర్మనీ, స్విట్జర్లాండ్, ఆస్ట్రియా, రుమేనియా దేశాలలో వున్న బాబా భక్తులు వారి వారి దేశాలకు రమ్మని పిలుచుచూ బాబాకు అనేకమంది ఆహ్వానములు పంపియున్నారు. బాబా ఇండియాకు త్వరితముగా తిరుగు ప్రయాణము చేసి అక్కడ చేయవలసిన పని యుండినందున ఆయా దేశములకు వెళ్ళుట వాయిదా వేసి ఇటలీలో ప్రస్తుతం పని చేయవలసియున్నందున ఆ దేశములో పోర్టోఫినో అను

నొక చిన్న పట్టణమునకు వెళ్ళారు. అది సముద్రతీరమున నున్నది. బాబాతో కూడా ఇక్కడ ఇరవై మంది శిష్యులున్నారు. ఒక నెలరోజులు బాబా చెప్పినట్లు నడుచుకొనుచు వీరంతా ఇక్కడే యున్నారు.

బాబాను దర్శనం చేసుకోవాలని ఉన్నవారు పోర్టోఫినోకు వెళ్ళినచో బాబా ప్రతిరోజు నిర్ణీత సమయమునందు వారిని చూచుటకు మాత్రము అంగీకరించుచుండిరి. అనేకమంది ఫ్రాన్స్, స్విట్జర్లాండ్, ఆస్ట్రియా మొదలగు దూర దేశముల నుండి బాబా దర్శనార్థము పోర్టోఫినోకు వచ్చియుండిరి. బాబా శిష్యులు అక్కడ ఒక విల్లాను బాబా బసకోసం అద్దెకు తీసుకొనియున్నారు. బాబా అనుమతితో కొన్నాళ్ళు బాబాతో ఉండి ఇతరులకు బాబా దర్శన మిచ్చు సమయముల బాబాను చూచెడి అవకాశమును పొందుచుండిరి. పోర్టోఫినోలో వుండగా బాబా మండలి వగైరా శిష్యులలోని స్వార్థపూరిత గుణాలను రూపుమాపుటకు బాబా ఇక్కడ పని చేశారు. మండలి వాళ్ళు ఇంకొక చోట బసచేసి యున్నారు. బాబా ఒక్కొక్కరికి ఒక్కొక్క పని యిచ్చి చేయిస్తూ వుండేవారు. కొందరు భక్తులు రమ్మని ఆహ్వానించగా 7 వ తారీకున రోమ్ నగరానికి బాబా తమ పరివారంతో వెళ్ళారు.

ఆ రోజున శుక్రవారం ఉదయం 8-15 గంటలకు రోమ్‌లో ప్రవేశించారు. అక్కడ ఎలిసీ హోటలులో బస చేశారు. అందులో స్త్రీలు వేరే ఒక అంతస్తులో దిగారు పురుష మండలి బాబా గదివద్ద వున్నారు. వారు బాబా గది సమీపంలో వరున్నారు.

ఉదయం అల్పాహారాలు అయాక సెయింట్ పీటర్స్ చర్చి చూడడానికి వెళ్ళారు. బాబాయొక్క శిరోజాలు కనపడకుండా ఒక టోపీ ధరించారు తలమీద, అందరి మధ్యను వుండి ఆ టోపి తీసెయ్యక్కరలేకుండానే సెయింట్ పీటర్సు చర్చి లోపలికి వెళ్ళగలిగారు. చర్చి లోపల మధ్య డోమ్ కిందకి వెళ్ళి నిలబడ్డారు బాబా. ఎడమవైపుకి తిరిగి నడిచి పరివారాన్ని అక్కడ ఆట్టేసేపు వుండనీయక పడమట ద్వారంగుండా బయటకి వెళ్ళారు. ఆ ప్రక్కనే మైకేలేంజిలో తయారు చేసిన మేడోనా విగ్రహం వున్నది. ఈ విగ్రహరూపమే "ది మిరకిల్" అనే నాటకంలో నొరీనా మెడొనా పాత్ర ధరించడానికి మాతృకగా ఉపయోగించింది. అంటే ఈ విగ్రహం ఎలావుందో అలా ఆమె వేషంవేసేది ఆ విగ్రహం వున్న ఆవరణ చాలా గొప్పగా వుంది. అయితే అక్కడ ఆధ్యాత్మిక వాతావరణం మాత్రం లేదు. అక్కడి నుంచి బాబా మండలిలో ది కాపిటోలైన్ హిల్, ది ఫోరమ్, ది కోలిసియమ్ అను

ప్రసిద్ధమయిన స్థలాలకి వెళ్ళి చూచారు. ఈ స్థలాలకి వెళ్ళడంలో ముసోలినీ ఆఫీసును రెండుమార్లు చుట్టారు.



ఆ మధ్యాహ్నం కొందరు దర్శనార్థులను చూచాక ప్రఖ్యాతి చెందిన కెఫె అరగ్నో అల్ కోర్సోకి వెళ్ళారు. అది రోమ్ నగరానికి ముఖ్యమయిన మధ్య భాగం. అక్కడ బళ్ళ రాకపోకలు మిక్కుటంగా వుంటాయి. కెఫెలో వారికి కావల సిన పదార్థాలు తిన్నారు. బాబాకి ఇరుపై పులా మార్గరెట్, నొరీనాలు కూర్చున్నారు. అలా కూర్చునే బాబా ఇంకో లోకంలోకి వెళ్ళిపోయి పని చేస్తున్నారు. మిగిలినవారు ఈ సంగతి తెలియక బాబాతో కబుర్లు చెబుతూనే వున్నారు. అక్కడ చాలామంది బాబాకేసి చూడనిదే వెళ్ళేవారు కారు. ఈ కెఫ్ అరగ్నో అల్ కోర్సులో వుండగా క్రిస్టియానో అనే బాబా యొక్క ప్రతినిధి ఒక ఫియట్ కారును నెమ్మదిగా నడిపిస్తూ బాబాను చూచాడు. ఇతడే కారు డ్రైవ్ చేస్తున్నాడు. ఇతడు మధ్య వయస్కుడు; కొంచెం లావుగా వుంటాడు. ఇతడు రోమ్‌లో ఉంటున్నాడని ఇతనికి భార్య వున్నదని ఆమెకు అతని ఆధ్యాత్మిక స్థితి గురించి ఏమీ తెలియదని బాబా వివరించారు.

బాబా లేచి పరివారంతో "వైట్ షాడోజ్" అనే ఫిలిం చూడడానికి సినీమాకి వెళ్ళారు. అంతలో ఆ సినీమాలో స్టేజి తిరిగిపోయి సినీమా అదృశ్యం అయిపోయి ఒక నాట్య రంగం వచ్చింది. అందులో హవాయీ నాట్యం చేశారు. అది చూచి బాబా చాలా మెచ్చుకున్నారు. పైన గుండ్రటి వివరంలో నుంచి ఆకాశం కనిపిస్తోంది. ఆకాశంలో ఎగిరే పక్షులు కనిపించాయి. చల్లని వాయువు అందులోంచి వస్తోంది. అది హాలులో కూర్చున్నవారికి హాయి గొలుపుతోంది. మామూలు ప్రకారంగా సినీమాలో వుండగా బాబా ఆధ్యాత్మికమైన పని చేశారు. అందరూ ఆ రాత్రి తొందర గానే పరున్నారు. రాత్రి అంతా బాబా పని చేస్తూనే వున్నారు. ఆ మర్నాడు ఉదయం బాబా వారి పని అనుకున్నదానికంటె తొందరగా అయిపోయిందని చెప్పి ఆ మధ్యాహ్నం వారి బృందంతో మరల శాంటా మార్గెరిటాకు వెళ్ళారు.

రోమ్‌లో ఇంటికి ఎవరూ భోజనానికి రావడానికి వీలులేదని వచ్చి టీ మాత్రం తీసుకోవచ్చునని బాబా స్పష్టంగా చెప్పారు. "ఆర్కేంజెల్ గేబ్రియల్ అయినాసరే" వీలు లేదన్నారు. రోమ్‌కి ఒకడు "ఫలానావాడు భోజనానికి రావచ్చునా?" అని టెలిగ్రాం యిచ్చాడు. అదిచూచి బాబా అన్నారు – "ఆర్కేంజెల్ గేబ్రియల్ అయినా సరే వీలులేదన్నా ఇంకా అడుగుతున్నాడేమిటి?" అని.

ఉదయం అల్పాహారాలు తీసుకుని మరల రోమ్ నగరంలో రెండు కార్లలో అందరు తిరిగారు-ది లాటెరాన్ అనే పవిత్ర స్థలానికి వెళ్ళారు. అక్కడ బాబా కారులోనే కూర్చున్నారు. పరివారం అందరూ అక్కడి మెట్లుయెక్కి దిగివచ్చారు. రోమ్‌నగరంలో అనేక ఫౌంటెన్‌ల అందమయిన దృశ్యాలు చూచారు. వాటికన్ మ్యూజియంకి. గాలెరీలకి వెళ్ళి చూచారు. ఈ తిరగడంలో కొంత అలసిపోయారు. అప్పుడు సిస్టైన్ చాపెల్‌లో కొంతసేపు కూర్చున్నారు. ఆ సమయంలో పెండు తనకి తెలియని విషయాలనేకం అడిగి తెలుసుకున్నాడు-పోప్, కార్డినల్స్ మొదలగు వారి గురించి, అక్కడ బాబా అన్నారు- "ఈ స్థలం నిజంగా నేడు ధన్యమయినది" అని. ఆ గోడ మీద అడ్డంగా అమర్చిన ఒక పెద్ద అద్దంలో పైకప్పు లోపలిభాగం మీద చెక్కబడిన భగవంతుని చిత్రం మొత్తం అంతా బాగా కనిపిస్తుంది. ఆదమ్ చేతిని చేయిజాపి స్పృశిస్తూ వున్నట్లు, ఆదమ్‌లోకి జీవనజ్యోతిని ప్రవేశింపజేస్తున్నట్లు ఆ చిత్రంలో చూడవచ్చు. వాటికన్ మ్యూజియంకి వెళ్ళినపుడు బాబా పరివారాన్ని ఆలస్యం చేయనీయక గాలరీలలోనుంచి పరిగెత్తించారు ఇంచు మించుగా. బాబా వారి బృందాన్ని కళలోవున్న సౌందర్య విశేషాలమీదకి మనసును పోకుండా,రోమ్ నగరపు దృశ్యాలలోని అద్భుతాలను మాత్రమే గుర్తించేలా చేశారు. ఏ నగరానికి ఎక్కడికి వెళ్ళినా-రోమ్, వెనిస్, పారిస్, మేడ్రిడ్, లండన్, ఆగ్రా, కాశ్మీర్, చైనా అమెరికాలలో ఎక్కడికి వెళ్ళినా ఆయన శిష్యులు కొంచెం ఎక్కువసేపు పరకాయించి చూస్తున్నారనేసరికి అక్కడినుంచి వారిని మరోచోటకి తీసుకుపోయేవారు బాబా.

భోజనాలయిన తరువాత రోమ్ నగరవాసులు కొందరు బాబా దర్శనార్థం వచ్చారు. వీరితో సంభాషణలు నొరీనా ఏర్పాటు చేసింది. కొందరు నిర్ణీత సమయానికి కాకుండా ఆలస్యంగా వచ్చారు. రోమ్‌లో మధ్యాహ్నం వేడిగా ఉండడంవల్ల సాధారణంగా కొంచెంసేపు పరుండి మరీ బయటకు వెడతారు. ఇలా ఆలస్యంగా వచ్చిన వారిని బాబా చూడడానికి అంగీకరించలేదు. కాని కొందరు కష్టంమీద బాబా గదిలోకి వెళ్ళ గలిగారు.

అనితా రోమ్‌లో ఒకానొక చిత్రపటం కావాలంది. ఇంక ఒక అరగంటకి బాబా వెళ్ళిపోతారనగా ఆయన బజారుకి కిట్టీ మింటాలతో వెళ్ళి అనితాకి కావలసిన చిత్రపటం తీసుకు వచ్చారు. రైలు స్టేషన్‌కి చేరుకోగానే టాక్సీ డ్రయివరు తన యిష్టం వచ్చినట్లు ఎక్కువచార్జీ ఇమ్మని పేచీ పెట్టాడు. టినాకి ఇటలియన్ భాష వచ్చును గనుక అది చాలా యెక్కువ అని వానితో పోట్లాడింది. ఇలా వుండగా-

ఒక పోలీసువచ్చి న్యాయమైన చార్జీ యిప్పించి వెళ్ళాడు. బాబా బృందానికి చాలా సామాను వుంది అదంతా ప్లాట్‌ఫారమ్ మీదకి చేర్చారు. ఎందుకోగాని బాబాకి రోమ్ అంతగా నచ్చలేదు. అందుచేత త్వరగా అది విడిచి రైలు ఎక్కినందుకు సంతోషించారు.ప్లాట్‌ఫారమ్ మీద అందరూ కాఫీ తీసుకున్నారు.శాంటా మార్గెరిటాకి వెళ్ళేసరికి రాత్రి 11-45 గంటలయింది. అక్కడ స్టేషన్‌కి ఎవరూవచ్చి కలియ లేదు. బాబా చాలా అలసిపోయినట్లున్నారు. ఆ అర్థరాత్రి ఎలిజబెత్ కారు షెడ్డులో నుంచి బయటకు తీయడం ఆలస్యం అవుతుందని బాబా ఇంకొక కారు అద్దెకు తీసు కున్నారు. బాబావున్న కొండ దిగువను వున్న 'విల్లా' దగ్గరకువచ్చి కారు ఆగింది. సామాను కొండమీదకి అరమైలు దూరం తీసుకు వెళ్ళాలి. ఎవరూ తెచ్చిపెట్టేవారు ఆ సమయంలో దొరకనందున కష్టమయింది. వెళ్ళి అక్కడ ఎత్తయిన కొండమీద వున్న విల్లాలో ఆ రాత్రి పరున్నారు. ఆ కొండమీద నుంచి మధ్యధరా సముద్రం కనిపిస్తూ వుంటుంది. ఆ విల్లా చుట్టూ అందమయిన ఉద్యానవనం ఉంది. కొండ దిగువను పైన విల్లాకి వెళ్ళే మార్గానికి ఒక గేటువుంది. ఆ గేటు వద్దకు వచ్చేసరికి బాబాతోవున్న ఒక పాశ్చాత్య ప్రేమికురాలు ఏడవడం మొదలుపెట్టింది. కొండమీదకి ఎక్కగా ఎక్కగా ఏడుపు ఎక్కువయింది. ఆమె అలా ఏడవడం ఆమెకే సిగ్గువేసింది. పైకి వెళ్ళేసరికి ఆమె చాలా దుఃఖంతో వుంది. టినా ఆమెకు మంచినీళ్ళు ఒక గ్లాసుతో పట్టుకువచ్చి యిచ్చింది. కాని లాభంలేకపోయింది. ఏమిటీ గందరగోళం అని లోపల బాబా లేచి వచ్చి తలుపు తెరిచారు. ఆమె ఊరికే చూస్తూ నిలబడింది. ఆమె ముఖంమీద చేతులు పెట్టుకుని ఇంకా ఏడుస్తోంది. బాబా అప్పుడు ఆమెను ఎంతో దయతో బుజంపట్టుకునిలోపలికి తీసుకువెళ్ళి ఒక సోఫామీద కూర్చోపెట్టారు. ఆయన ప్రక్కన కూర్చో పెట్టుకున్నారు. ఏడ్పు మానలేక పోయానని విచారిస్తూ ఆయనతో క్షమాపణ చెప్పుకుంటూ ఏడుస్తూనేవుంది. టినాతో "ఆమెతో చెప్పు. ఎలా వుండాలో అలాగేవుంది. ఏమీ ఫరవాలేదు." అని అన్నారు. ఏడుస్తున్నామెను చూచి బాబా పంపించేస్తారేమో అని భయపడింది. ఆ విధంగా బాబాను అడిగింది. బాబా "పంపను, ప్రతిరోజూ ఈ తోటలోకి వచ్చి ఉదయం 10 నుంచి 12 వరకు, మధ్యాహ్నం 4 నుంచి సాయంత్రం 6 వరకు ఉండు" అని చెప్పారు. ఈ విధంగా బాబా చెప్పినట్లు ఆమె పదిరోజులు వచ్చింది. కాని ఆమెకు ఏడ్పు ఆగలేదు. తోట లోకి వచ్చి ఏడుస్తూ కూర్చునేది.ఎక్కడ పడుకుందో, ఎక్కడ తిందో కూడా ఆమెకు తెలియదు. బయటకు వెడితే మళ్ళీ తోటలోకి ఎప్పుడూ వెడతానా అనే చూస్తూండేది. బాబాను ఒక్కొక్కప్పుడు ఆమె చూడలేదు. ఒకనాడు ఆమెను పిట్టగోడ వద్దకు తీసుకువెళ్ళి కనిపిస్తున్న సముద్రం చూపించి ఆయన అక్షర ఫలకం మీన "అమగోనేను ఆ సముద్రం వంటివాడను నాలో నీవు మునిగిపో, శాశ్వతంగా జీవించు" అన్నారు బాబా.

అత్యంత సాహసోపేత కార్యం చేయునపుడు; ఏకాగ్రత, ధైర్యం చురుకుదనము, ప్రాణరక్షణ, భీతి మొదలగు గుణములు పైకొని అతిశయిస్తాయి. ఇలాంటి గుణములు బాహ్యంగా ప్రకటీకృతమైనపుడు అవతారుడు వాటిని తన విశ్వ కార్యక్రమంలో ఉపయోగించుకుంటాడు. పోర్టుఫినోలో యీ విధంగా బాబా సాహస కృత్యాన్ని చేయింపజేసి తద్వారా, విశిష్టమైన ఆంతరంగిక కార్యక్రమం జేశారు.

## పోర్టోఫినోలో ఒక సాహస యాత్ర :

ఒకరోజు మధ్యాహ్నం టీ పుచ్చుకున్న తరువాత పదిహేను, పదహారుగురు బాబాతో కలిసి కొండల మీదకి షికారుకి వెళ్ళారు ఆయన ఒక అపాయకరమయిన కనుమగుండా అటు సముద్రం వైపుకి వారిని తీసుకువెళ్ళి దిగారు అందరు కలిసి వుండాలని బాబా చెప్తున్నా కొందరు వెనుక దిగబడినారు. వాళ్ళకు జోళ్ళు, బట్టలు వున్నందున అవి కుదరక కొందరు దిగలేకపోయారు. ఆఖరున ఏటవాలుగా వున్న కొండమీద నుంచి కింధికి జారలేకపోయారు. సముద్రతీరానికి బాబా చేరుకునేసరికి ఇద్దరు మగవారు ఇద్దరు ఆడవారు తప్ప మిగిలినవారు వారితో రాలేకపోయారు. అందరూ కొంత సేపట్లో బాబాను కలుసుకున్నారు ఎలాగోలాగ పక్కదార్లు వెంట దిగివచ్చారు.

వెళ్ళిన దారినే కాక బాబా ఇంకోదారిని కొండమీదికి తిరిగి ఎక్కారు. ఆయన చురుకుగా ఒక లేడిపిల్లలా నున్నటి ఆ కొండమీదికి త్వరగా ఎక్క గలిగారు. వారితో వున్న నలుగురు అయినా ఆయనతో వెళ్ళలేక పోయారు. కష్టమైనచోట్ల బాబా ఆగి ఆడవారికి చేయూత నిచ్చేవారు. ఇలా అపాయకరమయిన దారిని వారిని తీసికొని వెళ్ళడంలో ఆధ్యాత్మిక విశిష్టత ఏదో వుందని ఇప్పటికి వారికి తోచింది అందుచేత బాబాలో నమ్మక ముంచి వారి వెనుకనే వెళ్ళారు.

అకస్మాత్తుగా ఒకచోట నుంచి వారు ముందుకు ఎక్కలేకపోయారు. వారిపైన పెద్ద రాయి వుంది. సన్నని చెట్లు వున్నాయి. కుడివైపున ఏటవాలుగా అగాధంలా వుంది. అటువైపే సముద్రం వుంది. వారు దారికోసం వెతికారు. అది 150 అడుగుల పైన వుందని వారికి తెలిసింది. వారిలో ఒకరు హెర్‌బర్ట్ అనువాడు మూలలను పట్టుకుని ఎగప్రాకి చెట్ల వేళ్ళు పట్టుకుని వేళ్ళాడుతున్నాడు. అతని గుండెలు కొట్టుకుంటున్నాయి. బాబా ఏదో సులభమైన మార్గం కనిపెడతారని ఏదో అద్భుతం చేసి వారి నందరిని పైకి తీసుకువెడతారని వారు అనుకోలేదు. ఒక అరగంట తంటాలు పడ్డాడు కాని అతనికి దారి కనబడలేదు. ఏటవాలుగా వున్న ఒక కొండమీదకు ఎక్కుదామని చూచాడు. కాని అతడు కాళ్ళు నాటుకుని నిలబడలేకుండ వున్నాడు. 15

అడుగుల పైన అడ్డంగా ఒక పెద్ద రాయి వుంది. అది చాలా నున్నగా వుంది. చేతికి కూడా పట్టు దొరకడం లేదు అయినా అదొక్కటే మార్గం. అలాగే ఎక్కాలి.

బాబా చురుకుగా ముందు ఎక్కేసి ఇక్కడున్నాను రండి అని మిగతావారికి తెలసేలా చప్పట్లు కొట్టారు. తరువాత ఆయన కనపడకుండా చాటుకి వెళ్ళిపోయారు. హెర్బర్టు వెడదామని గట్టి ప్రయత్నం చేశాడు. ఆ గుండురాయి అడ్డం వచ్చింది. అక్కడే కొన్ని నిమిషాలు కష్టపడ్డాడు. ఇద్దరు ఆడపిల్లలు, రెండో యువకుడూ క్రింద నిలబడియున్నారు. పైన చెప్పిన నిటారుగావున్న కొండకి ప్రక్కగా ఒక చరియలో తుప్పుపట్టిన ఇనుపముక్కలు, గాజుపెంకులు, 40 అడుగుల లోతుకి వున్నాయి. ఒక తప్పటడుగు వేస్తే ఆ చెత్త మీద పడడమే కాకుండా క్రింద నిలబడిన వారిమీద పడడం తథ్యం.ఎలాగో తంటాలుపడి ఆ గుండ్రాయి దాటి ఎక్కగలిగాడు హెర్బర్ట్.

ఆఖరిమాటుగా బాబా పైకిరండి అనే సంకేతాన్నిచ్చి ఆయన కనుమరుగయారు. వివియన్‌ను ఎక్కమన్ని హెర్బర్ట్ కేకవేశాడు. ఆమెకూడా అలాగే ప్రయత్నం చేసింది కాని ఆమెకు బలం తగ్గిపోతుంది. మిగిలినవారు బాబాను సహాయం చేయమని పిలిచారు. వాళ్ళకి ఆయన వద్దనుంచి జవాబురాలేదు. ఏమిటి ఇలా అపాయంలో వదిలి వెళ్ళిపోయారు. ఇది దేనికయినా చిహ్నంగా వున్న పరీక్ష కాబోలు. లేకపోతే హెర్బర్ట్ వున్నాడుకదా ఆడవాళ్ళని తీసుకురాలేకపోతాడా అని అతని మీద నమ్మకంతో వెళ్ళిపోయారా ? వివియన్ 10-15 నిమిషాలసేపు ఎక్కుతూ మధ్య వేళ్ళాడుతూ వుండిపోయింది. ఆమె కుడిచేతి రెండు వ్రేళ్ళతో రాయిలో ఒకపగులును ఆధారంగా చేసుకుని గట్టిగా పట్టుకొని రాయికి జేర్లబడి ఎడమమోకాలు రాతికినొక్కిపెట్టింది. ఆమె అనేక సంవత్సరాలు నృత్యంలో శిక్షణపొంది యుండడంవల్ల దీనికి తట్టుకోగలిగింది. చాలా మంది ఈ సమయానికి ఇంకోదారిని పైకిఎక్కి వెళ్ళిపోయారు. రెండు గంటలయినా కొందరు రాలేదని వారికి ఆశ్చర్యం వేసింది. బాబా ఇంకా పైకి ఎక్కవలసివుంది. ఎక్కుతూ ఆయన చప్పట్లు కొట్టినా యిల్లు మైలు దూరం వుండడం వలన ఎవరికీ వినిపించలేదు. పోర్టొఫినోలో బాబా దిగిన బంగళాలో పనిచేసే కుర్రవాడు టినో అనే ఇటాలియన్ బాలుడు ఒక పూజారిని కలుసుకోగా ఎవరో సహాయం కోసం చప్పట్లు కొడుతున్నారు అని ఆ బాలునితో చెప్పాడు. టినో బాబా వద్దకు పరుగెత్తి వెళ్ళగా బాబా ఒక పగ్గం తెమ్మని సంజ్ఞచేశారు, అతడు యింటికి పరిగెత్తివెళ్ళి వంటయింట్లో వున్నవారితో చెప్పగా వారు బాబా వద్దకు పరుగెత్తి వెళ్ళారు.

వివియన్ అలాగే వ్రేళ్ళాడుతోంది. ఆమె చెయ్యి కొంచెం వదులు చేసిందా ఆమె 20 అడుగుల క్రింద వున్న అనితామీద పడి అక్కడినుంచి 300 అడుగుల క్రింద సముద్రంలోనికి దొర్లిపోవలసిందే. హెర్బర్ట్‌కి వివియన్ చెయ్యి తగులు తోంది. అంతే. అతడు కుడిచేత్తో ఒక తుప్పని పట్టుకున్నాడు. అది వదలలేదు. రెండోచేత్తో ఆమెని పైకిలాగడానికి సరిగా అందదు. వివియన్ "బాబా ! బాబా !" అని అరుస్తోంది. ఎట్టకేలకు పైనుంచి చప్పట్లు వినిపించాయి.

బాబా శిష్యుడయిన పెండు పొడుగుపాటి త్రాళ్ళతో వచ్చాడు. ఇంకా కొందరు కూడా వచ్చారు సహాయానికి. బాబా ఈ అపాయకర పరిస్థితి చూచి సంతోషించారు. ఆయన కొంతవరకు దిగివచ్చారు. కొన్నిచోట్ల మట్టిమీద కాలుజారిపోతుంది ఆయనకి కూడా. హెర్బర్ట్ ముందుకు వంగి ఒక పొడుగయిన తుప్పయొక్క కొమ్మలమీద నుంచి వంగి దాని వ్రేళ్ళను కుడిచేతితో పట్టుకున్నాడు. బాబా కుడిచేతితో ఆ కొమ్మ లకు అవతల చివర పట్టుకున్నారు. అప్పుడు హెర్బర్ట్ క్రిందకి వంగి వివియన్‌ను తన ఎడమచేతితో రాతిపైకి లాగాడు.

పెండు బలమైనవాడు, చురుకయినవాడూను. అనితా ఇంకా క్రిందనే నిలబడి వుండగా ఆమెకి ఒక తాడు విసిరాడు. ఆ తాడు మూలంగా వారంతా సురక్షితంగా పైకి యెక్కారు. ఈ ప్రమాదంలోనుంచి అందరూ తప్పుకుని బైటపడినందుకు బాబా ఒక బడిపిల్లవానిలా చాలా సంతోషంగా వున్నారు.

సాహసోపేతమయిన ఈ చర్య అయిన తరువాత బాబా ఈ కధ అంతా అందులో పాల్గొనని వారితో చెప్పారు. అధిగమించిన అపాయాలన్నిటి గురించి చెప్పారు. ఈ అనుభవంతో బాబా చాలా ముఖ్యమయిన పనిని చేశానని చెప్పారు. ఈ విచిత్రానుభవం తరువాత అందరూ సురక్షితంగా చేరినందున బాబా అందరిని గ్రంథాలయపు హాలులో సమావేశపరచి స్వయంగా వారిచేతితో ఇటలీదేశపు ద్రాక్ష సారాయమును అందరికీ పంచిపెట్టి రుచి చూపించారు.

ఈ సాహస కార్యంలో వారు చూపించిన ధైర్యము, వారు ఉపయోగించిన శక్తి, వారికి కలిగిన భావాలు ఇవన్నీ బాబా వారి ఆధ్యాత్మిక కార్యంకోసం వినియో గించుకున్నారు. ఎవరికీ ఏ అపాయమూ జరుగకుండా ఇంత ప్రమాదకరమయిన యాత్రలో నుంచి తప్పించుకు వచ్చారని అక్కడి పరిచారకులు సంతోషంతో కళ్ళ నీళ్ళు పెట్టుకున్నారు అపాయం గాని, ప్రమాదం గాని ఎలా కలుగుతుంది? ఈ నాట

కానికి దర్శకుడు భగవంతుడయిన బాబా కదా ! ఆయనలో భక్తి విశ్వాసాలు అంత గాఢంగా కలిగి వున్నందుకు ఆ పాశ్చాత్య ప్రేమికులు ప్రశంసనీయులు, ఈ నలుగురుని నాలుగు రీతులుగా మానవులలోని స్త్రీ, పురుష లందరికి ప్రతినిధులుగా జేసి బాబా తమ ఆధ్యాత్మిక కార్యం నిర్వహించుకున్నారు. చైతన్య రహిత మయిన స్థితిలో నుంచి వారికి గురువుగా మార్గదర్శిగా బాబా వారిని తమ అత్యున్నత తమ చైతన్యంతో కాపాడి పైకి తీసుకు వచ్చారు. బాబా వారి ఆధ్యాత్మిక రక్షకుడుగా పని చేసి యుండకపోతే వారికి కలిగిన ఉపద్రవానికి లోనై వారేమయి యుండెడివారో పాఠకులు సులభముగా ఊహించగలరు.

బాబా ఇటలీలో వుండగా 1933 వ సంవత్సరంలో చికాగోలో జరుగబోవు ప్రపంచ సర్వమత మహాసభలో మాటలాడవలసినదని ప్రార్థించుచూ బాబాకు అమెరికానుండి ఆహ్వానం వచ్చినది. అందులకు బాబా ఇండియాకి తిరిగివెళ్ళిన తరువాత నిశ్చయించి తెలియపరచెదనని చికాగోకి జవాబు వ్రాయించి పంపించారు.

పోర్టోఫినోలో ఒక నెల రోజులు సుఖంగా గడిపి బాబా 1933 వ సం॥ జూలై 24 వ తారీకున 'కాంట్ వేర్డ్' అనే స్టీమరులో తమ పరివారంతో బయలుదేరి బొంబాయి వెళ్ళారు.

బాబా ఇండియాకు చేరగానే మరల చికాగో నుంచి జాబు వచ్చినది. అక్కడి సర్వమత మహాసభ నిర్వాహకులు బాబాకు అక్కడికు వచ్చుటకు ఏ తేదీలలో వీలుగా నుండునో వ్రాయమని కోరారు బాబా ఆయాహ్వానమునకు ప్రత్యుత్తరము వ్రాయిస్తూ తమ యుపన్యాసము మౌనముగానే ఉండునని అక్షరఫలకం మీద తాము చెప్పబోవునది వేలితో చూపుచున్నపుడు వెంట వెంటనే తమ శిష్యుడొకడు అది చదువుచుండునని వ్రాయించారు. అమెరికావారు అందుల కంగీకరించినట్లుకూడా తెలిపారు. ఈ సంగతి విని అఖిల ప్రపంచమునందు ఉన్న బాబా భక్తులందరు చాలా సంతోషించారు.

ఆ రోజులలోనే నాసిక్‌లో జరిగిన సర్వమత సమావేశమునకు బాబా తమ సందేశమును పంపించారు. అప్పుడు వారు బొంబాయిలో ఉండి ఆయన శిష్యులలో ఒకడయిన రంజూ అబ్దుల్లాను వెళ్ళి అతనిని చదవమన్నారు. అతడు చదివిన బాబా సందేశ పాఠ మిట్లుండెను—

**బాబా సందేశము :**

వివిధ మతములవారు ఒకచోట సమావేశమగుట నేను చాలా మెచ్చుకొనుచున్నాను. నమ్మకమే సర్వమతములకు మూలాధారము. పరిసరములు మొదలగునవి భేదముగా నుండవచ్చును. అది ఊహమీద ఆధారపడి యుండవచ్చును. లేక ప్రతిమలమీద ఆధారపడి యుండవచ్చును. అది బుద్ధి ద్వారా కలిగిన విశ్వాసము కావచ్చును. లేక ఉద్వేగముపై కలిగిన నమ్మకము కావచ్చును. అయినను శిరోమణివంటి ఆ నమ్మకము ఒక్కటే. ఆ నమ్మకములో రెండు రకములు లేవు. ఆ నమ్మకము బలీయముగా ఉండవచ్చును లేక బలహీనముగా నుండవచ్చును. కొంతమందికది కర్మకాండల రూపములో నుండును. కొంతమంది బాహ్యరూపముల వదలి సారమును మాత్రము గ్రహింతురు. వారు నిర్గుణమయిన అనంతుని అస్తిత్వమును నమ్ముదురు. కొందరు తమయొక్క గురువుమీదనే నమ్మకముంచెదరు. అందుచేత అది తరతమ భేదము మాత్రముగా నుండును. అన్నిమతముల లక్ష్యముఅయిన భగత్సాక్షాత్కారము సంపూర్ణముకానిచో నమ్మకము నమ్మకము మాత్రముగానే వుండును. అది మూఢనమ్మకము, గుడ్డినమ్మకము కావచ్చును. మరియొక విధమయిన నమ్మకము కావచ్చును. ఒకమారు భగవంతుని పొందిన తరువాత ఇంక నమ్మకము ప్రశ్న వుండదు. మానవుడు తాను మానవుడనని అనుకొనుటకు నమ్మక మెందుకు ? నమ్మకము యొక్క హద్దులు అధిగమించి తాను అనంత భగవానునితో ఐక్యత గుర్తించినచో ఆ భగవంతుని అన్నిచోటులందును. అంతటను చూడగలరు.

అందరకు నా ఆశీస్సులు తెలుపుడు. — 'మెహెర్‌బాబా'

చికాగో సర్వమత సమ్మేళనము వారు అంతటితో ఊరుకొనక బాబా ఏ కారణము చేతనయినను రాకుండా ఉంటారేమోనని మరల మరల వారికి ఉత్తరములు వ్రాస్తూ వారి ఆహ్వానమును బాబాకు జ్ఞాపకము చేస్తూ వచ్చారు. అమెరికాలోని అనేకమంది బాబా భక్తులు కూడా తప్పకుండా చికాగో వచ్చి ఆ మహాసభలో బాబాను ఉపన్యాసమీయవలసినదిగా ప్రార్థించుచూ ఉత్తరములు వ్రాశారు.

చికాగో మహాసభ అక్టోబరు (1933) 29 వ తేదీన జరుగునని స్థిరపడెను

**ఆరవ పాశ్చాత్యదేశ యాత్ర :**

బాబా మండలి సహితంగా 'కాంట్‌వెర్డ్' అనే ఓడమీద సెప్టెంబరు 25 వ తేదీన బయలుదేరి అక్టోబరు 9 వ తేదీన వెనిస్‌లో దిగారు. అక్కడనుంచి వారు

పారిస్ వెళ్ళగా ఆ నగరంలో మూడు గంటల వ్యవధిలో 50 మంది బాబా దర్శనము చేసుకున్నారు. అక్టోబరు 9 వ తారీకుకి బాబా లండన్ చేరుకున్నారు బాబా లండన్‌లో హెజియా హౌస్ అనే భవనంలో దిగారు. బాబా లండన్‌కి స్వంత పని మీద వచ్చారని చెప్పినా పత్రికావిలేఖరు లెవరినీ బాబా చూడరని చెప్పినా ఇద్దరు బాబా వద్దకు వెళ్ళి వారి దర్శనము చేసుకున్నారు. లండన్‌లో బాబా 13 రోజు లున్నారు. అక్కడ ప్రతిరోజు అనేకమందిని చూచి సంభాషించారు. 'Q' థియేటరులో బాబాకి పెద్ద సత్కార సభ జరిగింది. లండన్‌లో బాబా అనేక థియేటర్లకు సినీమాలకు వెళ్ళి చూచారు.

ఈ మారు బాబా పాశ్చాత్య పర్యటన చేసినపుడు బహిరంగ సభలలో ప్రసంగించలేదు. జన బాహుళ్యానికి ఆధ్యాత్మిక తత్వం మనసు కెక్కినా అది శాశ్వతంగా వుండదు. అందుకని ప్రశాంత వాతావరణంలో వ్యక్తులతో ఆయన సంభాషించారు. సంభాషించిన ప్రతి వ్యక్తి ఆయన ప్రేమమూర్తి అని గ్రహించి ఆయనను గురువుగా ఎన్నుకున్నారు. ఆవిధంగా బాబాతో ఒక్కరూ వుండి ఆయన మీద మనసును కేంద్రీకరించి బాబాను దర్శించి ఆయన చెప్పిన మాటలు విని ఆయన స్పర్శ పొందినవారు ధన్యులు. చాలా అదృష్టవంతులు. ఇంతటి మహాపురుష సాంగత్యం కలగడమంటే ఎన్నో జన్మల పుణ్యఫలం వల్లనే సంభవిస్తుందని అంటే అది అతిశయోక్తి కానేరదు. బాబా వారికి అక్షర ఫలకం ద్వారా చెప్పే మాటల కంటె బాబా సన్నిధిలో కూర్చుని ఆయన పరిధిలో ఆయన తిన్నగా ఎదటివాని ఆత్మతో అంతరంగంగా మౌనంగా సంభాషించినదే ఎక్కువ ప్రాముఖ్యం కలది- దానివలననే వారు ప్రభావితులై ఇంక ఈ జన్మలో బాబాను మరిచిపోలేరు. బాబాతో వారికి శాశ్వత సంబంధం కలుగుతుంది. నిరంతరం ఆత్మను పునరుజ్జీవింపజేసే ప్రేమామృత ప్రవాహం బాబా నుండి ఎదటివారి మీదకు ప్రవహిస్తుంది. బాబా సన్నిధిలో ఉన్నవారు ఎక్కడో ఊర్ధ్వ లోకాలలో విహారం చేస్తున్నట్లు గుండెల లోని భారం అంతా దిగిపోయి గాలిలో తేలిపోతున్నట్లు అనుభూతి పొందడమేగాక వారు ఆనంద బాష్పాలతోను రోమహర్షణాలతోను పులకితాంతరంగాలతోను బాబా దర్శనం చేసుకున్నవారు బయటికి వస్తారు.

అక్టోబరు (1933) లో బాబా లండన్‌లో ఉన్నప్పుడే ఆక్స్‌ఫర్డ్ యువక సమాజంవారు కొందరు బాబాను దర్శించి వారి శిష్యులతో మాట్లాడి బాబాను గురించి అనేక విషయాలు తెలుసుకున్నారు. "శ్రీ మెహెర్‌బాబా - ప్రశ్నోత్తరాలు" అనే చిన్న పుస్తకం ఒకటి లండన్ బృందమువారు అచ్చొత్తించగా దాని ప్రతి ఒకటి 'లండన్ ఫోరమ్' అనే పత్రికవారు తీసుకుని బాబా గురించిన అనేక విషయాలు

1933 నవంబరులో వారి పత్రికలో ప్రచురించారు బాబా క్రొత్త మతమును స్థాపించుటకు రాలేదనీ, మత వ్యవస్థను పునరుజ్జీవింపజేసి క్రైస్తవులను ఈ నవనాగరిక యుగంలో మత విషయాలను బాగా అవగాహన చేసుకొనేలా చేసి తిరిగి చర్చిలకు వెళ్ళుట ప్రారంభించినట్లు చేయుట బాబా పనిలో ఒక భాగమని ఇత్యాది విషయాలు ప్రకటించారు.

ఆ రోజులలోనే రాసేల్ హెర్ష్ అనే గ్రంథకర్త ఇండియాలో పర్యటన చేస్తూ తాను ఒక గుహలో మెహెర్‌బాబా దర్శనం చేసుకున్నాననీ, తాను సిగరెట్ కాలుస్తూ ఆయన వద్దకు వెళ్ళగా ఆ సిగరెట్ ఆయనేం చేసిందో అది అవతల పారేసి మరీ రా అని బాబా అన్నారనీ, మెస్సయ్యా అని పిలువబడే ఈతడు పొట్టిగా ఉన్నాడనీ, బాబా ఒక అబద్ధపు బాబా అనీ, దేవుడనని గొప్ప చెప్పుకునేవాడు ఒక అద్భుతమయినా చేసి తనకు నమ్మకం కలిగించలేకపోయాడని బాబా గురించి ఇష్టంవచ్చినట్లు తాను పాల్ బ్రన్టన్ అనే పేరు పెట్టుకుని రచించిన "ఎ సెర్చ్ ఇన్ సీక్రెట్ ఇండియా" అనే గ్రంథంలో వ్రాశాడు. ఇతడు చాలా దురదృష్టవంతుడు. తాను చూచిన అనేక యోగులు సాధువుల వద్దకు వెళ్ళినట్లే మెహెర్‌బాబా వద్దకుకూడా వెళ్ళి ఆయనను తనకోసం ఒక అద్భుతాన్ని చెయ్యమని అడగడం బాబా నిరాకరించడం జరిగినందున బాబాను అపార్థం చేసుకుని ఆడిపోసుకున్నాడు. బాబా దర్శనం చేసుకున్నాగానీ అందువల్ల బొత్తిగా లాభం పొందలేకపోయిన పాశ్చాత్యుడు ఈ మంద భాగ్యుడొకడే అని తోస్తుంది. నమ్మకం కలిగించడం కోసం ఒక విచిత్రం చేసి చూపించమని ఒక గారడీవానిని అడిగినట్లుగా అడిగితే అతనికి ఆశాభంగం గాక మరేమి కలుగుతుంది? నేనెప్పుడూ అద్భుతాలు చేయనని బాబా అనేకమారులు చెప్పిన సంగతి పాఠకులకు విదితమే.

ఒకనాడు చేరింగ్ క్రాస్‌లో వున్న విల్ బాకెట్ ఆఫీసుకి ఒక శనివారం మధ్యాహ్నం బాబా వచ్చి చాలాసేపు కూర్చున్నారు. అప్పుడు విల్ బాకెట్ ద్వారా అనేకులు వచ్చి బాబా దర్శనం చేసుకున్నారు. ఇంతమంది వస్తే జాగా చాలదని విల్ ప్రక్కనె ఇంకొక గదిని కూడా అద్దెకు తీసుకున్నాడు. విల్, మేరీలు బాబా వస్తారని కెంట్‌లో ఉన్న వారి స్వంత ఇంటి తోట నుంచి అనేక పుష్పాలు తెచ్చి ఈ రెండు గదులను అలంకరించారు. సంభాషణలు ప్రారంభించక పూర్వం బాబాతో విల్, మేరీలు వారి స్నేహితులు 30 మందితో వెళ్ళి కోహినూర్ రెస్టారెంట్ అనే భారతీయ భోజన గృహంలో భోజనాలు చేసి వచ్చారు. సంభాషణలు తరువాత అయినవి.

బిల్ అనే ప్రేమికుని తల్లికి జబ్బుగా ఉండుటచేత బాబా ఆమె ఇంటికి వెళ్ళి చూచారు. ఆమెకు అంతకుముందు ఒక పెద్ద శస్త్ర చికిత్స జరిగింది. తూర్పు కొసను (ఈస్ట్‌ఎండ్) వున్న ఆమె యిల్లు చాలా దూరమయినా బాబా అక్కడికి వెళ్ళి ఆమెను చూచారు. తరువాత కూడా రెండు మూడు సార్లు బిల్‌కి కబురంపి బాబా అతనితో మాట్లాడారు. ఒకమారు అతనిని వెనిస్ మకాంకి రమ్మని చెప్పారు. బాబా వెళ్ళిన తరువాత విల్ బాకెట్‌ను బిల్ కుటుంబముతో సాంగత్యము ఉంచుకోమని విశేషాలు వ్రాస్తూ ఉండమని బాబా విల్‌తో చెప్పారు.

విల్ ద్వారా బాబాకు అనేకులతో పరిచయం కలిగింది. అమెరికా నుంచి వచ్చిన కొందరు భక్తులు, విల్ బాకెట్లు, ఇంకా కొంతమంది హైజియా హౌస్‌లోనే బస చేశారు.

లండన్‌లో ప్రసిద్ధ కళాకారు డొకడు బాబా చిత్రమును లిఖింప నెంచి తన స్టూడియోకి రెండుమారులు బాబాను ఆహ్వానించి ప్రతిమారు గంటసేపు వారి చిత్రమును లిఖించే పనిలో గడిపెను.

లండన్‌లో సర్కిల్ ఎడిటోరియల్ కమిటీ అని ఒక సంపాదక వర్గము ఒక పుస్తకమును తయారు చేశారు.— "ది పెర్ఫెక్ట్ మాస్టర్—క్వెశ్చన్స్ అండ్ ఆన్సర్స్" (సంపూర్ణ సద్గురువు – ప్రశ్నలు, ఉత్తరములు) – అప్పుడు బాబా ఇటలీలో పోర్టొఫినోలో ఉన్నారు. ఈ పుస్తకం ఆయనకు పంపించి అది ప్రచురించుటకు అంగీకారము బడసిరి.

## ఆశ్రిత వాత్సల్యము :

లండన్‌లో ఒకరోజున పాశ్చాత్య బృందంతో వుండగా ఉదయాన్నే మేరీ బాకెట్‌ను దగ్గరకు పిలిచి బాబా – "నేను వూరుకి (కెంట్‌లోచి సెవెన్ ఓక్స్) మీ యింటికి వస్తున్నాను" అన్నారు. మేరీ, ఆమె భర్త విల్ లండన్‌లో ఉంటూ అప్పుడప్పుడు వారి గృహానికి వెళ్ళి వస్తూంటారు. సెవెన్ ఓక్స్ లండన్‌కి 20 మైళ్ళ దూరంలో వున్నది. బాబా తన యిల్లు పావనం చేస్తానని వారంతట వారే అనగానే మేరీకి అంతకంటె కావలసిందేముంది ? ఆమె స్వర్గాని కెగిరినంత ఆనందం పొందింది. బాబా ఇండియానుంచి వారితో వచ్చిన ముగ్గురు శిష్యులతో తన ఇంటికి వచ్చినట్లు ఊహించుకోసాగింది.

కొంచెంసేపయిన తరువాత బాబా మేరీని పిలిచి — "రేపు నీ యింటికి మేమంతా వచ్చి టీ తీసుకుంటాము: మొత్తం ఇరవై ఇద్దరం" అన్నారు. ఇప్పటి దాకా సంతోషంతో ఉప్పొంగిపోతూన్న మేరీ ఈ మాట వినగానే కృంగిపోయింది. తన యిల్లెంత ? బాబాతో ఇంతమంది వస్తే ఎక్కడ కూర్చుంటారు ? తాను ఎలా సమర్థించుకోగలదు ? ఆ ఇంట్లో ఉన్నదే ఒక చిన్న గది. ఎవరైనా వస్తే కూర్చో డానికి ఇంట్లో ఉన్నవి మూడో నాలుగో కుర్చీలున్నాయి. రెండో మూడో కప్పులు సాసర్లు; అంతకంటె లేవు. బాబాతో వచ్చే అతిథులకు ఎలా సత్కార మివ్వాలా అని కడుపులో పుట్టెడు బెంగ ఏర్పడింది మేరీకి. ఆమె పాపం సామాన్య సంసారి. ఏదో కాలక్షేపం చేస్తోంది. ఇంతమంది వస్తే రసాభాస ఎలాగూ తప్పదు అనుకున్నది. పైకి ఏమీ అనలేకపోయింది ఏం చెప్పగలదు పాపం ? తనకి ఒక పెద్ద సమస్య ఏర్పడింది.

ఇలా ఆమె మనసులో మధనపడుతూండగా బాబా చిరునవ్వుతో అందరికీ తెలిసేలా ఇలా ఒక ఆజ్ఞ జారీచేశారు "రేపు మీరు మేరీ ఇంటికి వచ్చేటప్పుడు తలొక కప్పు, ప్లేటు కూడా తెచ్చుకోవాలి. అక్కడకు వెళ్ళిన తరువాత అందరూ ఎక్కడ జాగా వుంటే అక్కడే. క్రిందనైనా సరే కూర్చోవాలి" అని అన్నారు బాబా. బాబా ఇలా చెప్పగానే ఆమె నివేదించుకో నక్కరలేకుండానే తన హృదయం లోని బరువునే ఒక్కమారుగా బాబా దింపేశారని ఆమె మనసులోని బెంగను మాయం చేశారని బాబాకు ఆమె సహస్ర కృతజ్ఞతాభివందనాలు మనసులోనే అర్పించింది.

మర్నాడు మేరీ యింటికి వెళ్ళినపుడు బాబా పరివారం అందరు ఎక్కడ స్థలం వుంటే అక్కడ. నేలమీద, మెట్లమీద, ముందర వాకిట్లోను సర్దుకుని కూర్చున్నారు. మేరీ టీ తీసుకు వచ్చినపుడు ఎవరి కప్పులో వారు పోయించుకుని త్రాగారు. అక్కడ వారి సందడేగాని అంతా ప్రశాంతంగా వుంది. బాబా అందరితోను "ఇది నా యిల్లు" అని అక్షరఫలకం మీద చూపించి చెప్పారు. విల్ దంపతులంటే బాబాకి ఎంత ప్రేమ,

ఆ సమయంలో వచ్చిన అతిథులలో ఒక ప్రేమికురాలు విల్, మేరీల ఆదర్శ వంతమయిన భక్తి, ఉపచారము చూచి "నేను లండన్‌లో బాకెట్సు ఇంటికి వెళ్ళాను. అనేకులు బాబాను ప్రేమిస్తారు. వారంతా బాబాను సంబంధించినంతవరకు వారి స్వంతాన్ని గురించే ఆలోచిస్తారు. బాకెట్సు (విల్, మేరీలు) మాత్రం వారి స్వంత

విషయం వదిలేసి బాబా గురించే ఆలోచిస్తూ ఉంటారు. అందుకనే ఈ యిల్లు బాబా ప్రేమతో నిండిపోయింది" అని చెప్పింది. వారి యందు బాబాకు అంత ప్రేమ కలదు కనుకనే బాబా మేరీ మనసులోని ఆందోళనను క్షణంలో మాయంచేసి నెమ్మది కలిగించారు. అందుకనే "ఇది నా యిల్లు" అని బాబా ప్రేమతో అన్నారు.

బాబా చికాగో (అమెరికా)కు వెళ్ళలేదు. అందుకు బదులు బాబా స్పెయిన్ దేశానికి అక్టోబరు 22వ తేదీన బయలుదేరి వెళ్ళారు. ఈ మార్పుకు ఎంత బలీయమైన ఆధ్యాత్మిక కారణాలున్నాయో బాబాకే తెలియాలి.

ఈ మారు బాబా స్పెయిన్ దేశంలోని సెయింట్ తెరెసా యొక్కయు, సెయింట్ జాన్ ఆఫ్ ది క్రాస్ యొక్కయు జన్మ స్థలమయిన అవిలాకు వెళ్ళారు. బాబా అక్కడ 24 గంటలున్నారు. ఆ 24 గంటలూ బాబా వారితో వెళ్ళిన మండలి, ఇతరు శిష్యులు, అందరూ ఉపవాసం వున్నారు. అక్కడ జన్మించిన మహాభక్తుల యెడల ప్రేమచేత అలా వారు నియమం పాటించారు. ఆ భక్తాగ్రేసరుల వలననే ఆ స్థలమునకు అంతటి ప్రసిద్ధి, పవిత్రత కలిగినది. ఈ సమయమునందు బాబా శరీరము ఆధ్యాత్మిక ప్రవాహము చాలా శక్తివంతముగా నుండుటచే ఎవరినీ బాబా తమను స్పృశించవలదని శాసించారు.

స్పెయిన్ దేశమునందు గ్రామాలు భారతదేశంలో గ్రామాల వలెనే ఉన్నాయి గాని ఒక పాశ్చాత్య దేశంలో ఉన్నట్టు మండలికి అనిపించలేదు. 24 గంటల ఉపవాసముతో మరునాడు ఉదయం సెయింట్ జాన్ కెథిడ్రల్‌లో ప్రవేశించారు. చాలా ఎత్తయిన గోడలు, స్తంభాలు మీద వున్న పై కప్పుకి లోపల బంగారు అలంకారం చేయబడివుంది. వసారాలు, కిటికీలు లేనందువల్ల గుహలలోకి వెళ్ళినట్లుగా వుంది. అస్సిసీలో వలెను, వెనిస్‌లోని సెయింట్ మార్క్స్‌లో వలెను ఇక్కడ ఆధ్యాత్మిక వాతావరణంవల్ల అందరికీ ఉత్తేజం కలిగింది. అక్కడ చర్చిలో నాలుగు వెండి నాణెములను బాబా ఇప్పించారు.

అక్కడి నుంచి సెయింట్ తెరెసా ఆలయానికి వెళ్ళి అక్కడ డాబామీద ఎక్కి చూచారు. అవిలా చిన్న పట్టణము డాబామీద నుంచి చుట్టూ వున్న కొండలు కనిపించాయి. దానికి వెనుకనున్న ఒక కొండ చూపించి అక్కడికి వెళ్ళాలని చెప్పారు. అందరిని అక్కడికి తీసుకెళ్ళిన తరువాత అవిలాకేసి తిరిగి చూచారు. అవిలా చుట్టూ వున్న గోడలమీద సూర్యరశ్మి బాగా పడుతోంది.

అనేక సంవత్సరాల క్రిందట బాబా ఈ కెథిడ్రల్ కట్టకముందు. పూర్వావతారంలో కాబోలు, అక్కడికి వెళ్ళి యున్నారట. అప్పుడు బాబా కూర్చున్న కొండ మీదకి ఇప్పుడు వెళ్ళాలని అది చూడాలని బాబా పరివారాన్ని తీసుకుని వెడుతున్నారు. జ్ఞాపకార్థం బాబా బృందంలోని శిష్యులు సుగంధయుతమైన కొన్ని ఓషధులను తీసుకున్నారు, ఆ కొండమీద నుంచి

అక్కడ నుంచి మరలివచ్చి వారి ఉపవాసాన్ని విరమించారు. బాబా వారికి పళ్ళు, టీ, ద్రాక్షసారాయము యిప్పించారు. అవిలాకు వచ్చినందుకు బాబా చాలా సంతోషించారు. బాబా ఈ విధంగా వివరించారు. – "యూరప్‌లో ముఖ్యమయిన ఆధ్యాత్మిక కేంద్రాలు నాలుగున్నాయి. అవిలా ఒకటి. వెనిస్‌లోని సెయింట్ మార్క్సు రెండవది, ఇటలీలో లిగూరియా తీరంలో వున్న ఒక స్థలము, మూడవది, ఆ దేశంలోనే అస్సిసీ నాల్గవది. ఇవన్నీ కూడా బాబా చూచి వచ్చారు. వారు సెయింట్ ఫ్రాన్సిస్, సెయింట్ తెరెసాను, సెయింట్ జాన్ ఆఫ్ ది క్రాస్‌ని తలుచుకున్నారు. బాబా శిష్యులలో ఒకరిని పదిరోజులలో మరల అవిలాకు వచ్చి అక్కడ వారం రోజులుండి ప్రతి రోజున ఈ స్థలమునకు రావలసిందని చెప్పారు.

24 వ తేదీ రాత్రి 10–30 గంటలకు బాబా వారి పరివారంతో మేడ్రిడ్ చేరారు. అక్కడ బాబా చెప్పిన హోటలులో దిగారు. ఆ మర్నాడు ఉదయం బాబాకి కావలసిన వేడినీళ్ళ స్నానం ఆ హోటలులో లభించలేదు. హోటలులోని సిబ్బందిని పైకి, క్రిందకీ అనేక మార్లు త్రిప్పారు బాబా. హోటలు వాళ్ళతో మండలివారు పేచీ పడ్డారు. సాధారణంగా జనం స్పెయిన్ దేశంలో రాత్రి 10 గంటలకు భోజనంచేసి 12 గంటల ప్రాంతాలకి పరుంటారు ఉదయాన్నే చాలా ఆలస్యంగా లేస్తారు.

అక్కడ భోజనం కూడా ఈ వచ్చిన మండలికి ఎవరికీ సయించలేదు. ఆ రాత్రి బాబా తమ బృందముతో ఒక కాబరేట్ నాట్య ప్రదర్శనమునకు వెళ్ళారు. అది తక్కువరకపు నాట్యశాల. అందులో బల్లలవద్ద మాగ్డలీన్ మేరీలు చాలామంది కూర్చున్నారు. రంగంమీద కొందరు అద్భుతమయిన స్పానిష్ నాట్యకళాకారులు కనిపించారు. పాత స్పానిష్ జాతీయ నృత్యాలు చూచి బాబా పరివారంలో చాలామంది సంతోషించారు. అలాంటిచోట బాబా వుండడం మామూలు మనుష్యులకు వింతగా వుండవచ్చు. కాని ఆయన యొక్క ఆధ్యాత్మిక అవసారాలు వారు గ్రహించలేరు. మర్నాడు ఉదయం మండలివారు వేడినీళ్ళ కుళాయిల వద్దకు పరుగెత్తారు. హోటలు

వారు క్రితం రోజున వేడినీళ్ళు లేవని ఫిర్యాదుచేసి గొడవచేస్తే ఈ రోజున తప్పక సరఫరా చేస్తామని వాగ్దానం చేశారు. అయినా ఆ రోజుకూడా వేడినీరు దొరకలేదు. బాబాకు అసంతోషం కలిగింది. ఇది బాబా యెన్నుకున్న హోటలేకగా దీనికింత గొడవ యెందుకు చేయాలి ? ప్రయాణాల కంపెనీకి ట్రంకుకాల్ చేసి చెప్పారు. వారు కూడా ఈ హోటలే ఏర్పాటు చేశారు బాబా తమ మకాము ను ఇంకొక చోటకి-హోటెల్ లాన్‌డర్స్‌కి మార్చారు అది ఆదర్శపూర్వకంగా వుంది. బాబా గదిలో నుంచి ది గేట్ ఆఫ్ ది సన్ కనిపిస్తూ వుంది.

కావాలని బాబా వారి శిష్యులలోని కొన్ని కొన్ని చెడ్డ గుణాలను రెకెత్తించి అవి రూపుమాపాలని ఇలా చేశారు—

కొత్త హోటలుకి మారిన తరువాత ఎండ బాగా కాస్తోందని అనేక మైళ్ళు నడిచి వచ్చారు. జీసస్ వారి శిష్యుల యొక్క జీవితగాధను కనపరిచే ప్రాడో ఆర్ట్ గాలరీకి, ఎల్. గ్రెకో, వెలాస్క్వెజ్, గోయాలకి వెళ్ళి చూచివచ్చారు. థియేటర్ ఎస్పనాల్‌కి వెళ్ళి బాబా తన శిష్యులతో ఆర్జెంటినా నృత్యం చూచారు.

రాజప్రాసాదం చూడటానికి వెళ్ళినపుడు లోపలికి వెళ్ళకుండా రాజ సేవకులు బాబాను అటకాయించారు ఎందుచేతనంటే బాబా టోపీ పెట్టుకుని తియ్యలేదు గనుక. పొడుగాటి శిరోజాలు అందరికి కనపరచటం ఆయనకు ఇష్టంలేదు. అప్పుడు "ఏం చెయ్యాలి మమ్మల్ని కూడా వెళ్ళడం మానమంటారా ? లేక మీరు లేకుండా త్వరగా లోపలికి వెళ్ళి మమ్మల్ని చూచి రమ్మంటారా ?" అని అడుగగా 'వెళ్ళండి' అని బాబా చెప్పారు ముగ్గురు మాత్రం లోపలికి త్వరితంగా వెళ్ళివచ్చారు ఇలా వెళ్ళి వచ్చినవారు తమ అవివేకానికి తరువాత నొచ్చుకున్నారు బాబాను బయట వదలి వెళ్ళినందుకు.

హోటల్ లాండర్స్ చాలా అద్భుతంగా వుంది. కాని బాబా బృందానిక కావలసినంత వెల్లుల్లి, మిరియాలు లేవు ఆహారంలో. అదంతా నొరీనా చూచుకోవాలి. భోజన సమయానికి ముందు పాపం ఆమె కిందికి మీదకి, వంటఇంటికి వెళ్ళి వస్తూం డేది. వీళ్ళు పైన మూడవ అంతస్తులో ఉంటున్నారు. ఆ స్పెయిన్ దేశస్తులతో ఆమెకు వచ్చీరాని భాషల్లో మాట్లాడుతూ తంటాలు పడుతోంది. ఆ హోటలువాళ్ళు 'వీళ్ళు యెక్కడో విచిత్రమైన వాళ్ళలా ఉన్నారే' అనుకున్నారేగాని వారు దయగానే ప్రవర్తించారు వీరియెడల. ఈ విధంగా నొరీనాలోని భావాలు, గుణాలు రేపి బాబా

ఆమెలో కావలసిన మార్పుచేశారు. కాని ఆఖరి నాలుగు రోజులలోను హోటలువాళ్ళు బాబాకు, బృందానికి చాలా మంచి ఆహారం పెట్టారు. వారి కది ఎంతో ఇష్టమయింది.

బాబా ఏ దేశానికి వెళ్ళినా మామూలుగా చేసినట్లుగానే స్పెయిన్‌లోకూడా ప్రజా సామాన్యాన్ని సాంగత్యం చేయాలనుకున్నారు. అవిలా నుండి బాబా మేడ్రిడ్‌కి వెళ్ళి అక్కడ వీధులలో తమ పరివారంతో కూడా రోజంతా కాళ్ళు నొప్పులు పెట్టే దాకా తిరిగారు. ముఖ్యంగా సెంట్రల్ స్క్వేర్ ప్యూర్టా డెల్‌సోల్‌లో జనసమూహాలతో నిలబడి చాలా సేపు వున్నారు. కొంతసేపు రాజమార్గంలో ది గేట్ ఆఫ్ ది సన్ దగ్గర నడిచారు. బాబా యూరప్‌దేశపు దుస్తులు వేసుకున్నారు. వారి కేశములను గుప్తపరిచే స్పెయిన్‌దేశపు టోపీని ధరించారు. ఆ దేశ ప్రజలు వేసుకునే దుస్తులకు భిన్నముకాని దుస్తులు వేసుకున్నా బాబాకేసి ప్రజలు తేరిపారజూస్తున్నారు. ఆయనలో ఏదో శక్తి వారిని ఆకర్షించుచుండెను. దీనికి కారణం బాబా చేయుచున్న శక్తివంతమయిన ఆంతరికపుపని అని బాబాయే చెప్పారు. ఇతర సమయాల్లోను, ఇతర స్థలాల్లోను బాబాను ఇంతగా ప్రజలు ఆకర్షితులై చూడలేదు. స్పానిష్ యుద్ధమునకు ముందు బాబా ఆ దేశమునకు వెళ్ళియున్నందున బాబా ఆ ప్రజలలోని చైతన్యమునందు వారికి తెలియకుండానే కొన్ని కార్మిక శక్తులను రేపుచుండిరి. మంచి కలగడానికి ముందు ఈ కార్మిక శక్తుల వలన స్పానిష్ ప్రజలు కొన్ని బాధలు అనుభవింపవలసి వుండెను.

ఒకరోజు మధ్యాహ్నం బాబావారి పరివారంతో మంజానారెస్ నదిని దాటి మేడ్రిడ్ నగరమునకు ఎదుట వున్న ఒక పర్వతమును ఆరోహించారు. తరువాత ఆ పర్వతంమీద ఒక పెద్ద ఆలివ్ చెట్టుక్రింద నీడలో కూర్చున్నారు బాబా. వారిచుట్టు వారి పరివారం కూర్చున్నారు. భవిష్యత్తులో ప్రపంచంలో వారు బాబా యొక్క పనిలో పాల్గొనే అవసరం గురించి బాబా ముచ్చటించారు. అలా వారు బాబాచుట్టు కూర్చుండి యుండగా ఎంతసేపు కూర్చున్నారో సమయం తెలియలేదు. ఇలాగే జీసస్ అనుయాయులు ఆయన చుట్టునూ, బృందావనంలో గోపగోపీజనం శ్రీకృష్ణుని చుట్టును కూర్చున్నట్లును ఇప్పుడు వీరు బాబా చుట్టును కూర్చున్నారు. బాబా తమపరివారంతో ప్రతి రాత్రి సినీమాకు వెడుతూండేవారు. ఎక్కడికి వెళ్ళవలసినది దానికి తగిన ఏర్పాటు చేయడం ఆ సినీమాకు టిక్కెట్లు కొనితేవడం అదంతా టాడ్ యొక్క పని. ఒక సాయంకాలం మేడ్రిడ్ నగరంలో కూలీలపేటకు వెళ్ళారు. ఆ బీదవారి గృహాల వద్దనుంచి నడుస్తుంటే బాబాకు చాలా సంతోషం కలిగింది.

ఒక సంగీత నాట్య ప్రదర్శనానికి వెళ్ళారు. కాని అది మూడవ తరగతి ప్రదర్శనం. అది వీరికి తగినది కాదు. అయినా ఒక్కటి మాత్రం– జానపదగీతాలు పాడిన రంగం బాబాకి నచ్చింది. తరువాత సముద్రంలో నీటి అడుగున ప్రయాణం చేసే సబ్‌మెరీన్లను చూపించిన ఒక ఉఫా అనే జర్మన్ ఫిలిం చూడదానికి ఒక సినీమాకు వెళ్ళారు. కాని బాబా అందులో కూర్చోవడానికి సరియయిన చోటు ఏర్పాటు చేయలేకపోయాడు టాడ్. బాబాకు యిష్టమయిన సినీమా చూచి ఆనందించడానికి వీలులేకుండా పోయిందని అతడు చాలా బాధపడ్డాడు. జనం క్రిక్కిరిసి వున్నారు. అతనికి స్పానిష్ భాష రాదు. అందుచేత బాల్కనీలో రెండో పంక్తిలో దొరికింది చోటు.

ఆఖరు ఆదివారంనాడు మధ్యాహ్నం ఒక ఎద్దుల పోరాటం ఏర్పాటయింది. మేడ్రిడ్‌లో ఇలాటి ప్రదర్శనాలు ఏర్పాటుచేసే స్థలం. హిపోడ్రోమ్ అని వుంది. బాబా దానికి టిక్కెట్లు కొనమని మండలికి ఆనతిచ్చారు. మొదటి ఎద్దు రాగానే ఒక స్త్రీ ప్రక్కనున్న వాడి చెయ్యి పట్టుకుని గట్టిగా అరవడం మొదలెట్టింది. అలా ప్రతి మాటు గట్టిగా అరిచేది. రెండో ఎద్దుల పోరాటంలో ఒక ఎద్దు చచ్చిపోయిన తరువాత బాబా వారి మండలితో లేచి వెళ్ళిపోయారు. తరువాతే అసలు ముఖ్యమయిన పోరాటం వుందని అందరూ అన్నారు. బాబా వచ్చినపని అయిపోయింది గనుక ఇంక ఉండనక్కర లేదన్నారు.

అక్కడి నుంచి అక్టోబరు 31 వ తేదీనాడు బయలుదేరి బాబా నవంబరు 1వ తేదీ ఉదయానికి బార్సెలోనా వెళ్ళారు. ఆ రోజున స్పానిష్ ప్రభుత్వంవారు మేడ్రిడ్ నుంచి ప్రత్యేకంగా ఒక ప్రతినిధిని కాటలోనియా పంపించారు. అతడు కాటలోనియా యొక్క రాజ్యాంగ రీత్యా అక్కడ పరిపాలన సాగించమని ఆ రోజున అదే సమయంలో అతడు బార్సెలోనాలో దిగాడు. ఆ సందర్భంలో నగరంలోని పెద్దలందరు ఒక ఊరేగింపు చేశారు. బాబా ఒకచోట నుంచి ఒక పిట్ట గోడవద్ద ఎత్తైన ప్రదేశం మీద నిలబడి చూచారు. బాబారాక ఈ ప్రధాన సంఘటన ఉన్నరోజునే సరిగా వచ్చింది. ఒక మార్గదర్శి సహాయంతో 1700 అడుగుల ఎత్తునవున్న మౌంట్ టిబిడాబో మీదకి ఎక్కి చూచారు. ఆ యెత్తుమీద నుంచి అద్భుతమైన దృశ్యం కనబడుతోంది.

బార్సెలోనా నగరమధ్య భాగంలో ప్లాజా డి కటాలునా వున్నది. అది ప్రజల తోను, బండ్లతోను రద్దీగావుండే కూడలి స్థలం. రోమ్‌లోలాగే ఇక్కడ కూడా ప్లాజాలో మధ్యగాఉన్న కెఫేలో కొంతసేపు కూర్చున్నారు. సాయంకాలం జనసమ్మర్ధంగా వున్న వీధులలో బాబా మండలితో నడిచారు. ఇంతలోనే సంధ్యాసమయం అతిక్రమిస్తూంటే దీపాలు వెలిగించారు. ఆ ప్రజలకు వారి మధ్యను ఎవరు నడుస్తున్నారో ఏమి తెలుస్తుంది, ఎక్కడో ఒకడికి తప్ప? ఆ ఒక్కడూ ఒక పోలీసుమనిషి. ఆ సంజవేళలో అతడు బాబావద్దకు వచ్చి ఆయన్ను కలిశాడు. అతడు ఎప్పుడూ పనిమీదే ఉన్నట్లుంటాడు. ఆ ప్లాజాచౌక్‌లో అతడు బాబాకేసి చూస్తూ నిలబడ్డాడు. అతడెవరని మండలి బాబాను అడుగగా బాబా 'అతడొక ప్రతినిధి' అని చెప్పారు. అక్కడ ఆ చౌక్‌లో అనేక వేలమంది ప్రజలు తిరుగుతూ వుంటే బాబాను తెలుసుకున్నవాడు అతడొక్కడే.

బాబా ఇంకొక ప్రసిద్ధమయిన పవిత్ర స్థలమును జూచుటకు వెళ్ళారు. మాంట్ సెర్రాట్ అనేచోట సెయింట్ ఇగ్నేషియస్ అను సాధుపురుషుని ఆలయమును చూచారు. ఆ స్థలము హోలీగ్రెయిల్ అను కథకు కూడా సంబంధించినదై యుండెను. తరువాత ఆ స్థలమునందు బాబావారి బృందముతో కూడా కొంతకాలము భవిష్యత్తులో నివాసము చేసెదరని చెప్పారు. అది మరియొక అవతారమునందు సాధ్యము కావచ్చును.

బాబా బార్సెలోనా నుంచి తిరుగు ప్రయాణము చేయవలసిన సమయము ఆసన్నమైనది. నవంబరు 1వ తేదీ సాయంకాలం 7 గంటలకు బయలుదేరి మర్నాడు ఉదయం 7 గంటలకు బాబా మార్సెల్స్ పట్టణమునకు చేరుకొనిరి. మార్సెల్స్‌రేవుకు ఇద్దరు భక్తులు మిలాన్ నుంచి ఎనిడ్, జూరిచ్ నుంచి ఓట్టో – బాబాకోసం వచ్చియున్నారు. బాబా తిన్నగా హోటల్ బ్రిస్టల్‌కివెళ్ళి స్నానంచేసి అల్పాహారం ముగించారు. తరువాత బాబా ఎనిడ్‌తోను, ఓట్టోతోను విడివిడిగా సంభాషించారు.

బాబా 1933 నవంబరు 2వ తేదీ మధ్యాహ్నం 12 గంటలకు "వైస్రాయి ఆఫ్ ఇండియా" అను ఓడ నెక్కారు. ఆ రోజున బాబా నుండి ప్రసరించుచున్న ప్రేమతరంగాలు బహు శక్తివంతములై వారి దర్శనార్థము వచ్చినవారి మీద చిరకాలము వరకు ప్రభావము కలిగియుండెను. ఓడ బయలుదేరేముందు కొంచెంసేపు

వారి ప్రేమికులందరు బాబాతో కూర్చుండి యున్నారు. గంభీరమయిన ఆ వాతావరణంలో బాబా నుండి విడిపోవలసిన ఆ క్షణం అందరికీ బాధాకరంగానే వున్నది.

బాబా పరివారమంతా వారి కేబిన్‌లో వారి పాదాల ముందు నిశ్శబ్దంగా కూర్చుని యున్నారు. క్రింద ఎవరో సంగీత వాయిద్య మేదో వాయిస్తున్నారు. కొంచెం సేపట్లో అందరికి వీడ్కోలు చెప్పి బాబా సెలవు తీసుకుని దిగిపోయారు.

బాబా నవంబరు 14వ తేదీన బొంబాయిలో ఓడ దిగారు. ఆ నెలాఖరుకి బాబా నాసిక్ నుంచి వారి మకాం మెహెరాబాద్‌కు మార్చివేశారు. మెహెరాబాద్ కొండ మీద సావిళ్ళు పాకలు నిర్మాణం చేయించారు. మెహెరాబాద్ వచ్చిన తరువాత బాబా చాలామట్టుకు ఏకాంతంగానే ఉంటూ వచ్చారు నవంబరు 30వ తేదీ నాటికి అన్నీ మెహెరాబాద్‌కు తరలించుకు రావడం పూర్తి అయింది.

## మెహెరాబాద్‌లో :

బాబా యూరప్ నుంచి వచ్చినప్పటినుంచి మెహెరాబాద్ ఆశ్రమంలో హడావిడి ఎక్కువయింది. బాబా మండలి అందరూ, మొత్తం 70 మంది, అక్కడే నివసించడానికి ఏర్పాట్లు జరిగాయి. పాశ్చాత్య దేశాలనుంచి కొంతమంది వచ్చి వుండడానికి కూడా వీలుగా ఏర్పాట్లు చేశారు.

బాబా కొండమీద ఒక గుహలాటి గదిలో ఏకాంతంగా వుండడం ప్రారంభించారు. ప్రతి రోజూ బాబా కొండమీద నుంచి ఉదయం 8 గంటల నుండి 11 గంటల వరకు సాయంకాలం 4 గంటల నుండి 7 గంటల వరకు మండలితో వుండటానికి దిగి వస్తూవుండేవారు. ఈ ఆరు గంటల సమయములోనూ శిష్యులందరకు సామూహికంగానూ వేరే వేరే గాను వారి దినచర్య గురించి ఇంకా అనేక ఆధ్యాత్మిక విషయాలమీద ప్రసంగాలు చేసేవారు. మరియు బాబా అనేక దేశాలనుంచి భారతదేశంలో అనేక నగరాల నుంచి భక్తులు వ్రాసిన ఉత్తరాలు చూచి ప్రత్యుత్తరాలు వ్రాయించేవారు. ప్రతి రోజూ పాశ్చాత్య దేశాలలో భక్తుల సంఖ్య ఎక్కువవుతోంది. వారంతా చాలామంది బాబాకు ఉత్తరాలు వ్రాస్తూండబట్టి వాళ్ళందరికి బాబా ప్రత్యుత్తరాలు వ్రాయించడానికి చాలా సమయం వెచ్చించేవారు. కొంతమందికి ప్రత్యుత్తరాలు కేబిల్స్ మూలకంగా పంపించేవారు. ఈ విధంగా ప్రతి రోజూ

పంపించే కేబిల్స్‌కి నెలకి కొన్ని వందల రూపాయిలు ఖర్చు అయేది, ఒక్కొక్కప్పుడు ఒక్క కేబిల్‌కే అది దీర్ఘంగా వున్నప్పుడు వంద రూపాయి లయేది.

ఏకాంతంగా ఎక్కడో మారుమూల వున్న ఈ మెహెరాబాదులో ఎంత పని జరుగుతోందో బయట ప్రపంచానికి ఏమీ తెలియదుకదా. దగ్గరలో వున్న పూనా, బొంబాయి, నాసిక్ లాటి నగరవాసులలో వున్న బాబా భక్తులకే తెలియదు బాబా ఎంత పనిచేస్తున్నారో. సంబంధించినవారికి అయినా ఇతరులకు తెలియదు. ఎందుచేతంటే బాబాకి ముఖ్యంగా వారు చేసే ఆధ్యాత్మిక కార్యము పైకి తెలియడం ఇష్టంలేదు.

బాబా వారి ప్రయాణాలు వారి కదలికలు ఏవీ కూడా పత్రికలలో ప్రకటించడం వారికి బొత్తిగా ఇష్టంలేదు. ఎప్పుడయినా ముఖ్యమయిన సందేశాలు, ప్రసంగాలు వివరాలు చేస్తే అవిమాత్రం ప్రకటించడానికి అంగీకరించేవారు. ప్రపంచంమొత్తంలో ఉన్న ఆధ్యాత్మిక సాధకులకు ఉపకారం జరిగే పని గనుక దానికి ఒప్పుకునేవారు. ఇంతపని చేస్తూంటే బాబా వచ్చినవారితో వారినిచూచి సంభాషించడానికి సమయం చాలేదికాదు. అందుకని పైనుండి వచ్చిన దర్శనార్థులను జూచుటకు ప్రతి లక్ష్మివారం ఉదయం 8 మొదలు 11 గంటలదాకా వినియోగించేవారు ఒక్కొక్కప్పుడు భక్తులు కొంతమంది బాబా సన్నిధిలో భజనలు చేస్తాం పాటలు పాడతాం అని వచ్చేవారు. ముందుగా బాబా యొక్క అనుమతి లేనిదే ఎవరూ రావడానికి వీలులేకపోయేది. అందుకు బాబా వారికి సమయం నిర్దేశించి తెలిపేవారు. బాబా చెప్పిన ప్రకారం మండలిలోని ప్రతి శిష్యుడు వాడివాడి పని చేసుకుపోతూ వుండేవాడు. అందుకు ఎవరికీ ఎక్కువ సమయం మిగిలేదికాదు.

జీవితంలో తారసిల్లే ఎన్నో క్లిష్టసమస్యలు గురించి బాబా సలహాలు పొందా లని వచ్చే ఎంతోమంది భక్తులకు ఆశాభంగం కలుగుతూండేది. బాబాతో కొద్ది నిమిషాలు మాట్లాడితే నేచాలు వారి హృదయాలు తేలికపడడానికి, వారి మనసులో బరువు తగ్గడానికి. అంతమాత్రం అవకాశం దొరకడం వారి అదృష్టంమీద ఆధారపడి వుండేది. దర్శనం చేసుకోడానికి వీలులేదు అంటే అది బాబా వారికి పెట్టిన ఒక పరీక్ష లాగే అనుకుని బాబా ఇచ్ఛకు లోబడి పిలిచేదాకా వేచియుండేవారు. కొంతమంది ఇంత దూరం రాలేక ఉత్తరాలలోనే వారి గోడు వెళ్ళబోసుకొనేవారు. కొంతమంది

రానూ రాక ఉత్తరాలూ వ్రాయక అంతరంగంలోనే బాబాను తలచుకొంటూ వారికున్న కష్ట సుఖాలు బాబాకు నివేదిస్తూ వుండేవారు. వీరికి తప్పకుండా బాబా ఊరట కలిగించే వారు. ఇది ఉత్తమ పద్ధతే. అయితే అలా చేయడానికి మనకి భక్తి విశ్వాసాలు బలంగా వుండాలి. బాహ్యంగా ఎన్ని వేల మైళ్ళ దూరంలో ఉన్నా లోపల మనం బాబాను తలుచుకున్నామంటే బాబా తప్పకుండా మన మొర ఆలకిస్తారు. భక్తుల అంతరంగ ప్రార్థన, వారి హృదయ విలాపము బాబా వినకుండా ఉండలేరు.

బాబా మానవులయొక్క ఆధ్యాత్మికాభ్యున్నతికి ఒక ఫిలిం నిర్మించమని పాశ్చాత్య దేశాలు వెళ్ళినపుడు కొందరు నిర్మాతలతో మాటలాడి కొన్ని వివరాలు చెప్పారు. దానికథ యావత్తూ బాబా రచించారు. అందులో సృష్టికార్యము, పరిణామ సూత్రము, పునర్జన్మ సిద్ధాంతము, ఆంతరంగ భూమికలలోని అద్భుతానుభవములు చివరకు జ్ఞానప్రాప్తి అంటే భగవత్సాక్షాత్కారము – ఈ విషయాలు సుబోధకంగా చూపించబడతాయి. జీవిత ప్రారంభం నుంచి మానవునికి ఆత్మజ్ఞానం కలిగేవరకు వివిధావస్థలు అద్భుతంగా వివరాలతో చిత్రింపబడతాయి. అందులో పాత్రధారులుగా అవసరమయితే బాబా శిష్యులు ఉంటారు. ఫిలిం శాఖలో అతినిపుణుడయిన దర్శకుని చేత, అతి నేర్పరియయిన కళాకారునిచేత అది నడపబడుతుంది. అది చూచే ప్రేక్షకునిలో దివ్యమైన ప్రేమ కలిగేలా ప్రేరణవస్తుంది. ఇటువంటిది తయారు కావడానికి ఇది మొదటి ఫిలిం అవుతుంది. అన్ని మతాలయొక్క వేదాంత గ్రంథాలలో నిర్వచించిన మానవ జీవిత పరమావధి ఏమిటో, మానవజీవితం సార్థకం అయేది దేనివల్లనో ఆ పరమలక్ష్యం ఆ ఫిలిములో చక్కగా ప్రదర్శిస్తారు అప్పుడు ఈ ఫిలిము ప్రపంచ మానవులు తిలకించినపుడు దివ్యమైన ఉత్తేజం వారికి కలుగుతుంది గనుక వారు దాని వలన బాగా ప్రభావితులౌతారు. ఆశ్చర్యమైనటువంటి ఒక కళాఖండంగా రూపొందుతుంది అది. బాబా స్వకీయానుభవం అందులో ఉపయోగిస్తారు గనుక అంత విశిష్టంగా అది ఉంటుంది. ఉత్తమ కళాకారుడు, గొప్ప నిపుణుడు, కవి అయినవాడు దీనికి అప్పుడే సినేరియో వ్రాయడం ప్రారంభించాడు. ఉజ్జ్వలమయిన ఈ ఉత్తమ చిత్రానికి అనేక మంది సాంకేతిక సహాయం చేస్తామని ముందుకు వస్తున్నారు.

పుస్తకాలద్వారాను, పత్రికలద్వారాను బాబా ఆధ్యాత్మిక సందేశాలను ఇంత వరకు ప్రపంచంలో ఆధ్యాత్మికజ్ఞానం కావలసిన వారికి అందచేశారు. ఇప్పుడు అఖి

ప్రపంచానికి ఈ చిత్రంద్వారా వారియొక్క ఆధ్యాత్మిక జ్ఞానబోధ వ్యాప్తం అవుతుం దని ఆశించవచ్చును.

అమెరికాలోని నిర్మాతలతో మాటలు జరుగుతున్నాయి. ఒక ఒప్పందానికి ఇంకారాలేదు. అది కుదిరిందంటే బాబా ఈ పనికోసం మరల వారి శిష్యులతో బయలు దేరి అమెరికా వెళ్ళవలసి వుంటుంది. అనుకున్న ఈ చిత్రం పూర్తికావచ్చు లేదా అసలు లేకపోవచ్చు. అంతా బాబా ఇచ్ఛప్రకారం జరుగుతుంది.

1934 వ సంవత్సరం ఫిబ్రవరి మాసంలో తమ 40 వ జన్మదినోత్సవానికి బాబా ఈ విధంగా సందేశం యిచ్చారు —

"భారత దేశంలో నిమ్నజాతులు అని కొందరిని కేటాయించడంతో దేశమే నిమ్నంగా అయిపోయింది ఆ నిమ్నజాతులు ఉద్ధరించ బడినపుడే, ప్రపంచంలో అన్నిటి కంటె గొప్పది కాకపోయినా, భారతదేశం ఒక గొప్ప దేశం కాగలదు."

బాబా భారతదేశంలో పర్యటిస్తూ ఒక పట్టణంలో ఈ విధంగా చెప్పారు — "ఒక చివరనుంచి ఇంత దూరం రెండో చివరకు ప్రయాణంచేసి మీ ఉత్స వాలలో స్వయంగా పాల్గొనటానికి వచ్చేనంటే మీ ప్రేమయే నన్నీవిధంగా ఇక్కడకు లాక్కొని వచ్చింది. (ప్రేమ ఒక మహత్తరమైన శక్తి. దానివలన ఒకడు నిస్వార్థసేవ అనే ఆదర్శాన్ని ఆచరణలో పెట్టగలడు. అంతేకాదు, వాని ప్రేమ భగవంతునిలా మార్చివేయగలదు. ప్రేమతో ఎవరికి తగిన యోగాన్ని వారు అభ్యాసం చేయటానికి వీలవుతుంది. ఆధ్యాత్మిక మార్గంలో పయనించుటకు కావలసిన తీవ్ర నియమాలను సాధకుడు ప్రేమవల్లనే పాటించ గలడు. అవసరమయినపుడు అవసరమయినచోట మార్గంలో ఉన్న సాధకుడు ప్రియతమునితో ఐక్యత సంపాదించుటకు ప్రాపంచిక భోగాలకు విముఖుడై యుండగలడు.)

ప్రేమ ఉన్నచోట ఏకత్వం వున్నది. కులమత భేదాలుగాని, బీద ధనిక భేదాలు గాని, ఎక్కువ తక్కువ భేదాలుగాని, స్పృశ్యత అస్పృశ్యత భేదాలు గాని అందులో అసలులేవు. ఈ భేదాలు నిజముకావని ఈ మధ్య కలిగిన బీహార్ భూకంపం రుజువు పరచినది. అది ప్రకృతి ధర్మాల ప్రకటీకరణ మాత్రమే. ఆ వినాశనంలో ఎవరూ రక్షింపబడలేదు. అందులో ధనికులనీ, పేదవారనీ,

గొప్పవారనీ, తక్కువవారనీ ఈ మతంవారనీ, ఆ మతంవారనీ ఏరకమయిన భేదాలు చూపబడలేదు. వినాశనం అందరిపాలను పడింది. అది దేవుని కోసం కాదు. భగవంతుని ధర్మపరిపాలనలో కులమత దేశ విభేదాలు లేవని తెలియ జేస్తూ ఈ దుస్సంఘటన అందరి కళ్ళను తెరిచింది.

ఇలా శాశ్వతంగా తెలుసుకోడానికి అన్నిటికంటె గొప్పదయిన భగవంతుని ధర్మానికి – ప్రేమకి – ప్రతిమానవుడు తల ఒగ్గవలసినదే. ఈ ప్రేమ న్యాయం ప్రకారం ప్రతి మార్గంలోను – అది విజ్ఞాన శాస్త్రముకానీ, కళకానీ, మతము కానీ, సౌందర్యంకానీ, – అనంతమయిన భగవంతుని సంపూర్ణముగా శాశ్వత ముగా పొందవచ్చును. అన్నిటికంటె ఉన్నతమయిన దివ్యత్వముయొక్క ఈ అంశను ప్రపంచము తెలుసుకొనును గాక !"

సైదాపేట మెహెర్ ఆశ్రమంలో బాబా నలువదవ జన్మదినోత్సవానికి బాబా మెహెరాబాద్ నుంచి స్వయంగా సైదాపేట (మద్రాసు) వచ్చారు. ఆయన, దాదా చాన్జీ, రుస్తుంజీ, రంజూ అబ్దుల్లా మొదలయిన పదకొండుగురు శిష్యులతో 17 ఫిబ్రవరి 1934 తేదీ సాయంకాలానికి సైదాపేట చేరుకొన్నారు.

బాబా పుట్టినరోజు పండుగకు సైదాపేట మెహెర్‌లీగ్ వారు అన్నదాన సమాజంలో నూరుమందికి అన్నదానం చేశారు. వారిలో 50 మంది హరిజనులు కూడా వున్నారు. సైదాపేటలో ప్రాథమిక పాఠశాలలోను, మెహెర్ ఆశ్రమంలోను 100 హరిజన బాలురకు 250 మంది ఇతరులకు బాబా గౌరవార్థం మిఠాయిలు పంచిపెట్టారు. బాబా స్వయంగా అక్కడకు వచ్చియుండుటచేత ఆయన జన్మదినోత్సవం ఇంత వైభవంగా విశిష్టతతో జరిగింది.

ఫిబ్రవరి 18 వ తేదీ ఆదివారం ఉదయం 7 గంటలకు ప్రార్థనలు తరువాత భోజనం చేశారు. బాబాతో కూర్చుని అందరూ రెండు ఫోటోలు తీయించుకున్నారు. మధ్యాహ్నం షడ్రసోపేతమయిన భోజనం అయినాక అందరూ విశ్రాంతి తీసుకున్న తరువాత వీణ ధనం అనే సుప్రసిద్ధ కళాకారిణియొక్క కుమార్తె లక్ష్మిరత్నం, ఆమె మనుమరాలు కలిసి సంగీతం వినిపించారు. ఈ సంగీతం బాబా చాలా మెచ్చుకున్నారు.

సాయంకాలం దివాన్ బహదూర్ జె. వెంకటనారాయణ నాయుడి గారి అధ్యక్షతను బహిరంగసభ జరిగింది. సి. వి. రామానుజాచార్యులు ప్రార్థన చేసెను. తరు

వాత అధ్యక్షుడు బాబాగురించి ఆయన యూరప్, అమెరికా, ఇంగ్లండు, చైనా వగైరా దేశాల పర్యటనను గురించి ఆయన ప్రేమ, సోదరభావ సందేశాల గురించి ఉపన్యసించెను. తరువాత మెహెరాశ్రమ అధ్యక్షుడు సి. వి. సంపత్తయ్యంగారు బాబాకు స్వాగత పత్రం సమర్పించెను. తరవాత రత్నసభాపతి ముదలియార్ బాబా చేసే పనిగురించి ముచ్చటించి దాని సుభాషితాలు కొన్ని చదివి వినిపించెను. మెహెర్‌లీగ్ కార్యదర్శి అయిన సోదరి వి. టి. లక్ష్మి బాబాగురించి గంభీరమైన ఉపన్యాసమిచ్చెను. తరువాత రుస్తుంజీ అను బాబా శిష్యుడు బాబాయొక్క సందేశాన్ని చదివి వినిపించెను. ఆఖరున అధ్యక్షుడు బాబాయొక్క ఘనమైన ఆధ్యాత్మిక కార్యముల గురించి ఆయన చెప్పే సంగతులలో ముఖ్యంగా శాకాహార భోజనము గురించి ప్రసంగించెను. అందరూ మాంసాహార వర్జనచేసి బాబా యెడల తమ ప్రేమను కనపర్చాలని ఉద్బోధించెను.

రాత్రి కొంతమంది గుజరాతీ భక్తులు ఆహ్వానించగా జార్జిటౌన్‌లో ఒక కార్యక్రమానికి బాబా వెళ్ళారు. ఆర్యసమాజ కార్యకర్తయగు కేశవజ్ఞాని హిందీలోను, ఆంగ్లమునందును మాట్లాడెను. అందరూ బాబా దర్శనంచేసి ఆనందించారు.

19 వ తేదీ ఉదయం మెహెర్ ఆశ్రమంలో ప్రార్థనలుచేసి బాబాకు హారతి యిచ్చారు. బాబా ఆరోజున శిష్యులతో బయలుదేరి బొంబాయి ఎక్స్‌ప్రెస్‌మీద సెంట్రల్ స్టేషన్‌నుండి మెహెరాబాదుకి వెళ్ళారు. అనేక వందలమంది స్టేషన్‌కు వచ్చి బాబాజీకి జై అను జయధ్వానములతో మిన్నుముట్టుచుండ బాబాకు వీడ్కోలు నిచ్చారు.

1934 వ సంవత్సరం ఏప్రిల్ మాసం మొదటి పక్షంలో బాబా బొంబాయి వెళ్ళి అక్కడవున్న కొద్ది రోజులలో అనేకమంది భక్తులకు దర్శనమిచ్చారు. బొంబాయినుండి తిరిగివచ్చినతరువాత ఏప్రిల్ 18 వ తేదీన ఉదయం 7-20 గంటలకు బాబా నలుగురు శిష్యులతో మెహెరాబాదునుంచి బయలుదేరి బెంగుళూరు చేరుకున్నారు. ఈ ప్రయాణం మద్రాసు ఎక్స్‌ప్రెస్‌లో చేశారు. ఇది ప్రవచించబడలేదు. బాబాతో కూడా వెళ్ళిన మండలి వంటకి పాత్రసామానులు, బాల్చీలు, లాంతర్లు వగైరా అన్నీ కూడా తీసుకువెళ్ళారు. బెంగుళూరులో శంకరపురంలో మూడవ అడ్డవీధిలో 66 వ నెంబరు యింటిలో బాబా మండలితో బసచేశారు. రాత్రి విశ్రమించి మరునాడు ఉదయం బాబా నందికొండలకు వెళ్ళారు. బాబాతో మదరాసునుంచి వచ్చిన సి. వి.

సంపత్తయ్యంగారు కూడా నందికొండలకు వెళ్ళెను. ఆ కొండలకు దిగువను సుల్తాన్‌పేట అను నొక గ్రామ ముండెను. అక్కడికి చేరేసరికి ఉదయం 4-30 గంటలయింది. అందరూ మధ్యాహ్నం 3 గంటలకి కొండ ఎక్కారు. కొండమీద ఓక్ లాండ్స్ అను కన్నింగ్‌హామ్ బంగళాలో బాబా కోసం 5, 6 నెంబర్లు గల గదులు ముందే రిజర్వు చేయబడినవి. బాబా మండలితో ఆ గదులు ఆక్రమించు కున్నారు. సాయంకాలము 6 గంటలకు భోజనాలు చేశారు

నందికొండలమీద చల్లగా ఆహ్లాదకరంగా వుంటుంది. ఈ కొండలు సముద్ర మట్టానికి 4000 అడుగుల యెత్తున వున్నాయి. సుల్తాన్‌పేట నుంచి కొండమీదికి 1650 మెట్లున్నాయి. కొండమీద ఒక విశాలమైన పీఠభూమి వుంది. దాని మధ్య ప్రసిద్ధి కెక్కిన అమృత సరోవరమున్నది. కొండమీద నుంచి చూస్తే ఒకవైపున కోలారు జిల్లా మరియొక వైపున బెంగుళూరు జిల్లా కనులపండువుగా కనిపిస్తాయి.

టిప్పు సుల్తాన్ ఈ కొండమీద వేసంకాలము గడిపేవాడట. కావున ఇది చరిత్రాత్మకమయిన స్థలము. కుర్చీలలో కూర్చోపెట్టి మెట్లన్నీ ఎక్కించి తీసుకు పోయే వాళ్ళున్నారు. ఈ సౌకర్యం వుంది గనుక చాలామంది ఇక్కడికి చల్ల తనానికి వస్తూంటారు. ఇక్కడి ఉష్ణోగ్రత రాత్రింబగళ్ళు 64° నుంచి 77° వరకు వుంటుంది. అనేక సదుపాయాలతో భోజన వసతి గృహాలు కొండ మీద వున్నాయి. ఆ రోజులలో శాకాహారులకు వేరే భోజన హోటలు వుండేది.

ఏప్రిల్ 26 వ తారీకు దాకా బాబా నందికొండల మీద వున్నారు. 27 వ తేదీన బాబా శిష్యులతో కొండ దిగి బెంగుళూరు తిరిగివచ్చి కెన్‌గేరి అనే గ్రామానికి వెళ్ళి అక్కడ రెండు రోజులు గడిపారు. ఆ గ్రామం బెంగుళూరుకి 9 మైళ్ళ దూరంలో వుంది. అక్కడ నుంచి బెంగుళూరు తిరిగివచ్చి అక్కడ మరి రెండురోజు లుండి మే నెల (1934) 2వ తేదీ నాటికి గుంటకల్ మీదుగా రైలులో మెహెరాబాద్ ఆశ్ర మానికి ఉదయం 7 గంటల 10 నిమిషాలకి మండలితోసహా చేరుకున్నారు.

## సప్తమ పాశ్చాత్యదేశ గమనము:—

1934 సం॥ జూన్ 9 వ తేదీన బొంబాయిలో మంగోలియా అనే ఓడమీద బయలుదేరి 22వ తేదీన బాబా మండలితో మార్సెల్స్‌లో ఓడ దిగారు. అక్కడ రాజ కుమారి నోరీనా మాచెబెల్లీ మరియు లండన్ నుంచి పారిస్ నుంచి వచ్చిన మరి ఇద్దరు

శిష్యులు బాబాకు స్వాగతం యిచ్చారు. బాబా జూన్ 23వ తేదీన బయలుదేరి పారిస్ వెళ్ళారు. పారిస్ నగరంలో బాబా హోటల్ మెట్రోపాలిటన్‌లో బస చేశారు బాబా యొక్క ఆధ్యాత్మిక మయిన ఫిలింకు సినీమాకథ వ్రాస్తున్న గ్రంథకర్త, కవి, కళా కారుడు అయిన డా॥ కె. వి. బాబాను కలుసుకొనుటకు పారిస్‌కి వచ్చాడు. అతడు బాబాను హోటల్ మెట్రోపాలిటన్‌లో దర్శనం చేసుకున్నాడు. 24వ తేదీ మధ్యాహ్నం మిసెస్ ఆర్. బి. తన యింటికి బాబాను ఆహ్వానించింది, డా॥ కె. వి. ఆమె ఇంటికి వచ్చి బాబాతో ఫిలిం నిర్మాణం సంగతులు చర్చ చేశాడు. ఒక డ్యూక్ నొరీనా మాచెబెల్లీ వలన బాబా గురించి విని ఆయన దర్శనం చేసుకున్నాడు.

26 (జూన్, 1934) తేదీన పారిస్‌నుంచి బయలుదేరి కేలే, డోవర్ మీదుగా బాబా లండన్ విక్టోరియా స్టేషన్‌లో దిగారు. అప్పటికి సాయంత్రం 7-30 గంట లయింది. బాబా తిన్నగా వెస్ట్ హాంప్‌స్టెడ్‌లో కంపేన్ గార్డెన్స్‌లో వున్న 61 వ నెంబరు ఇంటికి కారులో వెళ్ళారు. అక్కడ బాబా భక్తురాలగు డెలియా-డి-లియాన్ కుటుంబంతో బాబా పదిరోజులున్నారు.

బాబా ఇప్పుడు పాశ్చాత్య దేశాలకి వచ్చినది వారు తీయించబోయే ఆధ్యాత్మిక ఫిలిం సందర్భంలో దానికి సంబంధించిన వారితో మాటలాడి ఏర్పాట్లన్నీ పూర్తి చేయుటకు, జూలై 10వ తేదీన లండన్‌లో మిస్టర్ పి. అనే నిర్మాత బాబా దర్శనం చేసుకున్నాడు. బాబాతో మాట్లాడుతున్నంత సేపు అద్భుతమయిన అంతరంగానుభూతి అతనికి కలిగింది. తన అనుభవజ్ఞానం అంతా బాబాపనికోసం ధారపొయ్యడానికి అతనికి నిశ్చయం కలిగింది.

ఫిలిం నిర్మాణం తాలూకు వ్యవహారాలన్నీ నొరీనా, ఎలిజబెత్‌లు చూస్తున్నారు. అన్ని శాఖలలోను పనులు చురుకుగా సాగుతున్నాయి.

ముఖ్యంగా ఫిలిం నిర్మాణం సందర్భంలో బాబా పర్యటనకై వచ్చినా కొంత మంది కొత్తవారికి ఆయన దర్శనమిచ్చారు, లండన్‌లో బాబా గౌరవార్థము కౌంటెస్ కె. పి. అనే ఆమె విందు ఇచ్చింది. కోహినూర్ రెస్టారెంట్‌కి యజమాని అయిన కృష్ణపీర్ బాబాకు తన యింటిలో భారతీయ భక్ష్యాలతో విందు చేశాడు. లండన్‌లో చేరింగ్ క్రాస్‌లో వున్న సర్కిల్ ఎడిటోరియల్ కమిటీవారి ఆఫీసులో విల్ బాకెట్ మున్నగు బాబా ప్రేమికులు బాబాకు ప్రేమపూర్వకమయిన విందు యిచ్చారు. ఆ విందుకు 50 మంది బాబా భక్తులు హాజరయారు. వారితో బాబా రెండు గంటలసేపు

మాట్లాడారు. మరల వారు బాబాను, మండలిని కోహినూర్ రెస్టారెంట్‌లో భోజనానికి పిలిచారు. అక్కడకు 40 మంది బాబా భక్తులు వచ్చారు. మండలివారుకాక, వచ్చినవారందరూ బాబా దివ్య ప్రేమను చవిచూచారు. వారికి ఇది అపూర్వమైన అనుభవము. బాబా సన్నిధిలో పదవి,అధికారము, ఐశ్వర్యము, బలము ఇత్యాది భౌతిక విషయాలు అన్నీ మరచిపోతారు వారి అహంకారం కూడా అణగిపోతుంది. బాబాను ఎదురుగా వున్నప్పుడు. అందరూ బాబాతో ఒకే బల్లమీద భోజనం చేశారు. ఒకే గదిలో ఒకే బల్లమీద బాబాతో భుజించే అవకాశం కలిగినందుకు అ బాబాభక్తు లందరు చాలా సంతృప్తి చెందారు. ఇది బహిరంగమయిన పర్యటన కాదు. అందుచేత బాబా ఎవరికీ దర్శనమిద్దామని అనుకోలేదు. అయినా బాబా తమ భక్తుల కోరికలను తీసివేయలేక అందులకు అంగీకరించారు.

## మూడు ప్రయాణాలు :—

ఒకమారు బాబా పరివారం ఇంకా కొందరు పాశ్చాత్యులు ఉండగా ఆత్మ సాక్షాత్కారము గురించి మాట్లాడుతూ బాబా ఇలా చెప్పారు:-

"యాత్రీకుడు గుప్తవిద్యను అభ్యసించేటప్పుడు మూడు ప్రయాణాలు చేయ వలసి వుంటుంది.

మొదటిది: సాధకుడు తన లక్ష్యం బాగా తెలుసుకుని అది గుర్తించిన తరువాత ఇంద్రియ నిగ్రహం సాధించి ఈ ప్రపంచంలోనే వుంటూ దానితో సంబంధంలేని వాడిలాగ వుండాలి. దాని వలన మనస్సులోని కోరికలన్నింటిని జయించి అంటే మనసునే స్వాధీనం చేసుకున్నట్లవుతుంది. దీనిని 'ఫనా' స్థితి అంటారు.

రెండవది : ఎప్పుడయితే మనసును జయించావో అప్పుడు భగవంతుని తో ఆత్మకి ఐక్యం ఏర్పడుతుంది. ఈ స్థితిని 'బాకా' అంటారు. ఈ ఐక్యత నే 'అనల్ హక్' అనగా 'అహం బ్రహ్మాస్మి' అంటే "నేనే భగవంతుడను" అనే స్థితి.

మూడవ ప్రయాణము "అహం బ్రహ్మాస్మి" స్థితినుంచి ప్రారంభం అయి, సంపూర్ణ మానవత్వంలో అనగా సద్గురు స్థితిలో (కుతుబ్) అంత మవుతుంది.

అతనికి అప్పుడు ఈ మూడూ సముద్రాన్ని చేరే నదులులా వుంటాయి. తాను సముద్రుడు అవుతాడు. తనకు ఇష్టమయినవారికి సహాయముచేసి ఆధ్యాత్మిక మార్గంలో ఉత్తీర్ణుని చేయగలడు. యాత్రికుడు ఈ మూడు ప్రయాణాలు చేసేటప్పుడు

అనేక మజిలీలలో ఆగి అనేక లోకాలలోంచి వెళ్ళవలసి వస్తుంది. ఎక్కడికక్కడే ఏవో అడ్డంకులు, ఏవో బాధలు అనేక విధాలయిన అనుభవాలు కలుగుతూంటాయి.

బాబా సప్తభూమికల గురించి చెప్పేరు. ఏడవదే దైవత్వము. భౌతిక ప్రపంచము, సూక్ష్మలోకము, మానసికలోకము, బౌద్ధికలోకము, ఆధ్యాత్మికలోకము, జీవాత్మలోకము, దివ్యలోకము అని ఏడులోకాల గురించి దివ్యజ్ఞాన గ్రంధాలు చెబుతున్నాయి. మొదటి మూడు భూమికలలోను ఉన్నవాడు యోగి యన్నియు, నాల్గవ భూమికలోకి వచ్చినవానిని మహాయోగి యన్నియు, అయిదవ భూమికలోనివాడు వలీ అనియు, ఆరవ భూమికలోనివానికి పీరు అనియు పేర్లు కలవని బాబా చెప్పియున్నారు. ఏడవ భూమికలోకి చేరుకొని నేనే భగవంతుడను అను అనుభవము కలిగినవానిని కుతుబ్ అని సద్గురువు అని పిలచెదరు. తుకారామ్, కబీర్‌దాస్, రామదాస్ మొదలగు మహాపురుషులు ఈ కోవకు చెందినవారే. ఈ స్థితి చేరేవరకు అందరూ దైవత్వంలో సతమతమవుతూ జీవాత్మ స్థితిలో ఉన్నవారే. మనస్సును అధిగమించి అన్ని కోరికలను జయించి సంపూర్ణంగా శాశ్వతంగా అహం జయించిననాడు ఆ ఆత్మ పరమాత్మతో లీనమగుటకు సంసిద్ధమయినదన్నమాటే. అని బాబా చెప్పారు.

మజ్జూబ్‌కి కుతుబ్‌కి అనగా పరమ హంసకి సద్గురువుకి భేదం గురించి చెబుతూ పరమహంసకి ఈ సృష్టి అసలు లేనే లేదన్నారు బాబా. అంటే అతడు అనుభవ పూర్వకంగా ఇదంతా వట్టి మాయ అని దృఢంగా తెలుసుకుంటాడు. సద్గురువుకి ఈ జగత్తంతా వుంది. కాని 'నేనే దేవుడను' అనేస్థితిలో వుంటాడు. అయితే, 'ఈ జగత్తు, ఈ దృశ్య ప్రపంచము ఊహాజనితము' అనే జ్ఞానం ఉంటుంది. కుతుబ్‌లను సద్గురువులను దైవ మానవులని భగవంతుని అవతారాలన్నికూడా అనవచ్చు అని బాబా చెప్పారు. "సూక్ష్మలోకంలోను మానవ లోకంలోను విహరించేవారు ఇతరుల మనస్సులలో ఏమి ఆలోచిస్తున్నారో వారి హృదయాలలో ఏ కోరికలు రాజ్యంచేస్తున్నాయో తెలుసుకోగలుగుతారు. వీరినే యోగు లన్నారు, సద్గురువులు మనసుకీ బుద్ధికి అతీతులు. వారి జ్ఞానం ద్వారా ఈ విశ్వమందలి యావత్తు బాహ్యాభ్యంతర విషయాలు వారికి అవగాహన అయివుంటాయి. మజ్జూబ్‌లు మనోబుద్ధ్యహంకారాలకు అతీతులుగా వుండడమే గాకుండా వారు నిమ్నలోకాలకి దిగిరారు. రాలేరు గనుక; వారు ఎల్లప్పుడు ఆత్మయందే రమిస్తూ ఉంటారు.

ప్రతి సాధకుడు సమత్వం అభ్యసించాలి. బుద్ధి వికాసంతోపాటు ప్రేమ, సానుభూతి వుండాలి. అవి లేకపోతే ఆ బుద్ధి పెడదారులు త్రొక్కుతుంది. కేవలం

ప్రేమ, సానుభూతి కలిగి బుద్ధి వికసించకపోతే వారు అవివేకులౌతారు. జ్ఞానము, ప్రేమ ఈ రెండూ ఆత్మసాక్షాత్కారానికి అవసరము. అవి లేనిదే ఇది సాధ్యపడదు.

ఈ మాటలు చెబుతూ బాబా ఒక యూదు వేదాంతి అన్న మాటలు వివరించారు. అతడేమన్నాడంటే—

"భగవంతుడు అర్థంచేసుకొనుటకు అతీతుడు. ఈవిశ్వమంతా చేరినా, భగవంతుని అర్థం చేసుకొనుట దుస్సాధ్యము. అలాటిది మానవుని మనస్సనగా ఎంతటిది? అందులో భగవదవగాహనాశక్తి ఎలా ఇమిడి వుండగలదు? మనకు భగవంతుడున్నాడని తెలుసు. కాని ఆయన ఏమిటో తెలియదు. ఆయన చేసిన పనులలో ఆయన చేయి వున్నట్లు మనకు తెలుస్తూ వుంటుంది. అంటే ఇది భగవంతుని పనే అని తెలుస్తుంది. కాని దానిలో వున్న పూర్తి సంగతి. దాని వెనుక ఏముందో తెలుసుకోడానికి ప్రయత్నించడం తెలివి తక్కువ."

తరువాత బాబా ఇంకా ఇలా చెప్పారు—

"నాకు వున్న ఉత్తమ జ్ఞానంలో కించిత్తయినా మీరు పొందితే గొప్ప ఆనందాన్ని అనుభవిస్తారు. ఆ స్వర్గసుఖాన్నే అది మీ హృదయంలోకి తీసుకు వస్తుంది. ప్రతీ పదార్థము దాని అస్తిత్వాన్ని నిరూపిస్తుంది. దాని కథను మీకు చెపుతుంది. అది మీకు సంతోషాన్ని కలిగిస్తుంది" అని బాబా ప్రవచనం సమాప్తి చేశారు.

పైన వ్రాసినట్లు బాబాకు లండన్‌లో అనేక విందులు జరిగాయి. అందులో కౌంటెస్ కె. పి. ఇచ్చినవిందుకి ఒకామెవచ్చి బాబాయొక్క సాంగత్యం అందరిమీద ఎలాటి ప్రభావం కనపరుస్తోందో చూచి చాలా ఆశ్చర్యపోయింది. బాబా వద్దకువెళ్ళి ఆయనతో కొద్దికాలమయినా కూడా వుందామని ఆ మహానుభావునికి ఇసుంతయినా సేవచేద్దామని ఆమెకు తోచి "బాబా నా రోల్సు రాయిస్ కారులో మిమ్మల్ని లండన్ మహానగరం అంతా త్రిప్పి చూపిద్దామని వుంది. ఆ అవకాశం నాకిప్పించమని కోరుతున్నాను" అని ప్రాధేయపడింది బాబాకి బొత్తిగా తీరుబడిలేదు. అయినా ఆమె ఇంతగా ప్రార్థనచేసింది గనుక ఆమెకు రెండుమారులు తన కారులో బాబాను తీసుకు వెళ్ళే అవకాశం ఇచ్చారు. కోహినూర్ రెస్టారెంట్‌లో భోజనం చేసిన తరువాత ఆమె స్వయంగా కారు నడుపుతూ బాబాను తీసుకు వెళ్ళింది. అప్పుడు బాబా ఒక పేదరాలు జబ్బుగావుంటే ఆమె యింటికి వెళ్ళి చూశారు. లండన్ తూర్పుకొనని బీదవారుండే పేటలో ఆమె కాపురం వుంది. ఆమెకు శస్త్ర చికిత్స అయింది. బాబా

ఆ పేదరాలి యింటికి వచ్చారంటే ఆమెకి, ఆమె కుటుంబంవారికి కలిగిన ఆశ్చర్యానికీ, ఆనందానికీ అంతులేక పోయింది. అంతటి భాగ్యానికి నోచుకున్నామా అని వారు ఎంతో అబ్బురపడిపోయారు. ఆమె కుమారుడు, కుమార్తె బాబాను అమితంగా ప్రేమిస్తున్నారు. ఆమె ప్రేమ సంగతి చెప్పనే అక్కర లేదు. ఆ కుటుంబం వారు యావన్మంది అనుకోకుండా బాబా వచ్చేసరికి వారు ఎంతో సంబరపడ్డారు.

తరువాత రెండో అవకాశంకూడా ఆమెకు కలిగింది. బాబా లండన్ వీడి జూలై 7 వ తేదీన జూరిచ్‌కి బయలుదేరి వెళ్ళినపుడు ఆమె బాబాను తన రోల్స్ రాయిస్‌లో కూర్చోపెట్టుకుని రెండుగంటలసేపు డోవర్ రేవుకు నడిపి తీసుకువెళ్ళింది. ఆమెకు బాబావద్ద రెండు గంటలసేపు ఉండి ఆయనను కావలసిన చోటికి తీసుకునివెళ్ళే భాగ్యం కలిగింధి. కాని ఆ కారులో కూర్చున్నంతసేపు ఎడతెరిపి లేకుండా విసుగు వచ్చేలా మాట్లాడటం, ఏవో ప్రశ్నలు వేస్తూవుండటంవల్ల బాబాకు హైరానుకలిగింది. బాబా కారులో వెళ్ళగా మండలి, ఇంకా కొందరు బాబా ప్రేమికులు లండన్ నుంచి డోవర్‌కి రైలులో వెళ్ళారు. ఇంగ్లీషు చానెల్ ఫెర్రీలో దాటటానికి నాలుగు గంటల కాలం పట్టింది. ఫెర్రీలో బాబా ఏదో ఫలహారంచేశారు. అవతలి ఒడ్డున ఓస్టెండ్ అనే చోట సాయంకాలం 4 గంటలకి దిగారు. సాయంత్రం 6–30 గంటలకు బయలు దేరే 'బ్రసెల్స్‌ఎక్స్‌ప్రెస్' అనే రైలులో ఎక్కారు బాబా మండలితో, రాత్రంతా రైలులో మూడవ తరగతిలో కర్రబల్లలమీద పరుండి కాలక్షేపం చేశారు. మర్నాడు ఉదయం "బలే" అనేచోట ఇంకో రైలులోకి మారారు.

"బలే" అనే స్టేషన్ నుండి ఆరైలు బయలు దేరడానికి కొంత వ్యవధి వుండుట చేత బాబా అక్కడ స్నానం చేశారు. జూరిచ్ వెళ్ళిన తరువాత అనేకమంది భక్తులు బాబా కోసం కనిపెట్టుకుని ఉండుటచేత అక్కడ బాబాకు స్నానం చేయడానికికూడా సమయం ఉండదు. స్నానం చేసిన తరువాత బాబా షికారుగా ప్లాట్‌ఫామ్ పొడుగునా నడిచారు. అప్పుడు రాజకుమారి నొరీనాయొక్క బంధుగురాలగు నొక వృద్ధస్త్రీ బాబా దర్శనార్థం వచ్చింది. రైలు ప్లాట్‌ఫామ్ మీద ఉన్న రెండు గంటలు ఆమె బాబా సహవాస భాగ్యం పొందింది.

బలే నుండి జూరిచ్‌కి రైలు కొండలు, లోయల గుండా వెళ్ళినది. దారి పొడుగునా ప్రకృతి సౌందర్యము చాలా ఆహ్లాదకరముగనుండెను. రోజంతా ప్రయాణము చేయడంతో సరిపోయింది. రాత్రంతా నిద్దురలేక మూడవ తరగతి పెట్టెలో కొంచెము అలసట కలిగించింది. అందుచేత బాబా మండలికి ప్రకృతి రామణీయకత

తిలకించి ఆనందించే మనసులేక పోయింది. ఆ రెండు గంటలసేపు వారు రైలులో వున్నారు.

రైలు జూరిచ్‌కి 1934 సం॥ జూలై 8 వ తేదీ ఉదయం 9-30 గంటలకు చేరినది. ఇక్కడ ప్రధాన బాబా భక్తుడు. కార్యకర్త అయిన వాల్టర్ మెర్టెన్స్ మూడు కారులతో స్టేషన్‌కి వచ్చాడు. సామానుల కోసం ఒక పెద్ద ట్రక్కు కూడా తీసుకు వచ్చాడు. జూపిటర్ వీధిలో వున్న ఒకటవ నెంబరుగల అతడు కాపురం వున్న యింటికి రావడానికి ఒక గంట పట్టింది. బాబా సహవాసం కోసం యూరప్‌లో ఇతర నగరాలలో ఉండే భక్తులు చాలామంది వచ్చియున్నారు. వారంతా హోటళ్ళలోను ఇంకా ఏవో వసతి గృహాలలోను బస ఏర్పాటు చేసుకున్నారు. వారు ఉన్న యిళ్ళ ముంగిట్లో, వసారాలలో నిలబడ్డారు. బాబాకారు ఆ రోడ్డుమీద వెడుతుందని తెలిసి, మెర్టెన్స్ ఇంటివద్ద మరికొందరు బాబాకు స్వాగతం యివ్వడానికి వేచియున్నారు. మెర్టెన్స్ కుటుంబసువారితో సహా, బాబా రాగానే అందరినీ కౌగిలించుకున్నారు. అందరూ ఈ ఆనందంలో తన్మయులై అన్నీ మరచిపోయారు. అందరి హృదయాలూ బాబా దివ్య ప్రేమతో నింపివేశారు.

బాబాకు పరిచయమయినవారిలో ఒక చిన్న మూగజీవుల కుటుంబం వున్నది. మిస్టర్ జానీ, మిసెస్ జానీ, మిసెస్ జానీ కాకుండా వాటికి ఒక చిన్నపిల్లవుంది. దానికి రెండు మాసములవయసు. అది బాబా దరికి రాగానే ఎన్నాళ్ళ నుంచో తెలిసినట్లు ఆయనతో ఆడింది. బాబా దానిని ఎంతో ప్రేమతో చేరదీశారు. జానీ తెల్లటి పొడుగాటి వెంట్రుకలు గల పెద్దకుక్క. ఆడ జానీకూడా తెల్లటిదే. అన్నింటిలోకి అందమయినది చిన్న కుక్కపిల్ల. దాని పేరు వూల్ఫ్. అది వూలు బంతిలాగే మృదువుగా గుండ్రంగా వుంటుంది. బాబా చేతుల్లో ఆడుకోడానికి అదెంత పుణ్యం చేసుకుందో.

తోటలో వాల్టర్ తన యింటికి వచ్చిన బాబాను భక్తులందరితోను ఒక ఫోటో, వేరేగా కొన్ని ఫోటోలు, సమూహాలుగ్రూ కొన్ని ఫోటోలు తీశాడు.

తరువాత బాబాను వారి గదిలోనికి తీసుకుని వెళ్ళాడు. అందరూ వారి వెనుకనే వెళ్ళారు. బాబా బృందంలో స్త్రీ, పురుషులందరూ పదిమంది వున్నారు. వాల్టర్‌యిల్లు చాలా శుచిగాను, చక్కగాను వుంది. నేల కూడా నున్నగా పరిశుభ్రంగా మెరుస్తూ వుంది. నడవడం జాగ్రత్తగా నడవాలి లేకపోతే జారుతుందేమో మరి.

జూరిచ్‌లో బాబా వున్న మొదటిరోజు వాల్టర్ కుటుంబం వారితో మాట్లాడుతూ కాలక్షేపం అయింది. తరువాత బాబాదర్శనార్థం వచ్చిన వారిని ఎప్పుడెప్పుడు ఎవరెవ

రిని బాబా చూస్తారో ఆ సమయ నిర్దేశాలు వగైరా ఏర్పాట్లు చేశారు. జూరిచ్ నగర వాసులలోనే చాలామంది బాబాకోసం వాచ్చేవాళ్ళున్నారు. న్యూయార్క్‌నుంచి చిత్ర నిర్మాణం సందర్భంలో కొంతమంది వచ్చి హోవర్‌లో దిగారని కబురు వచ్చింది. కుక్స్ ఆఫీసు నుంచి, ఆ మధ్యాహ్నమే బాబాను చూచుటకు రావచ్చునని తెలిసింది.

జూరిచ్‌లో వున్న కొండలమీద ఎక్కి ఒకచోట ఏకాంతంగా గడపాలని వుందని బాబా వాల్టర్‌తో చెప్పి తగిన చోటు అన్వేషించుటకు ఎవరినైనా పంపించమన్నారు. కొండలమీద తిరిగే అలవాటువున్న తన స్నేహితుని ఒకణ్ణి వాల్టర్ పంపించాడు. అతడు కొన్ని స్థలాలు కనుక్కునివస్తే బాబా ఒక సాయంకాలం వెళ్ళి అందులో ఒకటి ఎన్నుకోవచ్చునని ఏర్పాటయింది.

ఇంతలో న్యూయార్క్ నుంచి సినిమా బృందమువారు వచ్చిదిగారు. వారితో బాబా రాత్రి చాలా సేపటిదాకా మాట్లాడుతూ వున్నారు.ఇవతల బాబాకోసం కనిపెట్టుకుని వున్నవారితోకూడా అప్పుడప్పుడు బాబా ఈవలకివచ్చి కొంతసేపు గడుపుతూ వచ్చారు. అందువల్ల వారంతా చాలా ఆనందించారు.

ఉదయం అల్పాహారానికి మధ్యాహ్నం భోజనానికి వచ్చినపుడు బాబా అందరితోను సరససల్లాపాలు ఆడేవారు. సాయంకాలం బాబాతో టీ తీసుకోవడానికి అందరికీ తోటలో ఏర్పాటు అయింది.

సాయంకాలాల్లో వాల్టర్ కుటుంబ సభ్యులేగాక బాబా దర్శనార్థం వచ్చిన వారంతా ఆయన చుట్టూ కూర్చునేవారు. ఈ సాంగత్యం తోటలోనయినా లేక పెద్ద హాలులోనయినా జరుగుతూండేది. బయట ఎక్కువ చలిగావుంటే లోపల హాలులో సమావేశమయేవారు. సాధారణంగా ఆ సమయాల్లో బాబాయొక్క సహవాసం మౌనంగానే అనుభవించేవారు. గేబ్రియల్ పాస్కల్ అనే ప్రసిద్ధ సినీమా ఫిలిం నిర్మాత అమెరికానుంచి వచ్చి బాబాను పారిస్‌లో దర్శిద్దామనుకున్నాడు. కాని అట్లు చేయుటకు వీలులేక పోయినది. అందుచేత జూరిచ్‌లో ప్రప్రథమంగా బాబా దర్శనం చేసుకున్నాడు. బాబాతో ఒక గంటసేపు కూర్చుని మాట్లాడాడు. బాబాను చూడకుండానే బాబాపేరు విన్నంతమాత్రాన తనలోపల కలిగిన అనుభూతులు గురించి అతడు విన్నవించుకున్నాడు. మాటలతో చెప్పలేనంత అద్భుతమయిన అనుభవం అతనికి బాబాను భౌతికంగా చూచినందువల్ల కలిగిందన్నాడు. ఆయన్ను చూడగానే బాబాకు నేను గులామునయిపోయాను అని చెప్పుకున్నాడు పాస్కల్. బాబా తీయబోతున్న ఫిలిము

నిర్మించడానికి అతనికి ఎట్టి సంకోచము ఇంకలేదని ఆ పనికి ఒప్పుకున్నాడు. ఆ ఫిలింలో అవతారపురుషుడు ఏ విధంగా ప్రజలతో నివశిస్తున్నాడో చూపిస్తానన్నాడు.

బాబాను కలుసుకుని మాట్లాడినవారు బాబాను అనేక విధాలుగా వర్ణించారు. ఒకడు ఆయనను "జ్వలిస్తూన్న గులాబీ" అన్నాడు. ఇంకొకడు "మానవత్వం వికసించిన పుష్పం" అన్నాడు. "ఆయన ప్రతిరూపాన్ని నా హృదయంలో పదిలపరచుకున్నాను" అన్నాడు ఒకడు. బాబాను కలుసుకున్న ఒకడు "అదంతా కలలా జరిగిపోయింది" అన్నాడు. "అటువంటి మహానుభావుని సాంగత్యం చేయడానికి నాకు యోగ్యత వున్నదా?" అని సందేహించాడు మరియొకడు. "ఆయన సానుభూతి, ఆయన దయ నామీద చూపినప్పుడు నా జీవితంలోని మహత్తరమయిన కాలము అది అని నేను అనుకున్నాను" అని వర్ణించాడు ఒకడు. జూలై 9 వ తేదీన కూడా ఫిలిం పని గురించి బాబా సంప్రతింపులు సాగించారు. ఇలా కొన్ని గంటలు జరిగాయి మాటలు. ఆ సాయంకాలంకూడా బాబా రెండు గంటలసేపు వారందరితోను మౌనంగా సాంగత్యం చేశారు.

ఫిలింపనిలో ఉన్న సమస్యలు ఆ సాంకేతిక జ్ఞానం కలవారితో బాబా కూలంకషంగా చర్చించారు.

ఒక రోజున నలుగురు విద్యార్థికులు బాబా దర్శనార్థం వచ్చారు. ఒకడు ప్రొఫెసర్ (ఆచార్య పదవిలో ఉన్నవాడు). ఒకడు వేదాంతి. ఇద్దరు పండితులు–అందరూ సత్యాన్వేషకులే. బాబాగురించి ఇదివరకే వారు విన్నారు కాని ఇప్పటికి వారికి ఆయన దర్శన భాగ్యం లభించింది. వారు యూరపులో వివిధ నగరాల్లో ఉంటున్నారు. వారి నమ్రత, భక్తి, బాబాయెడల గౌరవము ఆశ్చర్యజనకంగా వున్నాయి. నిండుకుండ తొణకదు అనేది ఇక్కడ ప్రత్యక్షంగా కనిపించింది. ఇతరులు నేర్చుకోవలసిన పాఠము అది. బాబాను వారు అనేక ప్రశ్నలు వేశారు. అన్నిటికి బాబా యిచ్చిన జవాబులువిని వారు ఎంతో తృప్తిని వెలిబుచ్చారు. వారిని చూచి సంభాషించడానికి బాబా చాలా సంతోషించారు. వారు వేసిన ప్రశ్నలే వారియొక్క పాండిత్యము జ్ఞానము ద్యోతకం చేస్తున్నాయి అని విన్నవారు అనుకున్నారు. ముప్పావుగంటసేపు బాబా వారితో సంభాషించారు. వారు పరిష్కరించుకోలేని సమస్యలు తీర్చి వారి సందేహాలను నివృత్తిచేసిన బాబాకు ఎంతో కృతజ్ఞతతో ధన్యవాదాలు తెలుపుకున్నారు వారు. బాబా సాంగత్యం వారికెంతో తృప్తిని, ఆనందాన్ని కలుగజేసిందన్నారు. ఎప్పటికీ

వారికి బాబా అనుగ్రహం కావాలనీ బాబాయొక్క మార్గదర్శకత్వం కోరుతున్నామనీ వారు బాబాతో అన్నారు. బాబా వారికి సహాయం చేస్తానని అభయమిచ్చారు.

జూలై 11 వ తేదీన ఫిలిం నిర్మాణం పనిగురించి ఇంకా చర్చలు జరిగాయి. ఆ రోజున మెర్టెన్స్ కుటుంబ బంధువులు కొందరువచ్చి బాబా దర్శనం చేసుకున్నారు. వారిలో ఒక్కొక్కరితో వేరేగా మాటలాడి బాబావారికి సలహాలు యిచ్చారు. ఆ రోజు మధ్యాహ్నము బాబా భక్తుడు ప్రసిద్ధ కళాకారుడు అయిన ఆట్టో హాస్‌హేయ్ అనునతని స్టూడియోకి బాబాను ఆహ్వానించగా బాబా అందరితోను కలిసి వెళ్ళారు. మొత్తం పాతికమంది బాబాతో వున్నారు. ఆ స్టూడియోలో పని చేసేవారు కూడా బాబా దర్శనం చేసుకున్నారు.

## ఒక అద్భుత దృశ్యం :

12 వ తేదీన జూరిచ్‌నుంచి నగరమునకు అనతిదూరంలో స్విడ్జర్లాండుకి హృదయం అనదగిన మైథెన్ అనే ప్రదేశంవద్ద నున్న ఫాలెన్ ఫ్లూ అనే పర్వతం మీద ఉత్తరదిక్కున ఉన్న ఒకచోట బాబా ఏకాంతంగా కూర్చున్నారు. ఆ స్థలము నుండి లూసర్న్. ఇంగ్ కాసారములు మనోహరంగా కనిపిస్తూంటాయి. అటువంటి రమణీయమయిన పరిసరాలలో బాబా ఏకాంతవాసం చేశారు. అప్పుడు ఇంకొక కొండ మీద వారి శిష్యబృందంవుండి గమనించారు. ఆ సమయంలో ఒక తుఫానులాగ వర్షం వచ్చి వారందరూ బాగా తడిసిపోయారు. వారికి తలదాచుకుందుకు వారున్న కొండ మీద ఏమీలేక పోయింది. ఆ సమయాన వారు బాబా ఏ పరిస్థితిలో వున్నారో అని గమనిస్తూంటే వారికి ఆశ్చర్యకరమయిన దృశ్యం కనబడింది. బాబా వారు కూర్చున్న కొండమీద ఆరుబయటే కూర్చుని వున్నారు. అక్కడ గుహ ఏదీలేదు. వారికి పైన ఆచ్ఛాదన ఏదీ వేసుకోలేదు. ఆ శిష్యులకు ఏమి కనిపించిందంటే బాబా చుట్టూ బంగారపు రంగులో ఒక అద్భుతమయిన వెలుగు ప్రకాశిస్తోంది. వర్షం జోరుగా కురుస్తున్నా తుఫానువచ్చి భూమి ఆకాశము ఏకమయినా ఆయన మీద ఒక్క చినుకయినా పడటం లేదు. ఇదిచూచిన బాబా పాశ్చాత్య శిష్యులకు చాలా ఆశ్చర్యం కలుగజేసినది. పంచభూతాలను శాసించే పరమాత్మకదా.

13 వ తేదీ ప్రత్యేకంగా బాబా దర్శనార్థం వచ్చేవారికోసం కేటాయించబడింది ఒక్కొక్కరినే పిలిచి బాబా ఉదయం 9 గంటల నుంచి 11 గంటల వరకు సంభాషణలు జరిపారు. మరల మధ్యాహ్నం 3 గంటల నుండి 5 వరకు బాబా వచ్చినవారిని

పిలుస్తూనే వున్నారు. మొత్తం ఆ రోజున 50 మందితో బాబా సంభాషించారు. వారు ఐహికము, ఆధ్యాత్మికము అయిన అనేక సమస్యలను బాబా ముందు ఉంచి వాటికి పరిష్కారమార్గం తెలుసు కున్నారు. అందరూ ఎంతో కృతజ్ఞతతో బాబా వద్ద సెలవు తీసుకున్నారు. కొందరు తమ జీవితంలో వారికున్న కోరిక ఈనాడు నెరవేరిందని చెప్పారు. బాబామండలి, బాబాభక్తులు, వాల్టర్ కుటుంబమువారు అందరికీ బాబాతో సహవాసంగా ఉందామనే వుంది. కాని ఈ రోజున బాబా అప్పుడప్పుడు వారికేసి చూసిన చూపులతో వారు తృప్తిపడవలసి వచ్చింది. అయినప్పటికీ ఏదో సాకు పెట్టుకుని బాబాను చూచుటకు వచ్చినవారెవరైనా వెళ్ళిపోగానే ఇంకొకరు వెళ్ళే లోగా ఒక్కమాటు బాబావద్దకు వెళ్ళవస్తే వారికి హృదయం నిండినట్లుండేది. రాత్రి భోజనం అయిన తరువాత ఇంతమంది పైవాళ్ళతో మాట్లాడి అలసినప్పటికీ బాబా వీరందరితోను రెండుగంటలసేపు కలిసి వున్నారు.

అది 1934 జూలై 14వ తేదీ. ఇంక బాబా 16వ తేదీనే వెళ్ళిపోతారు. కొద్ది మంది మాత్రం బాబా దర్శనం కోసం వచ్చారు. వారిని చూచి ఒక్క అరగంటసేపు బాబావారితో మాట్లాడారు. బాబా ముందుజరగవలసిన ఏర్పాట్లన్నీ వాల్టర్‌తో చెప్పారు

15 వ తేదీ చాలామట్టుకు నిశ్శబ్దంగా గడిచింది. బాబా ఇంక వెళ్ళిపోతారని అందరు దుఃఖంతో ఉద్విగ్న మనస్కులయారు. ఆ రోజున బాబాకోసం అక్కడ వున్నవారు సుమారు 50 మంది వుంటారు. ఒకొక్కక్కరికి ఒకొక్కక్క సమస్య. అందరితోనూ ప్రత్యేకంగా వారి స్వకీయమైన విషయాల్లో ఏమి చేయాలో బాబా చెప్పారు.

పూర్వం గోపాలుడు గోవు లన్నిటినీ కూడా చూచి దేని కెంత ఆహారం పెట్టాలో అంతే పెట్టాడు. అలాగే బాబా కూడాను, తనకు ఆ పనిలో విసువు లేదు. ఆయన మన కోసమేకదా అసలు వచ్చింది.

బాబా జూలై 15 వ తేదీన మార్టెన్స్‌తో "రేపు (16వ తారీకు) అర్ధరాత్రికి ముందుగా మార్సేల్స్ చేరుకోవాలి." అన్నారు అక్కడ బాబా ఒక ఆధ్యాత్మిక సమావేశం వుందని చెప్పారు. ఆ ప్రకారంగా 16 వ తేదీ సాయంకాలం మార్సేల్స్ వెళ్ళారు. అక్కడికి చేరిన తరువాత బాబా సిటీ పార్కుకి వెళ్ళి అక్కడ ఒక చోటికి చేరుకోగానే ఆగి బాబా ముందుకు వెనుకకు పచారు చేశారు. నొరీనా. ఎలిజ్‌బెత్‌లు

కూడా బాబాతో నడుస్తున్నారు చెరో ప్రక్కన. వారిద్దరు ఒక చిన్న పచ్చగడ్డి బయటికి ఆవలి వైపున ఒక యువకుడు ఆ పార్కులో ఒక బెంచిమీద కూర్చున్నట్లు చూశారు. బాబా తిన్నగా వెళ్ళి ఆ యువకుని ముందునుంచి నడిచి వెళ్ళారు. బాబా అలా వెడుతూంటే అతడు లేచి నిలబడి తలవంచి బాబాకు ప్రణామం చేశాడు. బాబా అక్కడినుంచి అతనితో పని అయిపోయింది గనుక వెళ్ళిపోయారు. అతడొక ఆధ్యాత్మిక ప్రతినిధి అని బాబా చెప్పారు. మార్సెల్స్‌నుంచి బాబా 20 వ తేదీన (జూలై, 1934) 'స్త్రాతనావర్'అనే ఓడమీద పయనమై ఆగస్టు 2 వ తేదీకి బొంబాయి చేరుకున్నారు.

## రెండవ ప్రపంచ పర్యటన :

ఎనిమిదవ పాశ్చాత్యదేశ యాత్ర :- బాబా నిర్మాణం చేయించే ఫిలిముకు కథను వ్రాస్తున్న డాక్టర్ కె.వి.కి అకస్మాత్‌గా జబ్బు చేసిన కారణమున సినీ కథా రచన కొంచెం వెనకపడింది. కొన్ని ముందు ఏర్పాట్లు చేసుకుని బాబాకు వారు "ఇప్పుడు మీరుహాలీవుడ్ వచ్చినట్లయితే అన్నివిధాలా సహాయకరముగా వుంటుంది" అని కేబిల్ యిచ్చారు. బాబా వారికి ఇదివరకే అంత అవసర ముంటేనేగాని పిలుప వద్దని చెప్పియున్నారు. పైన ఇచ్చిన కేబిల్ తరువాత "ఇప్పుడే మీరు ఉండటం అగత్యం, ఇతరులలో నమ్మకం ఏర్పడటానికి, కళకి సంబంధించినవి ఆర్థిక సంబంధ మయిన నిశ్చయాలు చేసుకుందుకు" అని ఇంకొక కేబిల్ యిచ్చారు. దాని తరువాత మరియొక కేబిల్‌లో "మీరు రావడం శీఘ్ర ఫలితంకోసం అమూల్యంగా వుంటుంది" అన్నారు. ఇలా ఒకదాని తరువాత ఒకటి కేబిల్‌లు రాగానే మళ్ళీ బాబా విదేశాలకి బయలుదేరవలసివచ్చింది.

1934 నవంబరు 15 వ తేదీని "టస్కానియా అనే ఓడలో మార్సెల్స్‌కి బయలుదేరారు. ప్రయాణంలో వుండగా బాబాకు స్వాగతం అని అనేక వైర్లెస్ సందేశాలు ఓడలో అందినవి. ఇంగ్లండు నుంచి కొంతమంది స్విడ్జర్లాండు నుంచి కొంతమంది బాబా భక్తులు 'మా దేశం వచ్చి మాతో వుండాలని' రెండు దేశాలనుంచీ కూడా బాబాను కోరారు. బాబా జూరిచ్ వచ్చే మాటయితే నలుగురు వచ్చి ఇండియా నుంచి బాబాను తీసుకువస్తారని ఇంగ్లండు నుంచి ఎనమండుగురు బాబాతో వుంటారని మెర్టెన్స్ కుటుంబమువారు వ్రాశారు. చాలామంది పాత భక్తులు కొత్తవారు కూడా బాబా కొరకు వేచియున్నారని కేబిల్‌లో వ్రాశారు. అందరూ బాబాకోసం ఎదురు

చూస్తున్నారని అన్నారు. లండన్ నుంచి కూడా బాబా రాకవలన చాలా ఉత్సాహం చూపించారు. ప్రయాణ సౌకర్యాలనుబట్టి బాబాకి ఉన్న పనినిబట్టి బాబా తిన్నగా లండన్‌కే వెళ్ళారు. యూరప్‌లో, ఫ్రాన్స్, ఇటలీ, స్విడ్జర్లాండు, జర్మనీ, ఆస్ట్రియా దేశాలవారికి ఆశాభంగం కలిగింది. వీరందరికీ 'జూరిచ్‌కి బాబా వచ్చి ఉంటే వారి సాంగత్యం చేయడం చాలా వీలుగాను, సులువుగాను వుండేది అని అనిపించింది. అయినా కొంతమంది లండన్‌కి వెళ్ళి వారి దర్శనం చేసుకోవడమేగాక వారు ఇంగ్లండు విడిచి వెళ్ళేదాకా వారితోనే ఉన్నారు. మిగతావారు ప్రేమతో శుభాకాంక్ష సందేశాలు పంపించారు.

ఇండియాలో నవంబరు 15 వ తేదీన బయలుదేరినపుడు బాబా ఈ క్రింది సందేశం యిచ్చారు —

> "ప్రేమలో ఐక్యంగా ఉన్నవారు వేరుపడడం అంటూ వుండదు. నేను ఎక్కడ వున్నా, మీరు ఎక్కడవున్నా. నేను ఎల్లప్పుడు మీతోటే ఉంటు న్నాను. మీ అందరికీ నా ఆశీస్సులు – ఎమ్. ఎన్. ఇరానీ"

బాబా పాశ్చాత్య దేశయాత్ర చేయడం ఇది 8 వ మారు. పోర్టుసెయిడ్‌దాకా వచ్చి సముద్రప్రయాణం సుఖంగా జరుగుతోందని బాబా ఉత్తరం వ్రాయించారు ఇండియాకు. లండన్‌లో 30 వ తేదీని దిగి అక్కడ అయిదురోజులు మాత్రం ఉంటానని బాబా తెలిపారు. బాబా న్యూయార్క్‌కి డిసెంబరు 12 వ తేదీన చేరుకోవాలని ఫిబ్రవరిదాకా అమెరికాలో ఉండాలని నిశ్చయం చేసుకున్నారు.

అనుకున్న ప్రకారం బాబా లండన్‌లో 30 నవంబరు 1934 తేదీన దిగేసరికి ఆ రాత్రి అక్కడ డ్యూక్ ఆఫ్ కెంట్, డచెస్‌ల వివాహమునకు బ్రహ్మాండమయిన ఏర్పాట్లు జరుగుతున్నాయి. బాబా మండలితో కారులో ప్రజలతో క్రిక్కిరిసిన వీధులలో నుంచి బకింగ్‌హామ్‌కోట ప్రక్కనుంచి హైడ్‌పార్క్, పడమటకొన (వెస్టెండ్) ద్వారా వెళ్ళారు. జనసమూహాలలోకివెళ్ళి ఆధ్యాత్మికంగా పనిచేసేందుకు బాబాకు మరియొక అవకాశం కలిగింది. బాబా రాక యిలాటి ఉత్సవ సమయాలలోనే పడుతూ వుంటుంది.

లండన్‌లో వున్న అయిదు రోజులలోను అమెరికా వెళ్ళటకు వీసాలు ఏర్పాటు చేసుకున్నారు, బాబాకి మండలికి. అంతేగాక న్యూయార్క్ చేరిన తరువాత అక్కడి

నుంచి హాలీవుడ్ వెళ్ళడానికి కూడా లండన్ నుంచే ముందుగా అన్ని ఏర్పాట్లు చేసుకున్నారు. బాబాను దర్శించుటకు వచ్చేవారితో మాట్లాడటానికి కూడా బాబాకు సమయం చాలినంత లేదు. కొద్దిమంది మాత్రం ఆయనను దర్శించి సంభాషించారు. సర్కిల్ ఎడిటోరియల్ కమిటీ ఆఫీసులో బాబాను ఆహ్వానించి సత్కరించారు. 70 మంది భక్తులు స్నేహితులు కలిసి బాబాతో కరచాలనం చేశారు. వారికి కావలసిన సలహాలను పొందారు. చాలా కొద్ది రోజులే ఉన్నందువలన చాలా మంది విచారించారు. వారితో బాబా తాము ఒక సంవత్సరం ఏకాంతవాసం చేయబోతున్నట్టు అందువలన పునర్దర్శనం చాలాకాలానికిగాని కలుగదని చెప్పారు. ఈ సంగతి చాలామందికి ఆశాభంగమే కాకుండా బాధకూడా కలిగించింది. భౌతికమైన ప్రేమికులే ఒకరిని విడిచి ఒకరు అట్టే కాలం ఉండలేరు. ఇంక దివ్యమైన ప్రేమలో విరహవేదన భరించడం పరమ బాధాయుతము. దివ్య ప్రేమకి లింగభేదం లేదు. అది స్వచ్ఛంగా వుంటుంది. నిస్వార్థంగా వుంటుంది.

లండన్ నుంచి బాబా డిసెంబరు 5 వ తేదీని సౌథాంప్టన్ వెళ్ళి అక్కడ నుంచి 'మెజస్టిక్' అనే ఓడలో బయలుదేరి 12 వ తేదీన న్యూయార్క్ రేవులో దిగారు. లండన్ నుంచి సౌథాంప్టన్ వరకు చాలామంది భక్తులు వచ్చేరు. రైలులో ఉన్న రెండు గంటలసేపూ బాబాతో దగ్గరగా కూర్చున్నారు. ఆఖరి సమయంలో నయినా ఆయనకు సన్నిహితంగా వుందామని ఎవరికివారే ఉబలాట పడ్డారు. ఆయన స్పర్శ తగులుతే వారికి చాలు. ఆయన వారికేసి క్రీగంటితో చూచినా వారికి సంతృప్తి కలుగుతుంది. చెమ్మగిలిన కళ్ళతో ఆయన తేజోవంతమయిన వదనమును తిలకిస్తూ ఆయన చిరునవ్వుకి ఒడలు పులకరింపజేసుకొనుచూ సౌథాంప్టన్ చేరారు. వారి గాఢమైన ప్రేమను తెలిసికొనుటకు ఆ దివ్య ప్రియతమునకే చెల్లినది.

ఆయనను మెజస్టిక్ ఓడ ఎక్కించి అంతవరకు సాగనంపి ఇంక వెనుకకు మరలినపుడు ప్రతి ప్రేమికురాలు ప్రేమికుడు కూడా విశ్వ మానవుడయిన బాబా నుంచి తాము విడివడిపోతూంటే దేహము నుంచి ఒక మాంస ఖండము పెకలించినట్లే వారికి అనుభూతి కలిగింది. తమ నందరను బాబాకు అంతగా సమర్పించుకున్నారు వారు. బాబా తమవారు. వారు బాబావారు. శరీరాలను మాత్రం వెనుకకు మోసుకొని వెళ్ళారు. వారి హృదయాలు, మనసులు 'మెజస్టిక్' ఓడలో బాబాకు సమర్పించేశారు. నెమ్మదిగా ఓడ కదలుతూవుంటే వారు జన్మ జన్మలనుంచి ఆర్జించిన

పెన్నిధి యేదో కదలి పెడుతూన్నట్లు భావించారు. క్రిందినుంచి బాబాకేసి చూస్తూ వారి చేతులలో జేబురుమాళ్ళు విసురుతూ బాబా సౌఖ్యంగా ప్రయాణం చేయాలని సంకల్పించారు. ప్రతి క్షణము ఓడ దూర మౌతూవుంది. బాబా ముఖము అదృశ్య మౌతూవుంది. లండన్‌లో 5 రోజులూ 5 గంటలులా అతి త్వరితంగా వెళ్ళిపోయాయని అందరికీ చింతగా వుంది.

మెజస్టిక్‌లో ప్రయాణం చేస్తూ అమెరికా సమీపిస్తున్న బాబాకు స్వాగతం చెపుతూ అమెరికాలోని భక్తులు శుభాకాంక్ష సందేశాలను పంపారు. న్యూయార్క్‌లోను హాలీవుడ్‌లోను బాబాకు వారి మండలికి చేయవలసిన ఏర్పాట్ల గురించి మెజస్టిక్ ఓడ నుండి అమెరికాకు కేబిల్స్ అనేకంగా వెళ్ళాయి.

చెర్బర్గ్‌నుంచి ముగ్గురు భక్తులు వచ్చి బాబాతోచేరి న్యూయార్క్‌కి హాలీవుడ్‌కి వెళ్ళడానికి సిద్ధంగా రేవుకి వచ్చారు. అట్లాంటిక్ మహాసముద్రంకల్లోలంగా వుండడం వల్ల అలల తాకిడికి ఎంత పెద్ద ఓడ అయినా అప్పటికి ప్రపంచంలో ఉన్న చాలా పెద్ద ఓడల్లో ఒకటయిన 56,000 టన్నుల 'మెజస్టిక్' అటూ యిటూ ఊగిపోయింది. ఎదురుగాలి వీచుచుండుటచేత 11వ తేదీన న్యూయార్క్‌కి చేరవలసిన ఓడ ఒక రోజు ఆలస్యంగా 12వ తేదీన బాబా నిర్ణయించినట్లుగా చేరింది.

న్యూయార్క్‌లో దిగేసరికి బాబాకు చాలా సంరంభంతో స్వాగతం యిచ్చారు. అమెరికన్ భక్తులు. అక్కడ గడిపిన రెండు రోజులు బాబాకు బొత్తిగా తీరిక లేక పోవుటవలన సంభాషణలు బాహుకొద్ది మందితో మాత్రమే జరుపుటకు వీలయింది. అయితే అనేక వందలమంది భక్తులకు బాబాను కలిసే అవకాశమిచ్చుటకు 13వ తేదీన రెండువందలమంది స్త్రీ పురుషులను ప్రత్యేకంగా ఎన్నుకొని వారితో బాబా గౌరవార్థం ఒక సత్కారసభ ఏర్పాటుచేశారు. ఆ సభలో ఒకరితరువాత ఒకరు అందరూ బాబాతో కరచాలనం చేశారు. వారందరిని పలకరించి కుశలమడగటానికి సమయం చాలలేదు బాబా ఇంకా కొంతసేపు వుంటే బాగుండునని ప్రతియొక్కరికి తోచినా, ఇంతమాత్రం భాగ్యం కలిగినందుకే అందరూ సంతోషించారు. ఇలా చేయడానికే 3 గంటల సమయం పట్టింది.

హాలీవుడ్‌నుంచి బాబాకి డిసెంబరు 6 వ తేదీన "ప్రేమయుత మయిన స్వాగతము" అని తంతి వచ్చినది. డిసెంబరు 14 వ తారీఖున బాబా న్యూయార్క్

వదలి శాంటా ఫే మీదుగా హాలీవుడ్‌కి డిసెంబరు 18 వ తారీకు నాటికి చేరతారు. లాస్ ఏంజిల్స్‌నుంచి కూడా బాబా న్యూయార్క్‌లో బయలుదేరేముందే 11 వ తేదీన "మీరు వస్తున్నారని మా హృదయాలు సంతోషంతో గానం చేస్తున్నాయి. ప్రియతమమైన ప్రేమతో", అనీ 17 వ తేదీన పసడెనా నుంచి "రేపు ఉదయానికి అన్ని ఏర్పాట్లు జరిగినవి. ప్రియతముని రాకకై ఉవ్విళ్ళూరుచున్న హృదయాలతో వేచియున్నాము" అనీ తంతి సందేశాలు వచ్చాయి.

బాబా ప్రయాణంచేస్తున్న రైలు న్యూమెక్సికోలో ఆల్‌బుకర్క్ అనే స్టేషన్ వద్ద ఒక గంట ఆగింది. ఈ వ్యవధిలో బాబా రైలుదిగి ప్లాట్‌ఫారమ్ మీద ఆ చివర నుంచి ఈ చివరదాకా పచారు చేశారు. పాశ్చాత్య శిష్యురాలగు రువానోబోగిస్లావ్‌ను కూడా బాబాతో ఉండమన్నారు. పచారు చేస్తుండగా ఒకచోట ఆగి ఆయన చేతిలో అక్షరఫలకం లేకపోబట్టి బాబా అరచేతిలో "ఇండియన్" అనే మాట వ్రాశారు. రువానో చూచేలాగ. ఆమె ఇండియన్‌ని ఎవరినయినా బాబా చూడాలని అనుకుంటున్నారని ఏమి చెయ్యానా అని ఆలోచించి కొంచెం దూరంలో ఒక వృద్ధుడు కూర్చుని వుంటే అతనిని చూపించింది. అతడు స్టేషన్ బయట సమీపంలోనే ఒక దుకాణం వద్ద కూర్చుని వున్నాడు. బాబా మండలిలోని నలుగురు భారతీయ శిష్యులను పిలిచారు. బాబా రువానోనుకూడా తీసుకువెళ్ళారు. రైలు బయలుదేరడానికి ఇంక అరగంట మాత్రమే వున్నది. బాబా స్టేషన్‌లోనుంచి బయటకు ఎక్కడికో వీరందనీ తీసుకుపోతున్నారు. రువానో రైలు తప్పిపోతుందేమో అని భయపడింది.

కొంతదూరం వెళ్ళిన తరువాత ఒకచోట ఇద్దరు 'ఇండియనులు' కనిపించారు. ఒకడు లావుగాను పొడుగ్గాను ఉన్నాడు. అతడు లాగు తొడుగుకొని చొక్కావేసుకున్నాడు. తలకు ఏదో ఎఱ్ఱగుడ్డ చుట్టుకున్నాడు. రెండోవాడు పొట్టిగా వున్నాడు. వాడు పిల్లలు ఆడుకొనే చిన్న చిన్న విల్లులు, బాణాలు అమ్ముతున్నాడు. వారిని చూచి రువానో "బాబా ! అరుగో వాళ్ళిద్దరూ ఇండియనులే" అంది. అంతలో ఆ పొట్టివాడు ధనుర్బాణాలు అమ్ముతూ వెళ్ళిపోయాడు. బాబా మిగిలినవారి వద్దకు వెళ్ళారు. ఒక్కనిమిషం అతడు బాబాతో ఏదో మాట్లాడాడు. ఇంతలోనే బాబా గిరుక్కున వెనక్కితిరిగి రూవానో వద్దకు వెళ్ళి ఆమె చేతిని తన చేతిలోకి తీసుకుని గబగబా నడిచి రైలు కదలకముందే స్టేషన్‌కి వచ్చి రైలు ఎక్కేశారు. ఆ భారతీయుడు అక్కడున్నాడని మీకు తెలుసునా అని రువానో బాబాను అడిగింది.

బాబా అవునన్నట్లు తలఊపారు. అక్షరఫలకం తీసుకుని "అతడు నా ప్రతినిధి" అని చెప్పారు.

హాలీవుడ్‌లో బాబా బసచేయడానికి ఒక పెద్ద యిల్లు ఏర్పాటు చేశారు. అందులోనే బాబా మండలి కూడా దిగారు. ఆ యింట్లో ప్రశాంతమయిన వాతావరణం వుంది. ఇల్లు కూడా బాబా వుండడానికి తగినట్లు అందంగా వుంది. అందులో బాబాతో వచ్చిన పరివారం మొత్తం 18 మంది వున్నారు. బాబా వారికి ఒక్కొక్కరికి ఒక్కొక్క పని అప్పజెప్పారు. రువానో బజారుకి వెళ్ళి వంటకి కావలసిన సరుకులు తీసుకురావడము ఇల్లు చూసుకోవడము ఆమె వంతు అయింది. ఆమెకి వంట ఇంటి పనికి బజారు పనికి సరిపోతోంది. ఇతరులవలె ఆమెకు బాబాతో ఎక్కువసేపు గడపడానికి వీలులేకపోతోందని ఆమె గునుస్తూ ఉండేది. బాబాతో ఉండే ఇతరులను జూచి అసూయ పడుతూండేది కూడా. కాని బాబా చెప్పిన పని బాగా చెయ్యగలుగుతున్నాననే తృప్తి ఆమెకు మిగిలేది. అప్పుడప్పుడు మాత్రం వంట ఇంట్లో కూర్చుని ఏడుస్తూండేది. అలా ఏడుస్తున్నదానిని, బాబా అకస్మాత్‌గా వంట ఇంటికి వచ్చి వీపుమీద తట్టుతూండేవారు. ఆమె వెంటనే ఏడ్పు మానేది. రువానో తనకోసమే బాబా అక్కడికి వచ్చారని ఎంతో ఆనందించేది ఆయన వెళ్ళగానే మళ్ళీ మామూలే. వంటరితనంగా వంటయింట్లో ఉండవలసి వచ్చిందనీ ఇతరు లెవరికీ ఆ కర్మ పట్టలేదనీ ఆమె ఏడుపు.

'లిబర్టీ' అను పత్రికకు విలేఖరి యగు ఫ్రెడరిక్ కాలిన్స్ ఒకనాడు బాబాను దర్శనం చేసుకున్నాడు.

అతడు ఒక స్నేహితుని కూడా బాబాతో టీ తీసుకుందుకు పిలుచుకుని వచ్చేడు. బాబా లేత రంగు ఫ్లానల్ పాంటు వేసుకున్నారు. చిన్‌చిల్లా కోటును తొడుగుకున్నారు. ఆ కోటు అంత పొడుగులేదు. పొట్టి మాత్రం కాదు. చూపులోనే ఆకర్షణ చేశారు. బాబా కాక ఇంకెవరయినా ఆ వేషం వేస్తే నవ్వులాటకింద పట్టించేసేవారే వీరు. ఫెల్ప్స్ స్టోక్స్ అను ఆమె యింట్లో యీ మిత్రులు బాబాతో కలియుటకు వచ్చేరు. 37 ఏళ్ళ వయసులో ఉన్న బాబా ఇంకా బ్రహ్మచారిగా ఉన్నారని వారు ఆశ్చర్యపోయారు. ఎనిమిదేళ్ళ నుంచి మౌనంగా ఉన్నారని విని ఇంకా ఆశ్చర్యపోయారు.

బాబా మండలి ఆ వచ్చినవ్యక్తితో ప్రసంగవశాత్తు "బాబా అయితే బ్రహ్మచారిగా ఉన్నారు గాని అలా ఉండమని వారు ఇతరులకు చెప్పరు." అని వివరించారు అప్పుడు ఈ క్రింది సంభాషణ జరిగింది.

బాబా – నాకు స్త్రీ పురుష భేదం లేదు. ఆధునిక వివాహ వ్యవస్థ ఒక వ్యాపార వ్యవహారం లాంటిది. తరుచుగా అది విడాకులలోకి దిగితే ఆశ్చర్యపోనక్కరలేదు. భార్యా భర్తలు అన్యోన్యంగా వుండాలి ముందు. కామాన్ని జయించే నిస్వార్థ ప్రేమ వున్నట్టయితే ఆ కుటుంబం చాలా సుఖంగా వుంటుంది.

విలేఖరి – అమెరికాలో వున్న మాకు వివాహము, కుటుంబము ఈ సమస్యే కాకుండా మాకు ఎన్నో సమస్య లున్నాయికదా.

బాబా చిరునవ్వు నవ్వి – "ఇక్కడ అవగాహన లోపంచేత చాలా గొడవలు బయలుదేరాయి.

జీవితం అంతా అమెరికాలోనే గడిపినట్టుగా మాట్లాడుతున్న బాబాను చూచి వారు ఆశ్చర్యపోయారు.

బాబా నోటితో మాట్లాడకుండా అక్షరఫలకం మీద చూపించి జవాబులు ఇస్తూంటే వారేమి అదొక లోపంలాగా ఒక కొరతలాగా భావించలేదు. ఆ అక్షరాల పలక ఆధారంగా ఆయన ఒక్క ఇంగ్లీషు భాషలోనేగాక ఇంకా ఆరు భాషలలో మాట్లాడగలరంటే అది సామాన్య విషయం కాదు. మానవుని కన్ను చూడలేనంత వడిగా బాబా బోర్డుమీద అక్షరాలను చూపిస్తారు. విశాలమయిన ఆయన కళ్ళతో మాట్లాడగలరు. ఆ వచ్చిన విలేఖరి ఆయన కళ్ళకేసి చూచి అంత చురుకయినవి, పెద్దవి, అంత తెలివి కనపరిచేవి అంత ప్రకాశవంతమయినవి, అంత చిరునవ్వును చూపించేవి ఎక్కడా చూడలేదని విస్తుపోయాడు.

విలేఖరి :– మరి ఈ గొడవలతో కూడియున్న మా దేశానికి మీరు ఏమి చేయదలచుకున్నారు ?

బాబా :– ఇది నా దేశంకూడా.

బాబా ప్రతి దేశాన్ని స్వంత దేశంగానే భావిస్తారు. అక్కడి ప్రజ లందరూ తనవారే. బాబా అంతర్జాతీయుడు. అన్ని మతాలను, అన్ని నమ్మ

కాలను ఆయన సహించి గౌరవిస్తారు. ఎవరినీ తన మతం వదిలి ఇంకో మతాన్ని స్వీకరించమని బాబా ఎన్నడూ చెప్పలేదు.

భౌతికైశ్వర్యాలతో తులతూగుతూ అన్ని దేశాలను మించిన భాగ్య భోగ్యాలతో విరాజిల్లు అమెరికా దేశమునందే నూతనంగా ఆధ్యాత్మిక పునరుజ్జీవనం కలుగుతుందని బాబా అన్నారు.

విలేఖరి :- మీరు మౌన విరమణ చేసినప్పుడు ఎలా చేస్తారు ? రేడియో ద్వారానా ?

బాబా లండన్ శిష్యుడు :- ఇంకా నయం. రేడియోద్వారా మాత్రం కాదు.

బాబా :- ఏం ? ఎందుకు కాకూడదు ?

బాబా :- అమెరికాకు గొప్పశక్తి వున్నది. కాని అది చాలామట్టుకు దురుపయోగ పడుచున్నది. అందువలన అది నాశన హేతువుకూడా కాగలదు. దానివలన భయము, లోభము, కామము, క్రోధము ఉత్పన్నమవుతాయి. వీటివలన నైతిక ఆధ్యాత్మిక పతనము కలుగ గలదు.

విలేఖరి :- మీరు ఇంత గట్టిగా చెబుతున్నారేమిటి ? మీ లక్ష్యము మా ఆధ్యాత్మిక సమస్యలను పరిష్కరించుటకా లేక మా దైనందినము ఆచరణ యోగ్యము అగు సమస్యల నెదుర్కొనుటకు సహకరించెదరా ?

బాబా :- (చిరునవ్వునవ్వి) మన ఆధ్యాత్మిక సమస్యలు మనం నిత్యము ఆచరించు పనులతో సంబంధము కలిగినవే.

విలేఖరి :- అయితే మీరు ఎట్లు మీ సహాయము చేయుటకు ఉద్దేశించుచున్నారు ?

బాబా :- నే నీయబోవు సహాయము వేలాదిమంది మానవులలో హృదయ పరివర్తనము కలుగజేయును. దాని తరువాత సమ్యగ్భావన సమ్యగ్జీవనము వాటంతటవియే కలుగును.

విలేఖరి :- దానివలన సాధారణముగా ఉంటూవున్న ఈ మందస్థితి (depression) చక్కబడునా ?

బాబా :- అది అన్ని సమస్యలను చక్కబరచును.

విలేఖరి :- మద్య నిషేధము ?

బాబా :- అదేకాదు దాని వెనుకనున్న సమస్యలుకూడా. త్రాగుటయందు నాకు నమ్మకములేదు. నా అనుయాయులెవ్వరూ త్రాగరు. కాని మద్యనిషేధము ఇప్పుడు అమలు జరిగినట్లుగా అమలుజర్గి యుండకూడదు.

విలేఖరి :- అంటే ఒక్కమాటుగానా ?

బాబా :- అవును. మత్తుకలిగించునవి నిషేధించవలసినవి. ద్రాక్షరసము, బీరు ఇవి కాదు. తరువాత నిషేధమునకు పట్టము ఉండిన బాగుండెడిది. ప్రస్తుత పరిస్థితి లంచగొండి అధికారులు సంపాదించుకొనుటకు ఈ వ్యసనములు ఎక్కువగుటకు అనువుగా నున్నది.

బాబా మౌనము ప్రారంభించినది లగాయతు ఏ నాయకుడూ చెప్పనన్ని విషయములు మౌనముగా ఆయన చెప్పియున్నారని విలేఖరి తన యభిప్రాయమును వెలిబుచ్చెను.

బాబా :- ఆత్మ నిగ్రహమునందు నాకు నమ్మకమున్నది. బలవంతముగా మనము ఏదియు మాన్పించలేము. బలవంతము అనగానే ప్రజలను బాధపెట్టుటయే యగును. దాని వలన భయము ద్వేషము కలుగును. ఆత్మనిగ్రహమునకు ధైర్యము కావలెను. ప్రేమవలన అది కలుగజేయవచ్చును. మనము మామూలుగా చేయనిపను లెన్నో ఎవరిని మనము ప్రేమించుచున్నామో వారి కోసము చేయుదుము. ప్రేమద్వారా ఎన్ని అలవాట్లు మాన్పించలేదు మనము ? ఈ ప్రేమ విశ్వవ్యాప్తమైనచో అపకారము కలుగజేయు అలవాట్లున్న వ్యక్తిలోనయినా, సంఘములోనయినా నశించిపోగలవు, ఇదే విధముగా నీ వడిగిన ఆర్థిక విషయంలోకూడా. మానవుని శీలసంపదకు, అతని పరిస్థితులకు చాలా సన్నిహిత సంబంధమున్నది. అతని అంతరంగమున నున్న కోరికలకు, ఆలోచనలకు, అతని బాహ్య పరిస్థితులకుకూడా సంబంధమున్నది. లోపల ఎట్లో బయటకూడా అట్లే యనునది న్యాయము. నేను తూర్పుపడమరలకు తీగపెట్టినట్లు సంబంధము కలుగజేసెదను.

బాబా విలేఖరికేసి చూచి చిరునవ్వు నవ్వారు. బాబా దగ్గర వున్నంత కాలము ఎవరయినా వారి చింతలన్నీ మరచిపోయి సుఖవంతముగా, ఆనందముగా నుందురు.

బాబా యొక్క ఈ రాక లండన్‌లోనూ, న్యూయార్కులోను చేసినట్లే హాలీవుడ్‌లో కూడ రహస్యముగా నుంచబడినది. ఆయనకున్న కార్యక్రమము అంత రాయము లేకుండా సాగుటకు ఇట్లొనర్చబడినది. అట్లు చేసియుండకపోయినచో బాబా వచ్చారని తెలిసికొని అనేక వందలమంది ఆయన దర్శనార్థము వచ్చి యుండెడివారు. అసలు ఆయన వచ్చిన ఫిలుము పని చాలా ఆలస్యం అయిపోయేది. అందువలన హాలీవుడ్‌లో వున్న మూడు వారాలు ఈ పనితోనే సరిపోయింది బాబాకి. ఈ ఆధ్యాత్మిక చిత్రం తీసే వారందరితోనూ బాబా చర్చలు చేశారు. ప్రత్యేకమయిన ఈ అపూర్వ చిత్రాన్ని తీయడానికి వున్న అనేక విషయాల గురించి కథ, సినేరియో వ్రాసిన వారితోను, కళాకారులతోను. చిత్ర లేఖకులు, దర్శకులు, నిర్మాతలు, వ్యవహర్తలుతోను బాబా సంభాషించేరు. కేవలము ఆధ్యాత్మికంగా వుంటే ఎవరికీ నచ్చదు. అందువలన ఐహికమయిన సంగతులు కూడ మేళవించి ప్రేక్షకులకు సుబోధకంగా హృదయ రంజకంగా తయారు చేయడ మనేది సామాన్య విషయం కాదు. చాలామంది ఫిలుము గురించి బాబాతో మాట్లాడదామని వచ్చి దివ్య ప్రేమమూర్తి అయిన బాబా సమక్షంలో వచ్చిన మాట మరచి ఆయనకేసి చూస్తూ ఆయన ప్రేమలో నిమగ్నమైపోయి, కర్తవ్యతా మూఢు లయారంటే ఆశ్చర్యంలేదు. అయినా వారికి వున్న సమస్యలను బాబా అవలీలగా పరిష్కరించి మార్గం బోధించేవారు బాబాను కలసిన వారిలో కొందరు ఆధ్యాత్మిక వికాసం కొంతవరకు పొందినవారు లేకపోలేదు. వారు మాత్రం ఆయన దివ్య ప్రేమకు ముగ్ధులై ఎన్నో జన్మల నుంచి బాబా పరిచితుడు అన్నట్లు అనుభూతి చెందేరు. వారి ఆధ్యాత్మికాభివృద్ధికి కావలసిన సలహాలు వారికి బాబా ఇచ్చి వారి ఆశయాలకు దోహదం చేశారు బాబా.

అసలు ఆధ్యాత్మికత్వం అంటే ఏమీ అభిప్రాయం లేనివారు కూడా ఆయన సాంగత్యం చేయగానే ఒక అలౌకికమయిన ప్రపంచాతీత మయిన దివ్యత్వం ఆయనలో వుందని స్పష్టంగా గ్రహించ గలిగారు. వారిలో ఎప్పుడూ అనుభవించని అపూర్వమైన ప్రేమ వారిలో ఉత్పన్నమై బాబా వైపుకు వారు ఆకర్షితులయారు. కొందరు వారి యిండ్లకు బాబాను ఆహ్వానించి ఆయన్ను విశేషంగా గౌరవించి పూజించారు. బాబా హాలీవుడ్‌కు వచ్చి రెండున్నర సంవత్సరాలయింది. అందుచేతే వారి

ప్రేమికులు ఆయన ఎప్పుడు వస్తారా అని ఎదురు చూచి చూచి ఆయన రాగానే ఆ అవకాశం పోగొట్టుకోకూడదని అందరూ ఆయన సహవాస భాగ్యం కలుగజేసుకుని బాటరీ రీచార్జి అయినట్లు ఆధ్యాత్మిక పునరుజ్జీవనం కలిగించుకున్నారు

బాబా వారితో——

"శిష్యులు గురువుకి ఉపయోగంగా ఉండాలంటే మీరు ఆశాభంగానికి, విమర్శలకి సంపూర్ణ శాంతంతో తట్టుకోవాలి. భగవంతుని ఇచ్ఛకు ఎల్లప్పుడు లోబడి వుండాలి" అని అన్నారు.

బాబా యొక్క సాంగత్యంలో వారి సన్నిహిత శిష్యులు బాబా ద్వారా పరమాత్మ దర్శనం పొంది తరించగలమనే గట్టి నమ్మకము కలిగి వారి కొంగు పట్టుకుని ధైర్యంగా వున్నారు.

## జీన్ స్లాక్స్ :

అమెరికాలో మాల్కమ్ స్లాక్స్ అనే భక్తుడు దివాలాతీసి పుస్తకాల దుకాణం ఎత్తివేసిన తరువాత నెక్‌టైలు తయారుచేసి అమ్మే చిన్న వ్యాపారంతో తంటాలు పడుతున్నాడు. అతని భార్య జీన్ వంట్లో జబ్బు తీవ్రంగావున్నా డాక్టర్లకి చూపించుకోవడం మందులు తీసుకోవడం పూర్తిగా మానేసింది. శస్త్రచికిత్స చేయించుకోమని డాక్టర్లు ఇచ్చిన సలహా ఆమె పాటించలేదు. ఎలెక్ట్రో తెరాపీ అనే చికిత్స చేయించుకుంది. కొంత నయమయింది. మరల ఆమెకు కొంత ఆశ కలిగింది. అన్నిరకాల పథ్యాలు పానాలు చేసింది. ఆమె తీసుకోలేకపోతే మాల్కమ్ పళ్ళరసాలు తీసియిచ్చేవాడు. ఇంట్లో పనులన్నీ అతడే చేసుకునేవాడు. ఉదయం సాయంత్రం వంటచేసుకు తినేవాడు. రాత్రి 12 గంటలకుగాని అతనికి విశ్రాంతి దొరికేది కాదు.

జీన్ ఎందుచేతనో ఆమెకు శరీరంలోని బాధ ఆ రుగ్మత ఆధ్యాత్మిక చికిత్స వల్ల నయమవుతుందని బాగా తోచింది. ఇలా వుండగా మాల్కమ్, జీన్‌లు హాలీవుడ్ లోకి మకాం మార్చారు. ఆమెకి వున్న శారీరక రోగం గురించి అక్కడ పరీక్ష చేయించుకోగా అది క్షయ, కాన్సర్, బ్రైటిస్ డిసీజ్ అనే వ్యాధులు మూడు వున్నాయని తేలింది. దీనికి చికిత్స పొందాలంటే చాలా ధన వ్యయం అవుతుంది. వీళ్ళకి పాపం డబ్బు లేదు. ఏ రోజు కారోజు ఎలా గడుస్తుందా అన్నట్లుంది వీరి కాపురం. ఆమెకి ధనం వున్నా ఈ చికిత్సలు చేయించుకుందామని లేదు. ఆమె మనస్సులోను

అంతరంగంలోను ఆంతరికంగా బాబా యొక్క సహాయం పొంది ఆరోగ్యవంతురాలు కావాలని అనుకుంటోంది. తన హృదయంలో బాబాను తలుచుకుంటూంటే ఆమెకి సంతోషము, శాంతి లభిస్తున్నాయి. కాని ఆమె శరీరకంగా చాలా బలహీనంగా అవు తోంది. ఎంతో కష్టపడితేగాని ప్రయత్నం చేస్తేగాని చెయ్యికూడా ఎత్తలేని స్థితిలో వుంది. ఆమె పరిస్థితి బాబాకు తెలుపుకుంది లేఖమూలకంగా. ఒక రోజున ఆమెకు బాబా వద్దనుంచి జవాబు వచ్చింది. ఆమెకు మనోధైర్యం తద్వారా జీవితంమీద కొండంత ఆశ కలిగింది. లోపల ఆమె బాబాతో చెప్పుకుంటోంది. నిరంతరము ఆయన ధ్యానమే ఆయన స్మరణయే ఆమెకు రక్ష అని నమ్ముకున్నది. ఆమె జీవిత సర్వస్వము ఆమె భవిష్యత్తు ఆయన చేతులలో పెట్టి ఆయన ఇచ్ఛకు అంతా వదిలి వేసింది. అందువలన ఆమెకు అఖండమైన శాంతి లభించింది. ఒకనాటి రాత్రి ఆమె బాబాను తలుచుకుంటూనే నిద్రపోయింది. ఆమెకు మెలకువ కలిగినప్పుడు శరీర బాధ కనిపిస్తోంది. మళ్ళీ బాబా నామస్మరణ ఆమెను జోకొట్టి నిద్రబుచ్చుతోంది. ఇంతలో అరుణోదయ మయింది. తోటలోని చెట్ల కొమ్మలు వీవనవలె ఆడుతున్నాయి. కమ్మని పిల్లతెమ్మెరలు ఆమె శరీరాన్ని స్పృశించి హాయిని గొలుపుతున్నాయి. ఆమె లోపల ఏదో దివ్యానుభూతి కలుగుతోంది. ఆమెకు మెలకువ కలిగింది. ఆమె నుంచి ఏదో పెద్ద బరువు దింపేసినట్లు దేహం తేలిక అయింది. ఆమెకు ఒక నూతన జీవన జ్యోతి దర్శనం అయింది. భాస్కర కిరణాలు చెట్ల సందులలోనుంచి కిటికీగుండా ఆమె మంచం మీదకి వచ్చి ఆమె శరీరంమీద ప్రసరించాయి. ఆమెకు సంతోషం అతిశయించింది. ఆమె లోపల ఆరోగ్య భాస్కరోదయం అయినది. నెల రోజుల నుంచి సమస్తమూ మంచం మీదనే జరుగుతోంది ఆమెకు. అలాటి కదలలేని స్థితికి స్వస్తి చెప్పింది. ఆమె మంచంమీద లేచి కూర్చుంది. నిలబడి తిన్నగా ఆమె మాల్కం పడకగదిలోకి వెళ్ళింది. సూర్యరశ్మిచేత మెరిసిపోతున్న కిటికీ పంచని కూర్చుంది కాళ్ళు క్రిందకి పెట్టుకుని. ఆమె నూతన పరిస్థితి మాల్కంకి చెప్పింది. ఎంత ఆశ్చర్యము ! ఎంత విపరీతము ! మాల్కం ఆనందానికి అవధి లేదు. ఇదంతా ప్రియతమ బాబా యొక్క దివ్యప్రేమ ప్రభావమే. వా రిరువురికీ సందేహం లేదు.

దీనిని గురించి బాబా వద్దనుంచి ఆమెకి వచ్చిన ఉత్తరంలో—"ఏదయినా విఫలం కావచ్చు కాని ప్రేమమాత్రం విఫలం కాదు. జయించి తీరుతుంది" అని వ్రాశారు బాబా. తన ప్రియతముని అనుగ్రహంవల్ల దేనివల్ల ఆమె ఇంతటి బాధ అనుభవింపవలసి వచ్చిందో ఆ పూర్వకర్మను ఆమె తొలగించుకోగలిగింది.

హాలీవుడ్‌లో ఉన్నపుడు బాబా పారామౌంట్, యూనివర్సల్, ట్వెన్‌టియత్ సెంచరీ ఫాక్స్, వార్నర్ బ్రదర్స్ - వారి సినిమా స్టూడియోలను (ఫిలిం నిర్మాణ స్థలములను) దర్శించారు.

శామ్యుఎల్ కోహెన్ అను బాబా ప్రేమికుడు ఓషియానా అనే గ్రామంలో సముద్రతీరాన ఇసుకతిప్పలలో ఒక కుటీరంలో వుంటూ బాబాను హాలీవుడ్‌నుంచి అక్కడకు రావలసిందని ఆహ్వానించాడు. శామ్ యిచ్చిన తంతిని అందుకుని వెంటనే బాబా పదునెనమండుగురు గల బృందంతో వస్తున్నానని ఏర్పాటు చేయవలెనని బాబా జవాబు యివ్వగా శామ్యుఎల్ తికమక పడిపోయాడు. అతడువున్న కుటీరం ఆరడుగుల వెడల్పు, పదహారడుగుల పొడవు ఉన్న చిన్న గది. ఇందులో అంతమంది ఎలా వుండగలరు ? ఆలోచించగా అతని స్నేహితుడు గావిన్ ఆర్థర్ అను వానికి ఓషియానాలో ఒక విశాలమయిన ఇల్లు వుందని జ్ఞాపకం వచ్చింది. అతడు 1 1/2 మైళ్ళ దూరంలో ఇంకొకచోట వున్నాడు. అతని యిల్లు అన్ని విధాలా సముపాయంగా వుంటుంది. అందులో అందరికి కావలసినంత చోటువుంది. గావిన్ ఊళ్ళో లేక పోయినా అతని ఇంటికి వెళ్ళి బాబా ఆయన మండలి దిగటానికి తగిన ఏర్పాట్లు చేసి వచ్చాడు. వచ్చి వెంటనే బాబాకి తంతి మూలకంగా తెలియపరచాడు.

క్రిస్టమస్ ఈవ్ (అనగా పండుగకు ముందురోజున) డిసెంబరు 24 వ తేదీన (1934) బాబా ఆయన పరివారంతో ఓషియానాకు వచ్చారు. బాబాతో వచ్చినవారిలో రాజకుమారి నొరీనా మాచెబెల్లీ, ఎలిజబెత్ పాటర్సన్, రువానో బోగిస్లావ్, బాబా తమ్ముడు జాల్‌భాయి, నడినే టాల్‌స్టాయ్ మొదలయినవారంతా వున్నారు. పండుగ నాడు వీరంతా ఓషియానాలో వున్నారు. అక్కడ అంతా పల్లెటూరి వాతావరణం. త్రాగేందుకు మంచినీరు ఎక్కడినుంచో తీసుకురావాలి. బాబా అలా తెప్పించిన నాలుగు బాల్చీల నీటితో స్నానం చేశారు. మరునాడు బాబా వచ్చిన సమాచారం ఊళ్ళో అందరికి తెలిసింది. చాలామంది ఆ గ్రామస్తులు బాబా దర్శనార్థం వచ్చారు. మధ్యాహ్నం సముద్రతీరానికి నడక సాగించారు. బాబా ఇంక బయలుదేరి వెళ్ళిపోతా మంటే వారిని సాగనంపడానికి అందరూ కూడా వెళ్ళారు. అక్కడినుంచి బాబా ఇంక బయలుదేరి కారుమీద వెళతామన్నారు. సముద్రతీరం దరికి చేరిన తరువాత బాబా కారు పాడయింది. కూడా సాగనంపడానికి వచ్చినవారు బాబా ఏదయినా అద్భుతం చేసి కారు నడిచేలా చేయకపోతారా అని ఆయనకేసి చూస్తున్నారు. అలా ఎందుకు చేస్తారు బాబా ? ఎవరో కారు బాగుచేద్దామని ప్రయత్నిస్తూవుంటే సరే

కానిమ్మని. బాబా సముద్ర తీరాన్ని నడక ప్రారంభించారు. శామ్ కూడా ముందుండి బాబాతో నడుస్తున్నాడు.

## శామ్ కోహెన్ అద్భుతానుభవము:

అప్పుడు బాబాతో నడిచి వెడుతున్న శామ్‌కి ఒక అద్భుతమయిన అనుభవం కలిగింది. నడుస్తూ వెడుతున్న బాబా తమ కూడా వస్తున్న శామ్‌కి ప్రక్కనున్న పసిఫిక్ మహాసముద్రంకేసి చూపించారు. శామ్ "అవును బాబా! ఇది చాలా పెద్ద సముద్రం" అన్నాడు. బాబా తల అడ్డంగా త్రిప్పి "అది కాదోయ్ నేనంటున్నది" అని సంజ్ఞ చేశారు. బాబా మళ్ళీ చెయ్యి జాపి సముద్రం కేసి చూపించారు శామ్‌కి. అప్పుడు మరల శామ్ "అవును బాబా! అది చాలా అందంగా వుంది." అన్నాడు. మళ్ళీ బాబా అది కాదన్నట్లుగా సంజ చేశారు. ఆ తక్షణం శామ్యుఎల్ కోహెన్‌కి పెద్దగా బాబా ఆంగ్ల భాషలో మానవ స్వరంలో చెబుతున్నట్లుగా ఈ క్రింది వాక్యం వినిపించింది——

"నేను ఆ సముద్ర మంత బ్రహ్మాండ మయినవాడిని" ఈమాటలు విన్నాడు శామ్. విని బాబా ముఖం కేసి చూశాడు. ఆయన పెదవివిప్పినట్లు కనబడలేదు. బాబా తమ వదనంమీద మందహాసం చిందిస్తున్నారు. ఆయన అంఖడమౌనంలో వున్నారు. ఆయన నోటితో మాటలాడరని అందరికీ తెలుసును. మరి ఈ శబ్దం ఎక్కడ నుంచి వచ్చింది? ఈ మాటలు ఎలా వినిపించాయి? పంచ భూతములు ఆయన చెప్పుచేత లలో మెలిగే సర్వేశ్వరుడు బాబా అని యిది యింకొక సంఘటన. శామ్‌కి తెలియ జెప్పే మార్గం కోసం ఈ శబ్దాన్ని సృష్టించారు బాబా ఆకాశంలో, ఆయనకు మౌన భంగం కాకుండాను.

తరువాత బాబా వారితో వచ్చిన పరివారంతో హాలీవుడ్‌కి వెళ్ళిపోయారు.

హాలీవుడ్ లో బాబా తాము నిర్మాణం చేయిస్తున్న ఫిలిం సంగతి దానికి సంబంధించిన వారితో మాటలు పూర్తిచేసుకున్న ఇంక ఇండియాకు వెళ్ళిపోతానని ఆ సినీమా కార్యకర్తలతో ఇలా అన్నారు.——

"ఈ చిత్రము పూర్తి అవడానికి కొన్ని నెలలు పట్టుతుంది. ఇంకా ఎక్కువ కాలమే పట్టవచ్చు. సంవత్సరం కంటె కూడా ఎక్కువ పట్టవచ్చు. నేను అంతవరకు ఇక్కడ వుండటానికి వీలులేదు. ఇతర పనులు కూడా నేను చూచుకోవాలికదా- తూర్పు దేశాల్లలో, ముఖ్యంగా ఇండియాలో, ముఖ్యమయినప్పటికి ఈ చిత్ర

నిర్మాణం దాని తరువాతే మరి. మీరు మరీ మరీ రమ్మని అడిగితే నేను వచ్చాను. ఇండియా నుంచి ఇంత దూరమూను. ఈ పని ఇంతవరకూ వచ్చింది కదా. ఆ పైని మీరు కానివ్వండి నేను వ్రాయించి యిచ్చిన ఆధ్యాత్మిక పథకం ప్రకారం. నేను ఎక్కడ వున్నా మీకు మార్గం చూపిస్తూ మీ పనిలో అంతరంగంగా సహాయం చేస్తూ వుంటాను. ఇది నా పని. అందుకు మీరేమీ చింతపడనక్కరలేదు. మీరంతా అన్యోన్యంగా సహకరించుకుంటూ పని చేస్తూండండి. నేను మీతోటే వుంటాను"

అని చెప్పి బాబా వెళ్ళిపోతూవుంటే ఆయన వెడుతున్నారని అందరి హృదయాలు ఆయన కోసం ఆక్రోశించాయి. ఆయనే వారి సర్వస్వం. అని వారుకూడా నమ్మినవారుగాన బాబాను వీడి వుండడం అంటే అందరికీ కష్టంగానే వుంది.

అమెరికాలోను ఇంగ్లండులోను ఉన్న బాబా ప్రేమికులు ఆయనకు వ్రాసిన ఉత్తరాలనుబట్టి ఆయనను వారంతా ఏభావంతో చూచుకుంటున్నారో స్పష్టమవుతుంది.

కొలది ఉత్తరాలు మాత్రం నమూనాకి ఇక్కడ పొందుపరుస్తున్నాము–

కెంట్, 28–1–1935

ప్రియమైన గురూ!

మీ పుట్టిన రోజుకి మళ్ళీ ప్రేమతో నా శుభాకాంక్షలుపంపుతున్నాను.

క్రిందటిమాటు మిమ్మ కలసినపుడు అంతకుముందు మీ యెడల నేనుచూపిన గర్వము గురించి చెప్పుకుని క్షమాపణ వేడుకున్నాను. మీరు నన్ను క్షమించినట్లుగా తలవూపారు. ఆ క్షణం నుంచీ మీకు నేను పరమ విధేయుడను. నా హృదయం మీకు అర్పించి వేశాను. బరువులు భారాలు మోసే ఈ దుఃఖభాజనులయిన ప్రజల యెడల మీ దివ్యప్రేమను ప్రసరిస్తున్నట్లు నాకు అనుభూతి కలిగింది. నా హృదయంలో మీకందులకు ధన్యవాదాలర్పిస్తున్నాను.

నా అవగాహనాశక్తి అభివృద్ధి పొందేలా నాకు సహాయం చేయండి. మీ పునర్దర్శన భాగ్యం కలిగించండి.

భక్తి శ్రద్ధలతో, మీ అనుయాయి, యి. ఆర్.

◆ ◆ ◆ ◆

హాలీవుడ్, 17–1–1935

నా ప్రియతమ బాబా!

మీరు లేనిలోటుఎంతో అనుభవిస్తున్నాను. నిరంతరముమిమ్మే తలుస్తున్నాను.

ఎప్పుడూ విడిపోకుండా మీతోనే వుండేరోజు త్వరలోనే వస్తుందని ఆశిస్తున్నాను.

♦ ♦ ♦ ♦

లండన్.

ఎప్పుడూ మిమ్మల్నే తలుస్తున్నాను.

—ఎ. ఆర్.

♦ ♦ ♦ ♦

నా ప్రేమ ఎంత వుందో అంతాపేదే.... నా హృదయం. నా ఆత్మ.మీవే.... ఈరోజే ఇక్కడ సమావేశం....

—కౌంటెస్ కె. .పి

♦ ♦ ♦ ♦

నా ప్రేమను, కృతజతను తెలుపుచున్నాను.

జి. వి.

♦ ♦ ♦

నేను మిమ్మలను చూడాలని ఎంతో ఆతురతగా వున్నాను.

— పి. యి.

♦ ♦ ♦ ♦

హాలీవుడ్- 16-2-1935

మిమ్మలను జాపకం వుంచుకుని ఆరాధిస్తున్నాము.

— మింటా ట్రినిటీ

♦ ♦ ♦ ♦

మిలాన్, 11-1-1935

మీకు సుఖంగా ప్రయాణం సాగుగాక.

ఆనందమయంగా తిరిగి మిమ్మ కలుసుకొనుటకు ఎదురు చూస్తున్నాము.

— ప్రేమతో, ఎమ్. యి.

♦ ♦ ♦ ♦

వెస్ట్ లాస్ ఏంజిలెస్, 12-1-1935

మీరు నాకు చేసిన చక్కని సహాయమునకు అత్యంత కృతజ్ఞతను పంపుకుంటున్నాను. ఇంక మీ చేయి పట్టుకుని వుండుటకు మీరు ఇక్కడ వుంటే

బాగుండును........ నాకు శక్తిని ప్రసాదించరూ?

— ఎమ్

♦ ♦ ♦ ♦

న్యూయార్క్, 17-2-1935

....మీరు ఆధ్యాత్మిక సహాయం పంపండి. మీ కథలో పని చెయ్యడానికి త్వరలో హాలీవుడ్‌కి వెడుతున్నాను. గార్బోనుండి సమాధానం లేనందుకు నేను విచారిస్తున్నాను. అందమయిన నా బాబా! ఈ వుత్తరం మీ పుట్టినరోజు పండుగనాడు అందుతుందని ఆశిస్తున్నాను. ప్రేమతో నిండిన నా పూర్ణ హృదయాన్ని మీకు పంపుతున్నాను.

— ఎమ్.

♦ ♦ ♦ ♦

ఆ విధంగా బాబా అమెరికాలో కాలం గడిపారు. బాబా అమెరికా వదలి వెళ్ళే సమయం ఆసన్నమయింది. నొరీనామాచెబెల్లీ, ఎలిజబెత్, రువానో మొదలయిన పాశ్చాత్యులు అమెరికాలో ఉండి పోయారు. బాబా భారతీయ శిష్యులతో పయనమయారు. ఆఖరు రోజున రువానోతో బాబా అన్నారు.—

"నీకు యిష్టం లేని పని అయినా
విశ్వాసంతో బాగా చేశావు.
నీకు తెలియదుగాని ఇలా చేయడం నీకే ఎంతో
ఉపకారం అయింది."

ఈ మాటలతో ఆమె పడ్డ కష్టమంతా మరిచి పోయింది. ఆమె హృదయం ఆనందంతో గంతులు వేసింది.

బాబా లాస్ ఏంజిలెస్ నుండి 1935 జనవరి 7వ తేదీన రైలులో బయలుదేరి వాన్ కూవర్‌లో 10 తేదీన దిగారు. ఈ ప్రయాణం మూడురోజులలోను బాబాకు ప్రేమికులు పంపిన శుభాకాంక్ష సందేశాలు పన్నెండు అందాయి. బాబా పయనమవడానికి ముందు వాన్ కూవర్‌లో బాబాకు వచ్చిన వుత్తరాలు ఒక పెద్దకట్ట తీసుకున్నారు. అది బాబా రాక కోసం వాన్ కూవర్‌లో వేచియుండెను. అక్కడ వారం రోజులుండి అక్కడ నుంచి 18 వ జనవరినాడు బాబా "ఎమ్‌ప్రెస్‌ఆఫ్‌కెనడా" అనే ఓడమీద బయలుదేరి ఫిబ్రవరి 2వ తేదీకి హాంగ్‌కాంగ్ చేరుకున్నారు. ఇక్కడ బాబా తమ మండలితో ఇంకో స్టీమరులోకి మారవలసి వచ్చింది. హాంగ్‌కాంగ్‌లో

బాబాకు స్వాగతం యివ్వడానికి ఆర్. యి. దేశాయి ఎస్. పెస్టరీజీ అనువారలు వచ్చారు. బాబాను దేశాయి తన యింటికి తీసుకు వెళ్ళి అతిథ్యం యిచ్చారు. ఆరోజునే "పూషమి మారు" అనే ఓడ నెక్కి బాబా కొలంబోకి ఫిబ్రవరి 13 వ తేదీన చేరారు. ఇంగ్లండునుంచి, అమెరికా నుంచి, యూరపు నుంచి బాబా భక్తులు అనేకులు ఓడమీద ప్రయాణం చేస్తున్న బాబాకు వైర్లెస్సు ద్వారా శుభాకాంక్షలు భక్తి ప్రేమలను తెలుపుతూ అనేక సందేశాలు పంపించారు. రైలు మీద, స్టీమరు మీద ప్రయాణం చేసి కొలంబో నుంచి బాబా యిండియా వచ్చారు. మదరాసుకు రైలు రాగానే ఎగ్మూరు స్టేషనులో సంపత్తయ్యం గారు మొదలైన భక్తులు అనేక మంది బాబాకు స్వాగతం యిచ్చారు. అక్కడ బాబా ఆగలేదు. తిన్నగా సెంట్రల్ స్టేషనుకి వెళ్ళి యింకొక రైలు ఎక్కారు. ఒక గంట వ్యవధి వుంటే భక్తులతో ముచ్చటించారు. బాబాసరిగా పార్శీక్యాలెండరు ప్రకారం బాబాపుట్టినరోజయిన ఫిబ్రవరి 16 వ తేదీనాడు బాబా మెహెరాబాదు తిరిగి వచ్చారు. అయితే ఆనాడు పండుగ చేసుకోవడానికి బాబా ఎవరికి అనుమతి యివ్వలేదు.

1935 వ సంవత్సరంలో రోమ్‌లాండో అను నతడు "గాడ్ ఈజ్ మై అడ్వెంచర్" అనే పుస్తక రచన చేసి అది ప్రచురించాడు. జేమ్స్ డగ్లస్ అను పత్రికా విలేఖరి బాబాతో చేసిన సంభాషణ ప్రచురించగా అది లాండో చదివి బాబాను గురించి తెలుసుకున్నాడు. తరువాత అతడు బాబాను లండన్‌లో లంకాస్టర్ గేట్‌వద్ద ఒక యింటిలో బసచేసి వున్నపుడు దర్శించాడు. ఇతడు వ్రాసిన పుస్తకంలో బాబా గురించి ఎక్కువ సానుభూతితోను ఎక్కువ వివరాలతోను వ్రాశాడు. లాండో తన పుస్తకంలో బాబా తనకు దురవగాహంగా ఉండిపోయారని వ్రాశాడు. అతడంటాడు- "స్టీనర్ ఉన్నటువంటి ప్రపంచంలో ఒక మెహెర్‌బాబా ఉండవచ్చుకదా" అని. బాబా అతనికి అవగతంకాలేదు. పరమేశ్వరావతారు డయిన బాబాను ఎవరు అవగాహన చేసుకోగలిగారు? ముఖ్యంగా ఇదివరకే తన హృదయంలో ఒక అభిప్రాయం ఏర్పరుచుకుని బాబావద్దకు వెళ్ళినవారికి బాబా అసలే కొరకరాని కొయ్య అవుతారు.

బాబా ఒక సంవత్సరం ఏకాంతంగా ఉండాలని ఏర్పాట్లు చేసుకుంటున్నారు. 1935 వ సంవత్సరం మార్చినుంచి జూన్ వరకు ఎలా మసలుకోవాలో బాబా మండలికి విశదీకరించారు. ఈ నాలుగు నెలలలోను బాబా అహమద్‌నగర్, నాసిక్. పూనా, బొంబాయి, మద్రాసు నగరాలకి ఇంకా ఇతర స్థలాలకి వెళ్ళి తిరిగి వచ్చారు.

కాలిఫోర్నియా వగైరా దేశాల నుంచి ప్రపంచ యాత్ర ముగించుకుని వచ్చాక ఈ దీర్ఘ ప్రయాణాల వల్లనే కాకుండా హాంగ్‌కాంగ్ నుంచి కొలంబోకి చేసిన సముద్ర ప్రయాణంలో పాలు మాత్రం పుచ్చుకుంటూ ఉపవాసాలు చేసినందువల్ల బాబా చాలా నీరసించి ఎంతో అలసిపోయినారు. మెహెరాబాద్ వచ్చిన తరువాత కూడా బాబా ఒక నెల ఉపవాసం ఉన్నారు. ఈ రోజుల్లో బాబా ఆట్టే నిద్రకూడా పోయేవారు కాదు. నాసిక్‌కి 30 మైళ్ళ దూరంలో ఇగత్‌పురి వద్ద కొండలలో వున్న ఘోటీడాక్ బంగాళాలో కొన్నిరోజులు ఏకాంతంగా వుండడానికి వెళ్ళి మూడు రోజులు మాత్రం అక్కడ వుండి తిరిగి వచ్చేశారు.

మండలివారిని పంపించి కొండ ప్రదేశాలలో ఇంకా ఎక్కడ ఏకాంతవాసం చేయడానికి అనువుగా వుంటుందో చూచి రమ్మన్నారు. ఆయా స్థలాల గురించి ఎక్కువగా సమాచారం సేకరించి తీసుకురమ్మన్నారు. హిమాలయ పర్వతాలలో ఈశాన్య దిశలో వుంటానని వెళ్ళేటప్పుడు దారిలో మరొకచోట కొద్దిరోజులుంటానని బాబా చెప్పారు.

బాబా ఇద్దరు శిష్యులను వారితో రావడానికి ఎన్నిక చేసుకున్నారు. అందులో ఒకడు ఏడేళ్ళుగా మౌనం అవలంబించి వున్నాడు. గుస్తాద్‌జీ అతని అభిప్రాయాలు సైగల ద్వారా తెలియజేస్తూండేవాడు. అతనివద్ద వేళ్ళతో చేసే సాంకేతిక మయిన సైగలకు అర్థాలు చూపించే పలక ఒకటి అతడే తయారు చేసుకున్నాడు.కాని ఎంతో తెలివయినవాడు గాని ఆ పలకమీది వ్రాతలు అర్థం చేసుకోలేడు. రెండవవాడు శారీరక బలం బాగా వున్నవాడు. ప్రయాణాలలో కష్టాలు సహించగలిగేవాడు వారిరువురు ఏమేమి చెయ్యాలో బాబా వివరంగా చెప్పారు. ఆఖరు క్షణంలో మూడవ వానిని కూడా బాబా ఎన్నుకుని కొంతదూరం వారితో ప్రయాణం చేయడం కోసం రమ్మన్నారు.

ఈ ముగ్గురితోను బాబా బయలుదేరి బొంబాయికి 1935 జూన్ 7వ తారీకుకి చేరుకున్నారు. బొంబాయిలో కాని ఎక్కడయినాగాని బాబా ఎక్కడకు వెళ్ళుచున్నారో ఎవరికీ తెలియనివ్వలేదు. ఒక్క శిష్యునికి మాత్రం గమ్యస్థానం తెలుసును. ఎక్కడికి వెడుతున్నారు అని అడిగితే హిమాలయ పర్వతాలకి అని మాత్రం అనేవారు. రైలులో మూడవ తరగతిలో ప్రయాణం చేశారు. అది వేసవికాలం. అప్పుడు బాబా తిన్నగా అబూ పర్వతాలకి వెళ్ళారు. మర్నాటికి (జూన్ 8వ తేదీ కి) అబూ రోడ్

స్టేషన్‌లో దిగి ఆ సాయంకాలానికి మౌంట్ ఆబూ చేరుకున్నారు. ఆ రాత్రి ఒక రహదారీ బంగాళాలో గడిపారు. ఉదయాన్నే (జూన్ 9వ తేదీ) లేచి బాబా ఏకాంతంగా వుండడానికి సరియయిన స్థలం అన్వేషించారు.

మౌంట్ ఆబు దేవతల నిలయమని ప్రసిద్ధి. రైలు స్టేషన్‌కి ఈ కొండ గ్రామం 17 మైళ్ళ దూరంలో వుంది. దీనికి అహమదాబాద్ నగరం 115 మైళ్ళ దూరము వున్నది. 'గురుశిఖరం' అని పేరొందిన ఆ ప్రాంతంలో అన్నిటికంటె ఎత్తయిన గిరిశిఖరం 5, 600 అడుగుల ఎత్తున వుంది. ఆ గిరిమీద వాతావరణం ఆరోగ్యప్రదంగా వుంటుంది. ఆ కొండలలో అద్భుతమయిన దృశ్యాలున్నాయి. అక్కడ పర్వత సానువులలో అనేక పురాతనమైన గుర్తులున్నాయి. 'ఆబూతల్లి' అని ప్రఖ్యాతి గాంచిన 'అంబిక' అనే కొండమీద ఉండడానికి బాబా నిశ్చయించారు. అక్కడ ఒక వెల్లవేసిన చిన్న గుడి కూడా వుంది. ఈ కొండమీద అందమయిన చిన్న గుహ కూడా ఒకటి వుంది. అది ఒక గదిలా మలచబడింది. దానికి సమీపంలో ఒక చిన్న గుడిసె వుంది. అనేక తరాల క్రిందట ఆ గుహలోను అక్కడ ఇంకా అలాటి అనేక గుహలలోను సాధువులు ధ్యానం చేసుకునేవారు. అందుచేత ఇవి పవిత్ర స్థలాలయినాయి. బాబా ఒకమాటు తన శిష్యుడొకడిని కొన్నాళ్ళు ఏకాంత వాసం చేసి రమ్మని ఈ కొండమీదకి పంపించారు. అందుచేత బాబా పేరు ఇక్కడ బాగా తెలిసినదే. ఆ గుళ్ళో పూజారి బాబా తాలూకు ఎవరో వచ్చారని విని చాలా ఆనందించాడు. బాబా కూడా ఈ మాటు ఒక బాబా శిష్యుని వలెనే వేషం వేసుకుని ఆ గుహలో ఉన్నారు, ఆయన ఎవరినీ చూడలేదు. ఈ కొండమీద నివాసానికి అంత సౌకర్యంగా వుండలేదు చలి ఎక్కువ. ఎప్పుడూ ఈదురు గాలి వీస్తూ వుండేది. ఉప్పునీరేకాని మంచి నీరులేదు. త్రాగడానికి చాలా ఇబ్బందిగా వుండేది. ఉప్పునీరు త్రాగితే అరగడం కష్టం, అందుచేత బాబా పాలమీదే వుంటూ ఉపవాసాలు కూడా చేశారు ఇక్కడున్నన్నాళ్ళు. ఆరు వారాలయిన తరువాత బాబా తనతోవున్న ముగ్గురు శిష్యులకు అక్కడ తను చేయవలసిన పని అయిందని చెప్పారు. అక్కడనుంచి ఇంక వెళ్ళిపోదామనుకున్నారు. ఇంకోచోట కెక్కడికయినా వెళ్ళాలేమో అని ప్రయాణమవుతున్న శిష్యులకు బాబా తిరిగి మెహెరాబాదే వెళ్ళిపోదామనగానే వారికి ఆశ్చర్యం కలిగింది.

మెహెరాబాద్‌లో బయలుదేరేటప్పుడు బాబా యొక్క కేబిన్ పాతదై శిథిలమై పోతోందని బాబా పర్యటన చేసి తిరిగి వచ్చేసరికి కొత్తగది కట్టించి వుంచమ

చెప్పి వెళ్ళారు బాబా. మెహెరాబాద్ కొండమీద ఏకాంతంగా ఒకమూల కర్రతోటే కేబిన్ నిర్మించమన్నారు. అది ఆగస్టు (1935) మాసం.

ఎవరితోనూ చెప్పకుండా అంబికా కొండ నుండి తిరుగు ప్రయాణం కట్టారు బాబా, శిష్యులతో. ఇంగా ఏకాంతంగానే వుండాలని ఒక్క శిష్యుని తమ దగ్గర పెట్టుకుని రెండవ తరగతిలో రైలుమీద ప్రయాణం చేశారు. మిగిలిన ఇద్దరు శిష్యులు మామూలుగా మూడవ తరగతిలో వచ్చారు. బాబా బొంబాయి మీదుగా ఎవరికీ తెలియకుండా వచ్చారు. దోండ్‌లో రైలు దిగారు అక్కడినుంచి అహమద్‌నగర్‌కి 50 మైళ్ళ దూరము కారులో వచ్చారు శిష్యులతో. ఆయన్ను ఎవరూ ఆనవాలు పట్టలేదు. ఈ విధంగా మెహెరాబాద్‌కి తిరికి వచ్చారు వచ్చిన తరువాత ఇప్పుడు జరిగిన ఏకాంతవాసంలో ఆధ్యాత్మికమైన ఒక పనికి పునాదులు వేశానని బాబా చెప్పారు.

బాబా మెహెరాబాద్‌కి తిరిగివస్తూనే కొత్తగా తయారయి సిద్ధంగా వున్న వారి కేబిన్‌లో దిగారు. అందులో ఏకాంతవాసం ప్రారంభించారు. వారి కేబిన్ గుమ్మంలో బాబా పెంపుడు కుక్క 'చమ్' పడుకుని వుండేది. గదిలోపల బాబా వున్నా లేకపోయినా ఎవరూ ఆ గుమ్మంలోంచి వెళ్ళడానికి వీలులేదు. ఎవరూ చమ్ దగ్గరకు వెళ్ళడానికి సాహసించేవారు కాదు. బాబా అప్పుడు ఏకాంతంగా వారి కేబిన్‌లో ఉండేవారు. బాబా వంటయింటి వద్దకు గాని భోజనానికి గాని వెడితే చమ్ ఆయనతో కూడా వెళ్ళేది. అక్కడ కూడా బాబా సమీపానికి ఎవరినీ రానిచ్చేది కాదు. చమ్ యొక్క ఈ కావలి బాబా ఏకాంతవాసానికి బాగా సరిపోయేది. బాబా వారి ఏకాంతంలో కొద్దిమందిని మాత్రం చూచి మాట్లాడారు.

ఒక రోజున బాబా చెల్లెలు మణి వచ్చింది. "చమ్" ఆమె మీదికి ఉరకబోయింది. అప్పుడు బాబా లేచి ఒక చిన్న బెత్తంతో దాన్ని ఒక్కటేశారు. అప్పుడు తలకాయ వంచుకొని ఆయన పాదాల వద్ద పడివుంది. తన తప్పుకి క్షమాపణ చెప్పుకుంటుందేమో అన్నట్లుగా.

ఒకమారు బాబా తమ మండలికి ఒక ప్రవచనం చేశారు. ఎవరో ముఖ్యమయిన మానసిక స్థితుల గురించి బాబాని అడిగారు అప్పుడు ఆయన ఇలా చెప్పారు. —

"అనేక విధాలుగా అసంఖ్యాకమయిన ప్రేమికులను నా వద్దకు లాగుతాను నేను. వారికి అనేక విధాలయిన అనుభూతులు కలుగుతాయి. ఇవి మూడు విధాలుగా-మూడు స్థితులుంటాయని చెప్పవచ్చును.

మొదటిది రాతి స్థితి : వారికి తెలియకుండానే వారు భగవంతుని వైపుకి, అవతారుని వైపుకి ఆకర్షింపబడవచ్చు.

రెండవది కీటక స్థితి : ఇందులో మనస్సు అటు యిటు కదలుతూ వుంటుంది పురుగులాగ. అతడు నన్ను పూజిస్తూనే వుంటాడు. కాని అప్పుడప్పుడు నామీద నమ్మకం పోతూంటుంది. నన్ను ఆరాధిస్తాడు కాని నన్ను నమ్మడు. ప్రేమ, సంశయం రెండూ వుంటూ వుంటాయి. చివరకు ప్రేమయే జయిస్తుంది. ఈ స్థితిలో అనేక సంస్కారాలు వ్యయం అవుతాయి.

మూడవది : కుక్క యొక్క స్థితి : కుక్కకి యజమాని అంటే అత్యంతమైన విశ్వాసం వుంటుంది. యజమానితో అతడు ఎక్కడికి వెడితే అక్కడికి కూడా తిరుగుతూ వుంటుంది. దానికి ఒక విధంగా స్వంత యిచ్ఛ అనేది లేనట్లుగా. దానికి యజమానిని అనుసరించడమే తెలుసును. ఈ స్థితికి ప్రేమికుడు రాగలిగేడా అతడు ధన్యుడన్నమాటే.

బాబా ఎద్ద పెరుగుతున్న కుక్క 'చమ్' ఈ మూడవ స్థితిలో చెప్పినట్లుండేది. దాని జీవితాంతము కూడా అలాగే వుంది. చమ్‌కి కాన్సర్ వచ్చి ఒక రోజున చనిపోయింది. దానికి వున్న విశ్వాసం గొప్పది. అందుచేత అభిమానం కొద్దీ దాని శరీరాన్ని మెహెరాబాద్ కొండమీద పూడిపించారు. బాబా సమాధికి అనతి దూరంలో, బాబాకి విశ్వాసంతో సేవ చేసిన చమ్‌కి మంచి మానవ జన్మ కలుగుతుం దనడంలో సందేహం అక్కరలేదు.

బాబా దక్షిణ భారతదేశం పర్యటించి వద్దామని 1936 వ సంవత్సరం జనవరి మాసంలో కొంతమంది మండలిలోని శిష్యులను కూడా తీసుకువెళ్ళడానికి ఎన్నుకుని వారితో బయలుదేరారు. ఈ పర్యటనలో బాబా మదరాస్, బెంగుళూరు, పుదుచ్చేరి, ఉదకమండలం, కూనూరు, మైసూరు, మైసూరు రాష్ట్రంలో కొన్ని క్షేత్రాలు, చూడతగిన స్థలాలకి - హస్సన్, బేలూరు, చిక్‌మాగులూరు, బాబా బుడాన్ కొండలు మొదలయిన ప్రదేశాలకి వెళ్ళారు. ఈ పర్యటన అంతా కలిసి బాబాకి ఆరు

నెలలు పట్టింది. ఈ ఆరు నెలల కాలమూ బాబా ఏకాంతంగా వున్నారు. అంటే బాబా ఎవరికీ దర్శన మీయలేదు. ఎవరితోనూ మాటాడలేదు. భవిష్యత్తులో బాబా చేయవలసిన ఆధ్యాత్మిక కార్యమునకు ఈ పర్యటనలో బాబా పునాదులు వేశారు. ప్రాచ్య పాశ్చాత్య సమ్మేళనానికి దారి తీయడానికి ఉపయోగించే ఆధ్యాత్మిక ఆశ్రమాలు భారతదేశంలోను విదేశాలలోను నెలకొల్పాలని బాబా ఉద్దేశం. ఆ ఆశ్ర మాలలో అన్ని దేశాలవారు అన్ని మతాలవారు, వివిధ భాషలవారు బాబా పర్యవేక్షణ క్రింద ఒకటిగా వుండి జీవితం గడపాలని వారి ఆశయం.

ఈ ఆశయాలు నెరవేరడం కోసం బాబా మరల కొద్ది కాలం పాటు – బహుశా వచ్చే సెప్టెంబరు మాసంలో – పాశ్చాత్య దేశయాత్ర చేయవలసి వస్తుందని అను కుంటున్నారు. అంతేగాక ప్రియమైన ఆయన పాశ్చాత్య ప్రేమికులు బాబాని ఒక్కమారు వారి దేశాలకు రావలసిందని ఆహ్వానిస్తున్నారు. ఒకవేళ ఆయన అక్కడకు వెళ్ళడం పడకపోతే వారినే కొంతమందిని ఎన్నుకుని బాబా భారతదేశానికి రమ్మని పిలిపిస్తారు. కొంతకాలం పాటు ఒక ఆధ్యాత్మిక ఆశ్రమం నడుపుట మాత్రం ఖాయం. ఆశ్రమంలో వుండేవారంతా మనోహరమయిన పరిసరాలలో వున్న నాసిక్‌లో ఒకచోట వుంటారు.

మెహెరాబాద్ నుంచి నాసిక్ రోడ్‌మీద 23 మైళ్ళ దూరంలో నదీతీరాన ఒక ప్రశాంతమయ మయిన వాతావరణం కల ప్రదేశంలో రాహూరి అనే గ్రామ పరిసరాలలో బాబా ఒక ఆశ్రమం నెలకొల్పి అక్కడకు వెళ్ళి కొద్దిమంది శిష్యులతో ఏకాంతవాసం చేశారు. మిగతావారంతా మెహెరాబాద్‌లోనే వున్నారు.

("మౌనంలోను ఏకాంతంలోను రహస్యంగాను పని చేయడం అంటే నాకే తెలుసును. నాకు వేలాది మానవులతో సంబంధం వుంది. ప్రతీ క్షణం వారు నేను ఏం చేస్తూంటానో తెలుసుకుంటూ వుంటారు. నన్ను చూడాలని కోరుతూ వుంటారు. నేను ఎక్కడికి వెళ్ళినా ఏ పని చేసినా వారు చూడాలని అనుకుంటూ వుంటారు.)

ఎవరయితే నాతో పనిచేస్తూ వుంటారో ఎవరు నా కదలికను గమనిస్తూం టారో వారికి నన్ను గురించి నా పని గురించి ఒక అభిప్రాయం వుంటుంది. తెలియకుండా రహస్యంగా కదులుతూ వుండడం ఎంత కష్టమో ఇతరులకు ఏమీ

తెలియదు. ఎన్నో వేలాదిమంది భక్తులకు బాబా పేరు ఎంతో బాగా తెలుసును. వారికి బాబా అంటే ఎంతో ప్రియమైనవాడు. కాని నాకు నా స్వంత విధానా లున్నాయి. అందుచేత ఎలాగో సాధించగలను. ఈ పనిలో నాతో వచ్చేవారు నా పనిలో పాల్గొనేవారు సహజంగా నేను చెప్పినట్లు విని నా ఆజ్ఞలను ఒక క్రమ శిక్షణకు లోబడి వారికి కష్టమయినా ఇబ్బంది అయినా నాతో కూడా వుండి పనిచేస్తూ వుంటారు." అని బాబా అన్నారు. 1936 సం॥ ఫిబ్రవరి 10 వ తేదీన వారి పని గురించి చెప్తూ.

బాబా ప్రవచనాలలో "గురువులు వారి చైతన్య స్థితిలో నిర్గుణంగాను విశ్వవ్యాప్తంగాను ఉంటారు. కాని వారు అలా వున్నప్పటికి వారి ఆధ్యాత్మిక కార్యాల కోసం వారు చేసే పనిని పరిమితం చేసుకోగలరు. వారి శిష్యుల యొక్క ఆశయాల కోసం వారు కేంద్రంగా వుండగలరు కూడా" అని చెప్పినది ఈ సందర్భంలో జ్ఞాపకం వస్తుంది.

1936 వ సంవత్సరం ఫిబ్రవరి మాసంలో బాబా మైసూరులో వుంటూ వారి జన్మదినాని కిచ్చిన సందేశంలో ఇలా తెలిపేరు. —

("ప్రతివాడికి ఏవో సమస్యలు - చిన్న చిన్న సమస్య లుంటాయి. అవి ఏమంత చెప్పుకోతగ్గ ప్రాధాన్యత కలవి గావు. అన్నిటికన్న గొప్పది ఈ జీవిత సమస్య. ఆత్మ సాక్షాత్కారం అనే సమస్యలో ప్రపంచము - అందులోని మానవులు అన్నీ కలిపినా ఆ సమస్య యుగాలకైనా చిక్కు విడదు.—ఎప్పుడో ఒక సద్గురువు ఈ సమస్య తీసుకుని బాధపడుతూన్న మానవులకు సహాయం చేసి ఈ మాయ యొక్క చిక్కుల్లోంచి విడిపించేదాకా.")

ఇంకొకమారు ఈ మాయ గురించి చెప్తూ బాబా "మాయ అంటే ఈ ప్రపంచము దాని వ్యవహారాలూ కాదు. ఈ ప్రపంచము దాని వ్యవహారాలూనూ నిజమని పొందే భ్రాంతి, కొన్ని పరిస్థితులలో సుఖంగాను మరికొన్ని పరిస్థితులలో విచారంగాను ఉండడము - మాయ" అని చెప్పారు.

1936 ఫిబ్రవరిలో తమ పుట్టిన రోజునాడు ఎవరూ పండుగ చేయవద్దని బాబా మెహెరాబాద్‌లో చెప్పారు. ఎక్కడా జన్మదినోత్సవం చేయవద్దని చెప్పడం ఇది వరుసగా రెండో సంవత్సరం. సరిగా బాబా పుట్టిన రోజునాడు ఉపాసనీ

మహారాజ్ అహమద్‌నగర్ వచ్చి గుల్మాయి యింటికి వెళ్ళి అక్కడ బాబా ఫోటో వున్న గదిలోనికి పోయి – "గుల్మాయి ! మెహెర్ నా ప్రియమైన బిడ్డ ! అతనికి నేను తన జన్మదినంనాడు వచ్చి స్వయంగా హారతి యిచ్చానని చెప్పు." అని బాబా చిత్రానికి ఉపాసనీ మహరాజ్ హారతి యిచ్చి వెళ్ళెను. ఇందువలననే కాబోలు బాబా ఎవరినీ పండుగ చేసుకోవద్దని అన్నారు. ఒక సద్గురువు హారతి యిస్తే సర్వులు ఆయనకు హారతి యిచ్చినట్లే.

బాబా కొంతమంది పాశ్చాత్యులను ఇండియాకు రప్పించాలని 1936 వ సంవత్సరం వసంత కాలంలో నిశ్చయించుకుని ఆ సంవత్సరం ఆకురాలు కాలంలో వారికి ఆహ్వానాలు పంపించారు. ఆ ఆహ్వానాలు అందగానే బాబా ప్రేమికులు ప్రయాణాలకి సన్నాహాలు చేసుకుంటున్నారు. ఎలాగోలాగ ముందు ఇండియాకు చేరుకుంటే అక్కడ నుంచి వారి మంచి చెడ్డలు బాబాయే చూసుకుంటారని వారి ధైర్యం. బాబా శిష్యులలో ధనికు లయినవారు అంత భాగ్యవంతులు కాకుండా వుండి ధనము వల్లనే సాధ్యమయే ఈ దీర్ఘ ప్రయాణం ఎలాగ చేయడమా అని డబ్బు కోసం వెనకా ముందూ చూసుకునేవారికి కావలసిన ధన సహాయం చేశారు. ఉదాహరణకి – గారెట్ ఫోర్ట్ అనే హాలీవుడ్ నివాసి (ఇతని గురించి వివరంగా ముందు తెలుపబడుతుంది) మాల్కం స్లాక్‌కి అతని భార్య జీన్‌కి వారు ఇండియా వచ్చేందుకు ప్రయాణపు ఖర్చులు పెట్టుకుని సహాయం చేశాడు. బాబా రెండవ మారు అమెరికా వెళ్ళి హాలీవుడ్ సందర్శించినపుడు గారెట్ ఫోర్ట్ బాబా దర్శనం చేసుకున్నాడు.

రాహురిలోను, భారత దేశంలో యితర స్థలాలలోను బాబా నెలకొల్పిన అనేక ఆశ్రమాలు, పాఠశాలలు, ఆస్పత్రులు వగైరా సక్రమంగా నడిపించడానికి ఆయా స్థలాలలో వున్న చరస్థిరాస్తులను సరిగా పరిపాలించడానికి, ఆయా ఆశ్రమాలలో పని చేస్తున్న మనుష్యులు వారి కుటుంబాలు చక్కగా జీవించేటట్లు వారి పోషణ భారము వహించడానికి బాబా ఒక ట్రస్టు ఏర్పాటు చేశారు. అందులకుగాను బాబా వారి శిష్యులను కొంతమందిని ట్రస్టీలుగా ఎన్నుకుని వారి ధర్మాలను అందులో నిర్వచించారు. ఆ ట్రస్టుకు చెందజేసిన ఆస్తిలో బాబా నాసిక్‌లో రు. 40,000/– కు కొన్న స్థలము, భవనములు అన్నీ అందులో చేర్చారు. ఈ ట్రస్టు 1936 వ సంవత్సరం ఆగస్టు 5 వ తేదీ నుండి పని ప్రారంభించినది. ఆ మర్నాడే బాబా రాహూరీకి కొద్దిమంది శిష్యులతో బయలుదేరి వెళ్ళారు.

రాహూరి ఆశ్రమంలో కొంతమంది మస్తులు, పిచ్చివారు ఉన్నారు. వారి సంరక్షణకు కొందరు శిష్యులను ప్రత్యేకంగా బాబా నియోగించారు. ఈ ఆశ్రమ వాసులను లొంగదీసుకుని వారికి కావలసిన పనులన్నీ చేయడం బహు ప్రయాసతో కూడినపని అయింది. మస్తులూ, పిచ్చివారూ చెప్పినమాట వినరు గనుక వారితో పనిచెయ్యడానికి అత్యంతమయిన ఓర్పుకావాలి. వారితో మానసికంగా చేయవలసిన పనేగాక వారికి స్నానం చేయించడం, భోజనం పెట్టడం, బట్టలు ధరింప చేయడం వగైరా పనులన్నీ బాబాయే స్వయంగా చేసేవారు. సర్వశక్తిమంతుడు గనుక బాబాకు వారు సులభంగా లొంగిపోయి ఆయన చెప్పినట్లు నడుచుకునేవారు. వారిని ఏ విధంగా తమాషాగా బాబా లొంగదీసుకునేవారో నిజంగా చూచితీరవలసినదే. ఒక్కొక్కరికి ఒక్కొక్క గుడిసె కట్టించి వాటిలో వారిని ఉంచాలని 50 గుడిసెలు నిర్మించాలని బాబా సంకల్పం.

రాహూరీ ఆశ్రమంలో ఉన్నన్నాళ్ళు బాబా ఏకాంతంగానే వున్నారు. ఆశ్రమ వాసులు తప్ప పైవారెవరికీ బాబా దర్శన మీయలేదు.

మెహెరాబాద్ నుంచి బాబా 1936 ఆగస్టు 14వ తేదీని నాసిక్‌కు వెళ్ళి అక్కడ నుండి 16వ తేదీకి రాహూరీ చేరుకున్నారు.

బాబా ఈ సంవత్సరంలోనే ఒకమారు బొంబాయి వెళ్ళినపుడు అక్కడ ఖాన్ బహదూర్ పదమ్‌జీ యింటిలో దిగారు వారింటిలో శివాజీ మహరాజ్ యొక్క ఒక పెద్ద తైల వర్ణచిత్రం వుంది. అది జీవం ఉట్టిపడుతున్నట్టుగా లిఖింపబడి వుంది. శివాజీ గుర్రంమీద ఎక్కి కూర్చుని కత్తిపట్టుకుని వున్న చిత్రం అది. అప్పుడు తమ మండలితో వెనుక ఒక జన్మలో తానే శివాజీగా వుంటినని బాబా చెప్పారు. మరు జన్మలో గాక ఆ తరువాత ఈ జన్మలో షెరియార్‌జీ కుమారునిగా జన్మించితినని కూడా బాబా చెప్పారు.

పునర్జన్మ గురించి మాట్లాడుతూ బాబా ("మన మీ జీవితమనే ఒక పాఠశాలలో ఒక తరగతిలో ఉన్నామన్నమాట. దీనినుంచి నిష్క్రమించగానే-మరణించగానే-ఇంకొక తరగతిలో మనం జన్మిస్తాము. క్రిందటి తరగతిలో సంపాదించిన అనుభవాలన్నీ తీసుకుని దీని పై తరగతిలో మనం జన్మ ఎత్తుతాము") అని వివరించారు.

రాహూరి నుంచి మెహెరాబాద్‌కేగి రెండు రోజుల తరువాత మరల రాహూరి మీదుగా నాసిక్ చేరారు. అప్పటినుంచి మెహెరాబాద్‌కి రాహూరికి ప్రతివారం వెళ్ళి వస్తున్నారు. ముఖ్యంగా పాశ్చాత్యులకొసం నాసిక్‌లో నెలకొల్పిన ఆశ్రమంలో ఏర్పాట్లు పూర్తి చేయడంలో నిమగ్నమై వున్నారు బాబా. అనేక స్థలాలనుంచి తోడ్కొని వచ్చిన మస్తులతో ఆధ్యాత్మిక సాంగత్యం చేయడానికి బాబా ప్రతివారం రాహూరీ వెళ్ళవలసి వస్తోంది. ట్రస్టు ఏర్పాటు చేశారు గనుక అది ఎలా పని చేస్తోందో చూడటానికి ప్రతి బుధవారం రాహూరికి వెళ్ళినపుడు మర్నాడు గురువారానికి మెహెరాబాద్ కూడా వెళ్ళి అక్కడ పాత శిష్యుల పని పర్యవేక్షణ చేసి వస్తున్నారు.

## తొమ్మిదవ పాశ్చాత్య దేశయాత్ర :

అక్టోబరు (1936) మాసం మధ్యలో బాబా కరాచీ నుంచి విమానంలో బయలుదేరి బాగ్దాద్ నగరానికి వెళ్ళారు, అక్కడనుంచి ప్రయాణం రైలులో చేద్దామని. కాని రైలు మార్గానికి ఏదో మరమ్మత్తువచ్చి బాబా బాగ్దాద్‌లో రెండు రోజులుండిపోవలసి వచ్చింది. ఆ రెండు రోజులలోను వికలాంగులను రోగాలతో బాధపడుతున్న బిచ్చగాండ్రను పోగుచేసి వారికి భోజనాలు పెట్టారు బాబా. తరువాత బాగ్దాద్‌నుంచి రైలులో బయలుదేరారు కాని ఆ ప్రయాణంలో నానాచిక్కులు పడ్డారు. బాబాతో ఇద్దరు శిష్యులు మాత్రం వెడుతున్నారు. నవంబరు 3 వ తేదీ నాటికి బాబా లండన్ చేరుకున్నారు. ఈ ప్రయాణపు ఇబ్బందులతో బాబా బాగా అలసిపోయారు. బాబాచేసిన దీర్ఘోపవాసాల వల్ల చిక్కి బలహీనంగా వున్నారు. బాబా శిష్యులు ఈపరిస్థితికి భయపడ్డారు కూడాను. కాని బాబా లండన్ చేరిన రోజున మాత్రం బాగావున్నట్లుగానే ఎప్పటిలా కనుపించారు. బాబా ఈ మారు లండన్‌లో నాలుగు రోజులే వున్నారు.

అమెరికా నుంచి బాబా ప్రేమికులు బాబా ఆదేశించిన ప్రకారం 1936, అక్టోబరు 22 వ తేదీన ఎనమండుగురు, బయలుదేరి 'ఇలె-డి-ఫ్రాన్స్' అనే ఓడమీద ఇంగ్లండుకు వెళ్ళారు. గారెట్ఫోర్ట్ కొన్నాళ్ళయిన తరువాత హాలీవుడ్‌లో అతని వ్యాపార వ్యవహారాలు సర్దుకుని కొంటెస్ నడీనెటాల్ స్టాయ్ అనే బాబా ప్రేమికురాలితో అమెరికా నుంచి ఇండియాకువస్తూ లండన్‌లో దిగాడు.

వీరంతా లండన్ నగరంలో బాబాను కలిశారు. (నవంబర్, 1936) అమెరికన్ ప్రేమికులు లండన్‌లో దిగిన రెండురోజులకు బాబా లండన్ చేరుకున్నారు. బాబా

రాకకోసంవారు అక్కడ ఎదురు చూచారు. వారు లండన్ వచ్చిన కొద్దిరోజులకే బాబా మండలితోకూడా ఇండియాకు తిరుగు ప్రయాణం చేశారు. ఇంత కొలదికాలం బాబా ఇంగ్లండులో ఇదివరకు వచ్చినప్పుడెప్పుడూ గడపలేదు. ఈమారు నాలుగు రోజులే వున్నారు. ఆ నాలుగు రోజుల్లోనూ ఆయనకు ఎక్కడా తీరుబడి చిక్కలేదు. ప్రేమికులతో ఊపిరి సలపకుండా ఆ నాలుగు రోజులూ పనితోగడిచి పోయాయి. ఈ మారు అలెగ్జాండర్ మార్క్ అనే సినీ రచయిత, ఫిలిం డైరెక్టరు బాబా దర్శనం చేసుకున్నాడు. బాబాను దర్శించిన తరువాత తన జీవితాన్ని బాబాకు అంకితం చేసుకున్నాడు.

ఒకనాటి సాయంకాలం బాబా లండన్‌లో "మిష్టర్ డీడ్స్ గోస్ టు టౌన్" అనే ఫిలిం చూచారు. అందులో గారీకూపర్ అనే ప్రఖ్యాత సినీనటుడు నటించాడు. బాబా కోసం అమెరికా నుంచి వచ్చినవారు, లండన్‌లో వున్న బాబా ప్రేమికులు ఈ సినీమా చూడటానికి అందరూ వెళ్ళారు. బాబాకు ఈ ఫిలిం చాలా నచ్చింది. ఇది వారికి మిక్కిలి వినోదం కలిగించడమే కాకుండా మానవాళిని ఉత్తేజపరిచే విధంగా కూడా వుంది.

ఒకనాడు మధ్యాహ్నం ఒక ఆంగ్లేయ శిష్యుని యింటిలో అందరూ బాబాతో టీ త్రాగుతున్నారు. అకస్మాత్‌గా అప్పుడు బాబా ముఖము చాలా బాధ అనుభవిస్తున్నట్టు కనబడింది. నవ్వుతూ ఉల్లాసంగా ఉన్నవారందరూ గంభీరంగా అయిపోయి మౌనంగా వున్నారు. తరువాత బాబా ఈ విధంగా వివరించి చెప్పారు.—

"మీరు స్పెయిన్ దేశంలో ఈ క్షణంలో వేలాది ప్రజలు పడే బాధను తెలుసుకుంటే నాకు బాధ ఎందుకు కలిగిందో మీకు అర్థం అవుతుంది"

బాబా బయలుదేరి వెళ్ళే రోజున లండన్ విక్టోరియా స్టేషన్‌లో బాబాకు వీడ్కోలు యివ్వడానికి చాలామంది బాబా భక్తులు హాజరయారు. కిట్టీ డేలీ,మార్గరెట్ క్రాస్క్ కొన్ని పుష్పాలు బాబావద్ద వుంచగా వారి నిస్వార్థ ప్రేమను బాబా గుర్తించి వారివేపు అమృతమయ దృష్టిని సారించి బాబా ఆ పుష్పా లన్నిటిని తీసుకుని ఒక్కొక్కరిని తమవద్దకు రమ్మని ఒక్కొక్క పుష్పాన్ని వారి దివ్యహస్తాలతో శిష్యులకు యిచ్చారు; యిస్తూ వీడ్కోలు యివ్వడానికి వచ్చిన ప్రేమికులను కౌగిలించు కున్నారు. ఒక్కొర్కొరిని బాబా ఆశీర్వదించారు. బాబా రైలు కదిలిన తరువాత ప్రేమికు లందరూ వారి గృహోన్ముఖు లయినారు.

లండన్ నుంచి బాబా పారిస్ మీదుగా జూరిచ్ వెళ్ళారు. ఈ ప్రయాణాలు బాబా బహిరంగంగా చేయలేదు. లేకపోతే ఇంగ్లండులోను యూరప్‌లోను అనేక మంది భక్తులు వారి దర్శనార్థం వచ్చియుండేవారు. జూరిచ్ నుంచి మార్సెల్స్ వెళ్ళి అక్కడనుండి "వైస్రాయి ఆఫ్ ఇండియా" అనే ఓడమీద ఇండియాకి ప్రయాణం చేశారు. నవంబరు నెలాఖరులోగా బాబా బొంబాయిలో దిగారు.

ఈ పర్యటన చెయ్యడంలో బాబా ఉద్దేశం ఏమిటంటే నాసిక్‌లో ఏర్పాటు చేసిన కొత్త ఆశ్రమానికి ఇంగ్లండు నుంచీ యూరప్ నుంచీ అమెరికా నుంచీ శిష్యులను రమ్మని ఆహ్వానించడమే. బాబా అన్నారు. "నేనుఎక్కువగా పనిచెయ్యవలసి వుంది. నా శిష్యులు నా పనిలో పాలు పంచుకోవాలి. అందుకోసం వారు నాసిక్ రావాలి." అని.

1936 వ సంవత్సరం నవంబరులో బాబా ఇండియాకు తిరిగివచ్చిన తరువాత ఒకరికి ఇంటర్‌వ్యూ యివ్వగా ఈ క్రింది ప్రశ్నలు అడిగినపుడు బాబా యీ విధంగా జవాబు లిచ్చారు —

ప్రశ్న : మీ యొక్క అసలు ప్రకటీకరణ ఎప్పుడు జరుగుతుంది ? ఎంత కాలం ?

బాబా : నేను మాటలాడిన తరువాత 12 సంవత్సరాలకి. ఈ పన్నెండేళ్ళు అందుకోసం సిద్ధం చేయడమే.

ప్రశ్న : ఈ ప్రకటీకరణ యొక్క ఫలితం యేమిటి ?

బాబా : నమ్మకం కలిగిస్తుంది.

ప్రశ్న : వెంటనేనా ? క్రమంగానా ?

బాబా : క్రమంగా....పంటలు పండునట్లు - వర్షమువలె. వర్షం దానంతట అదికురుస్తుంది. కాని పంటలు ఎదగడానికి సమయం పడుతుందికదా. అలాగే నా పని యొక్క ఫలాలు పన్నెండేళ్ళ నా ప్రకటీకరణలో వ్యక్తమవుతాయి.

ప్రశ్న : మీరు మాట్లాడేముందు యుద్ధం జరుగుతుందా ?

బాబా : అవును.

ప్రశ్న : అవసరంగానా ?

బాబా : తప్పించుకోలేకుండా. కాని ఎవరూ గెలవరు. ఎవరూ ఓడిపోరు. దానివల్ల జీవితాదర్శం ఇంకా బాగా వుండాలని ఇంకా ఉన్నతంగా వుండాలని కోరిక కలుగుతుంది. ఇప్పుడు ఉన్న జాతి మత ఆదర్శాలు తుడిచిపెట్టుకుపోయి మానవ సోదర భావపు ఆదర్శాలు నెలకొంటాయి.

బాబా ఇండియాకు చేరిన ఒక వారం రోజులకి అమెరికా నుంచి వచ్చిన బృందాన్ని ఇండియాకు ప్రయాణమై రమ్మని చెప్పారు. ఆంగ్లేయ బృందాన్ని కొద్ది వారాలు తరువాత బయలుదేరమని చెప్పారు. అమెరికా బృందం బాబా చెప్పినట్లు 'ఎలిసియా' అనే ఓడమీద పయనం చేశారు. లివర్‌పూల్‌లో నొరీనా మాచెబెల్లి, ఎలిజబెత్ పాటర్సన్, ఎస్టెర్ (నానీ) గేలీ, మరియు ఆమె కుమార్తె రానో వారితో కలిశారు. వీరంతా ప్రయాణం చేసిన 'ఎలిసియా' బొంబాయి రేవుకి డిసెంబరు 8 వ తేదీని చేరింది. రుస్తుం ఓడలోకి వెళ్ళి, వచ్చిన బాబా ప్రేమికు లందరికీ స్వాగతం యిచ్చాడు. కొందరు యితర బాబా ప్రేమికులు, శిష్యరాండ్రు కూడా వెళ్ళి, వచ్చినవారందరిని తీసుకువచ్చారు. వచ్చిన పాశ్చాత్యు లందరూ ప్రాచ్యులను కలుసుకున్నారు. ఎప్పుడో చూచిన సోదరీ సోదరులను మరల కలుసుకున్నటు.

బొంబాయిలో ఈ వచ్చిన అమెరికనులయు, ఆంగ్లేయులయు ఛాయా చిత్రాలు పత్రికలలో ప్రచురించారు. ప్రాచ్య దేశానికి ఒక సద్గురు సేవకై వచ్చిన పాశ్చాత్యులు అని వారిని పత్రికలలో వర్ణించారు.

మర్నాడు మధ్యాహ్నం వారు ఇగత్‌పురి అనే వూరికి మోటారులో వెళ్ళారు. ఇక్కడ బాబా ఆజ్ఞ ప్రకారం ఆయన తమ్ముడు ఆదీ, బాబాశిష్యుడు కాకా వారికోసం ఒక బంగాళా ఏర్పాటు చేసియున్నారు. ప్రయాణ బడలికతో వున్న పాశ్చాత్యులంతా ఇగత్‌పురి బంగళాలో ఆ రాత్రి హాయిగా విశ్రాంతి తీసుకున్నారు. మర్నాడు ఉదయమే ఈ వచ్చినవారిని చూచేందుకు బాబా ఇగత్‌పురికి వెళ్ళారు. నాసిక్‌లో వారు ఉండటంకోసం బసలు ఏర్పాట్లు అవుతున్నాయని వాటికి ఇంకా కొద్ది రోజులు ఆలస్యం వుంది గనుక ఈలోగా చల్లగా వుండే భందర్దారా కొండలలో వున్న ఒక చక్కని స్థలంలో వారు ఉండటానికి ఏర్పాటయిందని బాబా చెప్పారు.

## నాసిక్ ఆశ్రమం :

బాబా తమ ఆధ్యాత్మిక శిక్షణ కేంద్రాన్ని నాసిక్‌లో నెలకొల్పుతారని ఎవరూ అనుకోరు. ఎందుంటే ఆ వూరు ఏమీ బాగుండదు. చాలా ఇరుకు. రోడ్లన్నీ దుమ్ముతో నిండి వుంటాయి. చాలా సన్నంకూడాను. ఒక కారులో వెడుతూంటే ఇంకో కారు ఎదురుగా వస్తే ఆ బజారువీధిలో చాకచక్యంగా తప్పించుకొని వెళ్ళాలి. ఇళ్ళైనా చూడటానికి ఏమీ అంత అందంగా వుండవు. ఇంక అది ఒక పుణ్యక్షేత్రం అని తప్పిస్తే అక్కడ ఏమీ ప్రాముఖ్యమైనది లేదనిపిస్తుంది. అయితే గోదావరినదే ఆ వూరికి జీవగర్ర. అదేనా శుభ్రంగా వుంచరు. అమ్ముడుకాని కూరగాయలు ఆ నదిలో దిమ్మరిస్తారు. అవి నీటి వేగానికి దిగువకు కొట్టుకుపోతాయి. ద్రాక్షపండ్లు మాత్రం వేసంగిలో విరివిగా దొరుకుతాయి. చాలా తియ్యగా వుంటాయి. నాసిక్ నివాసులు అవి ఎక్కువగా తింటూంటారు. గింజలులేనివి ఎక్కువగా కాపిస్తారు. ఇంత ఇలాటి వూరు గనుకనే బాబా నాసిక్ ఊళ్ళో గాకుండా ఊరి బయట వారి ఆశ్రమం నెలకొల్పారు. అక్కడ గోదావరి తీరానికి వూరి బయటికి వెడితే ప్రకృతి శోభ అంతా పుణికి పుచ్చుకున్నట్లుంటుంది. బాబా నెలకొల్పిన ఆశ్రమం పాతఊరికి అయిదుమైళ్ళ దూరంలో వుంది.

నాసిక్ ఆశ్రమం 24 ఎకరాల తోటలో ఏర్పాటయియున్నది. బాబా అప్పు డప్పుడు ఆశ్రమం నుంచి పాశ్చాత్య బృందాన్ని బయటకు తీసుకు వెడుతూండే వారు. నాసిక్ ఒక పుణ్యక్షేత్రం. పురాణ కాలంలో ఈ స్థలాన్ని జనస్థానం అనే వారు. ఇక్కడే శ్రీరాముడు రావణ సోదరులగు ఖరదూషణత్రిశిరులను రాక్షసులను, వారి సేనలను 40,000 మందిని తాను ఒక్కడే, లక్ష్మణుని సీతా సంరక్షణార్థం వుంచి, అసహాయ శూరుడై సంహరించాడు. ఇక్కడే ఆ రాక్షస నాయకుల సహోదరియయిన శూర్పణఖ యగు రాక్షసస్త్రీని ముక్కు, చెవులుకోసి లక్ష్మణుడు భంగ పరిచాడు. అందుకే ఈ పురమునకు నాసిక్ అను నామము కలిగినది. ఈ ఆశ్రమానికి మెహెర్ రిట్రీట్ అని పేరు పెట్టారు. నొరీనా మాచెబెల్లి నాసిక్‌లోని ఈ 24 ఎకరాల ఆశ్రమాన్ని కొని బాబాకి సమర్పించి ఆశ్రమం కలుగజేసింది.

ఈ ఆశ్రమాన్ని గురించి బాబా ఇలా అన్నారు—

నేను నాసిక్‌లో ఆదర్శవంతమయిన ఆస్తిని సంపాదించాను. అది అంద మయిన పరిసరాలలో ఉండి చుట్టుప్రక్కల ప్రకృతి అంతా శోభాయమానంగా వెలిగి.

పోతూంటుంది. పాశ్చాత్య బృందము నాసిక్‌లోను ప్రాచ్యమండలి మెహెరాబాద్ లోను నేను రెండిటికీ మధ్యగా రాహూరి పిచ్చివారి ఆశ్రమంలోను ఉంటున్నాను.

"ఈ కేంద్రము మామూలు ఆధ్యాత్మిక నివాసాలు లాగ, ఆశ్రమాలవలెను ఉండదు. కఠోర నియమాలు, నిబంధనలు ఉండవు. (జీసస్ తన శిష్యులకు శిక్షణ ఇచ్చినట్లుగా నేను స్వయంగా ఉండి మార్గమును చూపిస్తాను.)

ఇక్కడ తీవ్రమయిన శిక్షణతో కూడిన జీవితము లేకపోయినను, భౌతిక సౌకర్యాలు ఉన్నప్పటికిని పరోక్షంగా నేను ఇచ్చే ఉపదేశాల ప్రకారం నడుచుకోవడం కష్టంగానే వుంటుంది. నేను చెప్పే పనులలో బాహ్యంగా చేయవలసిన మానవసేవ కూడా వుండవచ్చును, వికలాంగులకు రోగులకు శుశ్రూష చేయుట, దిక్కులేనివారికి, బీదలకు సహాయము చేయుటవంటి పనులు మీయొక్క శక్తి సామర్థ్యాలను బట్టి మీచేత నేను పనులు చేయిస్తుంటాను." అని బాబా శిష్యులకు చెప్పారు.

పాశ్చాత్య దేశాల నుండి వచ్చినవారికి నోరీనా మాచెబెల్లీ, ఎలిజబెత్ పాటర్సన్, ఎస్టల్ (నానీ) గేలీ, డానో గేలీ, రువానో బోగిస్లావ్, మార్గరెట్ క్రాస్క్, డెలియా డిలియాన్, విల్ బాకెట్, మేరీ దాకెట్, కిట్టీ డేలీ, జీన్ స్లాక్, మాల్కమ్ స్లాక్, టామ్ షార్ప్లీ, గారెట్ ఫోర్ట్, నడియా టాల్‌స్టాయ్, శామ్ కోహెన్ — బాబా ఈవిధంగా ఆదేశాలిచ్చారు.

"ఒకటి మొదలు అయిదేళ్ళ వరకు నాతో వుండడానికి సిద్ధము అవండి. మీ యింటివద్ద పరిస్థితులు మీ కుటుంబ పరిస్థితులు ఇతర బాధ్యతలు అన్నీ ఆలోచించుకుని ఎవరు ఎంతకాలము ఉండడానికి వీలవుతుందో అంతకాలము ఉండండి. ఇండియాలో వుండడానికి మీకు ఒక్కొక్కరికి నెలకు ఆరు పౌనులు అవుతుంది. ఆ సొమ్ము సిద్ధం చేసుకోండి. ముఖ్యంగా నేను చెప్పిన ప్రకారం మీరు నడచుకోవాలి.

నావద్ద వుండి మీరు చూస్తూంటే ఇండియాలో జీవితం చాలా బాగుంటుంది. నా పని మీరు చూస్తూ నా పనిలో పాల్గొనే అవకాశం మీకు కలుగుతుంది. భౌతికంగా జీవితం మీ పాశ్చాత్యులకు సులభ మగునట్లు అన్ని ఏర్పాట్లు చేయబడుతున్నవి. ఈ భౌతిక జీవితం ముళ్ళ కిరీటం కాకపోయినా గులాబీల పరుపు మాత్రం కాదు. సమయానుకూలంగా మీకు నా మూడు ఆశ్రమాలలోను — ఒకటి ఆధునికమైనది, ఒకటి సనాతనమయినది, మరియొకటి అదీ యిదీ కాని మామూలుది. నా పని మీరు గమనించే అవకాశం కలుగజేస్తాను.

"మీరు ఏదన్నా ఎవరన్నా భయపడకూడదు. ఏమి జరిగినా మీ నమ్మక ములో మీరు దృఢంగా ఉండాలి. మీకు వ్యతిరేకంగా ఉన్నవారి విమర్శవలన మీరు లొంగిపోకూడదు. మీరు అర్పణ అయిపోవాలి. మీరు 'బాబా ! నా ఆరోగ్యం గురించి మీరు జాగ్రత్తపడాలి; నా కుటుంబాన్ని మీరు కాపాడుతూండాలి; నాకు జబ్బు చేయకూడదు; నేను చచ్చిపోకూడదు. నా కుటుంబంలో ఎవరూకూడా చచ్చిపోరాదు.' అని యీ విధంగా కోరుకోకూడదు. ఇవన్నీ నమ్మకం లేకపోవ డాన్ని సూచిస్తాయి. సర్వజ్ఞుడు, సర్వ శక్తిమంతుడు అని నమ్మిన మీ గురువులో విశ్వాసం లేనట్లే అవుతుంది. మీరు అంతా నాకు వదిలేసి నామీద నమ్మకం ఉంచండి. కాని దానికి షరతులు పెట్టకండి

"ఇంకో ముఖ్యమయిన విషయం చెప్పాలి; ఇదే అసలు ప్రధానమయినది-నేను చెప్పినది విని తు-చ తప్పకుండా ఆచరించడానికి ప్రయత్నించండి. మీరు వాదించవద్దు. నే చెప్పిన ప్రకారం చేసి మిగిలినదంతా బాబాకి వదిలేయండి") అని చెప్పారు. వారు ఇండియాకు బయలుదేరేముందే బాబా ఈ విషయాలు కొన్ని వారికి తెలియపరచేరు. వీటికి ఒప్పుకున్నవారందరు ఇండియాకు వచ్చేరు.

మొదట్లో వీరు 1933 మార్చిలో వచ్చినపుడు కొద్దికాలం ఇండియాలో గడిపినపుడు స్వర్గంలోనే ఉన్నట్లనిపించింది వారికి. అప్పుడు బాబా వీరిని కాశ్మీరు, వారణాసి, ఆగ్రా, ఢిల్లీ తీసుకునివెళ్ళి తిప్పారు. బాబా వారితో సహచరుడుగా వున్నారు. ఇప్పుడు నాసిక్‌లో వారు మొదటినుంచి చివరదాకా శిక్షణలో ఉన్నారు. శిష్యులు ఏ విధంగా నడచుకోవాలో, బాబా ఆధ్యాత్మిక గురువుగా వారిని తీర్చిదిద్దారు.

డిసెంబరు 16 వ తేదీన మరి ఇద్దరు ఇటలీదేశపు ఓడ అయిన 'కాంట్ వెర్డ్'లో అమెరికా నుంచి వచ్చారు. తరువాత మూడవ బృందం ఇంగ్లండు నుంచి ఆరుగురు 'రావల్పిండి' అనే పి. అండ్ ఓ. వారి స్టీమరులో ప్రయాణం చేసి డిసెంబరు 24 వ తారీకున బొంబాయిలో దిగారు. తరువాత ఇంకొకడు అమెరికా నుంచి పసిఫిక్ మహాసముద్రం మీద ప్రయాణం చేసి కొలంబో మీదుగా జనవరి (1937) 2 వ తారీకున "స్ట్రెయితర్డ్" అను ఓడమీద వచ్చాడు.

ఈ విధంగా 15 గురు పాశ్చాత్యులు ఆధ్యాత్మిక వికాసంకోసం ఇన్ని వేల మైళ్ళ దూరం ప్రయాణం చేసివచ్చి భారతదేశంలో ఒక గురువును ఆశ్రయించుట ఇదే మొదటిసారి. అపూర్వ మయిన ఈ సంఘటనవలన భారతదేశం ఆధ్యాత్మికంగా

ప్రపంచానికి నాయకస్థానంలో ఉందని విశదమగుచున్నది. తూర్పు, పడమర దేశాలు సన్నిహితం కావడానికి 1936 డిసెంబరులో జరిగిన ఈ సంగతి నాందిగా పరిగణించ వచ్చును. ప్రధానములయిన వారి పదవి, అంతస్తు, వారికి వారిదేశంలో ఉన్న సదు పాయాలు అన్నీ వదులుకుని అటువంటి సుఖవంతమయిన జీవితం ఇక్కడ దుర్లభ మని తెలిసియే వారంతా ఈ దేశానికి రావడం సామాన్య విషయం కాదు.

పాశ్చాత్యులు ఇండియాకి రావడం మెహెర్‌బాబా సాంగత్యంలో వారికి కలిగిన త్యాగశక్తి వలననే జరిగిందనడం నిర్వివాదం. ప్రాపంచిక సుఖాలకి ఐశ్వర్యాలకి అన్నిటికంటె ఎక్కువగా వారు ప్రేమమూర్తి అయిన బాబాను ఆయన ప్రతిపాదించే నిస్వార్థ త్యాగమయ సేవాజీవితమే ఎక్కువగా ఎంచుచున్నారని చెప్పడానికి వారు అన్నీ వదులుకుని ఇక్కడికి రావడమే తార్కాణము.

ఈ పాశ్చాత్యులు బొంబాయిలో అలెగ్జాండ్రా డాక్ వద్ద మోల్‌స్టేషన్‌లో దిగి నప్పుడు వారికి బొంబాయిలోను ఆ సమీపమందున నివసిస్తున్న బాబా శిష్యులు-భార తీయులు-కొంతమంది స్వాగతం యిచ్చారు. ప్రాచ్యసాంప్రదాయం ప్రకారం వారికి పుష్పమాలలు వేశారు. ఇదివరకు ఒండొరులను చూడకపోయినా ఎంతో ప్రేమతోను ఒకే కుటుంబములోని సభ్యులవలె వారూ వీరూ కలసిపోయారు. ఇదికూడా ఒక అపూర్వమైన విషయమే. భారతదేశం వచ్చిన పాశ్చాత్యులకు ఇదివరకు సాంప్ర దాయానుసారంగా సుప్రభాతం చెప్పి కరచాలనం చేసుకోవడమేగాని హార్దికమైన స్వాగతం యివ్వడం ఇదే ప్రథమం. ఇరువురి మధ్యను వున్న సత్సంబంధానికి బాబా అందరిలోను ఉత్పన్నం చేసిన ప్రేమయేకారణం. లేకపోతే ఇరుతెగలవారికి ఎందు లోనూ పోలికలేదు. జాతి, మత, వర్ణవిభేదాలు సరేసరి. జీవిత విధానాలలో అన్నీ భేదాలే. బాబా వీరి హృదయాల్లో మేల్కొలిపిన ప్రేమ ఈ బాహ్య అంతరాలన్నిటిని అధిగమించింది. పాశ్చాత్యులందరికి ఒక విదేశం వచ్చామన్న క్రొత్త లేకుండా ఎబ్బెట్టుగా వుండకుండా బాబాయొక్క భారతీయశిష్యులు చేశారు. ఒకే గురువు యెడల ఉన్న ప్రేమయే వీరి మధ్యగల అనుబంధం. ఆ ప్రేమనే అందరూ పంచుకున్నారు.

అమెరికానుంచి వచ్చిన రెండు బృందాల ప్రేమికులు ఇగత్‌పురికి భందర్ధారాకు వెళ్ళి అక్కడ బంగాళాలలో తాత్కాలికంగా బసచేసియుండగా ఇక్కడ నాసిక్ ఆశ్ర మంలో వారుండటానికి అన్ని సదుపాయాలతోను ఏర్పాట్లు పూర్తి అయాయి.

భందర్ధారాలో ఉన్నపుడు బాబా ప్రతియొక్కరిని ప్రతిరోజున పదినిమిషాల పాటు ఒక ఏకాంతస్థలమునందు కూర్చుని మనస్సునందు ఎట్టి యాలోచనలు లేకుండా

హాయిగా విశ్రాంతిగా ఉండమని బాబా ఆజ్ఞాపించారు. "దేనిని గురించీ ఆలోచించ వద్దు- నా గురించి కూడా" అని బాబా చెప్పారు.

"ఒకవేళ మీకు ఆలోచనాతరంగాలను ఆప శక్తి లేకపోతే- అలా చూడండి ఆ డామ్‌మీద నీరుఎట్లు ప్రవహించుచున్నదో ఆ రాళ్ళమీద గలగలనీరు పారుచున్నదే ఆ శబ్దమును వింటూ కూర్చొనండి. కాని పూర్తిగా విశ్రాంతిగా, శరీరమునందు ఏ అవయవమునకు బిగువు లేకుండా, మనసుకూడా సడలించి యుండాలి" అని చెప్పి బాబా నాసిక్ వెళ్ళారు. వారు మరల భందర్దారా వచ్చినపుడు "ఎంతవరకు మీ ప్రయత్నము ఫలించినది?" అని యడిగారు. వారు చేతకాలేదని ఒప్పుకున్నారు. "మానకుండా ఇంకా ప్రయత్నించండి" అని "మీకు నేను సహాయం చేస్తాను" అనీ అన్నారు బాబా. బాబా వారితో ఇంకా ఇలా అన్నారు. అక్షరఫలకంమీద వ్రేలితో చూపిస్తూ- "మీ మనసు స్వాధీనంలో ఉండడం చాలా ముఖ్యం. లేకపోతే మీ జీవితాన్నే మనస్సు స్వాధీనంలో వుంచుకుంటుంది. మనము మనస్సును స్వాధీనపరచుకోవాలి. మనసే మనకు నమ్మకం కలుగజేస్తుంది. మనం సుఖంగా ఉండేలా చేస్తుంది. మనసే మనలో సందేహాలను లేవదీసి మనలను దుఃఖాక్రాంతులను చేస్తుంది. సూర్యుని చూడండి. సూర్యుడు మనకు ప్రాణంయిస్తాడు. సూర్యుడు ప్రాణంతీస్తాడు కూడాను. మొక్కలు బ్రతకడానికి సూర్యుడే కారకుడు. మానవునికి ఎండదెబ్బ తగిలితే ప్రాణాలుకూడా పోతాయి." ఒక పాశ్చాత్యుడు బాబాను అడిగేడు- "బాబా ఇదివరకు మాకు సహాయకారిగా వున్న ధ్యానపద్ధతి - చిత్తమును ఏకాగ్రత పరిచే విధానము- అవలంబిస్తే సరిపోతుంది కదా."

బాబా- "వద్దు. ఏకాగ్రత ఆనందాతిశయమును, పరవశత్వమును కలుగజేసి ఆధ్యాత్మికానుభవాన్ని ఇస్తుంది. మనసును ఖాళీగా ఉంచితే చిత్తశాంతి కలుగుతుంది. మార్గమందు ప్రవేశించడానికి అప్పుడు వీలవుతుంది. కొండ యెక్కాలనుకోండి. ఏంజేస్తాము. కొండ దగ్గరికివెళ్ళి ఇంక ఎక్కడం ప్రారంభించడానికి ముందు బరువునంతా దింపేస్తాము.

"మనసుకి యుగయుగాలుగా అలవాటయింది- బయటకు చూడడం- దానిని లోపలికి చూచేలా త్రిప్పుకోవాలి. లోజూపు కష్టమే; ఎందుకంటే అది అంత సులభం కాదు గనుక" అన్నారు బాబా.

ఒక పాశ్చాత్యుడు కాళ్ళు ముడుచుకుని కూచోలేక అవస్థపడుతూ అడిగేడు- "బాబా! ధ్యానం చేసేటపుడు కూచోవాలా?" బాబా అందుకు జవాబుగా "అక్కర్లేదు-

ఎలా వున్నాసరే. నీవు పూర్తి విశ్రాంతిలో వుండాలి నీకు నిద్ర రాకూడదు. పూర్తిగా మేలుకుని చైతన్యంతో వుండాలి. మనస్సులో ఏ ఆలోచన లేనపుడు నిద్ర వస్తుంది. మన యిష్టప్రకారం మనసు నిలిచేటట్లు చైతన్యం కోల్పోకుండా ఉండునట్లు చేసుకోవాలి.) మిమ్మల్ని ఇంతదూరం ఇండియాకు తీసుకువచ్చింది మీకు ప్రకృతి దృశ్యాలు చూపించడానికా మరి?" అన్నారు బాబా.

వారు భండర్దారాలో రెండు వారాలున్నారు. బాబా ఆ రెండు వారాల్లోను నాలుగు రోజుల కొకతూరి అక్కడికి వెళ్ళి వారిని చూచేవారు. వెళ్ళినప్పుడు ఒకమారు 2 రోజులు వారితో ఉన్నారు. ఈ రెండు రోజులలోను బాబా తమ శిష్యురాలు ఒకతె మూడు సంవత్సరాలు పరవశురాలై ఒక గదిలో ఉండేదని వారితో చెప్పారు. ఒక పాశ్చాత్య వనిత అది విని "ఎంత భయంకరము!" అన్నది, బాబా ఆమెకేసి చూచి చిరునవ్వుతో "భయంకరం కాదు. అద్భుతం! ఆమె అన్ని వేళలా ఆనందం పొందు తుంది. ఇప్పుడు ఆమెకు బయట ప్రపంచం సంగతే తెలియదు. మీరంతాకూడా అదే విధమయిన ఆనందం పొందుతారు. కాని మీరు బయట ప్రపంచ చైతన్యాన్ని పోగొట్టు కోరు, మీరు ఎరుకతో ఆనందం అనుభవిస్తారు. ఆనందం అనుభవించే వ్యక్తికి అన్ని స్థితులు ఒకలాగే వుంటాయి. మీరు పొందే ఆనందస్థితివల్ల ప్రపంచానికి మీవల్ల కలిగే ఉపయోగానికి ఏమీ భంగంరాదు. మీలో కొందరకు అప్పుడప్పుడు ఆనంద స్థితి కలి గింది. కాని అది అజ్ఞానంతో మిశ్రమ మయినది" అని చెప్పారు బాబా.

ఆ తరువాత రోజున వారి మనసులలో ఏ ఆలోచనా లేకుండా చేయడానికి వారిని ఒక విధంగా ధ్యానం చేయమన్నారు. వారు అలా చేయలేకుండా ఉన్నామని చెప్పగా బాబా —("మనసులో ఆలోచనలు లేకుండా మనసును నిలుపుచేయడం దుస్సాధ్యం. కాని మనసును అలా నిరోధిస్తేగాని భగవంతుని చైతన్యం శాశ్వతంగా పొందలేరు. పరిమితమైన మనసు అంతరించిపోతేగాని అనంతునితో కలయికరాదు. పరిమితమైన వ్యక్తిత్వం పోయి అపరిమితమైన వ్యక్తిత్వం రావాలి. ఆత్మకు దైవ జ్ఞానం ఉండడమేకాదు అలా ఉన్నట్లు తెలుసునుకూడా. అలా తెలిసివుంటే దాని వ్యక్తిత్వాన్ని నిలుపుకుంటుంది. ఈ తెలియడమే క్రమంగా సర్వజ్ఞత్వానికి దారి తీస్తుంది.") అని వివరించారు బాబా.

రెండో వారంలో నడిరామా డాల్‌స్టాయి, గారెట్ ఫోర్ట్ అమెరికానుంచి వచ్చారు. గారెట్ మనసునిండా ఎన్నో ప్రశ్నలు అడగాలని పెట్టుకున్నాడు. ఆ సంగతి తెలిసి బాబా కొన్ని ముఖ్యమైనవాటికి జవాబులు చెప్పారు.

ఇంతమంది వచ్చారు కదా ఈ వచ్చిన పాశ్చాత్యులెవరెవరో కొంచెం పరిశీలిద్దాం . . .

## 1. రాజకుమారి నొరీనా మాచెబెల్లీ :

రష్యాదేశంలో విప్లవం తరువాత కాకసస్‌లోని అతని జన్మభూమి అయిన జార్జియా దేశ స్వాతంత్ర్యంకోసం పోట్లాడిన వీరుడు జార్జెస్ మాచెబెల్లీ. అతని యొక్క భార్య ఈ నొరీనా. ఈ దంపతులు అమెరికా వెళ్ళి అక్కడ స్థిరనివాసం ఏర్పరచుకున్నారు. అమెరికాలో ప్రపంచ ప్రఖ్యాతి వహించిన మాచెబెల్లీ సుగంధ ద్రవ్యాలను తయారుచేసి అమ్మే వ్యాపారసంస్థకు అతడు యజమాని.

నొరీనా తనా యవ్వనదశలో సుప్రసిద్ధ సినీమా ఫిలిం నిర్మాత అయిన రెయిన్ హార్ట్ తయారుచేసిన 'మెడోనా' అనే నాటకంలో నాయకిగా నటించింది. యూరప్, అమెరికా దేశాలలో ఈ నాటకం వెయ్యిసార్లయినా ప్రదర్శించబడింది. ప్రతీ ప్రదర్శన లోనూ నొరీనా పాల్గొని అఖండ ఖ్యాతి గడించింది, ఈ ఉచ్ఛదశలో పూర్వపుణ్యవశమున ఆమె మనసు ఆధ్యాత్మిక విషయాలమీదకు మళ్ళినది. తుదకు ఆమె హృదయం మెహెర్‌బాబా పాదపద్మాల వద్ద వ్రాలింది.

ఈమె మొదటిసారిగా అమెరికాలో 1931 సం. డిసెంబరు మాసంలో ఆమె స్నేహితురాలు జీన్ స్లాక్స్ సహాయంతో బాబాను దర్శించింది. ఆమె పాత జీవితానికి స్వస్తి చెప్పింది. వెలుగుతో నిండిన ఒకక్రొత్త భవిష్యత్తు ఆశాజ్యోతివలె ఆమెకు గోచరించింది. ప్రేమమయమయిన జీవితంలో అడుగుపెట్టింది. ఇంక ఆ కాలు వెనుకకు తీయకుండా ఆమె జీవితము సేవాత్యాగములతో బాబా ప్రేమలో సాగిపోయింది. నాసిక్ ఆశ్రమానికి ఆమె ఇప్పుడు నిర్వాహకురాలు (మానేజర్).

## 2. మిసెస్ ఎలిజబెత్ సి. పాటర్సన్ :

ఈమె ఒక అమెరికన్ స్టాక్ బ్రోకరు యొక్క భార్య. ఈమె స్వయంగా వ్యాపారం చేసెడిది. ఈమెకు భీమా సంస్థలతో చాలా సంవత్సరాలుగా సంబంధం వుంది. ఉత్తరధృవానికి ఎనిమిది డిగ్రీల సమీపానికి ఉత్తర సైబీరియా దేశంలో ఎలిజబెత్ మంచుగడ్డలను ఛేదించే ఒక స్టీమరులో ప్రయాణం చేసింది. ప్రపంచ యుద్ధంలో అమెరికాలో ఆమె అంబులెన్సు కారులను నడుపుతూ రెడ్‌క్రాస్ సంస్థలో పనిచేసింది. ఈమె ఉత్సాహవంతమయిన దైవాన్వేషకురాలు. 1931 సం॥లో బాబాను మొదటిసారిగా న్యూయార్క్ నగరానికి పొలిమేరలలోని హార్మన్ అనేచోట దర్శనం

చేసుకుంది. అప్పటినుండియు బాబాయెడల అమితభక్తితో వున్నది. అనేక పాశ్చాత్య దేశాల పర్యటనలలో బాబాతో ఆమెకూడా వెళ్ళింది. మొదటిసారిగా కొందరు పాశ్చాత్యులతో 1933 సం॥లో భారతదేశానికి వచ్చింది. వ్యాపార సంబంధమయిన లెక్కలలో ఆరితేరియున్నందున నాసిక్ ఆశ్రమపు లెక్కలన్నీ వ్రాయడం పని ఈమె చూస్తోంది. ఆమె అనుభవాలను లండన్ ఫోరమ్ అనే పత్రికలో ప్రచురించింది.

## 3. కౌంటెస్ నడియూ టాల్‌స్టాయి :

ఈమె సుప్రసిద్ధ వేదాంతి, గ్రంథకర్త అయిన కౌంట్ లియో టాల్‌స్టాయ్ కుమారుడయిన కౌంట్ ఇల్యా టాల్‌స్టాయ్‌ని వివాహం చేసుకుంది. ఆమె అమెరికాలో ఇప్పటికి (1936) 18 సంవత్సరాలుగా వుంటోంది. బాబా దర్శనం చేసుకున్నాక ఆమె భర్త గతించేడు. మాస్కోలో ప్రత్యేకంగా సంగీతం నేర్చుకుంది. పెట్రోగ్రాడ్ సర్వ కళాశాలలో విద్య నభ్యసించింది. ఈమెకు రష్యన్, జర్మన్, ఫ్రెంచి, ఆంగ్ల భాషలు బాగా వచ్చును.

ఈమెకు గుప్త విద్య, వేదాంతము, చాలా యిష్టము. నిజాయితీ కలిగిన అన్వేషకురాలు. ఈమె న్యూయార్క్‌వద్ద హార్మన్‌లో మొదట 1931 సం॥లో బాబాను దర్శించింది. అప్పటినుంచి బాబా పరిధిలో వుండి అనేక అంతరంగానుభూతులను పొందింది. బాబా దివ్యప్రేమ యొక్క శక్తిని బాగా చవిచూచింది. బాబాను తన నిత్య జీవితంలో మార్గదర్శకునిగా చేసుకుంది. బాబా దివ్యప్రేమ కోసం ఆమెయొక్క సర్వస్వము త్యాగం చేసింది. బాబా యొక్క గ్రంథాలను రష్యన్ భాషలోకి అనువదించింది. బాబా ప్రేమను గురించి అనేక వ్యాసరచనలు చేసింది.

## 4. మిసెస్ ఎస్టెల్ గేలీ :

ఈమె భర్త బ్రతికియున్నపుడు న్యూయార్క్‌లో న్యాయవాదిగా ఉండేవాడు. ఈమె 1933 అక్టోబరులో బాబాను ప్రథమంగా కలుసుకొన్నది. అచంచల విశ్వాసంతో బాబాకు ఈమె భక్తురాలయింది. యూరప్‌లో బాబా పర్యటించినపుడు ఈమెకూడా ఆయనతో వుండెను. బాబా యొక్క ప్రసంగములు వగైరా అన్ని టైపు చేసి యిస్తూంటుంది. బాబా యొక్క కార్యదర్శులలో ఈమె యొకతె. ఈమెను బాబా నానీ గేలీ అనేవారు.

## 5. మిస్ రానో గేలీ :

ఈమె పైనచెప్పిన ఎస్టెల్ గేలీయొక్క కుమార్తె. రంగులతో చిత్రలేఖనం చేయడం చాలా యిష్టం ఈమెకు. ఈ భక్తురాలు ఆమె జీవితాన్ని, ఆమె కళను

బాబాకు అంకితం చేసుకున్నది తల్లితోకూడా ఈమె బాబా చేసిన యూరప్, అమెరికా పర్యటనలలో పాల్గొన్నది.

## 6. మిస్టర్ మాల్కం స్లాక్స్ :

కవి, సత్యాన్వేషకుడు. అన్నిమతాలలోను గర్భితమై ఒకే సత్యమున్నదని నమ్మినవాడు న్యూయార్క్‌లో ఒక పుస్తకాల దుకాణం నడపేడు. దానిపేరు నార్త్ నోడ్ బుక్‌షాప్. అందులో ఆధ్యాత్మిక గ్రంథాలే ఎక్కువగా ఉండేవి. ఇతడు మొదటిసారిగా బాబా అమెరికా దర్శించినపుడు 1931 సం॥ నవంబరులో అతని భార్య జీన్‌తో కలిసి బాబాకు స్వాగతం యిచ్చిన భాగ్యశాలి. బాబాతో కూడా కాలిఫోర్నియా వెళ్ళాడు. అక్కడ బాబా ఆజ్ఞానుసారం 4 సంవత్సరములుండెను.

ప్రస్తుతం అతని భార్యతోను గార్‌ట్ ఫోర్ట్ సహాయంతోను క్రొత్తగా స్థాపించిన 'అవతార్' అను పత్రిక పని చూస్తున్నాడు.

## 7. మిసెస్ జీన్ స్లాక్స్ :

ఈమె మాల్కం యొక్క భార్య. ఈమె శ్రద్ధాభక్తులు కలిగిన ఆధ్యాత్మిక అన్వేషకురాలు. పత్రికానుభవం గడించింది. బాబాలో అపారమైన నమ్మకం కలిగివుంది. ఆయన దివ్యప్రేమను చవిచూచింది. అందులో ఆమెకు అద్భుతమైన అంతరంగానుభూతులు కలిగేయి. బాబాను అవతార పురుషుడుగా నమ్మి ప్రథమంగా లండన్ ఫోరమ్ పత్రికలో అద్భుతమైన వ్యాసం రచించింది. "గురువు పిలిచినపుడు" అను వ్యాసాన్ని ఆమె ప్రారంభించిన 'అవతార్'లో ప్రచురించింది.

## 8. మిష్టర్ గారెట్ ఫోర్ట్ :

ఇతడు న్యూయార్క్‌లో వుండే నాటక రచయిత,హాలీవుడ్‌లో తీసే సినీమాలకి సినేరియోలు కూడా వ్రాస్తూంటాడు. సుప్రసిద్ధ సినీమా స్టూడియోలు మెట్రో గోల్డ్విన్ మేయర్, పారమౌంట్, ట్వన్టియెత్ సెంచురీ ఫాక్స్, యూనివర్సల్, ఆర్. కె. ఒ. ఇంకా ప్రధానమయిన అన్ని సినీమా స్టూడియోలవారు ఇతనిచేత సినేరియోలు వ్రాయించుకుంటారు. ఎంతో ధనాన్ని ఆర్జించిపెట్టినట్టిన్ని గొప్ప పేరు పొందినదిన్ని అయిన "ఫ్రాన్‌కెన్‌స్టీన్", "డ్రాకులా", "ది లాస్ట్ పెట్రోల్", "ది ఇన్విజిబుల్ మాన్" అనే ప్రఖ్యాతి చెందిన సినీమా కథలు ఇతడు రచించినవే. 'హిపోడ్రోమ్' అనే సంగీత నాటక ప్రదర్శనానికి ఇతడే రచన చేశాడు. హాలీవుడ్‌లో ఇతనికి గొప్ప పేరు వుంది. చాలా ఉదార స్వభావుడు, ఉదాత్త హృదయం కలవాడు.

సత్యాన్వేషణలో తుదకు మెహెర్‌బాబా పాదాలచెంతకు చేరాడు. 1934సం॥లో మొదటిసారిగా ఆయన దర్శనం చేసుకున్నాడు. తన అన్వేషణ అప్పుడు అంత మయినదని తెలుసుకున్నాడు. ఐచ్ఛికంగా నిండు హృదయంతో ప్రేమతో ప్రియ తమ బాబాకు అర్పణ అయాడు

బాబా వద్దకు ఇండియా వచ్చి నిజమైన సాధకుడుగా ఆయన శుశ్రూష చేసు కుంటూ వుండాలని అతనికి చాలా కాలంగా వున్న కోరిక నేటికి తీరింది.

గారెట్ 'అవతార్' అనే బాబాకు సంబంధించిన క్రొత్త పత్రికకు సంపాద కీయ వర్గంలో పనిచేస్తున్నాడు. ఇండియాకు బయలుదేరేసరికి.

## 9. మాడమ్ రువానో బోగిస్లావ్ :

ఈమె అనేక దేశాలు తిరిగి చూచింది. సంగీత కళాకారిణి. వ్యాపార దక్షత గల స్త్రీ.జీవితంలో అనేకమయిన ఒడుదుడుకులను అనుభవించిన దిట్ట. న్యూయార్క్ లోని మెట్రోపాలిటన్ ఒపెరాలో ఈమె భర్త ఓంటున్నాడు. బాబాను మొదటిసారిగా 1933 సం॥రంలో ఇటలీలో పోర్టోఫినోలో దర్శించింది. ఆయన పనికోసం తన జీవితాన్ని అంకితం చేసుకోవాలనుకుంది. నాసిక్ రావడంతో ఆమె కోరిక తీరిందని సంతోషిస్తోంది.

## 10. మిస్ కాథరీన్ (కిట్టీ) డేలీ :

ఈమె సంగీత అధ్యాపకురాలు. ప్రప్రథంగా బాబా లండన్ వెళ్ళినపుడు ఈమె యొక్క కుటుంబ గృహంలో బస చేశారు. అప్పుడే—1931లో మొదటి సారిగా ఆమె ఆయన దర్శనం చేసుకుంది. రెండవమారు ఇంగ్లండు వెళ్ళినపుడుకూడా బాబా అక్కడే దిగేరు. అప్పటినుంచి ఆమె బాబాతోనే యూరప్‌లో ఆయన పర్యటన చేసినపుడెల్ల కూడా వెళ్ళేది. మొదటి పాశ్చాత్య బృందంతో ఇండియాకి కూడా వచ్చింది. నిస్వార్థ సేవాపరాయణ. ప్రేమతోను, భక్తితోను బాబాను సేవిస్తుంది. మానవకోటి శ్రేయస్సుకోసం బాబా చేసే కార్యాలకు ఆమె జీవితాన్ని అంకితం చేసు కోవాలని ఆమె కోరిక. బాబా పనిలో పాల్గొనుటకు ఇండియా వచ్చింది.

## 11. మిస్ మార్గరెట్ క్రాస్కె :

ఈమె లండన్ నగర నివాసి. అక్కడ ఒక నాట్య విద్యాశాల నడుపుతోంది. ఇంగ్లండులో అనేక ప్రముఖ నాట్య కళాశాలలలో పరీక్షాధికారిణిగా నియోగింప బడింది. పైన వ్రాసిన కిట్టీ డేలీ యింట్లో బాబా దర్శనం చేసుకుంది. 1931 సం॥లో,

ఆమె బాబాను మానవకోటి అనే వృక్షానికి పూచిన పుష్పం అని వర్ణించింది. యూరప్ అమెరికా దేశాలు బాబా పర్యటించినపుడు ఆయనను అనుసరించింది. మొదట ఇండియాకు వచ్చిన పాశ్చాత్య బృందంలో ఈమెకూడా వున్నది.

## 12. మిస్ డెలియా డిలియాన్ :

ఈమె లండన్‌లో నివసిస్తోంది. ప్రముఖనటి, గ్రంథకర్త, సినేరియో రచయిత అయిన మిస్టర్ జాక్ డిలియాన్ యొక్క సోదరి. ఈమె కూడా బాబాతో యూరప్ పర్యటన చేసిన బృందంలో ఒకతె. ఇండియాకు మొదట వచ్చిన పాశ్చాత్య బృందంలో ఈమెకూడా వున్నది.

## 13. మిస్టర్ విల్ బాకెట్ :

ఇతడు లండన్‌లో వుండేవాడు, వ్యాపారం చేసి విరమించుకున్నాడు. పరోపకార పారీణుడు, అధ్యాత్మికమైన తత్వంగలవాడు. బాబాను మొదటిసారిగా 1931లో కలుసుకున్నాడు. అప్పటినుంచి ఆయనకు ప్రేమికుడుగా ఉండిపోయాడు. లండన్‌లో సర్కిల్ ఎడిటోరియల్ కమిటీ అని బాబా పనికోసం ఏర్పాటయిన సంఘానికి నిర్వాహకుడుగా వుంటున్నాడు. బాబా భక్తులందరితోను సంబంధం కలిగివుండడంకోసం ఏర్పడిన సంస్థ అది. అందరికీ కడు సమర్థంగా బాబా సందేశాలు వార్తలు తెలుపుతూ వుండేవాడు.

## 14. మిసెస్ మేరీ బాకెట్ :

విల్ బాకెట్ భార్య. ఈమె వృద్ధురాలయినా కడు ఉత్సాహవంతురాలు, ప్రేమతత్వం కలది. ఆమెకు నెమ్మది, దయ, పరోపకారము స్వభావ జనితములు. తనకు కావలసిన నూలు తన రాట్నంమీద వడికి బట్టలు కూడా నేసుకుంటుంది, ఈ రాట్నం ఇండియాకు తీసుకు వచ్చింది. భర్తతో కలిసి 1931లో బాబా దర్శనం చేసుకుంది. అప్పటినుంచి ఆయనను ప్రేమించి పూజించేది. ఆయన పనిలో పాల్గొనాలని ఆరాటం మెండుగా వుంది ఆమెకు. భర్తకు బాబా పనిలో సహాయం చేస్తుంది.

## 15. టామ్ షార్ప్లీ :

ఇంగ్లండులో ఫోక్‌స్టన్ ఇతని కాపుర స్థలం. యువకుడు. ఉపాధ్యాయ వృత్తిలో వున్నాడు. మౌనము, ఏకాంతము అంటే యిష్టం. ఉత్తమమైన అన్వేషకుడు. ఈ స్థితిలోనే మొదట 1931 సం॥ లో బాబా దర్శనం చేసుకున్నాడు. బాబాకు తన జీవితం అంకితం చేసుకున్నాడు. మృదువయిన హృదయంతో ప్రేమతో బాబా

పనిలో పాల్గొనాలని అతని ఆరాటం. నాసిక్ వచ్చి తన అంతరంగంలోని కోరిక తీరిందని అనుకున్నాడు.

ఈ పదిహేనుగురు పాశ్చాత్యుల కాక కొంతమంది బాబా శిష్యులైన ప్రాచ్యులు కూడా నాసిక్‌లో మెహెర్ రిట్రీట్‌లో నివాసం ఉంటున్నారు.—ఆది (జూనియర్) బాబా ఆఖరి తమ్ముడు, బాదా చాన్‌జీ (చాన్‌జీ) కారింగర్ అనే పెర్షియన్ బాలుడు, ఆదీ (సీనియర్) తమ్ముడు రుస్తుం, అతని భార్య ఫ్రెని, వారి అయిదుగురి పిల్లల లోను ముగ్గురు అక్కడ వుంటున్నారు. మెహెర్ రిట్రీట్ ఆవరణలో చిన్న చిన్న బంగాళాలలో కాపురం వున్నారు. పాశ్చాత్యులు పన్నెండు గదులున్న ఒక బంగాళాలో నున్నారు. ప్రధాన భవనంలో 4 గదులలో కూడా వున్నారు. బాబాకి ప్రత్యేకంగా ఒక కేబిన్ వున్నది. దాదా చాన్‌జీ బాబా గురించి ఎన్నో సంగతులు పాశ్చాత్య శిష్యులకు చెప్పుచుండెడివాడు. అనేక సంవత్సరాలు బాబావద్ద శిష్యరికం చేసి యుండబట్టి ఆయన విధానాలు అతనికి బాగా తెలుసు. ఏదయినా బాబా ఒక ఆజ్ఞ జారీ చేస్తే అది ఎలా పాటించా లనేదాంట్లో పాశ్చాత్యులలో అభిప్రాయ భేదాలు కలిగినప్పుడు చాన్‌జీ యొక్క అనుభవజ్ఞత వాళ్ళకి ఎంతో ఉపకరించేది. అమెరికనులు, ఇంగ్లీషువారు ఎప్పుడూ ఒకే అభిప్రాయంతో ఉండేవారు కాదు. బాబా నాసిక్‌లో వారానికి ఒకటి రెండు రోజులు మాత్రమే ఉంటూ రాహూరీకి, మెహెరాబాద్‌కి వెళ్ళి వస్తూండేవారు. ఆయనతో కూడ ఆది (సీనియర్) కూడా వస్తూండేవాడు.

కొన్ని రోజు లయిన తరువాత పాశ్చాత్య శిష్యులను బాబా ఆశ్రమం నుంచి బయటకు వెళ్ళనిచ్చేవారు. వారినికూడా తీసికెళ్ళి మరల జాగ్రత్తగా ఆశ్రమానికి దారి తప్పకుండా వచ్చేందుకు వారితోకూడా ఆది (జూనియర్)ని పంపుతూ వుండేవారు బాబా. చీకటి పడకముసుపే వారిని తిరిగి ఆశ్రమానికి తీసుకురావాలని చెప్పేవారు బాబా. ఆదీ (జూనియర్) కూడా వారితో వెళ్ళినపుడు బాబా గురించి అనేకమయిన జరిగిన కథలను వారికి చెబుతూండేవాడు. ఇంటిలో వంట విషయాల్లోను మిగతా వాటిల్లోను ఫ్రెనీ అక్కడ చాలా కాలంనుంచి – అనేక సంవత్సరాల నుంచి – కాపురం వుంది గనుక నొరీనాకి చాలా సహాయంగా వుండేది. ఫ్రెనీ పిల్లలు మెహ్రూ, సగ్గు, బెహ్రాం అక్కడ ఒక యూరపియన్ పాఠశాలకి వెడుతూండేవారు. ఆమె ఆఖరి పిల్లవాడు అయిదేళ్ళవాడు. వాడు చాలా అందంగా ముద్దు లొలుకుతూ వుండే వాడు. బాబా టీ తీసుకునేటప్పుడు బాబా కుర్చీ ప్రక్కన నిలబడేవాడు. బాబా జుట్టు

తన ప్రేళ్ళతో సవరిస్తూ వుండేవాడు. మెహ్రూ కూడా తరువాత మెహెరాబాద్‌లో మండలిలో ఒకరుగా చేరి ఉండేది. డాక్టరయిన సగ్గు ఇంకో డాక్టరునే పెండ్లి చేసుకొని తూర్పు ఆఫ్రికాలో వుంటోంది. వీరికంటె పెద్దవాడయిన ఫాలుకూడా పెళ్ళి చేసుకుని నాసిక్‌కి సమీపంలోనే నివసిస్తున్నాడు.

నాసిక్‌లోని పరిస్థితులనుబట్టి పాశ్చాత్యులకు ఎక్కువ సౌకర్యాలు ఏమీలేవు. అయినా అవేమీ లేకపోయినా నిరాడంబర మయిన జీవితం గడుపుటకు వారు సిద్ధంగానే వున్నారు. వారు బాబాను అంతగా ప్రేమిస్తున్నారు. ఆయన కోసం వారు ఎంతటి కష్టాలయినా సహించగలరు. పాశ్చాత్యులకు బాబా ఉన్నంతలో మంచి వసతినే కల్పించారు. వారికి విడివిడిగా పడక గదులు వాటికి ఎదుట పొడుగైన వసారా ఒక పెద్దగది అందరూ కూచునేందుకు, ఇంకొక పెద్ద భోజనాల గది ఏర్పాటు చేయించారు. పడక గదులలో ఎలక్ట్రిక్ పంకాలు, ఆధునికమయిన స్నాన సౌకర్యాలు, వేడినీరు, చల్లని నీరు వచ్చే కుళాయిలు ఇవన్నీ అమర్చేరు. ఎన్ని వున్నా బాబా చెప్పగానే చెప్పిన పని విధేయతతో చేయాలన్నది ఎల్లప్పుడు జ్ఞాపకం వుండాలి అందరికి. ఇది చాలా సులభంగానే కన్పించవచ్చు గాని చేయవచ్చేటప్పటికి అందులోని కష్టం తెలుస్తుంది.

బాబా ఆశ్రమా లన్నిటిలోనూ ఆధ్యాత్మిక గురువు బాబా తప్ప ఇంకెవ్వరూ లేరు. మిగిలిన అందరూ ఇంచుమించు ఒక స్థాయిలోనే వున్నారు. దైనందిన కార్యక్రమాలకి ఆశ్రమాలలో కొంతమందికి పర్యవేక్షణ పదవులను అప్పగించేరు బాబా. ఏ సందర్భంలో నయినా ఏ పని గురించి అయినా చెప్పితే బాబాయే చెప్పాలి.

నాసిక్ ఆశ్రమానికి వచ్చిన పాశ్చాత్యులలో కొందరు ఇదివరకు ఆధ్యాత్మిక సూత్రాలను తమ జీవితాలలో అమలు పరచుకొనుటకు ప్రయత్నించారు. కొందరు యోగాభ్యాసం చేశారు. కొందరు ధ్యానం చేసేవారు. కొంతమందికి ప్రాచ్యదేశాలంటే వాటి ఆధ్యాత్మిక వాతావరణం వల్ల ఆకర్షణ కలిగింది. మరికొందరు అసలు వారి జీవితాలలో భౌతికమైన ఆనందాన్నిచ్చే భోగాలు తప్ప ఇంకేమీ అక్కర్లేకండా ఉండేది. మెహెర్‌బాబాను కలసిన తరువాతనే వారి ప్రవృత్తి మారిపోయింది. వారిలో బాబా మేల్కొలిపిన ప్రేమవలన జీవితంలో ఒక క్రొత్తదనం కలిగింది. జీవితంలో ఒక విశిష్టత పొడకట్టింది. ఇప్పుడు వారు గురువయిన బాబాను సేవించుటకు అంకితమయారు. ఇంకా గాఢంగా ఇంకా లోతుగా ప్రేమించడానికి, ఇంకా స్వార్థ రహి

తంగా సేవ చేయడానికి, బాబా సన్నిధిలో వారి మార్గదర్శకత్వంలో ఇంకా ఎన్నో విషయాలు నేర్చుకోడానికి వారు నిశ్చయించుకున్నారు. అదే వారి ధ్యేయం.

(ఆధ్యాత్మిక శిక్షణలో ఓర్పు మిగుల అవసరమయిన సద్గుణము. కబీర్ మహాత్ముడు చెప్పినట్లు ఆఖరు స్పర్శ కలుగజేసే పని, శిష్యుని ఒక సోపానం పైకి ఎక్కించే పని ఒక్క క్షణంలో కాగలదు. కనురెప్పపాటు కాలములో గురువు సాధకునికి దైవ సాక్షాత్కారము కలుగజేయగలడు. కాని శిష్యుడు అందులకు పరిపక్వమయిన మనసు కలవాడయితేనేగాని గురువుకు అట్టి అనుగ్రహము రాదు.)

బాబా వ్యక్తిగతంగా ఎంతో ప్రేమతో పాశ్చాత్యులను రావించి వారికి కావలసిన ఏర్పాట్లు భౌతికంగా చేయగలిగిన వన్నీ చేసి వారికి తగిన ఆధ్యాత్మిక వాతావరణాన్ని సృష్టించారు. ఆశ్రమ జీవితం ప్రేమకి, శాంతికి, నిస్వార్థతకీ ఆదర్శంగా వుంటుందని చెప్పారు బాబా కాని బాబా పాశ్చాత్యులకు సమరస భావం గురించి పాఠాలు చెప్పవలసి వచ్చింది. అన్యోన్యంగా ఒకరికొకరికి సామరస్యం లేనిదే శాంతి ఎలా వస్తుంది. అది లేనిదే బాబాకు వారు సేవ ఎలా చేయగలరు? అనేక రకాలవారిని అనేక రకాల అహంకారాల వారిని బాబా సమావేశపరచారు. వీరందరు నాసిక్ ఆశ్రమ్‌లో ఎవరికి చేతనైనట్లు వారు ముందు బాబాను ప్రేమించవలెనుకదా. ఒకరిద్దరు తప్ప వారిలో అంత సులభంగా సమరసభావం కలిగించుకునే వారు లేరు. అయినా అన్నీ తెలిసిన, ఆ సర్వ సృష్టికర్త అయిన బాబాకు పాశ్చాత్యుల గురించి వారికే తెలిసిన దానికంటె కూడా బాగా తెలుసును. అందుకనే బాబా ఆంతరంగికంగా వారిమీద చక్కగా పని చేయగలరు. భగవంతుని ఇచ్ఛ ఎలా వున్నదో ఏదో తప్పు జరిగితే గాని తెలియదుకదా. ఒక్కొక్కరిలోను ఉన్న అహంకారాన్ని తొలగించడానికి బాబా తమలో ఉన్న తరగని దివ్య శక్తితో పని చేసేవారు. అందరూ కూడా సమిష్టి శ్రేయస్సు కోసం వ్యక్తిగతంగా వారి అభిప్రాయాలను దిగమ్రింగవలసి వచ్చేది. వారిలో ఉన్న అవాంఛనీయమైన అలవాట్లను అభిప్రాయాలను అణచడానికి బాబా ఎన్ని విధాలుగానో ప్రయత్నం చేశారు. జయం పొందేవారు కూడా.

మొదటి నుంచి పాశ్చాత్య శిష్యులు బాబా ఆధ్యాత్మిక పాఠాలు, ప్రవచనాల రీతిని, చెప్పమని వేడుకొనేవారు. మొదటి పాఠం 1936, డిసెంబరు 17వ తేదీని ఆ నెలలో వచ్చిన (మొదట 8వ తేదీని ఆరుగురు, తరువాత 16వ తేదీన వచ్చిన ఇద్దరు) వారికి చెప్పారు.

ఈ ప్రసంగంలో అసలు ఈ శిబిరం యొక్క ముఖ్యోద్దేశం వివరించి చెప్పారు బాబా. ఆ రోజున బాబా ఇంకా ఇలా చెప్పారు.

"దివ్యత్వంలో మానవత్వం కూడా ఇమిడియున్నది. అనంతత్వంలో అన్ని రకాల జీవితాల వ్యక్తీకరణ కూడియున్నది. (ఆధ్యాత్మికం అంటే ప్రాపంచికపు పను లన్నీ త్యజించడం అని అర్థంకాదు. ఆధ్యాత్మికత్వం అంటే అంతరంగంలో వున్న ప్రాపంచికపు కోరికలను వదిలిపెట్టడ మన్నమాట)

("కేవలం వైరాగ్యం ఆధ్యాత్మికత్వానికి మార్గంకాదు. ప్రకృతియొక్క ద్వంద్వాల ప్రకటన నుండి తప్పించుకుందామంటే, వాటి చిక్కులనుండి తప్పించు కుందామంటే, సంపూర్ణత్వం నిజంగా సంపూర్ణత్వం కాజాలదు. మాయయొక్క అన్ని చేష్టలను ఎదుర్కొని దానిమీద తన యాజమాన్యాన్ని నిరూపించుకోవాలి. ఆ మాయానాటకం ఎంత ఆకర్షణీయమయినా ఎంత శక్తివంతమయినా సరే దాన్ని జయించాలి. ఎన్నో ఎడతెరపిలేని పనుల మధ్య అన్ని రకాల జీవిత రూపాలతోను సంబంధం కలిగి వుంటూ సంపూర్ణమయిన వ్యక్తినిస్సంగుడై వుంటాడు).

ఒక సందర్భంలో గారెట్‌ఫోర్ట్ బాబాలో హాస్యరసం వుందని అనగా బాబా— "దివ్యత్వములో సొగసు, అనుగ్రహము ఇమిడియున్నాయి. అందువల్ల సంపూర్ణ పురుషునిలో రసోత్పాదన కలిగించే చమత్కారశక్తి ఎందుకు వుండదు?

"మీలో ప్రతి యొక్కరు మీ మీ శక్తికి అనుగుణంగా నా పనిలో సహాయం చేయాలి. మీరు చేయవలసిన పనిలో ప్రపంచంతో సంబంధం కలిగి వుండవలసి వస్తుంది. ప్రపంచంలో ఎలా మెలగాలో నేను మీకు చెబుతాను. అలా ఉంటూనే అంతరంగంలో అనంతుడనయిన నాతో సంసర్గం కలిగి వుండాలి.

"నాసిక్‌లో మీకు కలిగిన సౌకర్యాలను, రహూరిలోను, మెహెరాబాద్‌లోను మీకు ఉన్న ఇబ్బందులను రెండింటినీ మీరు అనుభవిస్తూ మీరు వాటి యెడల అనాసక్తులుగా వుండాలి" అని చెప్పారు.

"మీరు ఆందోళన పడకండి. ఆతురత పడకండి" అంటారు బాబా ఎప్పుడూను. తరువాత రోజుల్లో నాసిక్‌కు వెళ్ళిన తరువాత డిసెంబరు 23, 24, 25 తేదీలలో బాబా కొన్ని ప్రవచనాలు చేశారు.

బాబా అన్నారు— ("శరీరం మూలాన అలసట చెందడం స్వభావసిద్ధమే. శరీరం, మనసు రెండూ వేరు అయినా అవి అన్యోన్యాధారముగా ఉంటాయి. మన

స్సుకు అలసట కలిగితే అది శరీరం మీద ప్రతిబింబిస్తుంది. శరీరానికి అలసట కలిగినపుడు కూడ మనస్సుమీద పని చేస్తుంది. ఆత్మ మాత్రం — ఈ రెండిటింకి విడిగా సంబంధం లేనట్లు ఉంటుంది/ ఈ భావం అంతా 'అహం' వల్లనే కలుగుతుంది. ఆ 'అహం' తృప్తి పడక పోతే 'నాకు సుఖం లేదు' 'నేను చిక్కుల్లో ఉన్నాను.' అనుకుంటుంది. ఇదంతా 'అహం' కారిమే, "పరిమితమైన ఈ 'అహం' ముఖ్యం కానివాటినన్నిటినీ ముఖ్యంగా తీసుకుంటుంది. ముఖ్యమయిన వాటిని అప్రధానంగా తీసుకుంటుంది. ముఖ్యము అనే దానికి అవసరము అనేదానికి చాలా భేద మున్నది. శారీరకమయిన అవసరాలు, సౌకర్యాలు ముఖ్యమయినవి కావు కాని అవసరమయినవి. ఆధ్యాత్మికత్వం ముఖ్యమయినది కాని బాహ్యంగా అనవసరమయినది. కావున అముఖ్యంగా తీసుకోబడుతోంది.

బాహ్యంగా కనపడేది ఎంత అముఖ్యమో చూడండి. క్వెట్టా మంచి అభివృద్ధిలో వున్న నగరం. అయిదు నిమిషాల్లో అది వినాశనం చెందింది. ఇది అముఖ్యమయినది. అదే నిజంగా ప్రధానమైన దయితే అనంతుడయిన భగవంతుడు దానిని నాశనం చేయకపోను. స్పెయిన్ చూడండి. అంతా ముఖ్యమని అనుకున్నదంతా నాశనమయింది. మాయ వస్తూంటుంది. పోతూంటుంది. కాని ఆత్మ అవికారంగా వుండి పోతుంది. దైవ సాక్షాత్కారం అంటే ఈ ముఖ్యమైనది నిజంగా అనుభవించడం- ఆత్మ శాశ్వతమయినది అని.

"మీరు ఇండియాలో ఉన్నపుడు నిరాడంబరమయిన జీవితం జీవించాలని నా అభిలాష. తరువాత మీ దేశాలకి వెళ్ళినపుడు అక్కడ మీకు అలవాటయిన జీవితంలోకి మరల అడుగుపెట్టవచ్చు. ఈ రెండిటిలో దేనివల్లాకూడా మీరు మారకూడదు. అయినా ఇప్పుడు మిమ్మల్ని నేను క్రింద పరుండేలా చేయను. ఈ సౌకర్యాలన్నీ నేను ఎందుకు కల్పించాను? ఎందుచేతంటే వీటికి అలవాటయిన మీశరీరాలకి అవి లేకపోతే కష్టం కలిగి మీ మనసుమీద ఆ లోటు పనిచేస్తుంది. అప్పుడు మీమనసుద్వారా మీకు సత్యాన్ని ప్రబోధం చేయడం నాకు కష్టమవుతుంది. తీవ్రమయిన మార్పులు మనసుమీద, శరీరం మీద పనిచేసి మార్పులు తెస్తాయి. క్రమంగా మీకుఈ సౌకర్యాలు ఈ సుఖాలు తొలగిస్తాను. మరల అవి మీకు కలుగజేస్తాను. ప్రపంచం అవసరాలకు బానిసవంటిది అవసరాలు మీ బానిసలుగా వుండాలి. మీ అవసరాలను వదులుకోమని నేను కోరను. కాని వాటి నుండి మీరు స్వేచ్ఛ పొందాలని కోరతాను. అందుచేత మొదట్లో మీకు ఏమీ తోచక పోవచ్చు; మీకు అలసట కలుగవచ్చు; అంతాగొడవగా

వుండవచ్చు; కాని మీరు చింతించవద్దు- త్వరలోనే మీకు నేను మీ పనులు ఏమిటో చెబుతాను. అప్పుడు మీకు తృప్తి కలుగుతుంది. మీరు జనవరి 15దాకా వీలయినంత విశ్రాంతి తీసుకోండి. ఇంక నేను ప్రారంభిస్తే ఏదీ నన్ను ఆపలేదు. 19 వ తేదీ నుంచి శ్రద్ధగా పనిచేయడం ప్రారంభిద్దాము".

ఇంకొకమారు ప్రభుత్వంవారు కుష్ఠ రోగుల గురించి బాబాను సహాయం అడిగిన సంగతి బాబా ఇలా వివరించారు—

"బజారులో కుష్ఠురోగులు ప్రజలతో కలిసి మెలిసి వుంటున్నారు. ఆరోగ్య శాఖాధికారి ఆ రోగులకు ఒక ఆశ్రమం కావాలన్నాడు. వారిని అందులో వేరే వుంచడానికి, అందులకతడు నా సహాయం కోరేడు. అప్పుడు "ఆ ఆశ్రమం పూర్తిగా నా ఆధీనంలో వుంచినట్లయితే నేను స్వయంగా ఆ రోగులను శుభ్రంగా వారి శరీరాలు కడిగి స్నానం చేయించ గలుగుతాను. వారి కెంతటి రోగమున్నా అదినాకు ఏమీ చేయదు. నాకు సహాయంచేసే నా శిష్యులకూ అది ఏమీ చేయదు అని చెప్పాను. రాహూరిలో నేను 'పిచ్చి' వారిని కడిగి నీళ్ళు పోస్తున్నానంటే ప్రపంచంలో అలాటి వారినందరినీ కూడా క్షాళనం చేస్తున్నానన్నమాట" అని బాబా చెప్పారు.

కొన్ని రోజులు పోయాక రాబోయే బాబా జన్మదినోత్సవంనాడు 15000మందికి బాబా తిండిగింజలు, బట్టలు పంచిపెడతానని చెప్పారు. అందుకు నాసిక్ ఆశ్రమంలో వున్న ప్రాచ్య పాశ్చాత్య శిష్యులందరి సహాయం కావాలన్నారు. వారు పంచిపెట్టే దినుసుల పొట్లాలు కట్టాలి అని బాబా కోరారు.

తరువాత జనవరి 16 నుంచి ఆశ్రమంలో కార్యక్రమము ఏ రీతిగా ఉండవలసినదీ ఈ విధంగా బాబా నిర్ణయించి చెప్పారు. —

"జనవరి 16 వ తేదీ నుంచి మీరు ఉదయం 6-30 గంటలకు లేవాలి. రాత్రి 9-30 గంటలకే పరుండాలి. మీలో ఒక్కొక్కరికి ఇవ్వబడే పనులన్నీ చేయాలి. నాసిక్ సమీప మందున్న సుందరమయిన ప్రదేశాలకి, కొండలకు, గుహలకు, నేను తీసుకుని వెడతాను. ఆ స్థలాలలో పూర్వం ఋషులు నివసించేవారు. ధ్యానాదులు చేసుకొనేవారు. కాని నాయొక్క జన్మదినం వరకు మీరు నా అనుమతి లేనిదే ఆశ్రమం విడిచి బయటకు పోకూడదు. మీరు ఖైదులో నిర్బంధంలో వుంచబడినట్లు అనుకోవచ్చు. కాని అది మీ మంచికే. రాహూరికి మెహెరాబాద్‌కి వెళ్ళి రావడం జనవరి 5 నుంచి ప్రారంభం అవుతుంది."

బాబా ఇంకా ఇలా చెప్పారు—

"సమయం పాటించడం జ్ఞాపకం వుంచుకోండి. భౌతికాతీతమయిన స్థితిలో దేశకాలములు లేవు. ఈ ద్వంద్వములున్న ఈ లోకంలోనే, సమయము, దేశము, (స్థలము), కారణము, కార్యము ఉంటాయి. కావున ఈ ద్వంద్వములలో నేను మానవోద్ధరణకు పనిచేసేటప్పుడు బాహ్యంగా నేను ఈ దేశకాలములకు కట్టుబడి వుంటాను. కొన్ని సమయాలలో నేను కూడా పరిమితుడనయినట్లు కనబడతాను. కాని నిజంగా నేను నిరంతరము ఏకత్వమునే అనుభవిస్తూంటాను. మరియు అనంత మయిన పరిస్థితి నా అనుభవంలో వుంటుంది.) నిర్ణీత సమయాలలో నా యొక్క పరిధిలో ఉన్నవారికొరకు పనిచేస్తాను. కాని విశ్వకార్యమునకు ఏ సమయమూ నిర్ణీతము కాలేదు. కావున మిమ్ము సమయం ప్రకారం పనులు చేయమన్నానంటే నా బృందంకోసం నేనుచేసే పనివల్ల మీరు లాభం పొందగలరన్నమాట. మండలికి ఎల్లపుడు సమయం ప్రకారం పనులను నేను విధిస్తూంటాను."

బాబా నాసిక్ శిక్షణ కేంద్రము నందుండగా ఒకనాడు వారి పాశ్చాత్య పరివారానికి ఈ విధంగా చెప్పారు. —

("దరిదాపు పన్నెండు సంవత్సరాలనుంచి నా పెదవులనుంచి ఒక్క మాటయినా వెలువడలేదు. అయినా నేను ఎప్పుడూ మౌనంగా లేను. నేను నిరంతరమూ మాటలాడుతూనే వున్నాను. నీలో లోతు నుంచి నీకు వినిపించే వాణి–అది నా వాణియే– ఆ వాణియె నీకు ఉత్తేజాన్ని కలిగిస్తుంది. అదే నీ అంతర్బుద్ధిని వికసింపజేస్తుంది; అది నీకు మార్గదర్శిగా వుంటుంది. ఈ వాణి వినుపించుకునే వారితోనే నేను మాట్లాడతాను.)

బాహ్యంగా నేను అవలంబిస్తున్న మౌనం ఆధ్యాత్మిక అభ్యాసం కాదు. ఒక మారు ఒక భక్తుడు ఒక సద్గురువుని ఎందుకు మీరు ఉపవాసం ఉంటున్నారని అడిగాడు. ఆ సద్గురువు— "నేను ఒక సాధకుని కాను, నేను సంపూర్ణుడను. అందుచేత నేను సంపూర్ణత్వం పొందడంకోసం ఉపవాసం చేయడంలేదు. నేను ఇతరులకోసం ఉపవసిస్తున్నాను." అని జవాబిచ్చాడు.

ఒక ఆధ్యాత్మిక సాధకుడు సంపూర్ణత్వం పొందినవానివలె ఆచరించలేడు. కాని ఇతరులకోసం సంపూర్ణత్వం పొందినవాడు సాధకునివలె ఆచరించగలడు. ఎమ్. ఎ. పరీక్ష ప్యాసయినవాడు చిన్న పిల్లలకు పలకమీద అక్షరాలు వ్రాసి నేర్పగలడు.

అలా అని అతడు ఎమ్. ఎ. కాకపోలేము. అందుచేత నా మౌనం ఇతరుల మేలు కోసమే ప్రారంభింపబడి వహింపబడుచున్నది.

## క్రిస్టమస్ పండుగ :

ఇండియాకువచ్చి (అసలు తూర్పు దేశాల్లోనే) బాబా భక్తులయిన పాశ్చాత్యులు నాసిక్ ఆశ్రమంలో క్రిస్టమస్ పండుగ చేసుకోవడం ఇదే ప్రథమం. అందు లోనూ బాబా సమక్షంలో జరుపుకోవడంతో దీనికొక విశిష్టత వచ్చింది. అందులో కొంత మంది 1934 సంవత్సరంలో బాబా హాలీవుడ్‌లో క్రిస్టమస్ పండుగ చేసుకున్నది జ్ఞాపకం తెచ్చుకున్నారు. అది పశ్చిమంలో మొదటిసారిగా బాబా చేసుకున్న క్రిస్టమస్ పండుగ. కాని ఈనాడు బాబా జన్మించిన దేశంలో ఆయన సన్నిధానంలో పశ్చిమ దేశాల నుంచి ఆయనకోసం వచ్చి పాశ్చాత్య ప్రేమికులు క్రిస్టమస్ పండుగ చేసుకోవడంలో గొప్ప విశిష్టతవుందని ఆ భాగ్యం వారికి కలిగిందని వారంతా ఎంతో సంతోషించారు ఆధ్యాత్మిక జీవిత ప్రధానమైన ఈ భారతదేశంలో, అనేక మంది ఋషులు, సాధువులు, మునులు, మహాత్ములు ఉద్భవించిన ఈ భారతదేశంలో నేటి యుగంలో జన్మించిన పురుషోత్తముడు వారందరిని ఆహ్వానించడం. వారు ఆ ఆహ్వానానుసారంగా ఇక్కడికి రావడం, బాబాతో సహజీవనంచేసే పుణ్యం వారికి కలగడం, ఆ మహానుభావునిచేత సహాయ సహకార శిక్షణలను పొందడం, ఇవన్నీ తలుచుకుని వారంతా ఆనందంలో ఓలలాడి పోతున్నారు.

క్రిస్టమస్ పండుగరోజున ఉదయాన్నే బాబా పాశ్చాత్యశిష్యుల గదులకు వెళ్ళి వారి ప్రేమలోను వారి ఉజ్జ్వలమైన తేజస్సుతోను వారిని ముంచెత్తి వేశారు. కబీర్ మహాత్ముడు చెప్పినట్లు బాబా ఎల్లప్పుడు ఒకే విధమయిన ప్రేమను ప్రసారం చేయరు. కబీర్ అంటాడు —

"నా ప్రభువు దాగుకుంటాడు.

నా ప్రభువు అద్భుతంగా తన్ను తాను ప్రకటించుకుంటాడు కూడాను."

కాని ఈ ప్రధానమయిన ప్రాతఃకాలమున బాబా అందరిమీదా వారి ఆశీర్వాదాలను కురిపి వారికి శుభాకాంక్షలను అందజేస్తూ అనిర్వచనీయమైన ప్రేమ జల్లులో అందరిని తడిపి వేశారు.

తెల్లవారిన కొద్దిసేపటికి భక్తులు బాబాకు జోహారులిచ్చేందుకు రావడం ప్రారంభించారు. పదిగంటలకు అక్కడ ఈ పండుగకోసం వేసిన పందిరి-స్త్రీలు, పురుషులు, పిల్లలతో నిండిపోయింది. కొంతమంది ఎంతోదూరం నుంచి నడిచివచ్చారు. కొందరు బస్సులలోను, కొందరు రైళ్ళలోను వచ్చారు ఇంతమంది బాబా దర్శనం కోసం రావడం చూచి పాశ్చాత్య ప్రేమికులు తమ అదృష్టాన్ని తలుచుకుంటూ- ఎందుచేతంటే బాబాయే తమ యోగక్షేమాల కోసం ఎంతో పాటుపడటం ప్రత్యక్షంగా చూచారు- మురిసిపోయారు. వచ్చిన వారందరికి బాబా దర్శనం యిచ్చారు. వారిని బాబా దీవించారు.

క్రిస్టమస్ పండుగనాడు ఉదయం కొంచెంసేపట్లో ఇంగ్లండు నుంచి కిమ్‌కో బృందం చేరుకున్నారు.

ఆ సాయంకాలం ఒక బల్ల చక్కగా అలంకరింపబడి వుండగా దాని చుట్టూ పాశ్చాత్యులు అందరూ కూర్చున్నారు. బాబా దానికి అగ్రభాగాన్ని అలంకరించారు. అందరు వారితో కూడా తెచ్చిన క్రిస్టమస్ కానుకలు వారి పెట్టలోనుంచి తీసి బయట పెట్టారు. అవిచూచి బాబా అన్నీ కలగలుపుచేసి వాటికి నెంబర్లువేసి తమయిష్టం వచ్చినట్లు ఒక్కొక్కరికి పంచి యిచ్చారు. అందరికి వారు తెచ్చినవి వేరొకరికిరాగా వారికి ఇంకొకరు తెచ్చినది ఏదో ఒక క్రొత్త వస్తువు వచ్చింది.

ఆ సాయంకాలం అన్నిటికంటె ఎక్కువగా వినోదం కలిగించింది. కాకా యొక్క ఉపన్యాసం .అతని వచ్చీరాని ఇంగ్లీషులో. అందరు ఆ ఉపన్యాసం విని కడుపుబ్బేలా నవ్వారు. కాకా పెద్ద బహిరంగసభలో బ్రహ్మాండమైన ఉపన్యాసం యిచ్చినట్లుగా ఈ స్నేహితుల యెదుట మాట్లాడాడు. బాబా కూడా నవ్వు ఆపుకోలేక పోయారు.

అప్పుడు బాబా పాశ్చాత్యులను కొద్ది నెలలు ఉర్దూ నేర్చుకుని ఉర్దూలో భారతీయులకు ఉపన్యాసం యివ్వాలన్నారు. అందరూ నవ్వుకుని సరేనన్నారు. చిన్నతనంలో తల్లిదండ్రులు వారి యోగక్షేమాలు చూసుకుంటున్నపుడు వారు ఆడుకుంటూ ఏ కష్టాలు లేకుండా హాయిగా సుఖంగావున్న సంగతి యిప్పటి వాతావరణం జ్ఞాపకం చేస్తోంది వారికి అందరికి తండ్రి యయిన బాబా వద్ద పిల్లలవలె వారంతా చిన్నతనంలోవలె హాయిగా అన్ని బాధ్యతలు మరచి ఆడుకుంటున్నట్లు వారు భావించారు.

పండుగనాడు రాత్రి ప్రత్యేకమయిన విందు భోజనం ఏర్పాటు చేసుకున్నారు.

## బాబా యొక్క క్రిస్టమస్ పండుగ సందేశం :

క్రిస్టమస్ పండుగ రోజున (1936) బాబా ఇలా చెప్పారు. —

"నా ప్రేమ నిరంతరము మానవు లందరికి ప్రవహిస్తూనే వుంటుంది. కాని ఈ ప్రత్యేక సమయంలో ఈ బృందంలో ఇక్కడ లేనివారిని జ్ఞాపకం చేసుకుందాము" ....కొద్ది నిమిషాలసేపు నిశ్శబ్దంగా వుంది బాబా మరల అక్షరఫలకం మీద ఇలా చెప్పారు. —

("నేను అనవరతము సిలువ వేయబడుతూనే వున్నాను. నిరంతరము నేను జన్మ తీసుకుంటూనే వున్నాను.")

బాబా వద్ద ఉండటానికి ఇదివరకు వచ్చినవారు కాక మరి యిద్దరు ప్రేమికులు వచ్చారు. వారు శామ్ కోహెన్, మాల్యారుడ్యార్ అనువారలు. వీరిని గురించి క్లుప్తంగా తెలుసుకుందాం.

## శామ్ కోహెన్ :

ఇతడు న్యూయార్క్‌లో బ్రూక్లిన్ నుంచి వచ్చాడు. తన తండ్రి వ్యాపారము నందు ఇతడు పనిచేస్తూ ఉండేవాడు. బాబా దర్శనం చేసుకునేముందు శామ్ రామకృష్ణ పరమహంస శిష్యులతో సాంగత్యం చేశాడు. అప్పటినుంచి అతనికి ఇండియా రావాలని కోరిక వుండేది. అతడు దివ్యజ్ఞాన సమాజంలో (థియసాఫికల్ సొసైటీ) సభ్యుడుగా వుండేవాడు. జె. కృష్ణమూర్తి అంటే అతనికి గౌరవం వుండేది. అతని ప్రసంగాలు వినడానికి 1931 వ సంవత్సరంలో కాలిఫోర్నియాలోని ఓజైకి శామ్ వెడుతూండేవాడు.

ఆ సంవత్సరంలోనే మెహెర్‌బాబా గురించి విన్నాడు. బాబా హాలీవుడ్ వెళ్ళినపుడు శామ్ బాబాను అక్కడికివెళ్ళి దర్శించాడు. జీవించివున్న అసలయిన సద్గురువని అతడు మెహెర్‌బాబాను కలిసినప్పుడే తెలుసుకున్నాడు. బాబాను చూడగానే శామ్ తన ఆధ్యాత్మికాన్వేషణము అంతము నొందెనని అతడు విశ్వసించాడు. ఆ సంవత్సరమే ధ్యానాది సాధనలకోసం ఓషియానా అనే వూరిలో సముద్రతీరాన ఇసుకతిప్పలలో ఒక కుటీరం నిర్మించుకుని కొన్నాళ్ళున్నాడు. ఎన్ని కష్టాలయినా భరించాడు. 1934-35 సంవత్సరంలో రెండవమారు బాబా కాలిఫోర్నియా వెళ్ళినపుడు హాలీవుడ్‌లో మరల బాబాను దర్శించాడు.

ఓషియానాలో వుండగా అతడు బాబాను ఆహ్వానించగా బాబా అక్కడికి పరివారంతో వెళ్ళారు. అప్పుడు అతనికి అద్భుతమయిన అనుభవంకూడా కలిగింది. ఇది చదువరులకు జ్ఞాపకం వుంటుంది.

ఆరునెలల తరువాత బాబా అనుగ్రహంవల్ల బాబాయే దేవుడు అనే జ్ఞానం కలిగేలా శామ్‌కి అనుభవం కలిగింది.

ఇతడు కష్టజీవిగా అలవాటుపడినవాడు గనుక వేరే ఒక కుటీరం ఇతడికి నాసిక్ ఆశ్రమంలో ఏర్పాటుచేసి అందులో వుండమన్నారు బాబా. అలా వుండడం ఇతనికి బాగా ఇష్టమయింది.

## మాల్యా రుడ్యార్ :

ఈమె కవయిత్రి. కొన్ని గ్రంథాలను రచించినది. మాల్యా ఇటలీలో జన్మించిన ఒక కౌంటెస్. ఈమె డేన్ రుడ్యార్ అనే రచయితను వివాహమాడింది. అతడు రచయితేకాక, జ్యోతిష్యంకూడా చెప్పగలడు. పియానో బాగా వాయించ గలడు. డేన్ రుడ్యార్ కొన్ని పాటలు రచించి వాటికి సంగీతం కూర్చి పియానో మీద వాయించేవాడు.

మాల్యాకు చిన్ననాటినుంచి అద్భుతమయిన అంతరంగానుభవాలు కలిగాయి. ఈమె వాటివలన అందరిలోను వున్న పరమాత్మను అన్వేషిస్తూ చాలాకాలం గడిపి చివరికి ఆమె పుణ్యంవల్ల బాబా పరిధిలోకి వచ్చింది. ఆయన దర్శనం చేయగానే ఆ పరమాత్మనే దర్శించినట్లుగా అనుభూతి చెందింది. ఆమె, ఆమె భర్త కలిసి 'హంస' అనే పత్రికకు సంపాదకులుగా వుండి ప్రచురించేవారు.

ఈమె చిన్న పిల్లలలో నాటక కళ మేలుకొల్పాలని కృషి చేసింది. తరువాత బాబా జనవరి 15వ తేదీ తరువాత ఎన్నో సంగతులు వారందరికి చెప్పేదనని అప్పుడు కిట్టీ దేవీ షార్టుహాండ్‌లో తీసుకోవాలని, ఆ వ్రాసిన సంక్షిప్త లేఖనము నానీ టైపు చేయాలని, చేసి గారెట్ ఫోర్ట్‌కి యిస్తే గారెట్ మాల్కమ్‌లు యిద్దరు పత్రికలో ప్రచురించడానికి అవి కూర్పు చేయాలని బాబా చెప్పారు.

ఒక్కొక్క ఆశ్రమవాసి సమయం ప్రకారం చేయవలసిన పనులు నోటీసు వ్రాయించి బోర్డుమీద పెట్టించారు బాబా-

| | | | |
|---|---|---|---|
| ఉదయం | 8 గంటలకు | | అల్పాహారము |
| మధ్యాహ్నం | 12 | " | భోజనము |
| సాయంత్రం | 4 | " | టీ |
| రాత్రి | 7 | " | భోజనము |

ఎవరూ కూడా ఉ॥ 10 గంటలు సాయంత్రం 4 గంటల మధ్యకాలంలో ఎండలో ఉండరాదు.

ఫిబ్రవరి 25వ తేదీ వరకు పాశ్చాత్య భక్తులెవరూ ఆశ్రమ సరిహద్దులు దాటి బయటకు పోరాదు.

పాశ్చాత్య భక్తులెవరూ ఆశ్రమానికి వచ్చినవారితో బాబా ఆజ్ఞాపిస్తేగాని మాటలాడరాదు.

పాశ్చాత్య భక్తులెవరూ భోజనమునకుగాని, ఇక్కడ రాత్రికి ఉండుటకుగాని అతిథులెవరినీ బాబా ఆజ్ఞాపిస్తేతప్ప, ఆహ్వానించరాదు.

ఎవరూకూడా వంటయింటిలోనికి పోకూడదు. ఏదయినా ఫిర్యాదు ఉంటే నొరీనాకు చెప్పవలయును.

నాసిక్‌లోగాని, బొంబాయిలోగాని వ్యక్తిగతమయిన పనులుంటే ఆశ్రమ కార్యస్థానములో చెప్పవలెను.

నిలవగది (స్టోరు రూమ్) లోనికి పోవలెనన్నచో పగలు ఎప్పుడయినను పోవచ్చును. కార్యస్థానములో తాళంచెవి ఉండును.

కార్యస్థానములో చెప్పకుండా ఎవరూ కార్లను ఉపయోగించరాదు.

ఈ విధంగా బాబా ఆజ్ఞలను జారీచేసి అందరికీ తెలియుటకు ప్రకటన వ్రాయించి బోర్డుమీద అతికింపించారు.

ఇంతవరకూ అందరూ ఎంతో స్వతంత్రంగా వారి యిచ్ఛవచ్చినటుల ప్రవర్తించినవారు ఇప్పుడు ఒక్కమారుగా ఇటువంటి ఆజ్ఞలను పాటించాలంటే – అవి బాబా ఆజ్ఞలయినప్పటికీ–అంత సులభంకాదు. అప్పుడప్పుడు బాబా జారీచేసిన కొన్ని ఆదేశాలను చూచినపుడు కొందరు ఒహో ! ఇది ఫలానావారు చెప్పి వ్రాయించి

వుండాలి అని అనుకొనేవారు. అంటే అందులో కొంతమందికి, మరికొంతమంది కిట్టని వారుండేవారన్నమాట. బాబా ఈ పరిస్థితిలో ఒక్కొక్కరినీ తమ తమ వ్యక్తిగత అభిప్రాయాలు వ్రాసి, వీలయితే టైపు చేయించి బాబాకు అందచేయాలని చెప్పారు. నడీనె టాల్‌స్టాయికి టైపురైటరు లేదు. అందుకని ఆమె కిట్టీని తాను వ్రాసినది టైపుచేసి పెట్టించమని బాబాను వేడుకుంది. బాబా అంగీకరించారు. కిట్టీ అక్కడే వుంది. "తప్పకుండాను, సంతోషంగా" అంది. అయితే నడీనె వ్రాతకి అంతు లేకుండా పోయింది. ఆమె అభిప్రాయాల పేరు చెప్పి పేజీల తరువాత పేజీలు తెగ వ్రాసేస్తోంది ఆమె రష్యాదేశస్తురాలేమో ఆ వ్రాతలలో రష్యన్ పరిభాషాపదాలు కూడా వాడింది. ఇవన్నీ టైపుచేసి పెట్టడం అంటే కిట్టీకి విసుగుపుట్టింది. అందుచేత ఆమె నడనెతో "నీవు ఇంత గ్రంథం వ్రాస్తే నేను టైపు చేయలేను బాబూ" అని అనగానే నడీనె కిట్టీతో "మరి బాబా నిన్ను టైపుచేసి పెట్టమన్నారుగా !" అని జ్ఞాపకం చేసింది. అయినా లోపల కిట్టీ సణుగుకుంటూనే వుంది.

డిసెంబరు 31 వ తేదీని బాబా అందరినీ సమావేశపరచి ఇలా చెప్పేరు—

"నేను భోజన వ్యవహారాలు ఇతర కార్యాలు నోరీనాను నిర్వహించమని ఆమెకు అప్పజెప్పాను. మీ అందరిలో సమరస భావం కుదరడానికి మీరు నాలుగు విషయాలు గమనించాలి—

1) మీ అందరికీ నోరీనాకు మధ్య పూర్తిసహకారం కుదరాలి.

2) కొన్ని విషయాలలో నోరీనా ఒప్పుకోవాలి. కొన్నింటిలో మీరు ఒప్పుకోవాలి. ఆధ్యాత్మిక సత్యాన్నిగూర్చి తెలుసుకోడానికి మీరు ఇక్కడికి అన్నీ వదలి— మీ యిల్లు వాకిలి. మీ తలిదండ్రులను అందరనూ వదలి వచ్చారు. అందుచేత ఇక్కడ వున్నపుడు కొంచెం ఇబ్బందులు కలుగుతే అవి మీరు సహించాలి. ఇలా చెప్తున్నానని మీకు నిజమైన అవసరాలుంటే అవి తప్పకుండా మీరు పొందవచ్చు. గారెట్ యొక్క పత్రిక ద్వారా ప్రపంచానికి-ప్రేమ, సోదరభావము గురించి ఒక సందేశం యివ్వబోతున్నాము. అల్పమైన విషయాల గురించి మన యింట్లోనే కజ్జాలు పెట్టుకుంటే అది హాస్యాస్పదంగా వుండదూ ? ప్రపంచాన్ని మనం మోసం చేయవచ్చునా ?

3) ఇదివరకు నేను 'ముళ్ళు గుచ్చుకుంటాయి' అన్నాను. ఆ ముళ్ళు అనేక రకాలుగా వుండవచ్చు. ఆ ముళ్ళు గుచ్చుకున్నపుడు మీరు 'ఆ ! పోనీలే' అని తేలికగా తీసుకోవాలిగాని అవే మీరెంతో పెద్దగాచేసి తీవ్రంగా తీసుకుంటే మీకు అనవసరమయిన బాధ కలుగుతుంది. వాటిని మీరు పాటించకుండా తేలికగా తీసుకున్నప్పుడు ఆ కంటకాలే మీకు కుసుమా లయిపోతాయి.

4) నొరీనాకు నిర్వహణకార్యం ఇచ్చానుగదా ఆమె యిష్టం వచ్చినట్లు ఆమె చేస్తుంది అని మీరు అనుకుంటూంటే అంతకంటె ఇంకొక పొరపాటు వుండదు. అలా మీరు అనుకుంటే వెంటనే ఆ భావం మీ మనసునుంచి తొలగిపోవాలి. నొరీనా ఏమిచేసినా అది నామీదవున్న గాఢమైన ప్రేమతోనే చేస్తుంది. నా పనిలో సాధ్యమయినంతవరకు పొదుపుచేద్దామనే ఆమె ఆలోచన. కాని కొంతమంది ఆమె నిర్వాహకురాలిగా వుండడం ఇష్టపడడంలేదని అనుకుంటున్నట్లుగా వుంది. కాని అది నిజం కాదని నాకు తెలుసును. నొరీనా ఈ పనులన్నీ చేయడం అందరికీ ఇష్టమే. ఈ అభిప్రాయ భేదాలు అనవసరమయిన పరిస్థితులను కల్పిస్తున్నాయి. అందుకు అవన్నీ ఎంత త్వరగా చక్కచేస్తే అంతమంచిది.

మీ లక్ష్యం ఆధ్యాత్మికం అని మీరు మరచిపోకూడదు. లేకపోతే ఈ రిట్రీట్' ఒక హోటలులా తయారవుతుంది. మీరు నాకోసం వచ్చినపుడు నా కోసం బాధకూడా పడాలి మరి.

మీలో ఎవరికయినా సుస్తీ చేస్తే వెంటనే నొరీనాతో చెప్పాలి. నొరీనా తక్షణమే గారెట్ వద్ద వున్న మందులు ఉపయోగించాలి. లేకపోతే అదేదైనా తీవ్రమయిన జబ్బు అయితే డాక్టరుకోసం కబురు చేయాలి.

నేను ప్రతివారం వచ్చినపుడు అందరి ఆరోగ్యం గురించి నొరీనా నాకు వివరంగా ఒక నివేదిక యివ్వాలి."

బాబా చెప్పిన ఈ మాట – జబ్బు చేస్తే నొరీనాకు చెప్పా లన్నమాట – కొంతమందికి నచ్చలేదు. ఎవరి మట్టుకు వాళ్ళు స్వతంత్రులు. చెబితే బాబాకి చెప్పాలి. లేకపోతే డాక్టరుకి చెప్పాలి. అంతేగాని మధ్యన ఈవిడెవరు ? అని వారి అభిప్రాయం. భోజనాల విషయం కూడా సాధారణంగా తర్కించేవారు. అది అసం

తృప్తికి కారణం అవుతూ వుండేది. పదార్థాలు ఎంత బాగా ఎంత రుచికరంగా తయారు చేసినా విమర్శించేవారు. ఒకరికి ఒకటి యిష్టమయితే ఇంకొకరి కింకొకటి యిష్టంగా వుండేది ఒకరికి వేపుడు యిష్టమయితే ఒకరికి ముద్దకూర యిష్టం. ఒకరికి గోధుమ రొట్టి యిష్టం. తీరా బల్లవద్ద కూర్చునేసరికి అది రంగువేసిన తెల్లరొట్టె అవుతుంది. ఒకతెకు ఉదయాన్నే మజ్జిగ త్రాగడానికి కావాలి. ఇంకొకతెకు నారింజ రసం కావాలి. మరియొకతెకు మజ్జిగలో నిమ్మకాయ పిండాలి. వీరందరి యిష్టాలు చూస్తుండాలి వంటయింటి యాజమాన్యం వహించిన నొరీనా. కొంతమందికి ఇష్టం లేనిది ఇంకొకటి కూడా వుంది – రాత్రి తొమ్మిదిన్నరకే దీపాలు ఆర్పేసి పడుకోవాలి, అని బాబా చేసిన ఆజ్ఞ. ఒకామె మధ్యాహ్నం భోజనం అయిన తరువాత రికార్డులు వేసుకుని సంగీతం వినాలనుకుంటుంది. అప్పటిదాకా పనిచేసి వచ్చిన నొరీనా పాపం కాస్సేపు విశ్రాంతిగా పరుండా లనుకుంటుంది. ఆమె గది అందరూ కూర్చునే గదికి ప్రక్కనే వుంది కూడాను. ఈ సంగతి విని బాబా అవును భోజనం అయిన తరువాత సంగీతం వింటే అరుగుదలకి మంచిదే అన్నారు. నోయెల్ కవార్డ్ అనే వాడు – "పిచ్చి కుక్కలు, ఆంగ్లేయులు మధ్యాహ్నం ఎండలో తిరుగుతారు"– అని పాడిన పాట బాబా అప్పుడప్పుడు వేస్తూంటారు అని డెలియా జ్ఞాపకం చేసింది. అవును మరి అలాటి పాట వేస్తారంటే వెయ్యరూ - పాశ్చాత్యులు టోపీలు లేకుండా కూడా ఎండలో బయటికి పోతూంటారు. అయినా బాబా ఎప్పుడూ ఒకరి యెడల మరియొకరు దేనికయినా సానుభూతి కనపర్చాలనే చెబుతారు. ఇలాటి సమయాల్లోనే ఫిర్యాదులు చేయకుండా వుండడము, ఇంకా సహనం చూపించడము, ఆశ్రమ జీవితం సాఫీగా నడిచేలా చూడడము చాలా అవసరము, అలా చేస్తేనే బాబాకి సహాయం చేసిన వాళ్ళవుతారు.

అయినా బాబాపని అంటే వ్యక్తులలోని అహమును నిర్మూలించడమే. ఆ పని సరిగ్గా అవలేదని దానికి కారణం అందరిమీదా పెట్టకుండా బాబా సాధారణంగా ఒకరిని ఏరి వారిమీద పెడతారు ఆ దోషాన్ని, అది అందరిదీ అయినప్పటికీ, మండలిలో ఏదయినా దోషం కనబడితే చాన్‌జీని పిలిచి చివాట్లు వేసేవారు. అప్పుడు నాకేం తెలియదు బాబా అన్యాయంగా నన్ను అంటున్నారు. అని ఆ మండలి శిష్యుడు అనకూడదు. ఎందుచేత ? బాబాకు అన్నీ తెలుసును. అందుచేత ఊరుకుంటున్నట్టయితే అతడిని బాబా మౌనంగా దీవిస్తారు. అతనికి ఒక చిరునవ్వు ప్రసాదిస్తారు. అది చాలదా ? ఆ చిరునవ్వులో ఎంతయినా అర్థమున్నది. దానికి ఎంతయినా విలువ ఉంది.

మెహెర్ రిట్రీట్‌లో పాశ్చాత్య ప్రేమికులను కూర్చోపెట్టుకుని బాబా 1937 జనవరి 1 వ తేదీనాడు ఈ విధంగా ప్రసంగం చేశారు —

"ఒక సద్గురువుయెడల ప్రేమ ఎంత గాఢంగా భక్తియుతంగా వున్నా, ఆ ప్రేమికుని అసలు స్వభావానికి మార్పు రాదు. బాహ్యంగా ఎన్ని మార్పులయినా రావచ్చు. వ్యక్తి స్వభావం మాత్రం అలాగే వుంటుంది. ఆ వ్యక్తి ఆధ్యాత్మికంగా ఏడవ భూమిక చేరేదాకా అంతే. సప్తమ భూమికలో అతనికి వేరే మనసు ఉండదు. అందుచేత వ్యక్తిగత మయిన స్వభావం అంటూ వుండదు. ఈ స్వభావం చాలా శక్తివంతంగా వుంటుంది. ఒక్కొక్కప్పుడు పరిశుద్ధమైన ప్రేమను వ్యక్తం చేయబోతే శక్తికి మించిన కారణాలవల్ల చిరాకు కలిగించేదిగాను, ఇబ్బంది కలిగించేదిగాను తయారవుతుంది ఆ స్వభావం. అందుచేత నా ప్రేమికుల యొక్క ప్రేమ నిర్మలంగా వుండాలంటే వారిలో వున్న అసూయ, గర్వం మొదలయిన నీచ గుణాలు పైకి రాకుండా నా హాస్యరసంతో అణిచెయ్యాలి. లేక పోతే అవి పైకి విజృంభించే అపాయం వుంది. అలా జరిగితే విరోధ భావాలు పెచ్చుపెరుగుతాయి. ఆ విధంగా నా పనికి అడ్డంకి కూడా ఏర్పడుతుంది."

ఇలా వుంటూ వుండగా ఒక రోజున మెహెర్ రిట్రీట్‌లో ఉన్న పాశ్చాత్య శిష్యుల నందరను పిలిచి సమావేశపరచి బాబా ఈ విధంగా ప్రసంగించారు —

"నేను చెప్పే ఉపన్యాసం జాగ్రత్తగా వినండి."

"నేను ఈ ఉదయం చెప్పినట్లుగా మనం చచ్చిపోవడం ప్రారంభించడానికి సమయం అయింది. చచ్చిపోవడం అంటే మామూలు అర్థం ప్రకారం ప్రాణాలు పోగొట్టుకోవడం కాదు. మనలోని ఇంద్రియాలకున్న కోరికలను చంపుకోవడమన్న మాట. ఉన్నది అంతా ఆనందమయినా కానీ అందరూ దుఃఖాక్రాంతులై వున్నారు; అజ్ఞానంచేత అలా వుంటున్నారు. ఈ అజ్ఞానమే కోరికలను కలుగజేస్తోంది అయినా ప్రతివాని గమ్యము కూడా కోరికలు లేని స్థితిని పొందడమే."

"మీరు ఎన్నో లక్షల పదార్థాలవి కావాలంటారు. ఇది కావాలి అది కావాలి అంటారు. ఏదయినా కావాలన్నప్పుడు దుఃఖప్రాప్తి తప్పదు. అందుకని మీరు శాయశక్తులా ప్రయత్నించి ఇంకా అధికంగా ప్రేమించండి. అప్పుడు మీ అవస

రాలను మించినవి మీరింకా కొద్దిగానే కావాలంటారు. బాగా శ్రద్ధగా ప్రయత్నించండి, మీరు ఏదీ కావాలని కోరకపోతే నిజంగా అది ఆనందమే. కాని మీరు ఎరుకతో ప్రయత్నించాలి. తెలివిలేకుండా వున్న రాయిలాటి దానికి ఏ కోరికా వుండదు. రాయి ఏమీ కావాలంటుంది? దానికి ఏమీ అక్కరలేదు. కాని దానికి చైతన్యం లేదు. చైతన్యంతో వుండి ఏదీ అక్కర్లేని స్థితి రావాలి.

"మనం 'చచ్చిపోవడం'తో ప్రారంభించుదాము. కోరికలు ఉన్నకొలదీ దుఃఖం ఎక్కువ అవుతుంది. నీ జీవితం అంతా నీవు ఏమీ కోరావో ఒక్క అయిదు నిమిషాలు ఆలోచించి చూస్తే, నీకు ఏమి లభించిందో, నీకు ఏది రాలేదో పరిశీలించి చూడు. జీవితం నీకు తృప్తి నిచ్చిందేమో చూడు. ఇన్నాళ్ళు నీ జీవితంలో అనుభవించిన సుఖం ఈ రోజున ఏదీ? – ఏమీలేదు సున్న. నీవు అనుభవించిన బాధ, కష్టము కూడా అంతే. ఈ రోజున ఏమీ లేదు. అదంతా మాయ. మనం ఆనందంగా ఉండడం మన హక్కు అయినప్పుడు మనం దుఃఖానికి ఎందుకు పాల్పడాలి. అదీ ఇదీ కోరుకుని? ఏదీ కోరకండి; హాయిగా ఉండండి. ఏదయినా కోరినపుడు నీకు ఏమీ తోచదు కోరినది సిద్ధించేదాకా. నీ కోరిక తీరకపోతే నీకు ఆశాభంగం తప్పదు. నీకు ఈ ఆశాభంగం కలిగినపుడు "ఛా! ఎందుకు కోరుకున్నామురా" అనిపిస్తుంది. ఏదయితే నీ అన్ని కోరికలను రూపుమాపుతుందో దాన్ని నీవు కోరుకోవాలి. ఐక్యంకావడంకోసం వాంఛించు. ఎంత సులభం! మీ హృదయపూర్వకంగా ప్రయత్నించండి. ఊరికే 'అలాగే' అనకండి. అలా అని ఏమీ ప్రయత్నించకుండా వుండవద్దు. ఇప్పుడే మీరు శ్రద్ధగా ప్రారంభించండి. మీరు అన్యోన్యంగా ఒకరి నొకరు ప్రేమించుకోలేరు. సరేకాని ఎదటివారు చెప్పినట్లు ఒప్పుకుని మీ స్వంత అభిప్రాయాన్ని నెట్టివేయడాని కయినా ప్రయత్నించండి. ఇది కూడా మీరు చేయరు. ఎందుచేత? మీరు నిజాయితీగా లేరు గనుక, అందుకనే ఆ పిచ్చి ఆశ్రమంలోని వారిని నేను అంతగా ప్రేమిస్తాను. వారి పిచ్చిలోనే వారు ఎంతో నిజాయితీపరులు. మీరు ఎంతో దూరాన్నుంచి నన్ను ప్రేమించడానికి నన్ను సాక్షాత్కరింప చేసుకోడానికి వచ్చేరు. కాని కోడిపుంజుల్లా దెబ్బలాడుకుంటారు. మిమ్మల్ని నేను వదలిపెట్టేసి ఏ నేపాల్ దేశానికో వెళ్ళిపోవాలని ఉంది నాకు. లేకపోతే మిమ్మల్నందరినీ హిమాలయ పర్వతాల్లోకి పంపించేస్తాను. అందుచేత మీరు తక్కువ కోరుకోవడం ఆరంభించండి. ఎక్కువ ప్రేమించడానికి ప్రయత్నించండి. ఎక్కువ సహనం చూపడానికి ప్రయత్నించండి. ఇది అంతా మహనీయమైనది. అయినా

ప్రతివారు విచారంగాను, దుఃఖంగాను, బాధతోను ఉంటున్నారు. ఏం మీరంతా 'చచ్చిపోడానికి' ప్రారంభిస్తామని మాట యిస్తారా ?"

అని చివరన బాబా అడుగగానే అందరూ ప్రయత్నం చేస్తామన్నారు.

"మీ అందరిలో సమరస భావం లేకపోతే. మీరు 'చావ'డానికి ఇష్టపడక పోతే మిమ్మల్నందరిని ఇక్కడనుంచి వెళ్ళిపొమ్మనడమే ఇంతకన్న మంచిది. మీరు ఇక్కడికి పేరుకోసం రాలేదు. కీర్తికోసం రాలేదు. (బాబాకి ఎంతోమంది శిష్యులున్నారు. ఆయనకి ఎవరూ అక్కరలేదు. నేను ఎప్పుడూ ఏకాకినే, ఏకాకిగానే ఉంటాను. మీకే నేను కావలసి వస్తాను. మీరు దేవుడు అయిపోయే వరకు నేను మీకు అవసరం వుంటాను.) మరి మీరు ప్రయత్నించకపోతే ఏమి ప్రయోజనము ?

"ఇప్పుడు అందరం ఉల్లాసంగా ఉందాము. మీరు గనక శారీరకంగా బలంగా ఉంటే మిమ్మల్ని అసలు భారతదేశాన్ని చూడడానికి రిషీకేశ్ తీసికెడతాను." —

ఒక రోజున నోరీనా భోజనాల ప్రశ్న ఎత్తింది, ఇంతమందికీ భోజనం తయారుచేసి పెడుతూ ఇంకా పొదుపు చేయడం ఎలాగ ? భోజనానికి ఎవరు ఎప్పుడు వస్తారో ! అసలు వస్తారో రారో కూడా తెలియదు. మనం భోజనం ఎక్కువ చేస్తూండబట్టిగా ఒకపూట భోజనం మానేస్తున్నది ? అని అడిగింది ఆమె. బాబా అన్నారు—"ఈ అభిప్రాయం ఆమెదే. ఆ పద్ధతి ఆమెకు సరిపడవచ్చు. అందుకని అది అందరిమీద రుద్దితే ఎలాగ ?" బాబా అందరినీ భోజనాలు ఎలా వుండాలీ అన్న సంగతి మీద అందరి అభిప్రాయాలూ అడిగారు.

"మీరంతా 'చని'పోవడానికి ప్రయత్నం చేస్తామని వాగ్దానం చేశారు. అందుకు మనం భోజనంతో ప్రారంభిద్దాము. ఇంక భోజనం గురించి ఏ విధమయిన పోట్లాటలూ ఉండకూడదు. నోరీనాను ఇదివరకు లాగే చేసిపెట్టనియ్యండి. నోరీనా ! అందరూ చెప్పినట్లు నీవు ఎంతో బాగా చేస్తావు కాని నీలో లోపం ఏమిటంటే-నీలో మృదుత్వంలేదు. కుండ బద్దలు కొట్టినట్లు మాట్లాడతావు. అందరికీ తల్లి స్థానంలో వున్న నీవు ఇంకా ఓర్పుతో మృదువుగా మాట్లాడు. అందరు చెప్పేది నెమ్మదితో విను వాళ్ళు చెప్పినట్లు చేయగలిగితే మంచిదే. లేదన్నావూ వాళ్ళని ముద్దుపెట్టుకుని 'వీలు లేదు' అని మృదువుగా చెప్పు. అలా నేర్పుగా వుండాలి. అంతేకాని ఉన్నది ఉన్నట్టుగా ముఖంమీద చెప్పేస్తే కొంతమందికి కష్టంగా వుంటుంది ఒక్కొక్కప్పుడు. అలా జరుగకూడదంటాను నేను. అందుచేత అందరూ శ్రద్ధగా సామ

రస్యంగా ఉండడానికి ప్రయత్నించడానికి ప్రారంభించండి. లేకపోతే నేను గట్టిగా చెపుతున్నాను మీరు వెళ్ళిపోవలసి వస్తుంది. మీ ప్రయత్నంలో మీరు నిజాయితీ చూపండి (అందరిమధ్యా సామరస్యం, ప్రేమ, శాంతము ఉండాలి. అవి నిజంగా ఉత్పన్నం కావాలి. బలవంతంగా తెచ్చిపెట్టుకోడంకాదు. హృదయ కవాటం తెరచి వుంచండి. మూసెయ్యకండి. నాకు ఇష్టమయినపుడు నేను అందులో ప్రవేశించాలి. నేను ఎప్పుడు మీ హృదయంలో ప్రవేశిద్దామనుకున్నా తలుపులు వేసివుంటున్నాయి.— ప్రయోజనంలేని కోరికలతో

(అల్ప విషయాలు, మీ శక్తిని, ఆలోచనలని, మీ సమయాన్నీ తీసుకుంటాయి. ప్రేమించండి ఎల్లప్పుడు ప్రేమించడానికి ప్రయత్నించండి. అదే కావలసింది.) నారీనా మీకు ఇష్టంలేనట్లు మాట్లాడిందే అనుకుందాం. ఆమెను మీరు ఇంకా ఎక్కువగా ప్రేమించాలి. మీ ప్రేమ ఆమెకు కావాలి. మీ కోరికలలో మీరు బలహీనంగా ఉన్నట్లు కనపడితే ఆమెకూడా మిమ్ము ప్రేమించాలి. ఆమె ప్రేమ మీకు కావాలి

తల్లి పిల్లవాడికి జబ్బుచేసినా, బలహీనంగావున్నా ఆమె వానిని ఇంకా ఎక్కువగా ప్రేమించి లాలిస్తుంది. మీలో ఎవరయినా బలహీనంగా వుంటే మిగిలినవారు ఆమెను లేక అతనిని ఎక్కువగా ప్రేమించాలి. బలహీనం అంటే కోరికలు కలిగి ఉండడమన్నమాట. కోపం బలహీనాన్ని సూచిస్తుంది. గర్వంకూడా దుర్బలత్వమే. అందుకని అందరూ ప్రయత్నించండి, కాకా చెప్పినట్లు "నో డిస్కస్, జస్ట్ ట్రై" (చర్చించవద్దు, ప్రయత్నించండి) — అంతే.

"ఈ వేళనుంచి మీరందరు ఒక్కొక్కరు ఏకాంతంగా మౌనంగా ఒక్క అయిదు నిమిషాలసేపు కూర్చుని మీ అంతరంగం లోపలికి చూచుకోవాలి. ఈ అయిదు నిమిషాలు ధ్యానం చేయడంకాదు. అది 'లోజూపు' అన్నమాట. ఇది ఎలాగ చేయడం ? "ఒకచోట అన్ని అవయవాలు సడలించి కూర్చోండి. దేని గురించీ ఆలోచించవద్దు — బాబాను గురించికూడా. కళ్ళుమూసుకోండి. మానసికంగా లోపలికి చూసుకోండి. మీరు మీలోపల 'అనంతులము' అని అనుకోండి. మీరు అనంతంగా వున్నారన్న అభిప్రాయం అయిదు నిమిషాలు ఉండనియ్యండి మీరు అనంతులమని ఎలా ఊహించుకుంటారు ? ఆకాశంలాగా అనంతంగా, సముద్రంలా, ఏమీలేని

విశాలాంతరాళంలా ఊహించుకోండి. ఈ ఒక్క ఆలోచనే మీ మనస్సులో ఉండాలి—లోపల మీరు అనంతులని తెలిసిందా ?

"ఈ రోజునుంచి ప్రతిరోజు ఒక్క గంట ధ్యానము ఒక్కొక్కరు నేను చెప్పినట్లుగా చేయాలి. నేను ఇక్కడ వున్న రోజులలో ప్రతి సాయంకాలము ఒక్క అరగంట నా సమక్షంలో మౌనంగా కూచోవాలి. ఇదిగాక నేను చెప్పిన అయిదు నిమిషాలు ఆ ప్రకారంగా ఉండాలి. మీకు నేను సహాయం చేయడానికి. మీకు ఇద్దామనుకున్నది నేను ఇయ్యడానికి ఇది చాలా అవసరం," అని బాబా వివరంగా పాశ్చాత్య శిష్యులందరికీ చెప్పారు.

బాబా ప్రతి సోమవారము నాసిక్‌లో వుంటారు. ఉదయం 8 గంటలకు రాహూరిలో బయలుదేరి 11 గంటలకు నాసిక్ వస్తారు. ఆ రోజంతా అక్కడ వుండి మర్నాడు మంగళవారము ఉదయం 10 గంటలకు రాహూరికి బయలుదేరి అక్కడ 1 గంటకు చేరుకుంటారు.

ప్రతి బుధవారము బాబా మెహెరాబాదు వెడతారు. రాహూరిలో ఉదయం 8 గంటలకు బయలుదేరి మెహెరాబాద్‌కి 9 గంటలకు చేరుకుని మూడు గంటలదాకా వుండి మరల 3 గంటలకు బయలుదేరి రాహూరి 4 గంటలకు తిరిగి వస్తారు.

నాసిక్ నుంచి పాశ్చాత్య ప్రేమికులంతా ప్రతి శుక్రవారము మెహెరాబాద్ వస్తారు. వారితో ఆ రోజు బాబా అక్కడ గడుపుతారు బాబా రాహూరి నుంచి శుక్రవారంనాడు 10 గంటలకు బయలుదేరి 11 గంటలకు మెహెరాబాదు వచ్చి పాశ్చాత్యులతో సాయంకాలం 4 గంటలదాక వుండి మరల బాబా 5 గంటలకు రాహూరి వచ్చేస్తారు.

శిష్యులందరు నాసిక్ నుంచి శుక్రవారంనాడు తెల్లవారుజామున 5 గంటలకు బయలుదేరి రాహూరివెళ్ళి బాబాను కలుసుకోవాలి. రాహూరిలో బాబాతో 10 గంటల దాకా వుండి మస్తు ఆశ్రమంలో మస్తులతో బాబాచేసే పనిని గమనిస్తారు. పాశ్చాత్య ప్రేమికులు. బాబా చెప్పినట్లుగా వారు ఆయన పనిలో పాల్గొంటారు. పది గంటలకు బాబాతో కలిసి మెహెరాబాద్ వెళ్ళి అక్కడ సాయంకాలం 4 గంటలదాకా ఉంటారు. పాశ్చాత్య పురుషులు భారతీయ పురుష మండలితోను, స్త్రీలు స్త్రీ మండలితోను ఉంటారు. ఈ కార్యక్రమం ప్రకారం జరగాలని బాబా నిర్ణయించి శిష్యులందరితోను చెప్పారు.

ఆశ్రమవాసుల పనులు :

పాశ్చాత్యులందరికి రంజూ అబ్దుల్లా ప్రతిరోజు ఉర్దూభాష నేర్పుతున్నాడు. వారంతా శ్రద్ధగా ఓర్పుతో నేర్చుకుంటున్నారు. కాని కొంతమందికి భాష రావడం లేదు. వారంతాకూడా బాబా పుట్టినరోజు పండుగకు బాబా ఆదేశం ప్రకారం పొట్లాలు తయారు చేయడంలో సహాయం చేసేవారు.

నొరీనా వంటయింటి యాజమాన్యం వహించినా తెచ్చిన పదార్థాలకి దానికి అయిన ఖర్చులకు లెక్కలు వ్రాయడానికి ఎలిజబెత్ సహాయంచేసేది. మన దేశపు రూపాయి అణా పైసల్లో వ్రాయడం ఆమెకి కష్టమయేది.

ఎలిజబెత్ ఇంకా బాబావద్ద ఉన్న రెండు కుక్కలను జాగ్రత్తగా పోషించాలి. పెద్దది కాన్యూట్ అని అందమైన తెల్ల సైబీరియన్ కుక్క. ఆ చుట్టుప్రక్కల ఉన్న కోళ్ళని తరుముకెళ్ళకుండా దాన్ని చూసుకోవాలి. రెండో కుక్క బోస్టన్ టెర్రియర్ జాతి కుక్క చిన్నది. చక్కగా వుంటుంది. దానిపేరు కిప్పి. కొన్ని నెలలయాక బాబా వెళ్ళిన తరువాత ఆయన మంచంవద్ద కిప్పి రెండురోజులు తిండి తినకుండా పడివుంది – పాపం ఆయన కోసం బెంగ పెట్టుకుని.

నడీనె టాల్‌స్టాయ్ బాబా జీవితము, సందేశములు, ఆయన బోధలు రష్యన్ భాషలోకి అనువదిస్తూ రోజూ మూడు గంటలు గడిపేది. తరువాత నొరీనాకు వంట పనులలోను, రువానోకి పక్షులను పోషించడంలోను సహాయం చేసేది. ఆ పక్షులను మార్సెల్స్ నుంచి పాశ్చాత్య ప్రేమికులు తెచ్చారు. కాని పాపం దేశం వాతావరణం మార్పువల్ల కాబోలు అవి బ్రతకలేదు. నానీ గేలీ టైపింగ్ పనిచేసేది. కిట్టీడేలీ బాబా చెప్పిన ప్రవచనాలు, ఆయన ప్రసంగాలు షార్ట్‌హాండ్‌లో వ్రాసినవన్నీ టైపుచేసేది. మార్గరెట్ క్రాస్కి బాబా చెప్పిన ప్రకారం రోజూ మూడుగంటలసేపు నాట్యం అభ్యాసం చేసేది. దానికి సంబంధించిన పనిచేసేది. డెలియా ప్రతిరోజు తోటలో ఉన్న మొక్కల సంరక్షణ చేసేది. ఆమె ఇంకా మార్గరెట్‌కి సహాయం చేసేది. తోటలో ఒకనాడు ఆమె ఒక మల్లెపొద వుంటే సమూలంగా పీకిపారేసింది. అక్కడ కాపురంవున్న రుస్తుం అదిచూచి చాలా విచారించాడు. ఎందుకిలా తీసేశావు అని అడిగితే మల్లెపూల వాసనకి పాములు వస్తాయటకదా ! అంది. నీ వేమయినా పాములు రావడం చూసావా అంటే లేదని చెప్పింది.

రానో ఆధ్యాత్మిక విషయాలు బాబా చెప్పినట్లు బొమ్మలలో చిత్రించేది. ఆమెకు జబ్బు చేసినందున ఆరు వారాలపాటు ఆ పని నిలిచిపోయింది. బాబా ఆమె ఆరోగ్యం ఎలా వుందని ఆమెను రోజూ రెండు మూడుసార్లు వెళ్ళిచూచి అడిగే వాడు. తరువాత "రానో చచ్చిపోయేదే ముందు ఆమె చేయవలసిన పనికోసం బ్రతికించా"నని బాబా చెప్పారు. తరువాత రానో డాక్టర్ డాన్‌కిన్‌తోపాటు బాబా ఆశ్రమంలో ఇండియాలో వుండిపోయింది.

విల్ బాకెట్ ప్రతిరోజు యూరప్‌లోని బాబా శిష్యబృందాలకి ఉత్తర ప్రత్యుత్తరాలు వ్రాస్తూ వుండేవాడు. వంట్లో ఓపికవుంటే ఇంకా ఇతర పనులేవయినా చేసేవాడు.

మేరీ బాకెట్ లండన్ నుంచి ఆమె మగ్గం తెచ్చుకుంది. దానిమీద ఆమె బట్టలు నేస్తూంది. మార్గరేట్ నాట్యం చేస్తూంటే కిట్టీదేవీ పియానో వాయించేది. తరువాత ఫ్రెనీ కుమార్తె మెహరాకి కిట్టీ పియానో వాయించడం నేర్పేది. కిట్టీ నోరీనాకు యింటిపనులలో సాయపడేది కూడ.

గారెట్ ఫోర్ట్, మాల్కొమ్ స్కాస్ వీరిరువురు పత్రికపని చేస్తూండేవారు-వారికి కార్యదర్శిగా జీన్ పని చేస్తూండేది. జీన్ మాల్కొమ్‌లు ఆధ్యాత్మిక రచనలతో రోజుకి రెండు గంటలు గడిపేవారు.

బాబా పత్రికపేరు 'అవతార్' అని పెట్టారు. కాని తరువాత 1939-40 సంవత్సరంలో మెహెర్ జర్నల్ అని మార్చేరు. మాల్కొమ్ తన జీవితం అంతా ఆధ్యాత్మిక గద్యపద్య రచనలతో గడిపేడు. కాని గారెట్ హాలీవుడ్‌లో ఉండినందు వల్ల అక్కడ అంతా ఆడంబరమైన ప్రకటనలు చూస్తూ చేస్తూ ఉండినందున మాల్కొమ్‌తో అతనికి తరుచు ఏకాభిప్రాయం ఉండేది కాదు. బాబా రెండు వైపుల వాదాలని వినేవారు. కాని రెండూ కూడా కొట్టిపారేసి ఆయన చేయవలసినతీరు వాళ్ళకి చెప్పేవారు.

వారిలో ఎవరికయినా భేదాభిప్రాయాలు తీవ్రంగా వున్నప్పుడు రెండు మూడు గంటలసేపయిన తరువాత వారి కోపతాపాలు చల్లారేక పిలిచేవారు బాబా. ఇరువురి అభిప్రాయాల్లోనూ మంచి అంశాలు తీసుకుని ఇద్దరికీ రాజీకుదిర్చేవారు. ఆఖరున బాబా ఇద్దరినీ ఒండొరులు కరచాలనం చేసుకొని కౌగలించుకునేదాకా ఆయన వదిలే వారు కారు. ఇద్దరినీ ఈ విధంగా మరల స్నేహితులనుగాచేసి పంపేవారు.

## బాబా తీర్పు విధానం :

నాసిక్‌లోవున్న పాశ్చాత్య స్త్రీలు ముగ్గురికి బాబా తాలియా, అగలైయా, యూఫ్రోసిన్ అని పేర్లు పెట్టారు. తాలియా, అగలైయా ప్రక్క ప్రక్కని వున్న గదులలో బసచేశారు. ఒకరియెడల ఒకరికి సానుభూతిలేదు. వీరికి నలుగురితో కలిసి మెలిసి ఉండే అలవాటులేదు. ఇదివరదాకా స్వతంత్రంగా జీవించారు. ఒక రోజున తాలియా అగలైయా మనసుకు నొప్పి కలిగేలా క్రూరంగా ప్రవర్తించింది. దానికి కారణమేమీ కనుపించదు. యూఫ్రోసిన్ ఈ సంగతి అంతా తెలుసుకుంది. ఆమెకు తాలియామీద కోపం వచ్చింది. వెంటనే ఇది మానిపించెయ్యాలని ఏడుస్తూ వెళ్ళి బాబాకు అంతా చెప్పేసింది. మామూలు గురువయితే తాలియాను పిలిచి చివాట్లు పెట్టేవాడే. కాని బాబా అగలైయాకు కబురుచేసి పిలిపించారు. ఆమె రాగానే ఆమె కేసి తీక్షణంగా చూశారు బాబా. చూసి ఆమెతో —

"చాలా మారులు నీవు నీ అహంకారాన్ని పోగొట్టమన్నావుకాదూ నాతో. అలా చేయడం నీకు యిష్టమా కాదా?"

"నాకు ఇష్టమే బాబా!"

"మరి తాలియా ఏదో అన్నదని నీ మనసుకు ఎందుకు కష్టం కలగాలి? ఇలాటి అవకాశాలు అందుకేగా మరి? తాలియాచేత నేనే అలా అనిపించాను. నేను పని చేసే విధానమిదియని నీకు తెలియదూ?" —

"జ్ఞాపకం వుంచుకో! ఇకముందు ఎవరయినా నీకు కష్టం కలిగిస్తే, నీ మనసుకి నెప్పి కలుగజేస్తే అది నేనే చేసేనని గ్రహించాలి ఎవరయినా నిన్ను చూసి నవ్వితే నేనే నవ్వుతున్నాననుకోవాలి. ఎవరయినా నిన్ను ప్రేమగా చూస్తే అది నేనే అని తెలుసుకో. నీవు ఎవరినయినా ప్రేమిస్తే నన్నే ప్రేమిస్తున్నావన్న మాట. నేను అన్నిటిలోనూ అందరిలోనూ వున్నాను. నిన్ను సంతోషింపజేసిన వారిలో ఉన్న నన్ను ప్రేమించి, స్వాగతంచెప్పి, నిన్ను దూషించిన వారిలో ఉన్న నన్ను ద్వేషిస్తే నా దివ్యసాన్నిధ్యం ఎలా పొందగలవు నీవు?"

బాబా మాటలువిని అగలైయా "సరే బాబా మంచిది. అలాగే ప్రయత్నం చేస్తాను" అని వెళ్ళింది.

బాబా నలభై రోజులు ఉపవాసం ప్రారంభించారు. ఆ రోజు అయిదవరోజు. బాబా ఏదయినా ప్రత్యేకంగా ప్రారంభిస్తే అయిదవ రోజున ఏదో జరుగుతుందని వారి శిష్యులెవరో అన్నారు. ఆ రోజున పాశ్చాత్య స్త్రీలలో జీన్‌కి చాలా తలనెప్పి ఎక్కు

వగా ఉండడంచేత ఆమె ఉదయం టీ తన గదిలోకే తెప్పించుకుంది. టీ అంటే అన్నీ వేరే వేరే పింగాణీ పాత్రలలో తెస్తే ఆమె కలుపుకుంటుంది. అది వాళ్ళ ఆచారం. ఆమె చాలా సన్నని గౌను ధరించివుంది. టీ పళ్ళెం ఒళ్ళో పెట్టుకుని టీ కలుపుకుందామనుకుని చేసుకోబోగా ఉడుకుడుకు నీళ్ళున్న పాట్ ఆమె ఒడిలో తిరగ బడిపోయింది. పాపం నీళ్ళు చాలా వేడిగా వున్నందువల్ల గౌను చాలా సన్నబట్ట అయినందువల్ల వొళ్లు కాలింది. చాలా బాధ కలిగింది ఆమెకు. ఎవరూలేరు అక్కడ. బాధ ఓర్చుకుంటోంది.

బాబా అప్పుడు రాహూరిలో వున్నారు. అందరూ టీ త్రాగిన తరువాత మాల్కం జీన్ గదికి వచ్చాడు. ఈ సంగతి తెలుసుకుని బాబాకు వెంటనే ఫోన్ చేశాడు. ఈ వార్త విన్నవెంటనే బాబా "ఆమె ధైర్యంగా వుందా?" అని అడిగారు. బాబా పంపించిన డాక్టరు ఒకగంటలో వచ్చాడు. ఏవో మందు వేశాడు. బాబా శిష్యులలో ఇలాటి పరిస్థితులలో ప్రధానంగా వుండవలసింది ధైర్యం.

జీన్‌కి గతరాత్రి ఒకస్వప్నం వచ్చింది. అందులో ఆమెకు ఎక్కడో కాలినట్లు అనుభవం అయింది. కలలో కలిగిన అనుభవం ఇప్పుడు నిజమయింది. ఆమెకు కొద్దిరోజులలో బాధ తగ్గిపోయినా నరాలకు తగిలిన షాక్ కొన్ని వారాలదాకా వుంది. ఈ ప్రమాదాన్ని గురించి బాబా ఆధ్యాత్మికంగా దాని ఫలితం చాలా గొప్పగా వుంటుందన్నాను.

ఇందువల్ల జీన్‌కి అవగాహనశక్తి సహనశక్తి ఎక్కువయింది. ప్రేమ, మానవ సంబంధాలలో సన్నిహితత్వము కూడా ఆమెలో బాగా వికసించాయి. ఆ సాయంత్రానికే బాబా వచ్చారు.

ఆ రోజునే మాల్కం, ఇంకొకరు వారిమధ్య ఏదో మాటా మాటా పెరిగి ఇరువురు తిట్టుకున్నారు. బాబా వారిద్దరినీ పిలిచి ఏం జరిగిందో వివరంగా చెప్పమన్నారు వేరేవేరే. ఈ యిద్దరు చెప్పిందీ విని ఎవరివల్ల ఎక్కడ తప్పు వుందో జీన్‌ని చెప్ప మన్నారు. మాల్కం ఆమె భర్తయే అయినా ఆమెలో ధైర్యం పుంజుకుని ఎవరివల్ల ఎక్కడ తప్పు జరిగిందో చెప్పింది.

దీనివల్ల బాబా ఆమెలో చైతన్యంద్వారా ఆమె ఉద్వేగాలద్వారా ఏదో కనిపించని పని చేశారు. భయంలేకపోవడం ఆమెకి అలవాటు చేశారు. తాను ప్రేమించిన భర్తకి అయిష్టంగా ప్రవర్తిస్తే ఏమి జరుగుతుందో అనే భయాన్ని ఆమె జయించ

గలిగింది. ఆమె మాల్కంలో కలిగించిన బాధ ఆమెకూ అతనికీ కూడా బాబా మంచిగా పరిణమింపజేశారు. నిష్పాక్షికంగా జీన్‌ను మాట్లాడ గలిగేలా ఆయన చేశారు. తన తప్పు తెలుసుకునేలా మాల్కంను చేశారు.

కొంతసేపటికి ఉద్వేగాలు చల్లారిపోయాయి. బాబా అప్పుడు ఆమె వద్దకు వెళ్ళారు. వెళ్ళి ఆమెకేసి చూడడంతోనే ఆ చూపులోనే తన రోగి ఎలావుందో చూడ టానికి వచ్చిన వైద్యుడులా వున్నారు బాబా. బాబాను అప్పుడు జీన్ ఇలా అడిగింది

జీన్ - కేవలం విధేయత మూలంగా భగవంతుని ప్రేమించడం సాధ్యమా? భావాలు ఏమీ లేనప్పుడు?

బాబా - (చిరునవ్వు నవ్వారు - శస్త్రచికిత్స జయప్రదమైనది. రోగికి ప్రాణ భయం లేదన్నట్లుగా ఆయన నవ్వుకుని ఇలా జవాబు యిచ్చారు.) - అది ప్రేమ వ్యక్తం చేయుటకు ఉత్తమోత్తమమైన మార్గం.

బాబా మండలిలో ఒకడు ఒకమారు బాబాను ఇలా అడిగాడు - మండలిని కారణం కనిపించకుండానే ఇన్ని కష్టాలుపడేలా ఎందుకు చేయాలి?

అప్పుడు ఆయన జవాబు యిచ్చారు - "నా విశ్వకార్యానికి ఒక్కొక్కప్పుడు మీ ఉద్వేగాలలో ఉన్న శక్తి అవసరమౌతుంది. అది నాక్కావాలంటే ఒకరిలో గాని ఇంకా ఎక్కువమందిలో గాని ఉన్న ఉద్వేగాలను పైకి వచ్చేలా చేయాలి. ఈ పనికి నా మండలిని కాకపోతే ఇంకెవరిని ఉపయోగిస్తాను?" బాబాచేసే ఈ పనివల్ల బాబా కార్యానికి వారు తోడ్పడటమే గాక వారికి కూడా ఇందువల్ల మంచి జరుగుతుంది.

ప్రతినెల పత్రికలోను బాబా ఒక ప్రవచనంచెప్పి ప్రచురింపజేయాలని నారీనా పట్టుపట్టింది. దీనివలన పత్రిక అందరికీ నచ్చింది.

బాబా ఎవరినీ సోమరులుగా పనిలేకుండా ఉండనిచ్చేవారు కాదు. బాబా ఏదయినా పనిచెస్తే అది ఎంతో ఉత్సాహంగా చేసేవారు. బాబా జీవిత విధానంలో ఉత్సాహం ఎంత ప్రధానమైనదో తెలిసికోకుండా బాబా సన్నిధానంలో ఉండలేరు. బాబావల్ల కలిగే ఉత్సాహం దిగులుని, నిరాశని పోగొట్టి శక్తిని ప్రసాదిస్తుంది.

కాని ఇది ఒక్కటే చాలదు. బాబా కావాలనేది అందరిలోనూ సమరసభావం. "ఒక మనిషిని స్వార్థపరత్వం నుంచి తప్పించి నిస్వార్థపరునిగా ఒనరించడం సృష్టి కార్యం కంటె కూడా ఎక్కువ కష్టమయినది" అని బాబా అంటారు. మూర్ఖత్వము

మంపతనమును పోగొట్టి శిష్యులను మెత్తని మనసు కలవారినిగా చేయడము అలాంటిదే.

బాబా ఇచ్చిన పనులలో అది ఎటువంటి పనైనాసరే ఇంకొకదానికంటే అది ఎక్కువ అనుకునేందుకు వీలులేదు. ఒకరు ఇంకొకరికంటె ఆధ్యాత్మికంగా ఎక్కువ అభివృద్ధిగాంచిన వారు. అందుకనే బాబా వారికి అలాటి పని చెప్పేరు. అని అనుకుంటే ఆ రోజునే బాబా అలాటి అభిప్రాయాన్ని తొలగించేవారు.

## రాహూరీ మస్తు ఆశ్రమం :

1936 డిసెంబరు 29వ తేదీన పాశ్చాత్య ప్రేమికులు నాసిక్ మెహెర్ రిట్రీట్ నుంచి ఉదయం 5 గంటలకే చీకటిలో కార్లలో బయలుదేరి రాహూరీ మస్తు ఆశ్రమం చూదామని వెళ్ళారు.

రాహూరీ అహమద్‌నగరానికి ఉత్తరంగా 30 మైళ్ళ దూరంలో వుంది. ఆ గ్రామం ప్రక్కనుంచి గోదావరినదియొక్క ఉపనది ప్రవహిస్తోంది. రాహూరీలో బాబా నెలకొల్పిన 'పిచ్చి ఆశ్రమం' నారింజ, మామిడి తోటలమధ్య వుంది.

రాహూరీ చేరేసరికి ఉదయం 8 గంటలయింది దారిలో కార్లు వెడుతూంటే అనేక గ్రామాలు కనిపించాయి. రోడ్డుకి ఇరువైపులా పంట చేలు, కూరగాయల పొలాలు పచ్చగా కంటికి ఇంపుగా వున్నాయి. కొన్నిచోట్ల వంతెనలు లేకపోబట్టి అడ్డంగా ప్రవహించే ఏరులుదాటి వెళ్ళవలసి వచ్చింది. రాహూరీకి చేరిన తరువాత పేక బెత్తాలతో తయారుచేసిన ఒక గేటు రెండువైపులా రాతిస్తంభాలకి అమర్చబడి వున్నది కనిపించింది. కార్ల బూరాలు వినగానే గేటు తెరువబడింది. లోపలికి వెళ్ళగానే ఇరువైపులా పెద్ద కుటీరాలున్నాయి. అందులో ఒకదాని ముందు వసారాలో మండలి పరివేష్టితులై బాబా వున్నారు. ఆయన మామూలుగా ధరించే తెల్లటిసద్రా వేసుకొని దానిమీద లేతరంగు ఎర్రనికోటు తొడుగుకొని ఉన్నారు. అక్కడవున్న శిష్యులు చాలా సంవత్సరాలుగా బాబాతో ఉన్నవారే. వారిలో ప్లీడర్ అనే అతడుకూడా ఉన్నాడు. ఇతడిని బాబా ఆశ్రమానికి నిర్వహణాధికారిగా నియమించారు. ప్లీడర్ పొడుగయిన ఒక సుందర పురుషుడు. పేరుకి ప్లీడరుకాని అతను వృత్తికి ప్లీడరుకాదు. అతడు రాహూరీలోనే ఒక బ్యాంకులో ఉండేవాడు. ఇతనికి బాబా అనేక నియమాలు విధించి పరీక్షలు పెట్టారు. అతడు అన్నిటిలోను జయించాడు. సుమారు అయిదేళ్ళ

పాటు పాలమీదనే జీవిస్తూ ఇంకేమీ తినకుండా వున్నాడు. ఎవరికి ఎటువంటి పరీక్ష పెట్టాలో బాబాకి బాగా తెలుసును.

బాబా తన పాశ్చాత్య భక్తులకి స్వాగతం యిచ్చారు. లేచి వారిని స్లీడర్‌కి ఇతర శిష్యులకి పరిచయంచేసి ఆశ్రమం చూపించడానికి వారినికూడా తీసుకువెళ్ళారు. లోపలికి వెళ్ళగా ఒక మామిడిచెట్టు క్రింద కొంతమంది పిచ్చివారు కూర్చుని వున్నారు. ఆ ఆశ్రమంలో భగవంతుడంటే పిచ్చిపట్టినవారు కొంతమంది వున్నారు. వారు అభివృద్ధిచెందిన ఆత్మలు. గురువు లేకపోవడంవల్ల వారి ఆధ్యాత్మిక ఆశయాలు, అభ్యాసాలు సరియయిన మార్గంలో వెళ్ళలేదు. కొంతమంది బాబా సాంగత్యంలో దారిలో పడ్డారు. ఒకరిని చూపి 'ఇతడు మూడవభూమికలో ఉన్నవాడు.' అని బాబా చెప్పారు. ఒక ముసలివాడు ఆనందంతో తొణికిసలాడుతూంటే అతడిని చూపి "ఇతడు పూర్తిగా పిచ్చివాడు. అయితే ఎవరికి ఏ అపకారమూ చేయడు. పూర్తిగా పిచ్చిగా వుండడం చాలా అరుదు" అన్నారు బాబా.

రాహూరికి చెందినవాడే పుంజియా అనే ఒక యువకుడు. పుంజియాని పాశ్చాత్యులకి చూపి"వీడు చాలా మంచివాడు"అన్నారు.పాశ్చాత్యులు పుంజీయాను గూఫీ అని పిలవడం మొదలుపెట్టారు.

బాబా వారందరియెడల ప్రేమను కనబరచారు. కొంతమంది చినిగిన గుడ్డలతో వున్నారు. అయినా వారిని ఎంతో మక్కువతో ఆలింగనం చేసుకున్నారు. ఇది చూస్తున్న పాశ్చాత్యులు సెయింట్ ఫ్రాన్సిస్ ఒక కుష్ఠురోగిని కౌగిలించుకోవడం గురించిన ఉదంతం జ్ఞాపకం తెచ్చుకున్నారు. ఆ యువకుణ్ణి బాబా కౌగిలించుకునేసరికి అద్దంలో సూర్యుడు ప్రతిఫలించినట్లు వాని ముఖంలో సంతోషం వెల్లివిరిసింది. అతని ముఖంలోని ఆ సంతోషం చూసేసరికి పాశ్చాత్యుల ముఖాలన్నీ వికసించాయి. బాబా అతనిని వదలి ఇవతలికి వచ్చేసరికి మళ్ళీ గూఫీ యథాప్రకారంగా ఉన్నాడు.

మస్తులలో ఒకడు ఏదో ఒకమాట పట్టుకుని అదేపనిగా ఆమాటే ఉచ్చరిస్తూ వుంటాడు. నీ పేరేమిటి? అని అడిగితే "పేరు-పేరు-పేరు" అని అంటూ ఉంటాడు. నీ ఊరేది? అని అడిగితే "ఊరు-ఊరు-ఊరు" అని ఉచ్చరిస్తు ఉంటాడు. బాబా అతని దగ్గరకు వెళ్ళేసరికి నవ్వుతాడు. బాబా ఇవతలికి వచ్చేస్తే ఏడుస్తాడు.

ఇంకొక మస్తు అసలు మాటే వినిపించుకోడు. ఎవరితోను మాట్లాడడు. వాని ప్రపంచమే వానిది.

రాహూరీ ఆశ్రమంలో వుండే మస్తులయొక్క సంగతి ఒక్కొక్కరిని గూర్చి సంక్షిప్తంగా పరిచయం చేసుకుందాము—

1) అబ్దుల్ హుస్సేన్ అనేమస్తు రోజంతా నిద్రపోతూంటాడు. భోజనం చేసేటప్పుడు అలాటి వేళల్లోనుతప్ప ఇతనిని ముల్లాజీ అని కూడా అంటారు.ఇతనికి పిచ్చివుండేది. తనలో తాను ఏదో గొణుగుకుంటూ వుంటాడు. ఇతడు రాహూరీలోనే ఆశ్రమంలో చేరాడు.

2) భిక్కు అనేవాడు ఒకడుండేవాడు. తన దగ్గరవున్న తమలపాకులు పుగాకు ఇతర మస్తులకి ఇచ్చేవాడు. వాళ్ళతో తమాషాగా మాట్లాడుతూ వుండేవాడు రాహూరీలో ఆశ్రమంలో చేరాడు.

3) దగ్డుబువా అనేమస్తు రాహూరీలో ఆశ్రమంలో చేరాడు. ఇతడు నిజమయిన మస్తు. కొత్త రోజుల్లో ఆశ్రమంలో చేరినకొత్తలో,బాగా ఎత్తుగావున్న చెట్లు ఎక్కేవాడు; చిటారు కొమ్మలకెక్కి కూర్చునేవాడు అలాగే రోజుకి 5, 6 గంటలు కూర్చుని వుండేవాడు. అతనిని భావు అని పిలిస్తే బుజాలుఎగరేస్తు చేతులతో కౌగలించుకున్నట్లు తన ఛాతీమీద చేతులు ముడుచుకునేవాడు. ఇతరులను మధ్యాహ్నం ఎండవేళ పరుండివున్నపుడు లేపేసే అలవాటుంది ఇతనికి. అందువల పోట్లాటలు కూడా వచ్చేవి. వాళ్ళ దగ్గరకువెళ్ళి వాళ్ళ బుజాలు పట్టుకుని ఊపేసేవాడు.

4) ధోండియా అనేవాడు యువకుడే. కాని శుద్ధ మొద్దబ్బాయిలా వుండేవాడు. వాడు ఏమి అడిగినా ఇవ్వమని బాబా మండలికి ఆజ్ఞాపించారు. పాపం ఒక రోజున ఇతడు జబ్బుచేసి మరణించాడు.

5) ఫకీర్‌బువా-ఇతడు నాసిక్ నుంచి వచ్చిన వృద్ధుడు, ఇతని తలమీద ఏదో దెబ్బతగిలి ఒక సాసర్ అంత సొట్టపడింది. నాసిక్‌లో ఉండేవాడు. రాహూరే ఆశ్రమంలో చేరడానికి ముందు, ఇతడొక పిచ్చివాడుగా వుండేవాడు. మూత్రంచేసి తనగది పాడుచేసుకునేవాడు. ఒక్కొక్క సమయంలో ఇతరులను కొట్టేవాడు. ఒక రోజున నవ్వుతూ బైదుల్‌ను సమీపించి గబుక్కున అతని ముక్కుమీద గుద్దాడు. అందుచేత బైదుల్ ముక్కులోంచి రక్తం రావడంతో "అదేమిటి అలా రక్తం వస్తోందేం?" అని అడిగాడు. పైగా తలమీద మట్టిముద్ద వేసుకో రక్తం కారడం

కడుతోంది అన్నాడు. ఇలాటి పనులు చేస్తాడని ఇతనితో వేగడం కష్టంగా వుండేది. తరువాత ఇతడు వెళ్ళాడు. అక్కడ ఇతనిని మస్తునివలె పూజిస్తారు. కాని నిజంగా అతడు పిచ్చివాడే.

6) గణేశ్ అని ఒకడుండేవాడు. ఇతని గురించి తెలుసుకోవలసింది ఏమీలేదు.

7) గులామ్ హుసేన్ రాహురీలోనే చేరాడు. రాత్రి కాపలా మనిషిని హడల గొట్టేవాడు. రాత్రివెళ్ళి ఏదో చూపించి అదిగో బూచాడు. ఎంత పెద్దగా వున్నాడో అనేవాడు. ఆ కాపలావాడు ఒక పల్లెటూరి పిల్లవాడు. పాపం వాడికి భయమేసి అక్కడినుంచి ఉద్యోగం వదులుకుని పారిపోయాడు. గులామ్ హుసేన్ అతడు కప్పుకునే దుప్పటి తలకు చుట్టుకునేవాడు. ఇతడికి పిచ్చివుండేది. మహమద్ మస్తుని వేధించేవాడు.

8) గోపాల్ అనే వాడొకడుండేవాడు.

9) హనుమాన్ అని ఇంకొకడుండేవాడు.

10)హసన్ అలీ అనేవాడుకూడా రాహురీలో ఉండేవాడు.

11) కాళిదాస్ స్వామి అనేవాడు భక్తిగీతాలు బాగా పాడేవాడు. తరువాత రోజుల్లో మస్తులా అయిపోయినట్లున్నాడు. ఇతనికే భగవంతుడంటే పిచ్చి ఎత్తింది.

12)లాల్‌సాహెబ్. ఆ పిచ్చి ఆశ్రమంలో వున్న నిజమైన మస్తులలో ఇతడొకడు. బాబా పాదాలవద్దపడి ఆయన్ని కౌగిలించుకునేవాడు ఆయన్ని దేవుడనేవాడు. పుంజియాకి ఇతడు ప్రాణస్నేహితుడు. ఒక రైలు పెట్టెనిండా బంగారం, ఇంకా ఎన్నో వస్తువులు తెచ్చిపెడతానని అతనితో చెప్పేవాడు. అవన్నీ తెచ్చి పుంజియాని ఒక రాజకుమార్తెతో పెళ్ళి చేస్తాననేవాడు. నీకు కావలిస్తే ఇదిగో కోటి రూపాయలిప్పుడేఇస్తాను అని జేబులో చెయ్యి పెట్టేవాడు. ఎప్పుడయినా పుంజియా లాల్‌సాహెబ్‌ను కొట్టేవాడుగాని సాధారణంగా వాళ్ళు ఎప్పుడూ స్నేహితులుగానే ఉండేవారు. లాల్‌సాహెబ్ తరువాత నాసిక్‌కి వెళ్ళారు.

13) మహబూబ్ అనేవాడు రాత్రిళ్ళు మేలుకుని పగలు నిద్రపోయేవాడు. అల్పాహారానికి ఉదయాన్నే కూర్చుని ఆరు చపాతీలు తిని ఎనిమిది కప్పుల టీ తాగేవాడు. తనలో తాను నవ్వుకుంటూ గొణుక్కుంటూ ఉండేవాడు. మంచి బీడీలుకాల్చక ఎవరయినా సగం కాల్చి పారేసినవి ఏరి కాల్చేవాడు. ఇతడు భగవదున్మత్తుడు.

14) మహమ్మద్ మస్త రాహూరీ ఆశ్రమంలో వుండేవాడు. ఏ యితర మస్తుకంటె ఎక్కువ కాలం బాబా సాంగత్యంలో వున్నవాడితడే. రాహూరీ ఆశ్రమానికి మొదట ప్లీడర్ అనే బాబా శిష్యుడు ఆగష్టు 1936లో బొంబాయి నుంచి మహమ్మద్‌ను తీసుకువచ్చారు. ఇప్పటికీ మెహెరాబాద్‌లో వున్నాడు. బాబాకి అయిదుగురు యిష్టులలోను ఇతడు మొదటివాడు.

15) పసర్‌బువా అనేవాడు రాలిన ఆకులు, చెత్త, కాగితం ముక్కలు, రాళ్ళు పోగుచేసి పెట్టేవాడు తన గదిలో. భోజన సమయంలో అన్నం కలుపుకుని మొహానికి పులుముకునేవాడు. నీళ్ళిచ్చి శుభ్రంగా కడుక్కోమంటే తలమీద నీళ్ళు పోసుకుని చేతితో కొట్టుకునేవాడు. కాని ముఖం మీద వున్న అన్నం మాత్రం కడుక్కోనేవాడు కాదు. వయసులో పెద్దవాడు. పిచ్చివాడు.

16) పుంజియా:- మొదట్లో ఆశ్రమంలో చేరినవాడు ఇతడు. ఇతని మనస్సు వికాసం పొందక పిచ్చివాడయాడు. కాని స్నేహానికి చాలా మంచివాడు ఆ ఆశ్రమానికి ప్రాణంలా వుండేవాడు. ఇతని స్వగ్రామం రాహూరీయే. స్వభావసిద్ధంగా ఆటలాడుతూ అందరినీ నవ్వించేవాడు. మెడలో కిరసనాయిలు డబ్బా ఒకటి వేళ్ళాడేసుకుని వాయిస్తు లయ విన్యాసంతో ఆడేవాడు. ఏదయినా అల్లరి చేస్తూవుంటే ఆ డబ్బా లాక్కుంటానుసుమా అని భయపెడితే ఊరుకునేవాడు.రాహూరిఆశ్రమం ఎత్తేసినపుడు రాహూరీ వూళ్ళోకి పంపించేశారు బాబా ఇతన్ని ఆ డబ్బా వాయిస్తూ బాబా బాబా అని అరుస్తూ వుండేవాడు. పాపం ఇతడు 1946 సం॥లో రాహూరికి వచ్చిన వరదలలో మునిగి చచ్చిపోయాడు.

17) రమ్‌జాన్ అనేవాడు తన గదిలోనే దాగి కూర్చునేవాడు. ఈ పిచ్చివాడు తాను ధరించిన కఫ్నీని చింపి పీలికలు చేసుకున్నాడు. తరువాత వానికి గోనిగుడ్డ యిచ్చారు. అది చింపడానికి చాలా గట్టిగా ఉండేది. తన కఫ్నీలోనే ఉమ్మి వేసుకునేవాడు. ముక్కుకొసను నాలికతో నాకేవాడు. పళ్ళుతోముకునేందుకు పళ్ళపొడి యిస్తే అవతల పారేసేవాడు. దంతధావన చేసినట్లు మాత్రం నటించేవాడు. ఏవరయినా టోపీ పెట్టుకుని తనవద్ద కూర్చుంటే వాళ్ళు అటువైపు చూస్తున్నపుడు ఆ టోపీ లాగి బలంకొద్దీ దూరంగా విసిరివేసేవాడు. మళ్ళా ఏమీ తెలియన అమాయకుడులా కూర్చునేవాడు. తరువాత రోజుల్లో ఈ చేష్టలుమాని మంచివాడులా వర్తించాడు. కాని తన బట్టలు చింపుకునే అలవాటు మాత్రం జయించలేదు. ఇతడొక భగవదున్మత్తుడు.

18) షా బెహ్రాం అనే యువకుడు బొంబాయినుంచి వచ్చిన ఒక ఇరానీ. ఇతడు ఇరాన్ దేశంలో బడిలో పంతులుగా పనిచేసేవాడు ఇండియాకి వచ్చేముందు. ఆశ్రమంలో పనిచేసే కుర్రాళ్ళను కొట్టేవాడు. ఒకమాటు ఇలాగే కొడతాడేమో అన్నట్టుగా బైదుల్ వద్దకు వచ్చేసరికి బైదుల్ – "నేనెవర్నో తెలుసా రుస్తుం పహిల్వాన్‌ని. చితక్కొట్టేస్తాను జాగ్రత్త" అనగానే తగ్గి అప్పటినుంచి బైదుల్‌తో స్నేహంగా ఉండేవాడు.

19) శంకర్ అనేవాడు మాట్లాడకుండా ఒకచోట నెమ్మదిగా కూర్చునేవాడు. అప్పుడప్పుడు పెద్దగా నవ్వుతూండేవాడు. అతనిని ఏమి అడిగినా "శంకర్" అని సమాధానం చెప్పేవాడు. అందుకే అతన్ని కూడా శంకర్ అని పిలిచేవారు. నేలమీద గోకే అలవాటుంది అతనికి. ఇంట్లోవున్న కుర్చీలు వగైరా లాగేసి ముక్కలు చేసేవాడు. ఇతడు దగ్గుబువాకి ప్రాణస్నేహితుడు. శంకర్ ఒక పిచ్చివాడు.

20) సైయద్‌దిన్ మహమ్మద్ అనేవాడు అన్నంపెడితే ఇంకా మొదటి ముద్ద తినకుండానే ఇంకా కావాలి అనేవాడు, టీ తాగుతే ఎంత తాగాడో అంత కింద పోసేవాడు అబ్బ అని విసుక్కుంటే తిట్టేవాడు. అతను నోటివెంట చొంగకార్చేవాడు. ఇతన్ని షా అనేవారు. షా ఒక పిచ్చివాడు.

21) వామన్ – అనే ముసలివాడు, వాడిపోరు పడలేక అతని గ్రామస్తులు ఆశ్రమానికి తీసుకొచ్చి వదేశారు. రాత్రిళ్ళు బైదుల్‌నిలేపి ఒక బకెట్‌నిండా నీళ్ళు తెమ్మని అవి తెచ్చాక తనగది అంటుకుపోతోందని అన్ని నీళ్ళు తన గదిలో దిమ్మరించుకునేవాడు. ఒక చెట్టుకింద తలమీద నిలబడేవాడు (శీర్షాసనం) ఆశ్రమ ఆవరణలో వున్న చెట్లకొమ్మలు పట్టుకు వేళ్ళాడేవాడు. తాను ఆంజనేయస్వామినని చెప్పేవాడు. ఆశ్రమవాసులకు వాళ్ళపనిలో సహాయం చేస్తానని చెప్పేవాడు. మహమద్‌ని చూసి నీ విలా వేధించకూడదని కోప్పడేవాడు. ఇతడూ పిచ్చివాడే.

22) ఇంకొకపేరు తెలియనివాడున్నాడు. బొంబాయి నుంచి రాహూరీ ఆశ్రమానికి ప్లీడరు తీసుకువచ్చాడు. అక్కడ వున్న కొద్దిమంది మస్తులలో ఇతడు నిజమైన మస్తు. ఆశ్రమంలో కొద్ది రోజులే వున్నాడు. తన వంటికి మట్టి, బూడిద, సున్నం రాచుకునేవాడు. రాహూరీలో బాబా ఇతన్నే అందరికంటె ముందు స్నానం చేయించారు. స్నానం చేయించి మంచి కఫ్ని తొడిగించి అతనికి బాబా భోజనం

పెట్టారు. కొద్దిరోజులు అతని సాంగత్యం చేశాక బాబా ఇతనిని బొంబాయికి పంపిం చేశారు.

మొదట చెప్పిన మూడవ భూమికలో వున్న ఒక మస్తుకి ఎవరి మనసులో ఏముందో తెలుస్తుంది. బాబా ఎప్పుడు వస్తారో తెలుస్తుంది. బాబా శిష్యులు బాబా ఎక్కడికయినా వెళ్ళినపుడు ఆయన ఎప్పుడు వచ్చేదీ తెలియకపోతే ఇతని వద్దకు వచ్చి అడుగుతుంటారు.

కొంతమంది పిచ్చివారు ఆశ్రమానికి గొని రాబడినపుడు అది వదలి ఎప్పుడు వెళ్ళిపోదామా అని అనుకుంటారు. ఆశ్రమం ఒక ఖైదులా వుండేది వారికి. బాబా స్వయంగా స్నానం చేయించిన తరువాత వాళ్ళకి ఇంక వెళ్ళాలని వుండేది కాదు. ఆయన స్పర్శ మహాత్యం అది. అది వెంటనే ఫలిస్తుంది.

బాబా ఆ పిచ్చివారికి స్నానం చేయిస్తూంటే వాడి ఒక్కడికే ఆ స్నానం కాక లోకంలో అటువంటి వారందరికికూడా దాని మంచి ఫలితం కలుగుతుందని ఒక మారు చెప్పారు. అటువంటి పిచ్చివారందరికీ కూడా అది ఆధ్యాత్మిక స్నానం అవు తుంది. ఇలాటి ఆశ్రమాలు అందులో వుండే కొద్దిమంది కోసం గాక లోక సంగ్ర హార్థం బాబా ఈ ఆశ్రమాలు నడిపేవారు.

బాబా అనుగ్రహం ప్రవహిస్తున్న ఆ ఆశ్రమంలో ఆ వాతావరణమే వేరు. అందులోకి ప్రవేశించినవారికి దాని యొక్క మంచి ఆ గాలి పీల్చగానే తెలుస్తుంది. బయట ప్రపంచం అంతా ఎడారి అయితే ఇది ఆ ఎడారిలోని పచ్చని చెట్లు, నీళ్ళు ఉండి ప్రాణదానం చేసే స్థలం (ఒయాసిస్సు)

ఆశ్రమంలో పొడుగైన చెట్లు కనువిందుగా వున్నాయి. అక్కడిమామిడి తోట, నారింజతోట చల్లదనాన్నిస్తాయి. ఆశ్రమంలో ఉన్నవారి గదులకి - క్రింద సిమెంటు చేసిన నేల, పైన వెదురు తడకలతో కప్పు ఉన్నాయి. పరిసరాలన్నీ పరి శుభ్రంగా ఉన్నాయి. గేటు దగ్గర ఉన్న పెద్ద కుటీరం వంటయింటి కోసం ఏర్పడింది. లోపల సామానులన్నీ ఏది ఎక్కడ వుండాలో అక్కడ వుంచబడినాయి. అందులో ఆశ్రమవాసు లందరికీ ఒకే వంటలో భోజనం తయారవుతుంది. వచ్చిన పాశ్చాత్య అతిథులకు కూడా వంట తయారు చేశారు. బయట చెట్ల క్రింద నీడలో పొడుగాటి బల్లమీద భారతీయ ఆచారం ప్రకారం వారందరికీ భోజనం పెట్టారు. వారంతా

అన్నము, కూరా చాలా బాగున్నాయి అన్నారు. అప్పుడప్పుడు పిచ్చివారు బాబా దగ్గరకు వచ్చేవారు. బాబా వారికేసి ప్రేమయుతమయిన ఒక చూపు చూసేవారు. వారు ఆ చూపు కోసమే వచ్చేవారు. అది అందుకుని వెళ్ళిపోయేవారు. పైన చెప్పిన గూఫీ అనే యువకమస్తు వచ్చి బాబా పాదాల వద్ద కూర్చున్నాడు. ఏమీ అల్లరి చేయకుండా బుద్ధిమంతుడులా కూచున్నాడు. గూఫీ వచ్చినట్లే ఎవరికీ తెలియదు. చూచినవారికి గాని, అతడు రావడం చూస్తే యజమాని వద్దకు అతని కుక్క వచ్చి ఇలాగే కూర్చుంటుంది కదా అనిపిస్తోంది.

చిట్టచివర బాబా కుటీరంవుంది. అది చిన్నదయినా చాలా అందంగా చక్కటి పరిసరాలతో రమణీయంగా వుంది. బాబా కుటీరానికి ప్రక్కనే నారింజతోట వుంది. ప్రకృతి సుగంధం వెదజల్లుతోంది. ఆ ఆశ్రమం అంతా చూస్తే భగవంతుడు ప్రకృతి, మానవుడు కలిసి సమరసభావంతో తయారుచేసిన ఒక ప్రశాంత కళా ఖండంలా వుంది.

రాహూరీ ఆశ్రమంలో మస్తులను చూపించినపుడు బాబా వారి పాశ్చాత్య బృందమునకు యిలా వివరించి చెప్పారు —

("మస్తులయొక్క మానసిక స్థితికి, మామూలుగా పిచ్చివారియొక్క మనస్థిమితం లేకపోవడానికి చాలా తేడా వుంది. పిచ్చివారు శారీరకముగానో, మానసికముగానో కొన్ని కారణాలవల్ల అలా వారి మనసుయొక్క స్థిమితాన్ని కోల్పోతారు. అందుకు ఏదో వారిలోని ఒకానొక జబ్బు కారణంగా వుంటుంది. లేక మానవ జీవితంలోని పరిష్కారం కానటువంటి సమస్యలు వారి పిచ్చికి కారణమైవుంటాయి. కాని మస్తులలో భగవంతుని పొందాలనే శక్తివంతమైన వాంఛ కారణంగా వారిలో మానసిక అసమానత్వం ప్రాప్తిస్తుంది. ఆధ్యాత్మిక సాధకుడు భగవంతుని అనుభవించాలనే కోరిక మిక్కుటమైనపుడు కొన్ని సందర్భాలలో అతని మనసుకు సాధారణంగా ఉండిన శక్తులన్నీ అడుగంటుతాయి, అందుచేత సహజంగా మామూలు పిచ్చివారికి చేసే చికిత్స ఈ భగవదున్మాదులకు చేసే చికిత్స వేరుగా వుండక తప్పదు. పిచ్చివారికి వారి మానసిక విచ్ఛిన్నాన్ని బట్టి చికిత్సకూడా మానసికంగానో, భౌతికంగానో వుంటుంది. భగవదున్మాదులకు ఆధ్యాత్మిక చికిత్స కావలసివుంటుంది. ఇది మామూలు వైద్యుడు చేయలేనిపని. వాని శక్తికి అతీతమైనది. అతీతమయిన ఆధ్యాత్మిక శక్తి కలిగిన సద్గురువే వారికి కావలసిన చికిత్స చేయగలడు.")

14

మనసును అధిగమించే క్రమంలో ఒక్కొక్క ఆధ్యాత్మిక సాధకుడు ఒక్కొక్క విధంగా మనస్సుయొక్క స్థిమితాన్ని కోల్పోతాడు. ఆ వ్యక్తి ప్రత్యేకంగా ఏ విధంగా తన మానసిక సమత్వాన్ని కోలుకుంటాడో ఆధ్యాత్మిక సద్గురువుకే తెలుస్తుంది. అతడే ఆ సాధకునికి సంపూర్ణమయిన సమగ్రత్వాన్ని, సామరస్యాన్ని చేకూర్చగలడు.

రాహూరీ ఆశ్రమంలో ఆస్పత్రి డా॥ గాడ్సే పర్యవేక్షణలో వున్నది. అక్కడ మహమద్ మొదలయిన కొందరు మస్తులు కొన్ని దేశాలకి ప్రతినిధులుగా ఉన్నారని బాబా చెప్పేవారు. మహమద్ జర్మనీ దేశానికి ప్రతినిధి అన్నారు.

బాబా భక్తులు అనేక వూళ్ళనుంచి వచ్చారు. ఈ వచ్చిన వెయ్యిమంది బాబా ప్రేమికులకు భోజనలశాల కోసం ఒక పెద్ద పందిరి వేయించారు. ఆ పందిట్లోఅందరూ పంక్తులు తీర్చి భోజనాలకు కూర్చుంటే చూడటానికి చాలా ముచ్చట గొలిపింది. ఆ కూర్చున్నవారిలో అన్ని మతాలవారు, అన్ని కులాలవారు, అన్నివర్ణాలవారు ఒక్కచోట చేరి అందరకు తండ్రియయిన బాబాను తలచుకుంటూ భోజనాలు చేశారు. ఎవరి వేషభాషలు వారివి. పార్సీలు, మహమ్మదీయులు కూడా పాశ్చాత్యులవలెనే దుస్తులు ధరించారు. అనేక మంది స్త్రీలుకూడా రావడంచేత వారు కట్టుకున్న రంగు రంగుల చీరలు కనులకు ఇంపుగా కనిపించాయి. భోజనం ప్రారంభించే ముందు అందరూ ముక్త కంఠంతో "శ్రీ సద్గురు మెహెర్ బాబా మహరాజ్‌కి జై" అని జయధ్వానాలు చేశారు.

అప్పుడే వచ్చిన ప్రేమికులకు టీ త్రాగమనియిస్తే బాబాదర్శనం అయితేగాని పుచ్చుకోమన్నారు.

మధ్యాహ్నం అందరూకలిసి భోజనాలు చేస్తూంటే ఒక ముసలి బ్రాహ్మణుడు మాల్కమ్‌నుచూచి "ఇది విశ్వమానవ సౌభ్రాతృత్వమా?" అనిఅడిగాడు మాల్కమ్ "అందులోనే ఇది యొక సోపానం" అన్నాడు. "అవును. సద్గురు మెహెర్ బాబాకే ఇలా చేయడం సాధ్యం అయింది. ఆయన దివ్యప్రేమ వల్లనే ఇలా జరగడానికి కారణమయింది" అన్నాడు ఆ అగ్రజన్ముడు.

ఒకేమారు వెయ్యిమంది బ్రహ్మాండమయిన పందిట్లో బారులుతీర్చి కూర్చుని భోజనం చేయడం పాశ్చాత్యులు ఇదివరకెప్పుడూ వారి జన్మలో చూడకపోవడంచేత

ఆ దృశ్యం వారు చాలా విచిత్రంగా చూస్తున్నారు. పాశ్చాత్యులుకూడా భారతీయుల వలెనే నేలమీద కూర్చుని ఆకులలో చేతితో కలుపుకుని అన్నం తిన్నారు. ఆ నాటి విందులో మహమ్మదీయులు, పార్సీలు, హిందువులు, హరిజనులు, బ్రాహ్మణులు అందరూ పాల్గొనుచూ రాజూ, పేద అనే భేదభావంలేక నేలమీదకూర్చుని భోజనం చేసి అందరి సమానత్వాన్ని రుజువు చేశారు. అవతార పురుషుని సహపంక్తిలో కూర్చుని భుజించడం ఎన్నో జన్మల పుణ్యఫలంలా వారికి కలిగింది. నాసిక్‌లోని పవిత్ర గోదావరీ జలాలు ఏ విధంగా సర్వులు ఉపయోగించారో అలాగే అక్కడ బాబా పావన సన్నిధిలో వారి సహపంక్తిలో అందరూ సమంగా కూర్చుని విందు ఆరగించారు.

భోజనాలయిన తరువాత బాబావారున్న కుటీరానికి పాశ్చాత్యశిష్యులను రమ్మని పిలువనంపారు. వారంతా వచ్చేసరికి బాబా ముందు ఒక హిందూ వృద్ధసాధువు కళ్ళు మూసుకుని కూర్చున్నాడు అతడి తెల్లటి దళసరి అయిన చొక్కా వేసుకున్నాడు అక్కడక్కడ దానికి కాన్వాసు గుడ్డతో మాసికలు వేసివున్నాయి. ఆనందం అతని మోమున తాండవిస్తూంది. అతడు రెండు సంవత్సరాల నుంచి మౌనంగా ఉన్నాడని ఊరూరా తిరుగుతూ ఇక్కడికి వచ్చాడని ఏది దొరికితే దానితో కడుపు నింపుకుంటాడని తెలిసింది. బాబా పాదపద్మాలు చేతితో నిమురుతున్నాడు. బాబా ఆ వచ్చిన పాశ్చాత్య ప్రేమికులను కూర్చోమని సైగ చేశారు. వారికి తెలిసేటట్లు బాబా తమ అక్షరఫలకం మీద "ఈ సాధువు క్రిందటి డిసెంబరు నెలలో నాగపూర్ మారిస్ కాలేజీలోని ఒక తత్త్వ శాస్త్రాధ్యాపకుని యింటివద్ద బాబా ఫొటోగ్రాఫ్ చూచి భగవత్సాక్షాత్కారం పొందిన వాడని గుర్తించి బాబాను ఆరాధించాడు. ఇప్పుడే ఇతడు బాబా దర్శనం చేసుకుంటున్నాడు" అని బాబా చెబుతుండగా ఆ సాధువు తన తలను బాబా హృదయంమీద ఆన్చి ఉద్వేగంతో పరవశుడైనాడు. ఒక నిమిషం తరువాత బాబాలేచి కుటీరం బయటకు వెళ్ళారు. వెనకాలే వెళ్ళిన సాధువుయొక్క శిష్యుడొకడు బయటవున్నవాడు. ఒక గులాబీ పువ్వుకోసి అతనికి యిచ్చాడు. దానిని గాఢంగా ఆఘ్రాణించి నుదురునుస్పృశించి కళ్ళమీద తలమీద పెట్టుకుని చివరకు తన హృదయానికి హత్తుకున్నాడు. ఆపరవశత్వంలో అతడు క్రిందపడిపోకుండా ఇద్దరుశిష్యులు ఎడాపెడా వుండి అతనిని పట్టుకుని నడిపించుకుంటూవెళ్ళారు. ఇతడు ఆధ్యాత్మికంగా అభివృద్ధి చెందిన ఆత్మ అని బాబా చెప్పారు.

మధ్యాహ్నం ఈ సాధువును ఉదయం చూడని ఒక పాశ్చాత్య వనిత వచ్చి అతనినిచూచి నమస్కరించింది. ఆసాధువు ఆమెనుఆశీర్వదించి "ఇలాగే ఎప్పుడూ ఆనందంగా వుండు" అని సైగచేసి చెప్పి ఆమె చేయి పుచ్చుకుని వంట పందిట్లో ఆ సాయంత్రం వంటలు పరిశీలిస్తున్న బాబా వద్దకు తీసుకుని వెళ్ళాడు. అవును. ఆధ్యాత్మిక మార్గంలో ఎవరయినా అంతవరకే తీసుకుని వెళ్ళగలరు. ఇంక బాబాయే

ఆమెకు దైవసాక్షాత్కారం కలుగజేయాలి. ఆమెకు కావలసినదదే కదా. ఏకాంతంగా గుహల్లో ఈ సాధువు తన భక్తిని చూపించుకుంటాడు. ఈ జన్మదినోత్సవాలు పూర్తి కాకుండా అతనిని రాహూరీ పంపించి అక్కడ మస్తులను చూచే అవకాశం కలిగించారు బాబా. ఇతడు ఆనందంతో లయయుక్తంగా నృత్యం చేస్తాడు.

మధ్యాహ్నం గాయకులు ఆధ్యాత్మిక గీతాలు గానంచేశారు. కొంతమందికళాకారులు నృత్యం చేశారు. మాస్టర్ కృష్ణ అను ప్రసిద్ధగాయకుడు రెండు గంటల సేపు తన గానామృతాన్ని వెదజల్లి శ్రోతలను తన్మయుల గావించాడు.

బొంబాయి, పూనా, ధూలియా నుంచి వచ్చిన గాయక బృందాలు బాబాకు ఇష్టమయిన పాటలు పాడారు. మధ్యాహ్నం పాడిన మాస్టర్ కృష్ణ పాటతో తనివితీరక బాబా మండలివారు కొందరు అతనిచేత రాత్రికూడా పాడించుకుని ఆనందించారు.

అరంగామ్ గ్రామంలోని మగవారు వచ్చి సాంప్రదాయక జానపద నృత్యాలు చేశారు. కొమ్ముబూరలుఊదారు. డోళ్ళు వాయించారు. తప్పెట్లు తాళాలు మ్రోయించారు. 1923 సం॥లో మెహెరాబాద్‌లో బాబా ఆశ్రమం నెలకొల్పినప్పటి నుంచి ఆ గ్రామ ప్రజలందరు బాబా భక్తులయారు. నిత్యము వారు బాబాను పూజిస్తారు. ఆ గ్రామంలోని అశేషజనమూ బాబా పుట్టినరోజు పండుగకు నాసిక్ వచ్చారు.

సొరాబ్జీదేశాయి లాంటి పండితులు సుప్రసిద్ధ గ్రంథకర్తలు కూడా వచ్చారు.

పాశ్చాత్య ప్రేమికులు ఇంగ్లండు నుంచి ఓడలో వచ్చేటప్పుడు ఒకహిందూ యువక విద్యార్థి వారిని కలిసి అనేక విషయాలు బాబా గురించి తెలుసుకున్నాడు. తాను కూడా ఈ ఉత్సవాలకు రావచ్చునేమో ఉత్తరం వ్రాసి కనుక్కొని బాబా అనుమతితో 17 వ తేదీన నాసిక్ వచ్చాడు. అతడు ఆక్స్‌ఫర్డ్ విశ్వ విద్యాలయంలో న్యాయశాస్త్ర పట్టభద్రుడై ఇండియాలో న్యాయవాద వృత్తిని సాగించడానికి వచ్చాడు. బాబా దర్శనం చేసుకుని వెళ్ళాడు – ఆయన దీవనలతో. ఇటువంటి ఉత్సవం తాను ఎప్పుడూ చూడలేదన్నాడు.

మానవులు ఒక సద్గురువు వద్దకు వచ్చి ఆయన పాదాలను వారి శిరములతో స్పృశించినపుడు వారి సంస్కారపు బరువులను, వారి ఆలోచనా ముద్రలను, వారి వాసనలన్నిటిని గురుచరణముల మీద ఉంచుతారు. ఈ ఆలోచన, ఉద్వేగము ఆచరణకు సంబంధించినవి; వ్యక్తిగతమయిన ఆత్మను బంధించి దానికి అనేక జన్మలు కల్పిస్తాయి. "బరువుతో కృంగి పోతున్న వారంతా నావద్దకు రండి– మీకు విశ్రాంతి

నిస్తాను" అని క్రీస్తు అన్నాడు. అలాగే సద్గురు పాదాలమీద వారి భారం దింపేసుకుంటారు

"విశ్వం అంతటి నుంచి సద్గురువులు సంస్కారాలను పోగు చేసుకుంటారు. అది మామూలు మనిషి దారిని నడుస్తూంటే తన పాదానికి దుమ్మును అంటించుకున్నట్లే. ఎవరయితే ఆ సద్గురువును ఎక్కువగా ప్రేమిస్తారో, ఎవరయితే ఆయన బాధలను, బరువులను సాధ్యమయినంత వరకు పంచుకుందామని అభిలషిస్తారో వారు ఆయన పాదాలను తేనెతోను, పాలతోను, జలంతోను – ఇవి వివిధ సంస్కారాలకి చిహ్నాలు– కడిగి మనసుకు చిహ్నంగా ఒక టెంకాయను అర్పణ చేస్తారో అప్పుడు వారు పూర్తిగా ఆత్మార్పణ అయినట్లు భావింపబడుతుంది" అని పాదాలయొక్క విశిష్టత పాదపూజయొక్క అంతరార్థము బాబా వివరించి చెప్పారు. పాదాలకి ప్రణమిల్లడం పాశ్చాత్యులకు క్రొత్త. అందుచేత పాదాల గురించి బాబా వారికి తెలిసేలా ప్రసంగించారు ఈ విధంగా —

"శరీరానికి పాదాలు అన్నిటికంటె అధోభాగాన్ని వున్నాగాని, అవి ఆధ్యాత్మికంగా ఉన్నత తమంగా వున్నాయి. భౌతికంగా పాదాలు అన్నిచోట్లకి – మంచి, చెడ్డా–సుభ్రం, అశుభ్రం–అందము, అసహ్యము అనే భేదాలు లేకుండా తిరుగుతాయి. అయినా అవి అన్నిటికంటె ఉత్తమంగానే వుంటాయి. ఒక సద్గురువుయొక్క చరణాలు ప్రపంచంలో అన్నిటికంటె కూడా మిన్నగా భావించబడతాయి. మిగిలినదంతా ధూళితో సమానమే."

ప్రియతమునికి దివ్య పాదాభిషేకం అయిన తరువాత పుష్పమాలలు ఆయన మెడలో వేసి ఆయన పాదాలకి ప్రణమిల్లుట మరల స్త్రీలే మొదలుపెట్టారు. ఒక్కొక్కరు ఒక గులాబీదండో, మల్లెలమాలయో ఆయన మెడలో వేశారు. తరువాత నుదురుతో వారి చరణకమలాలను స్పృశించారు.

మహమ్మదీయ భక్తులువచ్చి మల్లెలతోను, గులాబీలతోను కుట్టి అలంకరించిన ఒక పచ్చడమును బాబా మేనికి కప్పారు, తలచుట్టు పుష్పాలతో కట్టారు. వారి యిండ్లలో వివాహాలు జరిగినప్పుడు ఇలాటిదే వధువుకు – వరునకు, అలంకరిస్తారు. ఇప్పుడు బాబా భగవంతునితో అభిన్న చిహ్నంగా ఈ అలంకారం చేశారు.

బాబా వారి పాత్రను బిడ్డలను ప్రేమించే తండ్రిగా చక్కగా నిర్వహించారు. బాబా పాదాలను కడగటంలో పాశ్చాత్యులు కూడా బాబా అనుమతితో పాల్గొన్నారు.

ఎంత నిర్లిప్తంగా బాబా ఈ నాటకం ఆడుతున్నారో ఒక పాశ్చాత్య ప్రేమికు రాలు పాదాలు కడుగగానే బాబాకేసి చూడగా ఆయన కండ్లతో చిలిపిగా చేసిన సైగ వలన తెలుస్తూంది. ఇదంతా మాయతోకూడిన నాటకం సుమా అని బాబా తెలియ జేశారు. ఆ సైగ వలన.

దీని తరువాత వారి జన్మదినోత్సవ సందర్భంగా బాబా తాను యిచ్చిన సందేశం చదివించారు —

బాబా 43 వ జన్మదిన సందేశం ఈ విధంగా చెప్పారు —

"పుట్టడం అనేది ఈ భూమిమీద ప్రతి ప్రాణికి సాధారణమైన విషయం. ఏ విశిష్టత ఏ విశేషము లేకుండా ఎక్కడో పుట్టి తన ప్రమేయము లేకుండ జీవితం గడిపి చచ్చిపోయే జీవులలా కాకుండా, మానవ జన్మనెత్తడం అనేది పరిణామశ్రేణిలో అంతిమదశ అని చెప్పవచ్చు, మానవులు యంత్రవత్‌గా కాకుండా వారి భవితవ్యా నికి వారే బాధ్యులు కాగలరు. క్రింది జన్మలు అనేకం అనేక శరీరాలలో, అనేక ఆకారాలలో జన్మించి ఇప్పుడు మానవుడుగా జన్మించడం అంటే ఇదివరకు పడిన అనేక కష్టాలకు ప్రతిఫలంగా ఆధ్యాత్మిక జననం పొందడం అన్నమాట.

"ఎక్కడికి?" "ఎక్కడ నుంచి?" ఈ మన ప్రయాణం— అనే ప్రశ్నలకు లోపల తర్కించుకొని సమాధానం పొందడానికి ప్రయత్నించడమే ఈ ఆధ్యాత్మిక జననం పొందినట్టు ఆనవాలు. మానసిక సమత్వం ఒక్కమారు పొందగలిగినట్లయితే మానవుడు తాను ఉన్న భౌతిక పరిసరాలతో సామరస్యం కలుగచేసుకోవడానికి ప్రయత్నిస్తాడు. పూర్వాచార పరాయణత్వము, అసహనము, గర్వము, స్వార్థపర త్వము క్రమంగా వదులుకుంటాడు. అన్నిటికీ ఒక అర్థం, ఒక ప్రయోజనము కని పిస్తుంది. పుణ్యపురుషుడయినా – పాపి అయినా ఒకే సముద్రంమీద పెద్ద చిన్న తరంగాలుగా కనిపిస్తారు. అవి దేశ కాలానుసారంగా వస్తూపోతూంటాయి. పుణ్య పురుషుడు తన స్థానం గురించి గర్వించడు. పాపి శాశ్వత దౌర్భాగ్యావస్థలో ఉండా లని అఘోరించడు. ఎవరు కూడా నిస్పృహ చెందవలసిన పనిలేదు.

బాధపడుతున్న ప్రపంచానికి నేనుఇచ్చే అమృతంలాంటి ఔషధం 'ఎక్కడికి? ఎక్కడనుంచి?' అను ప్రశ్నలకు సమాధానం కనుగొనడానికి ప్రయత్నించేలా చేయ డమే. అందరూ జన్మిస్తారు. అందరూ మరణిస్తారు. కాని జనన మరణాలు రెండింటి మధ్య సుఖవంతమయిన జీవిత అవకాశమే ఈ ప్రపంచంలో జీవితం అని తెలుసు

కోవడంవల్ల ఈ భూమిమీద విశ్వమానవ సోదరత్వం నిజంగా సాధించడానికి ప్రయత్నిస్తూ సంకుచిత కులతత్వాలకు పరిమితమయిన జాతీయితలకు స్వస్తిచెప్పి యుద్ధాలకు దారితీయకుండా ఆర్థిక అన్యాయాలు చేయకుండా చూడడం జరుగుతుంది. ఇది మీ జీవితలక్ష్యంగా వుంచుకొని సాధించడానికి మిమ్ముల నందరినీ ఆశీర్వదిస్తున్నాను— మెహెర్‌బాబా."

ఈ సందేశపాఠాలు ఆంగ్లభాషలోను, గుజరాతీ, మరాటీ భాషలలోను చదివించబడ్డాయి.

జన్మదినోత్సవం అయిన తరువాత బాబా అందరికి క్రొత్తపనులు విధించారు. రెండువారాలయిన తర్వాత బాబా వారివద్దకు వారానికి రెండుమార్లు కూడా వచ్చేవారు. రెండువారాల కొకసారి పాశ్చాత్య బృందం అందరూ మెహెరాబాద్ వెళ్ళి ఒకరోజు ఉండి వచ్చేవారు. కొండమీద ఒకరాత్రే ఉండేవారు. ఏ రోజున బాబా నాసిక్‌వస్తారో సరిగా ముందు తెలిసేదికాదు. బాబా వచ్చిన తరువాత తలుపుమీద కొట్టేవారు. బాబా వచ్చారు అనేమాట వినగానే లోపల వున్నవారంతా బట్టలు సరిగా సర్దుకొని సిద్ధంగా ఉండేవారు. బాబా రాగానే ఒక్కొక్కరినీ కౌగలించుకొనేవారు. బాబా వారిని వారి మనస్సు, శరీరముయొక్క ఆరోగ్యస్థితి గురించి అడిగేవారు. తరువాత అందరూ భోజనాలు చేస్తుంటే ఎవరి కుర్చీవెనుకనయినా వచ్చి బాబా నెమ్మదిగా చెవి మెలిపెట్టేవారు. వారు తిరిగి జూసేసరికి పారిపోయేవారు. ఒక్కొక్కప్పుడు ఆయనే భోజనం వడ్డించేవారు.

బాబా తమ శిష్యబృందమును ప్రతివారిని వారికొచ్చిన కలలు వ్రాసియుంచమని చెప్పారు. ఆ వ్రాసినది మరునాడు ఉదయాన్నే బాబాకి చూపించాలి. ఒకమారు ఒక పాశ్చాత్య వనిత వ్రాసిన కలచదివి బాబా ఆమె కళ్ళలోకి చూచారు. ఆ చూపు ఆమె ఎప్పటికీ మరువలేదు. అనంతమయిన ప్రేమతో ఆయనచూసి ఒక ప్రత్యేకమయిన తారీఖున ఆ కౌగితం తిరిగి యిచ్చేయాలని బాబా చెప్పారు.

ఉదయాన్నే ఎవరికి అప్పచెప్పిన పనులు వారుచేశాక బాబావారందరిని ప్రధాన భవనంలో కలుద్దాము రమ్మని చెప్పారు. ఆయన చుట్టూ కూర్చుని ఆయన యిచ్చే ఆధ్యాత్మికాహారాన్ని ఆరగించేవారు. ఆయన యొక్క అక్షరాల పలకద్వారా దివ్య ప్రేమ గురించి ప్రవచనం చేసేవారు. భగవత్సాక్షాత్కారం గురించి చెప్పేవారు. భవిష్యత్తులో ఆయన పనిగురించి తెలియజేసేవారు. ఎవరి తక్షణ సమస్య గురించో మాట్లాడేవారు.

మధ్యాహ్నం టీ అయిన తరువాత వేడి కొంచెం తగ్గిన తరువాత ముందు వసారాలో కొందరు టేబిల్ టెన్నిస్ ఆడేవారు. బాబా ఈ ఆట చాలాబాగా సరదాగా ఆడేవారు. ఈ ఆట ఆడేటప్పుడు బాబా ఆధ్యాత్మికంగా ఏదో ఆంతరికమైన పని చేసేవారు. ఆటకి ఎవరు గెలుస్తున్నారు ఎవరు ఓడుతున్నారు అనేమాట గమనించేది ఎప్పుడూలేదు. స్కోరు అసలే లెక్కపెట్టేవారు కాదు.

కూర్చొని మాట్లాడేటప్పుడు తరుచుగా బాబా ఎక్కడికో 'వెళ్ళిపోయి' నిశ్చలంగా మంచంమీద పడిపోయేవారు. అప్పుడు ఆయన తలమీద ముసుగు వేసుకునేవారు. తరువాత లేచి మళ్ళీ టేబిల్‌మీద పింగ్‌పాంగ్ ఆడుదామనేవారు. అప్పుడే తిరిగి 'వచ్చినందువలన' ఆయన పడిపోకుండా బల్ల వంచి పట్టుకోవలసి వచ్చేది. శిష్యులందరూ చూచేవారు. కాని వారు ఎలా సహాయం చేయగలరు?

సాయంకాలం తోటలో షికారుచేసేవారు. అప్పుడు వారు శిష్యులను ప్రక్కన పెట్టుకునేవారు. రాత్రి భోజనాలయిన తరువాత వారికి ఆధ్యాత్మికాహారం కూడా పెట్టేవారు.

పాశ్చాత్యశిష్యులు పుట్టినరోజులొస్తే ఆరోజు అందరు పండుగ చేసుకునేవారు. వారు మొత్తం 15 గురున్నారు గనుక తరుచుగా ఈ పండుగలు వస్తూండేవి ఆ రోజున ఐస్‌క్రీమ్, కేక్ తప్పకుండా చేయించుకునేవారు.

నాసిక్‌లోవున్న సినిమాహాలు యజమాని బాబా భక్తుడయినందువల్ల ఈ పాశ్చాత్యమండలి వెళ్ళినప్పుడు వీరందరికి కూర్చొడానికి ప్రత్యేకమయిన ఏర్పాట్లు జరిగేవి. బాబా కూడా వారందరితో వెళ్ళేవారు. సినిమా జరుగుతుంటే, వారంతా సినీమా చూస్తుంటే, బాబా వారి ఆధ్యాత్మికమయినపని చేసుకునేవారు. సినీమా అయిన తరువాత కథ మీకు నచ్చిందా? సినీమా బాగుందా అని బాబా వారిని అడిగేవారు

నాసిక్‌కి అనతిదూరంలోనే గంగాపురమను పుణ్యస్థలమువుంది. బాబా ఒకనాడు అక్కడికి తమ పాశ్చాత్యమండలితో వెళ్ళి అక్కడవున్న అనేక ఆలయముల వద్ద నుంచి ఒక మనోహరమయిన జలపాత దృశ్యాన్ని వారికి చూపించారు. ఆ స్థలము నందు అనేక యోగులు మనస్సు కేంద్రీకరించుటకు అభ్యాస మొనర్చి యున్నారు. కొంతదనుక ఆ జలపాతము ప్రక్కన ఆ సుందర ప్రకృతియొక్క రామణీయకతను తిలకించుచు బాబా ఉపనిష్టులైయుండిరి. వారి పాదాలవద్ద వారి పరివారమందరును ఆసీనులైరి. బాబాను గుర్తించిన కొందరు గౌరవపురస్సరముగా వారికి అవనత మస్తకులై మనసులోనే నమస్కరించి దూరముగా వెళ్ళారు.



పాశ్చాత్య ప్రేమికులతో బాబా - నాసిక్ ఆశ్రమం



పాశ్చాత్య ప్రేమికులతో బాబా - నాసిక్ ఆశ్రమం

మరియొక రోజున నాసిక్ ఆశ్రమమునకు అయిదుమైళ్ళ దూరములో పాండవుల గుహలను చూడటానికి వెళ్ళారు. పాండవుల యరణ్యావాసకాలమునందు ఇచ్చోట కొన్ని రోజులు గడిపారని ప్రతీతి. పాండవులు గావించిన ఈ గుహలలో తరువాత శతాబ్దములందనేక యోగులు-మహాత్ములు నివసించారట. ముఖ్యముగా ఒక జైనగురువు 18 గురు శిష్యులతో ఆ గుహలలో ఉండేవాడని అంటారు. ఆ గుహలవద్ద ఒక 17 స్తంభాల మండపం వుంది. అందు ఆ జైనగురువు ఆసీనుడై శిష్యులకు బోధ చేయుచుండెడివాడు. ఆ చోటనే బాబా ఆసీనులై ఆ వెనుకటి సంగతి మండలి వారికి తెలియ జెప్పారు ప్రక్కనున్న 18 చిన్నగదులున్న గుహలో ఆ జైనులు ధ్యానతత్పరులై యుండెడివారు. ఆ సమీపమునందు ఒక పెద్దగుహ. అందులో లోపలగా బ్రహ్మాండమైన బుద్ధవిగ్రహము ఉన్నవి. ఆ గుహలో చీకటిలో కొంతసేపు ఉంటేగాని ఆ విగ్రహము కనిపించదు. ఆ గుహలో ఆధ్యాత్మిక శక్తి వెల్లివిరియు చుండెను.

ఒకొక్కక్క రోజున త్రియంబక్‌లాటి పుణ్యస్థలాలకి బాబా వారందనీ తీసుకుని వెళ్ళేవారు. త్రియంబక్‌లో గోదావరినది పుట్టింది. ఒక రోజున త్రియంబక్‌కి వెళ్ళడంకోసం తెల్లవారగట్ల చల్లటివేళ బయలుదేరారు. తెల్లవారి సూర్యోదయం అవుతూంటే త్రియంబక్ పర్వతం దగ్గరకు చేరారు. ప్రక్కనున్న దేవాలయంలో ప్రాతఃకాలపు అర్చన జరుగుతోంది. మంత్రాలు వినిపిస్తున్నాయి. ఇదంతా ప్రాచీన భారత సాంప్రదాయం. కాని నవయుగావతారుడయిన బాబా ఆధునిక అవతారుడు. భారతదేశం ప్రపంచానికి ఆధ్యాత్మిక నాయకత్వం వహించింది. ఈ భారత దేశంలో బాబా జన్మించినందువలన ఈ దేశం ప్రాచీన కర్మకాండలను క్రమంగా విడనాడి ప్రపంచంలో నేడు కావలసిన ఆధ్యాత్మిక దృక్పథం బలపడి ప్రపంచానికి భారతదేశం మార్గదర్శి కాబోతుంది.

రోడ్డు ప్రక్కనున్న ఒక పొలంలోంచి నడిచివెళ్ళి బాబా పరివారంతో సహా త్రియంబక్ పర్వతం వద్దకు వెళ్ళారు. ఆ పర్వతానికి 700 మెట్లు ఉన్నాయి పైకి ఎక్కవలసినవి. ఎక్కలేనివారు కూడా బాబా మనకి కావలసిన బలాన్నిస్తారు అని అందరూ ఎక్కడం ప్రారంభించారు. కాని బాబా మరీ దుర్బలులను. ఆడవారిని ఎక్కవద్దని డోలీలు ఏర్పాటుచేశారు పైకి తీసుకు వెళ్ళేందుకు. కావడిలో పెద్దపెద్ద బుట్టలు పెట్టి అందులో ఎక్కించుకుని తీసుకువెడతారు. మెట్లు పెద్దవిగానే వున్నాయి-వెడల్పుగా.

దారిలో కొన్ని దేవాలయాలున్నాయి, పైకి ఎక్కాక ప్రధానాలయంలోని పురోహితులు బాబా స్వయంగా దయచేశారని వారి అదృష్టాన్ని గురించి కొనియాడు కొనుచూ ఉద్రేకం పొందారు. పైకివెళ్ళి అక్కడొకచోట గోదావరి రాళ్ళలో నుంచి నిరంతరము చిన్న ధారగాపడుతూంటే బాబా వారి బృందానికి చూపించారు. అదే ఆ పవిత్రనది జన్మస్థానం. తరువాత ఒకనీడ చూసుకుని అందరు అందులో విశ్రమించారు. మెట్లు ఎక్కివచ్చిన వారికి ఇది చాలా అవసరం అయింది. కూడా తెచ్చుకున్న బుట్టలు, పొట్లాలు వగైరా విప్పారు. అందరూ చాలా ఆకలితో వున్నారు. అందరూ అల్పాహారాలు తీసుకుని నిర్మలమైన గోదావరీ జలాలు గ్రోలి చల్లని మలయానిలంలో సేద దీర్చుకున్నారు అందరూ. ఇంకో గంట తరువాత బాబా అందరినీ మళ్ళీ ఆహారం తీసుకోమన్నారు. ఇప్పుడింక తెచ్చుకున్నదంతా తినేశారు గనుక మెల్లగా పర్వతం దిగడం ప్రారంభించారు. సూర్యుడు నడినెత్తికెక్కాడు. దిగేటప్పుడు బాబా వచ్చినదారి కాక ఇంకోదారిని అందరినీ దిగడానికి తీసుకువెళ్ళారు. దాని కంటె ఇది దగ్గరిదారికూడాను. ఇందాకటిలాగే డోలీలలో ఎక్కినవారిని డోలీలలోనే దిగాలని బాబా పట్టుపట్టారు.

పైకి ఎక్కిన తరువాత ఎక్కడినుంచో ఒక బక్కచిక్కిన కుక్క కుంటూ కుంటూ బాబావద్దకు వచ్చింది. దానికి ముఖమంతా ఏదో జబ్బు తినేసింది పాపం. ఒక కన్ను బాగావుంది. దానితో బాబాకేసి జాలిగా చూస్తుంది. ఆ కుక్కనుచూచి భయపడి అసహ్యించుకున్నారు కొందరు స్త్రీలు. బాబా కరుణాకులితమూర్తి గనుక వెంటనే ఆ కుక్కను చేతితోనిమిరి దాని కురుపులమీద రాచి దయచూపించి వారి దివ్యస్పర్శ చేత దానికి బాధ కొంత తగ్గించారు. ఆ కుక్క ఇంతటి దయ చూపించినందుకు బాబా మీద కృతజ్ఞతతో తోకాడించింది. బాబా ఆ స్త్రీలతో "మీరు బాధపడే జంతువులకు ఏ సహాయమూ చెయ్యలేకపోతే పోనీండి. మీరు దానియెడల అసహ్యం, ఉద్వేగం చూపించి దానిబాధ మరింత ఎక్కువ చేయకండి" అని మందలించారు. ఈ సంఘటన సెయింట్ ఫ్రాన్సిస్ కుష్ఠువానిని కౌగిలించుకున్న దృశ్యం జ్ఞాపకం చేస్తున్నది.

క్రిందికి దిగారు అందరూ. ఆధ్యాత్మిక చైతన్యపు ఉన్నతాలనుంచి మరల ప్రాపంచిక నిమ్నంలోకి, మాయాంధకారంలోకి దిగినట్లయింది ఆ పాశ్చాత్యులకు.

బాబా ఏప్రిల్‌నెల వచ్చేసరికి కొందరు ఆధ్యాత్మికానందము, శాంతి పొందుతారని బాబా జోస్యం చెప్పినట్లు ఫిబ్రవరి నెలలోనే చెప్పారు. అలాగే జరిగింది కొంత మందికి. వారికి శాంతి, ఆనందమూ కలిగాయి. అన్నిటిలోను బాబాను చూడగలిగారు.

ఇంక వర్షాలు పడటం ప్రారంభమయాక బాబా వారానికోమారు ఇదివరకులాగ ఆశ్రమానికి రావడం మానేశారు. దానితో వారికి బాబాయొక్క భౌతిక సన్నిధానం పోయినట్లయింది. వర్షాలు పడేసరికి ఏదో అనిర్వచనీయమైన విధంగా వారిలోని బాధలు తగ్గినట్లనిపించింది. అంతవరకు నాసిక్ ఎండల్లో వేగిపోయారు పాపం అందరూ.

గారెట్ ఫోర్ట్‌ను బాబా భారతదేశంలో పర్యటించేందుకు అనుమతియిచ్చి వెళ్ళిరమ్మన్నారు. బాబా ఆజ్ఞ ప్రకారం అతడు బొంబాయి, భోపాల్, ఉజ్జయిని, గ్వాలియర్, ఆగ్రా, ఢిల్లీ, వారణాసి వగైరా నగరాలు చూచి వచ్చాడు.

నొరీనా యింటికి మానేజరుగా ఉంటోంది. ఇలా వుండగా ఒకనాడు ఉదయాన్నే జీన్ ఏడ్రియల్ బాబా వద్దకు వెళ్ళి నొరీనాను మానేజరు పదవినుంచి తొలగించమని చెప్పింది. జీన్‌కి ఎంతో అసంతృప్తి కలిగింది. బాబా జీన్‌ని, నొరీనాను పిలిచి జీన్ యొక్క కోరికను నొరీనాకు యెదురుగా చెప్పించారు. ఆమె చెప్పింది. నొరీనాను తీసివేసి రువానోను మానేజరుగా వెయ్యమంది జీన్. బాబా వీలులేదు నొరీనాయే మానేజరుగా వుండాలన్నారు.

మధ్యాహ్నం భోజనాలు అయాక నొరీనా అందరిని వారి వారి అభిప్రాయాలు దాచకుండా చెప్పమంది. ఈ లోపుగా బాబా నొరీనాను ఒక నిమిషం ప్రక్కకి రమ్మని పిలిచారు. బాబాతో మాట్లాడి ఆమె సంతోషంతో మరలి వచ్చింది. బాబా ఏం చెప్పారు అది ఊహించవచ్చును – "విచారించకు. అంతా నేను అనుకున్నట్లే జరుగుతోంది. శాంతంగా ఉండు. ఉద్రేక పడవద్దు" అని బాబా చెప్పివుండాలి అని వారు అనుకున్నారు.

బాబా హాలులో కాకుండా నొరీనా ఎలిజబెత్‌ల గదిలో సమావేశపరచారు అందరినీ. అందరినీ వారి వారి నిజమయిన అభిప్రాయం చెప్పమన్నారు బాబా. అందరూ ఏవో ఫిర్యాదులు చేశారు. – ముగ్గురు తప్ప – ఆ ముగ్గురు విల్, మేరీ, ఎలిజబెత్‌లు. వీరు బహూశా తృప్తిగానే వున్నారుకాబోలు. మొదటి యిద్దరు అసలు ఫిర్యాదు చేసే స్వభావంకాదు వారిది.

ఈ విధంగా బాబా ఒక్కొక్కరి భావాలను, ఉద్రేకాలను రేపేవారు. చివరికి వాతావరణం నిర్మలంగా చేసేవారు. అల్పమయిన విషయాలమీద ఎందుకిలా దెబ్బలాడుకుంటారని బాబా అందరిని మందలించారు.

అయినా బాబా ఇంటిలో కొన్ని మార్పులు చేశారు. రుస్తానోని మానేజరుగా వేశారు. నొరీనాకి ఇదివరకులాగే ఆర్థిక వ్యవహారాలు చూడడం ఆమె వంతే. ఎలిజ బెత్ ఈ మార్పు గురించి—"నొరీనాకు ఇప్పుడు ఇతర సంగతులు చూచుకోడానికి ఎక్కువ సమయం లభించింది. ఆమె యెప్పుడూ సోమరిగా వుండలేదు. ప్రతి నిమిషము ప్రయోజనకరంగా ఆమె ఉపయోగించుకోగలదు. అది ఆమె బాబా పని కోసం వినియోగించగలదు." అన్నది.

బాబా జన్మదినోత్సవం ఫిబ్రవరి 18 తేదీని జరిగిన తరువాత నాసిక్‌లో ఒక నాటి సాయంకాలం పాశ్చాత్య బృందంతో వున్నపుడు బాబా ఇలా ప్రసంగించారు—

"ఈ మధ్యాహ్నం 'మాయ భ్రాంతి' గురించి మాట్లాడుకున్నాము. ఇప్పుడు ఆత్మ-భ్రాంతి అంటే యేమిటి? ఫలానావాడు ఆత్మభ్రాంతిలో పడ్డాడు అంటాము. అంటే యేమిటి?" అని బాబా అడుగగా ఒకడు అన్నాడు—"ఎవరయినా తాను కానిది తాను అయివున్నట్లు భావించడం." అప్పుడు బాబా అన్నారు—"ఈ ఊహ ఎంత బలమయినదంటే ఆత్మభ్రాంతి చెందిన మనిషి తాను ఎలా ఉన్నాననుకుంటు న్నాడో దానిగురించి కించిత్తయినా సందేహించడు. తాను నిజంగానే అలా వున్నానను కుంటాడు. కాని ఇది ఎంత చెప్పినా భ్రాంతియే కదా. ఇలా అనుకునేవారు కపటులు కాకపోయినా, వారు అపాయం కలుగచేసేవారే. అయితే అంత తీవ్ర అపాయమేమీ కాదు. ఒక విధంగా వారు పిచ్చివారు. భ్రాంతి చెందినవారు పిచ్చివారు. ఉదాహరణకి శరీరమే మీరని అనుకుంటారు. మీరు శారీరకమైన పిచ్చి కలవారు. మీరు పిచ్చివారు కాదూ? (ఒక బృందానికి చెప్తూ) మీరు పిచ్చివారు; కాని భగవంతుడంటే పిచ్చి మీకు."

"ఆత్మకి లింగ భేదంలేదు. కాని ఆత్మ అదే శరీరం అని అనుకుంటే లైంగిక మాయ ఆవరిస్తుంది. ఆత్మ అప్పుడు ద్వంద్వాలకి లోనై వుంది. సత్య మయిన మన ప్రతియొక్కరిలోని ఆత్మకి లింగభేదంలేదు. నొరీనాలో వున్న జీవాత్మ తాను స్త్రీ ననుకుంటుంది. మాల్కంలోని జీవాత్మ తాను పురుషుడననుకొంటుంది. అదే భ్రాంతి. చాలా సూక్ష్మమైన భేదం. మనమే శరీరం అని అనుకోవడంచేత వచ్చింది ఇది.

జన్మదినోత్సవా లయిన తరువాత బాబా ఆశ్రమ నియమాలు కొంతవరకు సడ లించారు. శిష్యులను బయటకు వెళ్ళి కాస్త దూరం తిరిగి రానిచ్చేవారు. కాని కొన్ని నియమాలు మాత్రం కఠినంగా పాటించమన్నారు.

1) ఎవరూ క్లబ్బుకుగాని, డాన్సుకుగాని పోకూడదు. ఆశ్రమ ఆవరణకి బయట ఏ ఆటలూ ఆడకూడదు. ఏ వ్యాయామ క్రీడలందును పాల్గొనరాదు.

2) కొత్తవారెవరితోనూ మాటలాడకూడదు. అవసరమయితేనేగాని బయటి వారితో మాటలాడకూడదు. ఎవరి యిళ్ళకు వెళ్ళకూడదు. తమ పరిచయస్తు లెవరి వద్దకు పోరాదు.

3) సరోష్ మోటారు వర్క్సు నాసిక్ శాఖకి ఎవరూ పని వుంటేగాని పోకూడదు.

4) ఉదయం 10 గంటలు మొదలు సాయంకాలం 4 గంటల వరకు కాలినడకను గాని, సైకిల్‌మీదగాని బయటకు పోకూడదు.

5) భోజన సమయానికి ప్రతి యొక్కరు సరిగా హాజరు కావాలి.

6) ఆశ్రమంలో తయారు చేసిన ఆహారం తప్ప ఇంకొకటి ఎవ్వరూ భుజించ రాదు. (టాఫీలు తప్ప)

బాబా ఈ విధమయిన జీవితాన్ని "రెక్కలు కత్తిరించిన స్వేచ్ఛ" అని అన్నారు. ఇతర విషయాలను గురించి బాబా శిష్యులతో చర్చించారు.

మార్చి 16వ తారీకు నుంచి ఉర్దూ పాఠాలు మళ్ళీ ప్రారంభం అవుతాయి అని చెప్పారు. బాబా ప్రతి యొకరిని పని శ్రద్ధతో చేయమన్నారు. ప్రతి ఆదివారం ఉర్దు తరగతికి సెలవు. నెలకి మూడు రోజులు ఎక్కడికయినా బాబా తీసికెళ్ళిన చోటుకి వెళ్ళినప్పుడు కూడా ఉర్దూ పాఠాలుండవు.

ఏదో ఒక విధమయిన శరీర పరిశ్రమ ఉండాలని ఒక శిష్యుడు అన్నాడు—పింగ్‌పాంగ్ కాని బాడ్‌మింటన్‌గాని ఆడడంలాటిది. బాబా ఇలాటి ఆటలు ఆడుకునేం దుకు పరికరాలు కొనేందుకుగాను యాభై రూపాయిలిచ్చారు. నియమ నిబంధనాలన్నీ అందరూ బాగా చదివారు. వాటి ప్రతిని ప్రతివారు దగ్గర ఉంచుకొనమని చదవమని బాబా చెప్పారు. తరువాత మళ్ళీ అవి స్పష్టంగా లేవని చెప్పకూడదన్నారు.

వచ్చేది వేసంగి గనుక 20 రోజుల కొకమారే మెహెరాబాద్ వెళ్ళి వద్దా మన్నారు. మొదట వారానికోరోజున అనుకున్నట్లు కాకుండా ఎండాకాలం వెళ్ళిన తరువాత పదిరోజుల కొకమారో వారం వారమో వెళ్ళవద్దామన్నారు బాబా, ఈమారు మార్చి 15వ తేదీన వెడదామని చెప్పారు.

పిక్‌నిక్ రోజున (అంటే బయటికి వెళ్ళిన రోజున) ఎవరికీ ఏ పనులూ ఉండవు. ధ్యానం చేయనక్కరలేదు. బయట ఆహారం కొనడం వుండదు గనుక

మీతోచే ఆహారం తెచ్చుకోవాలన్నారు బాబా. నొరీనా బయటకు వెళ్ళిన రోజున తగిన ఏర్పాటు చేస్తుంది. బయటకు వెళ్ళినపుడు ఎండలో ఎప్పుడూ కూర్చోవద్దు నీడలో కూర్చోవాలి అని బాబా చెప్పారు. పది గంటల తరువాత నాలుగు గంటల లోపున నీడలోనే వుండాలి.

కారుల్లో మరీ క్రిక్కిరిసి కూర్చోనక్కరలేకుండా కొందరు ఒక రోజున, మరి కొందరు ఇంకొక రోజున, మిగిలినవారు వేరొక రోజున బయటకు వెళ్ళిరావచ్చు. ఈ ఏర్పాటువల్ల కొందరు ఎప్పుడూ ఇంట్లో వుంటారు. బయటకు అసలు వెళ్ళడం యిష్టం లేనివారు ఇంటిలోపలే హాయిగా వుండవచ్చు. ఎలిజబెత్ ఆమే ఫోర్డుకార్ నడిపే యెడల నెలకి రెండు రోజులు ఆమె వెడుతుంది.

మార్చి 4 వ తారీఖున బాబా అన్నారు – మీరంతా గదుగ్గాయిలు. బయటకు వెళ్ళడం పిక్‌నిక్‌లు చేసుకోవడం మంచిదే. పింగ్‌పాంగ్‌లాటి ఆటలాడడం కూడా శరీర పరిశ్రమ నిస్తాయి. కాని ప్రతిరోజు ఈదడానికి గాని, వేటకివెళ్ళడం గాని – పెద్ద పులులను చంపడానికి పనికిరాదు. రుస్తుం ఒకనాడు ఒక పెద్దపులిని వేటాడి చంపాడు కదా అని మీరు కూడా వేటకి వెళ్ళాలని కోరుకుంటారా ? ఎంత అవివేకం !

"కొత్తగా అది చేదాం ఇది చేదాం అని ఏమీ సూచనలుచేసి చెప్పకండి. షికారుకి వెళ్ళిరండి కావలిస్తే. నేను నియమించిన నిబంధనావళి చదివి ఆ ప్రకారం నడుచుకోండి. మీరంటే ప్రేమచేత నే నేను ఇలా చెప్తున్నాను. (మార్గరెట్‌కేసి చూచి) నీ నాట్య కళాశాల మేబిల్‌కి వదిలేసి వచ్చినది పెద్దపులులను చంపడానికి కాదు కదా !

"నెలకొక రోజున పిక్‌నిక్‌కి వెళ్ళడం మంచిదే. నాకు సంతోషంగానే వుంది. ఇంతకంటె ఏమీ అడగకండి. మీరు పిక్‌నిక్‌లకు వెళ్ళడం నాకు యిష్టంకాకపోతే ఎలిజబెత్‌ని మీరెప్పుడు వెడతారని, ఎందుకు వెళ్ళలేదు అని అడిగేవాడినికాదు. మీరు ప్రతిరోజు మైళ్ళకొద్దీ నడిచిరావడానికి షికారుకి వెళ్ళినా, బజారుకి ఏవో కొనుక్కుందుకు వెళ్ళినా నేనేమీ అభ్యంతరం చెప్పను. కాని ఈదడానికి, వేటకి మాత్రం వెళ్ళకూడదు. "నేను యిచ్చేదానికంటె అధికంగా అడగకండి నేను మీ కొక్క వేలు అందిస్తే చెయ్యంతా లాగెయ్యకండి."

"ఒకరికి ఏ విషయంలోనైనా కొస్త స్వేచ్ఛయిస్తే ప్రతివారికి అల్లా యివ్వాలనేమీ లేదు. ఒకరికి మంచిదయినది ఇంకొకరికి కాక పోవచ్చు. అది జ్ఞాపకం ఉంచుకోండి.

"పిక్నిక్‌లు – నెలకొకమారు, ప్రతిరోజు షికారుకివెళ్ళి రావడం, మీకు యిష్టమొచ్చినపుడు బజారుకి వెళ్ళడం, వేటకిగాని, చీకటి పడేసరికి తిరిగి రాలేనంత దూరానికిగాని వెళ్ళకుండా వుండడం. రాత్రి 9 గంటలకి ముందు మీరు తిరిగి రాక పోతే నా ఆజ్ఞలను ఉల్లంఘించినట్లే అవుతుంది.

మళ్ళీ చెప్తున్నాను, కొత్త సంగతులు ఏవీ చేయాలని సూచించవద్దు. పిక్నిక్‌కి వెళ్ళినరోజున మాత్రం బయట మీరు స్నానాలు చెయ్యొచ్చు, చెట్లు ఎక్కవచ్చు, నృత్యం చేయవచ్చు – కాని ఇతర దినాలలోకాదు. టీ పార్టీ లుండవు."

పాశ్చాత్య బృందం అనుకున్నారు – 'బాబా ఎలా చెప్పితే అలాగే చేద్దాము – ఆయనకి యిష్టంలేని పని చెయ్యడమెందుకు? ఆయన యిచ్చిన స్వేచ్ఛతోనే సుఖంగా వుందాము' అని సమాధాన పడ్డారు. పిక్నిక్‌లకు వెళ్ళకుండా ఉన్నవారికి ఉర్దు పాఠా లున్నాయి. వారు ధ్యానంకూడా చేయాలి మామూలుగా. ధ్యానం కొందరు యిష్టపడ తారు, కొందరు అసహ్యించుకుంటారు. "ప్రేమ చాలా ఉత్తమమైన ధ్యానము. అయితే ఆ ప్రేమతో ప్రియతముని ఒక్కక్షణమయినా మరువకుండా ఉండాలి. అప్పుడు ధ్యానమవసరం లేదు. మజ్ను లేలాని తప్ప దేనినీ తలచేవాడుకాదు. అన్నింటిలోనూ లేలానే చూచేవాడు."

"ఉర్దు ఆముదం లాటిది. అయితే మీరు అయిదేళ్ళుందామని అనుకుంటే నేర్చుకోక తప్పదు. అది ఎంత త్వరగా మీకువస్తే అంతమంచిది. కాని మీరంతా త్వరలో వెళ్ళిపోతాంగదా ఆ గొడవ కూడా యెందుకు మనకి అనుకుంటున్నారు." అలా అని బాబా కొందరిని కొన్ని ఉర్దు క్రియాపదాలు అడిగారు. ఎవరూ సరిగా ఉచ్ఛరించ లేకపోయారు. కాకా అప్పుడు ఆ మాటలు ఎలా పలకాలో చెప్పాడు.

8 వ తారీకున కిమ్‌కో (కిట్టీ, మార్గరెట్, డెలియా) బొంబాయి వెడతారు. గారెట్‌ను నా పనికోసం పంపించాను. అలా అని మీరంతా వెళ్ళనక్కరలేదు. కిమ్‌కో వెళ్ళి మూడు రోజులుంటారు. వెళ్ళి ఏమి చెయ్యాలో తరువాత చెప్తాను కిమ్‌కో :– మీరు వెళ్ళి బొంబాయిలో కాకా యింటిలో వుండాలి. అక్కడ అదిలేదు, యిదిలేదు అని సదుపాయాల గురించి ఫిర్యాదు చేయకూడదు.

మార్చి 14 వ తారీఖున అర్థచైతన్యా (sub-conscious) నుభవాల గురించి బాబా ప్రవచించారు........ "భ్రాంతికి ఆధ్యాత్మికానుభవానికి గల తేడాయేమిటి? (భ్రాంతిలో అసాధారణ విషయాలను చూస్తావు. కాని ఎప్పుడూ ఆనందంగా గాని శాంతంగా గాని వుండవు....")

ఇంకొక విషయంమీద మాల్కం అడిగాడు —

ఈ అనంతమయిన క్రమం మాయగా అవుతోంది.

పరిశుద్ధమయిన వ్యక్తి అవడంకంటె ఇంకా అతీతంగా ఎలా అవగలము ?

బాబా జవాబు చెప్పారు : "నీకు ఆత్మసాక్షాత్కారం ఎలా పొందాలో తెలుసుకోవాలని వుంది. కావలసిందేదో అది అడుగుతున్నావు. అది తెలుసుకోవడం కాదు. పొందడం. ఖైదులో బందీగా వున్నవాడికిగాని స్వేచ్ఛయొక్క గొప్పదనం ఎలా తెలుస్తుంది? నీటిలోవున్న చేపకి నీరే తెలుస్తుంది."

నడియా అప్పుడు అడిగింది - అయితే అన్నిటినీ మన కష్టాలను కూడా మంచిగా తీసుకోవాలి. కాదా బాబా?

"అవును. అన్నీ ఆ దేవుని ఆశీర్వాదమే."

ముందు అనుకున్న ప్రకారం మరునాడు మార్చి 15 వ తారీఖున బాబా వారిని మరల మూడుకార్లలో మెహెరాబాదుకి తీసుకుని వెళ్ళారు. బాబా ఏ కారులో ఎవరెవరు కూర్చోవాలో కూడా నిర్దేశించారు. ఒక్కొక్కరికి ఒక్కొక్క బిరుదు యిచ్చారు బాబా. షెవ్రలెట్ కారులో పెండు ది గ్రేట్, డ్రయివరుగా వుండాలి. (కారు నడపాలి) ఇంకా అందులో టామ్ ది లవర్, మాల్కమ్ ది మాగజైన్, జీన్ ది జ్యువెల్, మెరీ ది మెర్రి, నడియా ది నోయర్, కూర్చోవాలి.

ఫోర్డుకారులో ఎలిజబెత్ ది ఇటర్నల్ డ్రయివర్, నోరీనా ది మమా, రానో ది యునివర్సల్ మైండ్, రువానో ది హెవెన్స్,నానీ ది బిలవెడ్, కిట్టీ ది లవ్ కూర్చుని కాన్యూట్ అండ్ కిప్పీ (రెండు కుక్కలు) ది మ్యాసెన్జెన్‌ని కూడా కూర్చొపెట్టుకోవాలి.

ఓపెల్ కారులో బాబా ది ఇన్‌ఫినిట్, ఆదీ ది ఆల్ఫబెట్, మార్గరెట్ ది ఫోటో స్పిరిట్, డెలియా ది చంపక్, మరియా ది "బోయ్" ఎక్కాలి. ఈ కారు ఆదీ నడుపుతాడు. అన్నీ తెల్లవారుజామున రెండు గంటలకు బయలుదేరాలి. అందుకోసం రాత్రి 8 గంటలకే వీరందరినీ పరుండమని బాబా ఆజ్ఞాపించారు. రాత్రి ఒంటిగంటకు లేచి ఒకటిన్నరకి అందరూ టీ తీసుకున్నారు. పగలయితే ఎండి వేడి వుంటుందని రాత్రి బాగా పెందలాడే రెండు గంటలకే బయలుదేరి వెళ్ళారు.

ఏప్రిల్ మొదటి వారంలో బాబా అనేక ఆధ్యాత్మిక ప్రసంగాలు చేశారు. ఏప్రిల్ 2 వ తేదీన ఆశ్రమ జీవితాన్ని గురించి ఒక ప్రవచనం యిచ్చారు బాబా—

"పిచ్చియెత్తడమే ఆనందమయినపుడు మనసు సరిగా వుండడం తప్పు" అని చెప్పినట్లు రాహూరీలోని కొందరు "పిచ్చి" వారు పనిచేస్తారు. కొందరు ధ్యానం చేస్తారు. కొందరు ఆడుకుంటారు. వారిలో బాబాను చూడవచ్చును.

"మీలో కొందరు కుష్టురోగులకు సేవ చేయడము, స్నానం చేయించడము నాకు చూడాలనివుంది. మీలో కొందరు ధ్యాన నిమగ్నులవాలి. కొందరు పరివ్రాజకులుగాను, కొందరు సంతోషంగాను, కొందరు సన్నగాను, కొందరు అస్థిపంజరాల లాగ, కొందరు పెద్దగాను, కొందరు లావుగాను, వున్నాకాని అందరూ నాకోసం పని చేసేవారుగా ఉండాలి.

నా కోసం మీరు పనిచేయడమే ముఖ్యమయినది. లేకపోతే మనకి ఆస్పత్రులున్నాయి, నర్సులూ వున్నారు. నా కోసం మీరు పనిచేయాలి. (నాకోసం భిక్షాటన చేయాలి, వ్రాయాలి, నామీద ధ్యానించాలి, ఆ కుష్ఠురోగులను మీరు బాబా అనుకుంటే మీరు ప్రేమతో స్నానం చేయించగలరు. బాబా అందరిలోను వున్నాడు. నా తల వెంట్రుకలు ఎంత ప్రేమతో మీరు నీటితో కడుగుతారో, అదే ప్రేమతో ఒక కుష్ఠు రోగిని కూడా కడిగితే సెయింట్ ఫ్రాన్సిస్ స్థితిని మీరు ప్రదర్శిస్తున్నట్లే.) నాకోసం నాట్యం చేస్తే నామీద ధ్యానం చేసినవాడి అంత మంచి చేస్తారన్నమాట. కొందరు ఆటలంటే ఇష్టపడతారు. కొందరు పని అంటే ఇష్టపడతారు. మీరు నాకోసం పని చేసినపుడు, ఆడినపుడు అంతా ఒక్కటే. ఇదే వేదాంతము, సూక్ష్మంగా చెప్పాలంటే ఇదే క్రైస్తవ తత్త్వం చాలా సులభము. చాలా కష్టము కూడాను.

రామకృష్ణ అమ్మకి (దేవుడికి) చెప్పేవాడు "నా పాపాలను, నా సద్గుణాలను (పుణ్యాలను) నీ పాదాల ముందు ఉంచుతాను" అని.

పాపం, పుణ్యం రెండూ బంధనం కలిగించేవే. రెండూ బంధాలే - బంగారపు శృంఖలాలు కానీ, ఇనప సంకెళ్ళు కానీ రెండూ బంధించేవే.

మీరు తినండి, నాట్యం చేయండి-ఏం చేసినా అది చేసేటప్పుడు మిమ్మల్ని మీరు మరచిపోయి ఆ స్థానంలో నన్ను పెట్టుకోండి. అదీ కర్మ! 'నీవు' వెళ్ళిపోయినపుడు - నీ 'అహం' పూర్తిగా పోయినపుడు, నేను నీతో వున్నాను. కొంచెం కొంచెంగా 'నీవు' వెళ్ళిపోవాలి. ఈ రోజున నీ ముక్కు, రేపు నీ చెవి, తరువాత నీ కళ్ళు, నీ చేతులు అన్నీ, అందుచేత నీవు తినినపుడు, పరుండినపుడు, చూచినపుడు, వినినపుడు నన్ను తలుచుకోవాలి, మీరు అన్నీ అనుభవించండి. కాని అదంతా

బాబాయే అని అనుకోండి. బాబాయే అనుభవిస్తున్నాడు. బాబాయే తింటున్నాడు. బాబాలో బాగా నిద్రపోండి. మీరు నిద్ర లేచినపుడు బాబా లేస్తున్నాడని అనుకోవాలి. ఆ ఒక్క ఆలోచన చాలు. నీ కేదయినా నెప్పి వస్తే బాబాయే నెప్పితో బాధపడు తున్నాడని అనుకోవాలి.)

ఈ రోజు నుంచీ ఈ నూతన జీవితం అమలులోకి రావాలి. మిమ్మల్ని మీరు మరచిపోవడానికి ప్రయత్నించి బాబా చెప్పినట్లు అన్ని చేస్తే మీరు చేసిన పనీ్న మీకే చక్కగా ఉన్నాయని అనుభవిస్తారు. అదంతా ఆనందం. అంతా ప్రేమ-మనమే దుఃఖాన్ని సృష్టించుకున్నాము" అని చెప్పారు బాబా.

ఈ జీవిత విధానము ఒక గమ్యానికి దారి తీస్తుంది. అన్ని వేళలా బాబా లోనే నిమగ్నమై ఉండిపోవడం - అవతార పురుషుని అనుసరించడంలో వున్న కీలకం ఇదన్నమాట. ఆయనే సజీవ సద్గురువు, సజీవుడైన క్రీస్తు.

కొద్దిమంది ఉన్నారు: వారు మొదటిమాటుగా బాబాని దర్శించినపుడే ఆయన లోనే నిమగ్నమై వుంటారు. ఆయనే వారికి వున్న ఒక్క ఆలోచన; ఆయన గురించే వారు సాగించే చర్చలు, ఆయనే వారి యొక్క జీవన వ్యాపృత్తి. వారికి ఉన్న ఒక్క కోరికా ఆయన సేవ చేయడమే. దానిని ప్రేమ అనండి - ఏదయినా అనండి. వారికి తెలిసి చేసే పని ఆయన సేవలో కాలక్షేపం చేయడమే, ప్రేమ ద్వారా బాబా వైపుకి ఆకర్షింపబడినవారిలో ఆయన ప్రేమను సృజింపజేసి వారికి దానిని నిలుపుకోగలిగే శక్తిని ఇస్తారు. అది భౌతికమును ఆధ్యాత్మికమును ఒకే మారుగా సృష్టిస్తుంది మెహెరాబాద్ వెళ్ళి అక్కడి శిష్యులను శిష్యురాండ్రను చూచి, ప్రతి నిముషము బాబాలో తన్మయం అయిపోయి వారు పని చేస్తూంటే చూసేవారికి ఈ ఆలోచన తప్ప ఏదీ రాదు.

బాబా యొక్క జీవిత విధానమును అనుసరించుట నేర్చుకుని ఆయన ఆలోచన లోనే లీనమయి వారి జీవితాలను బాబామయం చేసుకొంటూ వుంటే అదే సరియయిన మార్గంలో వుండడం అని మనకు తెలుస్తుంది. మనం కూడా ఆ మార్గానికే వస్తాము.

ఇది పెద్దవారి స్థితి మాత్రమే కాదు. ఈ మధ్య కాలిఫోర్నియా నుంచి పదేళ్ళ కుర్రవాడు తనకి నిద్ర పట్టకపోతే వాళ్ళ అమ్మను "అమ్మా రెండు బాబా 'ముత్యాలను' చదువు అమ్మా?" అని అతడు ప్రతి రాత్రి పరుండే ముందు చదివించుకుంటూ వుంటాడు ఇలాటివి. —

"భగవంతుడు తప్ప ప్రతీదీ మాయా ప్రదర్శనమే."

"భగవంతుడు ఏదీ చేయకుండా అన్నీ ఆచరిస్తూ వుంటాడు."

"నేను ఒకే సమయంలో తింటాను. తినను కూడాను. త్రాగుతాను. త్రాగను కూడాను. చేస్తాను, ఏమీ చెయ్యను కూడా."

అతని తల్లి వ్రాస్తుంది - ఏ కారణం చేతనో గాని ఈ బాబా మాటలు అతనికి నచ్చాయి" అని.

ఏప్రిల్ 9 వ తేదీన చక్కని వాతావరణంలో బాబా వారి బృందాన్ని వెంట బెట్టుకుని ఆనంద లోయకు తీసుకొనివెళ్ళారు. అహమద్‌నగర్ సమీపంలో 13 మైళ్ళ అవతల వున్న ఆనందలోయ గాక నాసిక్ వద్ద ఒక ఆనందలోయ వున్నది. ఈ లోయలో సీతారామలక్ష్మణులు నివసించారని ప్రతీతి. ఆ పరిసరాలలో ప్రకృతి అంత రమణీయంగా వుంది గనుక దీనిని ఆనందలోయ - హాపీవాలీ - అన్నారు.

ఇది నాసిక్ ఆశ్రమానికి 8 మైళ్ళ దూరంలో గోదావరీ తీరంలో వుంది. ఎక్కడ జూచినా రసాల తరువులు కనబడతాయి. తరచు జనసంచారము లేని ఒక ప్రశాంతమయిన స్థలము. దూరాన గేదెలు నీటిలో చల్లదనానికి దిగివుంటాయి. అప్పుడప్పుడు స్త్రీలు నదీ జలాలు నీటితో బిందెలు నింపి, తలమీద పెట్టుకుని తీసుకువెళ్ళడం చూడవచ్చును.

ఉదయాన్నే బాబా 7-30 గంటలకు నాసిక్‌లో కారులో బయలుదేరారు. ఫ్రెని కారు నడిపింది. మిగిలిన వారంతా ఇంకో రెండు కార్లలో ఎక్కారు. ఒక కారు ఎలిజబెత్ నడిపింది. కారు దిగి కొంతదూరం నడిచి ఒక మామిడితోపు నీడలో విశ్రాంతి తీసుకున్నారు. బాబాయొక్క ఫోటోలు తీశారు. బాబాతో శిష్యుల యొక్కయు, శిష్యురాండ్ర యొక్కయు ఫొటోలు కూడా తీశారు. నానీ 40 రోజుల ఉపవాసంలో వుంది. ఆమె నారింజరసం నీరు తప్ప ఏదీ తీసుకోవడంలేదు. రువానో బోగిస్లావ్‌ని నానీతో కూడా బాబా ఉండమన్నారు. వారిరువురు మామిడి వృక్షాల ఛాయలో విశ్రాంతి గైకొనాలి. నడియా టాల్‌స్టాయిని కూడా బాబా వారితోనే ఉండమన్నారు. - ఈమె ఈ మధ్యనే జ్వరంపడి లేచింది. ఇతరులంతా ఒక మంచి నీడగల ప్రదేశం చూసుకుని డెక్ టెన్నిస్ ఆడుకున్నారు. అందులో బాబా కూడా చేరారు. తరువాత కర్రతోటి, రాళ్ళతోటి ఆడేఆధ్యాత్మిక విశిష్టత గల ఆటను బాబా ఆడించారు. అందరూ కలిసి ఆడుకున్నారు. అందరూ కలిసి భోజనం చేశారు. అందరూ కూర్చుని అనేక కథలను చెప్పుకున్నారు.

10_30 గంటలయే సరికి నారీనా ఆశ్రమానికి వెళ్ళి భోజనం పట్టుకుని వచ్చింది. వేడి వేడి అన్నము, కూరలు తీసుకు వచ్చింది. బాబా కూడా వారితో కుట్టుడాకులతో భోజనం చేశారు. తరువాత కొంచెంసేపు విశ్రాంతి. తదుపరి మళ్ళీ ఆటలు ఆడారు. దాహం తీర్చుకోడానికి నారీనా అందరికి చల్లని పానీయాలు కూడా తెచ్చింది భోజనంతో బాటుగా. బార్లీ నీటితోను, సోడా, నారింజ, కర్బూజా పండ్లతో బాబా ఒక పానీయాన్ని తయారుచేసి తీసుకున్నారు అందరికి కర్బూజా పళ్ళంటే యిష్టం కలిగింది భోజనాలయిన కొద్దిసేపటికి ఆదీయొక్క సోదరుడు రుస్తుం వచ్చాడు. బాబా అతని భార్య ఫ్రెనీని తీసుకురమ్మని అతనిని పంపించి రప్పించారు. అతడికి మలేరియా వచ్చి బాధ పడ్డాడు ఈ మధ్య. అతనిని మామిడిచెట్ల నీడను పరుండమని ఆయన బార్లీ నీటిని, పళ్ళ రసాలను యిచ్చారు. ఆ నీడలో ఆ చల్లనిగాలి అతనికి హాయి గొలిపింది.

బాబా వారి పరివారంతో మధ్యాహ్నం 2 గంటలకు బయలుదేరి 3 గంటలకు నాసిక్ ఆశ్రమం చేరుకున్నారు.

మాల్కమ్ ప్రతియొక్క శిష్యుడు బాబాతో తన అనుభవాలు వ్రాయాలని చెప్పగా ఆ సంగతి చర్చించాలని బాబా అందరిని సమావేశపరచారు. అది చాలా మంచి ఆలోచన అని అందరూ అంగీకరించారు. ఈ రచన లన్నీ తరువాత ప్రచురించబడిన మెహెర్ జర్నల్ అనే పత్రికలో అప్పుడప్పుడు ప్రచురితమయినాయి.

బాబా నోరీనాకి, నడియాకి, కిట్టీకి పర్డమ్ రచించిన పెర్‌ఫెక్ట్ మాస్టర్ ప్రతులు స్వయంగా సంతకం చేసి యిచ్చారు. సాయంకాలం 5 గంటలకు బాబా రాహూరికి వెళ్ళారు. మిగిలిన వారంతా ఆ దినశేషం విశ్రాంతి తీసుకున్నారు.

బాబా వారి శిష్యబృందానికి – "మీరు అంతా సంతోషంగా వుండాలి. తమాషాలు చేసుకుంటూ సరదాగా వుండాలి. కాని కొన్ని విషయాలలో – ధ్యానం మొదలయిన వాటిలో శ్రద్ధ జాగ్రత్త వహించాలి" అని చెప్పారు.

"నిరంతర ప్రార్థన – నిస్వార్థ సేవ ఈ రెండూ కూడా మనసును ప్రాపంచిక విషయాల మీదకి పోకుండా ఉంచేందుకు ఆధ్యాత్మిక విషయాల మీదకి పోయేలా చూడటానికి మిక్కిలి అవసరం" అన్నారు బాబా.

బాబా చెప్పిన ప్రకారం వారి శిష్యులు అప్పుడప్పుడు ఉపవాసాలు చేసేవారు. ఒక్క నానీగేలీని మాత్రం 40 రోజులు వరుసగా ఉపవాసం చేయమని బాబా ఆజ్ఞాపించారు. అప్పుడు ఆమె మంచినీటిని నారింజ రసాన్ని తీసుకునేది. బాబా ఆజ్ఞ

ప్రకారం. బాబా ఈ ఉపవాస దీక్షను కఠినంగా పర్యవేక్షించేవారు బాబా జన్మదినం ముందు ఆయన నెలరోజులు ఉపవాసం చేసినపుడు శిష్యబృందంలో ప్రతి యొకరిని ఆయనతోపాటు ఒక్కొక్కరోజు ఉపవాసం ఉండడానికి సమ్మతించారు ఏ రోజున ఎవరు ఉపవాసం ఉండాలో బాబాయే నిర్ణయించి చెప్పేవారు. ఆ పాశ్చాత్య శిష్యులు ఉపవాసం చేసిన రోజుల్లో రెండు కప్పుల పాలు తీసుకుంటూ వుండేవారు. కావలసినంత మంచినీరు త్రాగేవారు. బాబా నీరు మాత్రమే తీసుకుంటూ ఉపవాసం ఉన్న రోజుల్లో వారుకూడా అలాగే చేసేవారు.

ఒకామె ఒక రోజున ఉపవాసం చేసి ఆ సాయంత్రం ఇలా అనుకున్నది – "నే నెంతో హాయిగా ఉన్నాను. దేవునిలో ఐక్యం అయిపోయేదాకా బాబా కోసం పని చేస్తూ ఆయనకి విధేయురాలనై వుండాలి. నేను ఎప్పుడూ ఏడవను. బాబా యొక్క ప్రేమచేత ఆయన సౌందర్యముచేత ఆయన పడే బాధను చూచి ఆగలేక పోతే తప్ప. నా స్వంత కారణాలచేత మాత్రం ఎప్పుడూ ఏడవను." ఈ విధంగా ఆమె డైరీ – (దినచర్య పుస్తకం) లో వ్రాసుకుంది.

ఏప్రిల్ 12 వ తారీకున రాహూరి నుంచి బాబా రాత్రి అందరి భోజనాలు అయాక ఎవరూ అనుకోకుండా నాసిక్ ఆశ్రమానికి వచ్చారు. ఆయన రావలసిన రోజు 13 వ తేదీ. మొత్తం ఆశ్రమాన్ని 'మెహెర్ రిట్రీట్' అని పేరు పెట్టారు. ఆశ్రమ ప్రధాన భవనానికి 'మంజిల్ మీమ్' అని పేరు. అందరూ బాబా కారు ఆగగానే మంజిల్‌మీమ్ బయట గేటువద్ద నిలబడ్డారు. ఒక్కొక్కప్పుడు బాబా దిగగానే ఆయనను కౌగిలించుకునేవారు. ఈనాడు బాబా దిగగానే ఎవరూ తమను స్పృశించ వద్దని సైగ చేశారు. ఆయన ఆంతరికమైన పని చేస్తున్నారు. బాబా దిగి వచ్చిన తరువాత అందరూ ఆయన యెదుట కూర్చోటానికి అనుమతించారు. ఆ కూర్చోవడం ముందు వసారా మెట్లమీద కూర్చున్నారు. ఎలిజబెత్ యొక్క బోస్టన్ టెర్రియర్ అయిన 'కిప్పీ' పరుగెత్తి వచ్చి ఆయన పాదం నాకుతూంటే ఒక నిమిషం దానిని ఎత్తుకుని బాబా ఒడిలో పెట్టుకుని దింపేశారు.

కిట్టీ యెక్కడ వుందని బాబా అడిగారు. "ఆమె దగ్గరకే బయటకు షికారుకు వెళ్ళిందని" చెప్పారు. "చీకటి పడినా ఇంకా రాలేదేం కిట్టీ అన్నారు బాబా. బాబా వస్తారని ఆమెకు తెలియదు. అందరినీ బాబా తోటలోకి తీసుకువెళ్ళి నిశ్శబ్దంగా కొంతసేపు కూర్చున్నారు. బాబా మళ్ళీ "కిట్టీ వచ్చిందా?" అని అడిగారు

అప్పటికీ ఆమె రాలేదు. బాబా వారిని వదలి ఆయన గదిలోకి వెళ్ళారు. కిట్టీవస్తే చెప్పండి- "ఆమె మంచిలోను, చెడ్డలోను అన్నివిధాలా అద్భుతంగా వుంది" అన్నారు.

బాబా వచ్చినప్పుడు ఆయన తిరిగి వెళ్ళేముందు అందరూ కూర్చునే గదిలోకి అందరినీ పిలిచి అందరితోను అరగంట కూర్చునేవారు. ఆ సమయాలలో "ఆ ఆనందమయిన క్షణాలు మరుపురానివి. అవి అఖండానందానికి చాలా దగ్గర అయిన సమయాలు. ఎంతదూరంలో వున్నా ఎంతకాలం అయినాఅవి మరచిపోలేము" అని ఎలిజబెత్ అంటుంది. ఆమె బాబా సన్నిధానంలో ఆనంద రసాంబుధిలో తేలియాడడం అనుభవించింది.

ఏప్రిల్, మే నెలలలో బాబా నాసిక్‌లో ఎక్కువ సమయం గడిపేవారు. ఆయన ఎన్నో అనందమయిన ప్రసంగాలు, ప్రవచనాలు చేశారు. ఆశ్రమంలో ఉండే దినాలు అయిపోతున్నాయని శిష్యులకు తెలియదుగాని బాబాకు తెలుసును. ఆయన వేరే పథకాలు వేశారు.

ఏప్రిల్ 13వ తేదీ సాయంకాలం బాబా అందరినీ పిలిచి మాట్లాడకుండా ఆయనవద్ద కూర్చోమన్నారు బంగాళా బయట పచ్చనిగడ్డి నేలమీద

బాబా అక్షర ఫలకంమీద ఇలా చెప్పారు- "రేపు సాయంత్రం అందరూ మౌనంగా ఉండాలి. ఒక ముఖ్యమయిన షరతు. ఎవ్వరూ అటూ యిటూ చూడకుండా బాబా ముఖంకేసే చూస్తూ తానూ బాబా తప్ప ఇంకెవరూ లేరని భావించాలి ఎవరిమట్టుకువారు."

"బలవంతాన కాకుండా సహజంగా అలా అనుకోగలగాలి. మీకు శరీరాలున్నాయన్న మాటే మరిచిపోవాలి. మీ శిరమే మీ గాత్రానికి ప్రధానం గనుక శరీరం మరిచిపోయి మీరు నన్నుగురించే ఆలోచించాలి."

ఐల్—— "మా తలలో ఆలోచనల ఒత్తిడి కలిగితే ఏం చెయ్యమంటారు?"

బాబా—— పరుండండి. నిద్రపోడానికి పరున్నట్లు. ఒక కిటుకు చెబుతాను. మీరు కళ్ళు మూసుకుంటే మీ శరీరం కనబడదు. దానిని అప్పుడు మరచిపోవడం సులభం.

అది కష్టంలేకుండా సులభంగా చేయండి. చేయలేకపోతే విచారించవద్దు. తరువాత ఒకరోజున మాట్లాడుచుండగా-

నడియా— "నేను నిన్న కళ్ళుతెరిచే కూర్చున్నాను"

బాబా— మీరు దృష్టిని కేంద్రీకరించి నాకేసి చూస్తూంటే చాలా మంచిది. అప్పుడు మీ శరీరాన్ని మరిచిపోగలుగుతారు. మీరు కళ్ళు తెరిచేవుంచుకుని మీ దృష్టిని నామీద కేంద్రీకరించి మీ శరీరాలను మరిచిపోగలిగితే అది చాలా మంచిది. ఈ విషయం మీకే వదిలేస్తాను.

"నేను ప్రపంచంకోసం అంతరికంగా పనిచేస్తాను. ఆ సమయంలో మీరు మీ దేహాలను మరిచి బాబామీద కేంద్రీకరిస్తే మీరు నా పనిలో పాల్గొన్నవారవుతారు. నా పనికీ నాకు అవినాభావం కలదు. పూవూ తావీవలె. ముల్లు,దానికివున్న గుచ్చుకునే గుణం అవినాభావంకలవి. కాని గుచ్చుకోవడం అనేదే ముల్లుకాదు. వాసన గులాబీలో వుంది. కాని గులాబీ ఆ సుగంధము కాదు."

సృష్టి దానియొక్క ఉద్దేశము గురించి బాబా ప్రవచించి ఇలా ముగించారు— "భగవంతునికి శక్తి, ఆనందము, వెలుగు, శాంతి వున్నాయి. కాని ఆయన వ్యక్తీకరించాలని కోరతాడు. చైతన్యమును పొందేటందుకు ఈ తమాషా అంతా ప్రారంభం అయింది. అయినా ఈ తమాషాలో నేను బాధపడతాను."

ఒక ప్రశ్నకు సమాధానమిస్తూ బాబా చెప్పారు—"బాధ, అహంకారం తొలగించడానికి అవసరమయినది. కోటుమీద డాగుపడితే అది పోవడానికి ఆ కోటు రుద్దడం ఎంత అవసరమో అలాగే")

నాసిక్‌లో ఉన్నపుడు తమ శిక్షణకేంద్రంలో ఉన్న ప్రాచ్య పాశ్చాత్య శిష్యులందరికీ ప్రియతమ బాబా సామరస్యం చాలా అవసరమని చెప్తూ ఇలా ప్రసంగించారు. ఆరోజు తేది–1937, ఏప్రిల్ 23.

"భూమికలు అనీ సమాధి అనీ దాని శక్తులనీ మీరేమి గొడవపడకండి. ఐక్యం కోసం వాంఛించండి. ఓర్పు వహించండి ఈ వాంఛ భగవంతునికోసం. అలాగే ఆయన అనుగ్రహం కోసమన్నమాట. నేను చెప్పినట్లు చేయండి.

"ఆ కోరిక మీరు ఉంచుకుంటే ఆ వాంఛలో మీకు నేను సహాయం చేస్తాను. ఎందుచేతంటే అదంతా నేనే. నేను ఇక్కడి (తమ హృదయం చూపుతూ) నుంచి ఇస్తాను. మరి నేను అక్కడ (వారి హృదయాలు చూపుతూ) నుంచి అందుకుంటాను.

"అహంకారం రూపు మాసిపోడానికి బాధ చాలా అవసరం. అన్ని పనులూ చేయండి. కాని వ్యాకులపడవద్దు. కలత చెందితే అది మిమ్మల్ని బంధిస్తుంది.

ఈ చింతలకి మీరు అతీతులయితే మీరు సుఖంగా వుంటారు. మీరు తెలిసియుండి వ్యాకుల పడకూడదు. రాయి వుంది. దానికి ఏ చీకూ చింతాలేమ. అయితే దానికి చైతన్యంలేదు. తెలివిలేదు మీరు వ్యాకులపడకపోతే అంతా ఒక తమాషా అన్న మాట. ఒక ఆట అన్నమాట అదే సుఖం.

"మీరు స్వేచ్ఛచేతనే బంధింపబడి ఉండాలి. నిర్లిప్తతకే ఆసక్తులయి ఉండాలి. అంటే కోరిక లుంచుకోండి; కాని వాటికి బానిస కాకూడదు. వాటికి యజమానిగా వుండాలి.")

23—4—37వ తారీకున రాహూరీ ఆశ్రమం యావత్తు రాహూరీనుంచి మెహెరాబాద్‌కి తరలించారు బాబా ఆజ్ఞప్రకారం. అక్కడున్న పిచ్చివారు మస్తులు చాలామట్టుకు మెహెరాబాద్‌కి వచ్చేశారు. వారితోబాటు మహమద్‌మస్తు కూడా మెహెరాబాద్ వచ్చాడు.

మెహెరాబాద్ వచ్చాక కొందరు కొత్తవాళ్ళు ఆశ్రమంలోచేరారు. ఈ ఆశ్రమ వాసులను గురించి కొంతవరకు తెలుసుకుందాము—

1. అర్జ్యున్ :- మెహెరాబాద్‌లో చేరారు. ఇతడు కొద్దిమంది నిజమయిన మస్తులలో ఒకడు. పొడవైన జుట్టు, పొడవైన గోళ్ళు కలవాడు. ఇవి పొట్టిగా కత్తిరించుకోవడం అతనికి యిష్టంలేదు. మొదట్లో అతని జుట్టులో పేలుండేవి. ఆశ్రమంలో బాబా మనుష్యులు జాగ్రత్తగామందులువాడి వాటిని లేకుండా చేశారు. ఇతడు ప్రతిరోజు 24వ నెంబరు సైజు రెండుబకెట్లనిండా మంచినీరు త్రాగేవాడు. ఇతనికి అందుచేత మూత్రము చేసుకోడానికి తరుచుగా వెళ్ళవలసివచ్చేది. కాని విరోచన బద్ధకం వుండేది అర్జ్యున్‌కి. అది ఎంత ఎక్కువగా ఉండేదంటే ఇంచుమించు పదిహేను రోజులకొక విరేచనం అయేది అతనికి, ఇలావున్నా అతని ఆరోగ్యం బాగానేవుండేది. ఇతని స్వస్థానం పండరీపురం. ఆశ్రమం 1940 సం॥లో ఎత్తేసినపుడు అర్జ్యున్‌ని బాబా పండరీపురం పంపించేశారు.

2. బచ్చురాయిజీ :- ఒక యువకుడు. ఎవరయినావస్తే అతనికేసి చూసినవ్వే వాడు. ఇతడు దొడ్లోకి వెళ్ళినపుడు ఆ మలాన్నితీసి దొడ్డిగోడలకు పిడకలా వేసేవాడు. ఏమిటీ చండాలపుపని అని గట్టిగా అడిగినపుడు నేను గోడలకు సున్నం వేస్తున్నాను అనేవాడు. అందుచేత ఇతడు దొడ్లోకివెళ్ళినపుడు అలా

చేయకుండా ఎవరయినాకూడా వెళ్ళి చూస్తూండేవారు. మూత్రానికి కూడా తరుచుగా వెడుతూండేవాడు. ఒకరోజున లెక్కపెడితే 55 మార్లు ఆ రోజున వెళ్ళినట్లు తేలింది. చివరకు ఈ విషయంలో కొంత నిగ్రహం చేయమంటే చాలా మట్టుకు తగ్గించాడు. ఇతడొక పిచ్చివాడు.

3. భాయ్యా :- ఇతడు మెహెరాబాద్‌లోనే ఆశ్రమంలో చేరాడు. ఎప్పుడూ తనకు 12000 రూపాయిలూ, ఒక కన్య కావాలని అడుగుతూ వుండేవాడు. సామ్లు అనే అతనితో అస్తమానం కూర్చునేవాడు. అతడు అలాగే తెచ్చిపెడతానులే అని వాగ్దానం చేసేవాడు.ఒక్కొక్కప్పుడు కప్పలా పెద్ద నోరు తెరుచుకుని చూస్తూండేవాడు. ఇతడికి పిచ్చి.

4. భిక్కు :- రాహూరినుంచి మెహెరాబాద్‌కి వచ్చాడు. అతడు పాపం మెహెరాబాద్‌లో జబ్బుచేసి చనిపోయాడు. ఇతడూ పిచ్చివాడే.

5. అహమద్ :- మహమ్మదీయులు అధోగతి పొందుతున్నారని వగచేవాడు. ముఖ్యంగా లాల్‌సాహెబ్ అనేవానిని తిట్టేవాడు. బైదుల్‌కి ఇతర ఆశ్రమవాసులకు డబ్బు యిచ్చానని చెప్పేవాడు. ఆ డబ్బు మళ్ళీ యిప్పించమని కోరుతూ బైదుల్‌ని వేధించేవాడు. కొన్ని సమయాలలో దిగంబరిగా వుండేవాడు. ఇతడు పిచ్చివాడు.

6. దగ్డుబువా :- రాహూరీ ఆశ్రమంలో వుండేవాడు. మెహెరాబాద్ వచ్చాక ఆశ్రమంలో ఒకచోట నుంచి ఇంకోచోటకి మట్టి తీసుకువేళ్ళేవాడు. అస్తమానం చీపురు తీసుకువచ్చి ప్రధాన భవనంలో హాలు తుడుస్తూ అందరికీ ఇబ్బంది కలుగజేసేవాడు.

7. దాతాస్వామి :- మెహెరాబాద్‌లోనే ఆశ్రమంలో చేరాడు. ఈతడొక వృద్ధుడు. నెమ్మదిగా ఉండేవాడు. తనలోతాను గొణుగుకుంటూ ఉంటాడు. ఇతడు పిచ్చివాడు.

8. ఏక్‌నాధస్వామి :- మెహెరాబాద్‌లో ఆశ్రమంలో చేరాడు. నడి వయస్కుడు. నెమ్మదయిన పిచ్చివాడు.

9. ఫ్రాన్సిస్ :- క్రైస్తవ యువకుడు. మెహెరాబాద్‌లో చేరాడు. రోజంతా చాలాభాగం నెమ్మదిగా కూర్చునేవాడు. ఒక్కొక్కప్పుడు గట్టిగా అరిచేవాడు. అప్పుడు చుట్టుప్రక్కలవారిని తిట్టేవాడు. ఇతడొక పిచ్చివాడు.

*10.* గణ్‌పత్‌రామ్‌జీ :- మెహెరాబాద్‌లో చేరాడు. కుంటివాడు. నడివయస్కుడు. వృత్తి చెప్పులు కుట్టడం. నెమ్మదిగా మాట్లాడేవాడు. బాబా అంటే అమితమైన గౌరవం. భగవదున్మత్తుడు.

*11.* గోవింద్ :- మెహెరాబాద్ ఆశ్రమంలో చేరి కొన్నాళ్ళున్నాడు.

*12.* గులాబ్ సాహెబ్ :- ఎప్పుడూ అర్థంలేని వాగుడు వాగుతూండేవాడు. పొట్టిగా ఉండేవాడు. ఒక నెలరోజు లున్నాడంతే. ఇంక ఉండటం ఇష్టంలేక పోతే బాబా అతనిని పంపించేశారు. ఇతడు పిచ్చివాడు.

*13.* ఈసా :- మెహెరాబాద్‌లో చేరిన మధ్యవయస్కుడు. ఇతనికి మూర్ఛ రోగం వుంది. మాట్లాడినపుడు తమాషాగా సంజ్ఞలు చేసేవాడు. ఇతడు పిచ్చివాడు.

*14.* ఇస్మాయిలు:- తాను ప్రేమించిన ఒక పిల్లమీద పాటలు పాడుతూండేవాడు. పేరు పెట్టి పిలిచినపుడుగాని ఏదయినా అతనితో చెప్పినపుడుగాని—"ఒకటి, రెండు, ఎనిమిది, ఆరు" అనేవాడు. ఇలా తనకు తోచిన అంకెలు ఏకరువు పెట్టేవాడు. ఇతనికి పిచ్చి.

*15.* కల్లూ :- అనే పిచ్చివాడు—మెహెరాబాద్‌లో చేరాడు. పోట్లాడేరకం; కొన్ని సమయాల్లో పాడేవాడు.

*16.* లల్లూ :- అనే వాడుకూడా మెహెరాబాద్‌లోనే చేరి కొన్నాళ్ళున్నాడు.

*17.* మహాగని :- చాలా పొడవైన మనిషి. ఏదో ఒకమాట పుచ్చుకుని అదే పాడుతూండేవాడు. ఒక్కొక్కపుడు అన్నం తిననని భీష్మించుకునేవాడు. ఒక కుక్కను కూడా తనతో కూర్చోపెట్టి దానికి కూడా అన్నం పెట్టాలి అనేవాడు. అతడక్కడనుంచి యెవోలా వెళ్ళాడు. ఇనపముక్కలు తీగలు శరీరం మీద పెట్టుకునేవాడు. ఇత్తెఫాకీ మస్తులాగ. ఒక పాత ఖడ్గము తనవద్ద ఉంచుకునేవాడు. ఎవరయినా కనిపిస్తే డబ్బు యిమ్మని అడిగేవాడు. ఇతడు భగవదున్మత్తుడు.

*18.* మానెక్ ఛంద్ :- ఇతడు మెహెరాబాద్ ఆశ్రమంలో చేరాడు. కొత్తగా వచ్చినపుడు జేబులనిండా 20 మార్వారీ టోపీలు కుక్కుకుని వచ్చాడు. ఇవి

తీసి పారెయ్యమంటే వద్దనేవాడు. స్నానం చేయిస్తానంటే వద్దనేవాడు. అన్నం తింటూ తింటూ జేబుల్లో కొంత దాచుకునేవాడు. అలా దాచి ఇంకా కావాలని అడిగేవాడు. అప్పుడప్పుడు తన కెన్నో ఎకరాలున్నాయని బడాయిలు చెప్పేవాడు.

*19.* మంగళదాస్ :— అనేవాడు మెహెరాబాద్‌లోనే చేరాడు.

*20.* పటేల్ :— అహమద్‌నగర్ వద్దనున్న ఒక గ్రామం నుంచి వచ్చి మెహెరాబాద్‌లో చేరాడు. రాత్రిళ్ళు ఎవరికీ తెలియకుండా నిద్రపోతున్న బైదుల్ వద్దకు వెళ్ళి అతడు కప్పుకున్న శాలువా లాగేసేవాడు. ఒక్కొక్కప్పుడు తన గుడ్డలు విప్పేసేవాడు. కొన్ని సమయాలలో నేలమీద దొర్లుతూ "నన్ను కొట్టేస్తున్నారు బాబోయ్" అని గోలపెట్టేవాడు, ఇతనికి ఆకలి ఎక్కువగా వుండేది ఇంకా కావాలని పెట్టించుకుని కక్కుకునేదాకా తినేవాడు. కక్కుకుని కూడా ఇంకా కావాలనేవాడు. ఆఖరున గొంతుకు చించుకుని పాట పాడేవాడు. ఇతడు పూర్తి పిచ్చివాడు.

*21.* పీరా :— ఒక ముసలివాడు. ఇతనితో వేగడం కష్టంగా వుండేది. ప్రతివానితోటి పన్ను నెప్పి బాధగావుందని చెప్పేవాడు తన ముఖంమీద తనే బాదుకుని ఇతరులను తిట్టేవాడు, పిచ్చివాడు.

*22.* మెహెరాబాద్‌లో చేరిన రెహ్మాను అనేవాడొకడుండేవాడు.

*23.* సాల్లు :— మధ్య వయస్కుడు. గడ్డం పెంచాడు. ఏదో వాగుతూ వుండేవాడు. లాల్‌సాహెబ్ దగ్గర కూర్చునేవాడు. అతనికి పద్యాలు పాడి వినిపించేవాడు. అక్కడి ఆశ్రమవాసులు ఆడిన నాటకంలో రాజు పాత్ర వేశాడు. యెవోలాలో తిరుగుతున్నాడు ఇక్కడినించి వెళ్ళాక. ఇతడొక పిచ్చివాడు.

*24.* షా సాహెబ్ అరబ్ :— కేకలేసుకుంటూ మెహెరాబాద్ ఆశ్రమం అంతా తిరిగేవాడు, పిచ్చివాడు.

*25.* షెరియార్ :— ఇతడొక పిచ్చి ఇరానీ. నెమ్మదిగా వుండేవాడు.

*26.* షేక్ మన్నాన్ :— నెమ్మదయినవాడు - తాను రాజుగా వుండేవాడినని చెప్పుకునేవాడు. కొన్ని సమయాల్లో ఇతరులను తిట్టేవాడు-పిచ్చివాడు.

27. వాసంత్ :- మెహెరాబాద్‌లో చేరాడు. అన్నం పెడితే అన్ని వైపులకి చిమ్మేసి అందరినీ తిట్టేవాడు. అందుచేత ప్రత్యేకంగా ఒకడు ఎంతో ఓర్పుతో అన్నం పెట్టేవాడు వీనికి. ఇతడు పిచ్చివాడు.

1937 మే. 1 వ తారీకున కొన్ని ప్రశ్నలకు జవాబులిస్తూ ఇదివరకు ఒక మారు చెప్పిన సంగతే బాబా ఇలా వివరించారు. విషయం సద్గురు పాద ప్రక్షాళనము "పాదాలు శరీరానికి అన్నిటికంటె అధో భాగంలో వుంటాయి కదా. కాని ఆధ్యాత్మికంగా వాటికి అన్నిటికంటె ఉన్నతస్థానం వుంది. భౌతికంగా పాదాలు మంచి-చెడ్డ అందము-అసహ్యము. పరిశుభ్రము-మలినము వీటి అన్నిటిలోనుంచి వెడతాయి. అయినా అవేవీ అంటకుండా అతీతంగా ఉత్తమంగా వుంటాయి. విశ్వంలోని అన్నిటికంటె సద్గురు చరణాలు ఉన్నంతగా మిన్నగా వుంటాయి. వాటికి మిగిలిన వన్నీ ధూళితో సమానం.

"ప్రజలు వచ్చి సద్గురు పాదాలను వారిచేతులతో తాకినపుడు వారియొక్క సంస్కారాల భారాన్ని అతనిమీద ఉంచుతున్నారు. విశ్వమంతటి నుంచి అతడు సంస్కారాలు ప్రోగుచేస్తాడు-మామూలు మనిషి నడుస్తూ తన పాదాలకి ధూళి అంటించుకుంటున్నట్లు.

ఎవరు సద్గురువును గాఢంగా ప్రేమిస్తారో, సాధ్యమయినంతవరకు ఆయన పంచుకుందామనుకుంటారో వారు అతని పాదాలను తేనెతోను (ఎర్రని సంస్కారములను), పాలతో (తెల్లని సంస్కారములను) కడుగుతారు. అతని పాదాలచెంత కొబ్బరికాయను (వారి మనసును) ఉంచి వారు గురువుకు పూర్తి సమర్పణ అవుతారు."

ఆ రోజునే పాశ్చాత్య శిష్యులు మెహెరాబాద్ వెళ్ళవలసినరోజు గనుక వెళ్ళారు తిరిగి వచ్చేటప్పుడు బాబా వారిని తిన్నగా నాసిక్‌కు తీసుకువెళ్ళ కుండా సరోష్ కె. ఇరాని అహమద్‌నగర్‌లో నడుపుతున్న సర్కిల్ సినిమాకి తీసుకుని వెళ్ళారు. అందరూ 'బోర్న్ టు డాన్స్' అనే మంచి ఫిలింను చూశారు. మధ్యలో మార్గరెట్‌కి అకస్మాత్‌గాతలనొప్పి, పోటు, వికారమువచ్చినది అదీని ఒక ఆస్పిరిన్ బిళ్ళ అడిగింది. బాబా ఏమిటి సంగతి అని అడిగారు ? ఆమె బాబాకి ఈ సంగతి విన్నవించింది. బాబాను చెప్పగానే ఆమెకి నొప్పి తగ్గిపోయింది. మందు అక్కర్లేక

పోయింది. సినీమాలో వారు టీ, కేకులు తీసుకున్నారు, రాత్రి 9 గంటలకు నాసిక్‌కు కార్లలో బయలుదేరి అక్కడికి పాశ్చాత్యులు అర్ధరాత్రికి చేరుకున్నారు బాబా అహమద్‌నగర్‌లో ఉండిపోయారు. వారితో కిట్టీకూడా ఉండిపోయింది.

మరునాడు ఉదయం (మే 2 వ తారీకున అదీ తెల్లవారుజామున 5 గంటలకే లేచాడు. రాత్రి అహమద్‌నగర్‌లో బయలుదేరిన పాంటియాక్ కారు నాసిక్ చేరలేదని టెలిగ్రాం వచ్చింది అందులో డ్రైవరుకాక శామ్, నడియా, మాల్కమ్ రువానో వెళ్ళారు. అందుచేత డా॥ నీలు, ఆదీ జూనియర్) నాసిక్ నుంచి వెదుకుచూ బయలుదేరారు. రానో, విల్ బాకెట్, నానీ, డెలియా, మాల్యా వీరికి ఒళ్ళు బాగాలేక నాసిక్‌లోనే ఉండిపోయారు. నొరీనాకూడా పరుండియె యుండెను. ఇంతమంది రాలేదని బాబాకి కొంచెం ఆశాభంగమే కలిగింది. పాంటియాక్ మధ్య దారిలో పాడయిపోయినందున ముందుకు వెళ్ళలేదు. అందులో బయలుదేరిన వారిని ఆదీ అహమద్‌నగర్ తీసుకు వచ్చాడు. వారు రాహూరీకి 30-40 మైళ్ళ దూరంలో ఆగిపోవలసి వచ్చింది. అక్కడ నుంచి వార్త పంపడానికి ఏ సౌకర్యమూ లేకపోయింది. తెల్లవారుజామున 4 గంటలకు అహమ్మద్‌నగర్‌కి ఒకబండి వెడుతూంటే బాబాకు తెలియజేయమని సరోష్ మోటార్‌వర్క్సుకి కబురు చేశారు.

అందరూ రాత్రంతా రోడ్డు ప్రక్క ఆరుబయట గడిపారు. మధ్యాహ్నం 2-30 గంటలకు బాబానుంచి ఆ రాత్రికి నాసిక్ వస్తున్నట్లు టెలిగ్రాం వచ్చింది. సుస్తీగా వుందని పరున్నవారి కందరికీ ఆ వార్త వినగానే ఆరోగ్యం బాగాలేకపోయినా కొంచెం జవసత్వాలు వచ్చాయి. ఆ రాత్రి 8 గంటలకి బాబా నాసిక్ చేరారు. అందరి వద్దకు వెళ్ళి చూచారు. అదొక ఆసుపత్రిలాగుంది. బాబా ఒక డాక్టరుని తీసుకుని ఒక శిష్యుని వెంటబెట్టుకునివచ్చి ముందు రానోని చూచారు. ఆమెకు వంట్లో ఏమీ బాగాలేదు. డాక్టర్ టైఫాయిడ్ కావచ్చునని అభిప్రాయపడ్డారు. ఆమెకు వెంటనే ప్రత్యేకమైన గది ఏర్పాటు చేయించారు. నానీ గదికి ప్రక్కగదిలో రానో మంచం వేయించారు. అంతా శాంతంగా వుండాలన్నారు. సంగీతాలు, గ్రామఫోనులు పనికి రావన్నారు. బాబా చెప్పిన ప్రకారం రానోకి పథ్యపానాలు జరిపించే బాధ్యత రువానో బోగిస్లోవ్ మీద పడింది.

ఏ జబ్బు లేకుండా వున్నవారు బాబాను చూడడానికి ఆ సాయంత్రం అవకాశం లేకపోయింది. రుస్తుంభార్య అయిన ఫ్రెనీకి గుడ్‌నైట్ చెప్పి బాబా కొత్తబంగళా అయిన సార్‌సెట్‌కి వచ్చేశారు. విల్ బాకెట్‌తో కొద్ది నిమిషాలు గడిపారు. తరువాత

బాబా ఒక్కరూ షికారుకి వెళ్ళారు. రాత్రి కావలి కాసే సింగ్ లాంతరు పుచ్చుకుని గేటువద్ద నిలబడి బాబా తిరిగి వచ్చేదాకా ఎదురుచూస్తూ వున్నాడు. అందరూ ఆ రాత్రికి పరున్నారు.

మర్నాడు ప్రాతఃకాలమున (1937 మే 3వ తారీకు) బాబా ఇంకా రానో గురించి ఆందోళన చెందుతున్నట్లుగానే వున్నారు. ఆమెకు చాలా జబ్బుగా వుందని అందరితోనూ చెప్పారు. ఎవరూ ఆమె వద్దకు వెళ్ళవద్దని చెప్పారు.

నాసిక్‌లో వున్న డాక్టర్లలో మంచివాడగు ఇంకో డాక్టరుకి కబురంపి రప్పించి రానోని పరీక్ష చేయించారు. బాబా 'రానోకి ఎస్. యు. సి. ఇంజక్షన్ యిచ్చి వుండవలసింది' అని అంటే ఆ డాక్టరు బాబాతో ఏకీభవించి "అవును అది యిచ్చివుంటే తరువాత జ్వరం వచ్చేది కాద"న్నాడు. బాబా చాలా విచారంతో "ఆమెకు ఈ బాధ లేకుండా వుండేదికదా అలా చేసివుంటే" అన్నారు.

బాబా ఎవరినీ రానో గదిలోకి తొంగిచూడను కూడా చూడనియ్యలేదు. ఎవరి మట్టుకి వారు అక్కడా అక్కడా వసారాలోను కాలక్షేపం చేస్తున్నారు. బాబాయే ఎన్ని మార్లయినా రానోకి మందులు స్వయంగా యిచ్చేందుకు ఆమె వద్దకు వెళ్ళి యిచ్చే వారు. తరువాత 3, 4 రోజులు వరుసగా బాబా డాక్టరుతో వచ్చి రానోను చూసే వారు. మే 6వ తేదీ నాటికి ఆమెను నెమ్మది కలిగింది. బాబా మెహెరాబాద్‌కి వెళ్ళారు. ఈ విధంగా బాబా ఒక తల్లికంటె ఎక్కువ ప్రేమతో రానో జబ్బులో ఆమెను చూడడంవల్ల ప్రేమికు లందరికి బాబా అంటే ఇంకా గాఢమైన ప్రేమ ఏర్పడింది.

బాబా నాసిక్ నుంచి వెళ్ళేముందు అందరినీ పెద్ద గదిలోకి పిలిచి వారితో వర్షాకాలంలో ఏమి చేయాలి ఏమి ఏర్పాట్లు చేసుకోవాలి అని చర్చ చేశారు. తరువాత పాల్ రోబ్‌సన్ పాటలు రికార్డులు వెయ్యమని టామ్‌తో చెప్పారు. బాబాకి కావలసిన పాటను అతడు వినిపించాడు. అప్పుడు బాబా అందరనూ మనసులో బాదా సిలువ మీద వ్రేలాడుచున్నట్లు ఊహించమన్నారు. చాలామంది అలా ఊహించేసరికి ఆ ధ్యానం అందరికీ కళ్ళ నీరు తెప్పించింది. ఎలిజబెత్‌ను బాబా "నీ అనుభవం చెప్పు" అని అడిగారు. ఆమె– "బాబా అలా చెప్పకముందే నేనేదో ఊహించి ఒక దృశ్యాన్ని నా మనో నేత్రం ఎదుట చూచాను, అందులో బాబా సోఫామీద పరుండియున్నట్లు ఆయన పాదాలమీద మేకులు కొట్టబడినట్లు కనిపించారు." ఎలిజబెత్‌కి

ఇలాటి ఊహా దృశ్యం కలగబట్టే బాబాకి అలాటి ఆలోచన కలిగి ఆ విధంగా ధ్యానం చెయ్యమన్నారేమో అంది ఆమె.

సిలువమీద మేకులతో కొట్టబడిన దృశ్యం ఇంకొకమారు ఊహించండి అని బాబా అందరకు ఇంకొక అవకాశం యిచ్చారు. ఈ ధ్యాన సమయంలో పాల్ రోబ్‌సన్ ఆధ్యాత్మిక గీతాలు వినిపించారు. ఈ ధ్యానం అందరూ మెచ్చుకున్నారు.

తరువాత అందరితోను వెడుతున్నానని చెప్పి బాబా కారులో రాహూరి వెళ్ళారు.

1937 మే, 4 వ తారీకున ఉదయాన్నే ఇంకా అల్పాహారం చేయకుండానే బాబా అందరితోను నాసిక్ ఆశ్రమంలో మంజిల్ మీమ్‌లో పెద్ద గదిలో కూర్చున్నారు. అప్పుడు బాబాను ఇలా అడిగారు.

ప్రశ్న :- విధి, అదృష్టం అంటూంటారే బాబా అవి ఏమిటి ?

బాబా :- విధి అంటే జీవాత్మ తన పరిణామం మొదట నుంచీ అనుభవించిన పాపపుణ్యాలను అనుసరించి కలిగిన ఈశ్వరేచ్ఛ. దాని ఫలితం-బాధ, సుఖము.

"అదృష్టం అంటే జీవాత్మ అనేక పరిణామ దశలద్వారా ప్రోగుచేసుకున్న సంస్కారాలను వెచ్చించడం. అదే కర్మ సూత్రం. ఈ జీవితంలోని సంస్కారాలను బట్టి తరువాత జన్మలో కలిగేది అదృష్టములేక దురదృష్టము."ఒక జీవితం లోని సంస్కారాలు మరుజన్మలోని అదృష్టానికి కారణం అవుతాయి. ఉదాహరణకి ప్రతి జీవాత్మ 700 టన్నుల బరువు మోయాలి అనుకుందాం. కొంత బాధ, సుఖము ప్రతి జీవాత్మ దాని పరిణామం మొదటి నుంచి చివరకు బ్రహ్మసాక్షాత్కారం అయే వరకు అనుభవించాలి. కాని ఈ 700 టన్నుల బరువు, రూపంలోనో, పదార్థంలోనో మారినట్లు, జన్మ జన్మలలో సంస్కారాలు మారుతూంటాయి. ప్రతి క్రొత్త జన్మలో అనుభవాలు క్రితం జన్మలోని సంస్కారాలను బట్టి వుంటాయి. అందుచేత జీవాత్మ క్రిందటి జన్మలోని సంస్కారాలను బట్టి ప్రస్తుత జన్మలో వచ్చే అనుభవాలనే కర్మ అని, అదృష్టం అనీ అంటాము. జీవాత్మ అనేక జన్మలగుండా అనేక జీవితాలు అనేక రూపాలలోనుంచి ప్రయాణం చెయ్యాలి. జీవితానుభవాలు మారిన విధంగానే అదృష్టంకూడా మారుతూ వుంటుంది.

అందుచేత ఈశ్వరేచ్ఛ వేరు, అదృష్టం వేరు, అని చెప్పి బాబా ఆ రోజున ప్రసంగం ముగించారు.

ఒక రోజున పాశ్చాత్య బృందం బాబా చుట్టూ కూర్చుని యుండగా మాల్కమ్ కేసి చూచి అందరికీ తలొక కాగితము, పెన్సిలు యివ్వమన్నారు బాబా. మాల్కమ్ ఆ ప్రకారమే చేశాడు.

బాబా అప్పుడు అందరితోను మీ యిష్ట మొచ్చినది మీ మనసుకి తోచినది వ్రాయమన్నారు. అప్పుడు వారు యిలా వ్రాశారు—

ఒకరు :– "నా కాలం అంతా ఇదంతా ఏమిటి అని ఆశ్చర్యపోతూ గడుపుతున్నాను. నేను చక్కగా కట్టిన బంగీని ఆనుకుని ఒక్క క్షణంలో పంపించెయ్యడానికి సిద్ధంగా ఉన్నట్లు భావిస్తున్నాను.

రెండవవారు :– ముఖ్యమయిన సంగతేమిటంటే నేను ఈ రోజున ఎంతో సుఖపడు తున్నాను. బాబా యిక్కడ వున్నారు. నా ప్రపంచం పూర్తి అయినది —నానీ.

మూడవవారు :– ప్రేమ ప్రపంచాన్ని గుండ్రంగా తిరిగేలా చేస్తుందంటారు. బాబాను ప్రేమిస్తే అది యింకా త్వరగా గిరాగిరా తిరుగుతుంది. —రానో.

నాలుగోవారు :– ప్రేమ ఉన్నచోట దేవుడున్నాడు. అలాగే మన మందరమూ బాబాను ప్రేమించే రోజు. అంతేకాకుండా, మనలో మనకు ప్రేమ, ఆప్యాయత వుండే రోజు వస్తుంది. అలాటి మంచి రోజును ఆ సుఖవంతమయిన రోజును వాయిదా వెయ్యడ మెందుకు ? ఇప్పుడే అది ఎందుకు రాకూడదు ? – నడీనె టాల్‌స్టాయ్.

అయిదోవారు :– నేను భావిస్తాను; నేను ఆలోచిస్తాను; నేను కోరుతాను; నేను పని చేస్తాను; నేను ఆచరిస్తాను: నేను చూస్తాను; నేను వింటాను; నేను ప్రేమిస్తాను; నేను వాసన చూస్తాను; ఈ అహంభావమంతా నీ ప్రేమాగ్నిలో దహించివెయ్యి ప్రియతమా!

ఈ విధంగా ఎవరికి తోచినట్లు వారు వ్రాశారు.

బాబా రాహూరిలోని పిచ్చి ఆశ్రమము మస్తులతోను అక్కడ జరుపుచున్న ధర్మాసుపత్రితో సహా రాహూరినుంచి మెహెరాబాదుకు తరలించిన ఈ ఆశ్రమం మే నెల మొదటివారం నుంచి పనిచేయడం ప్రారంభించింది. రాహూరి నుంచి ఆశ్రమము ఎత్తివేయడానికి పైకి కనబడే కారణం రాహూరివద్ద నది వరదలు వచ్చి పొంగితే వంతెన లేకపోవడంవల్ల అవతల ఒడ్డున బళ్ళు ఆగిపోవలసివస్తుంది. రాక

పోకలకు చాలా ఇబ్బంది కలుగుతుంది. ఆశ్రమం రాహూరిలో వుంటే బాబా ప్రతి వారము అక్కడికి వెళ్ళవలసి వుంటుంది. వెళ్ళి అక్కడే చిక్కుపడితే మిగిలిన ఆశ్రమాలకు వెళ్ళడానికి వీలుండదు. ఇంక వేరే కారణాలు ఏమయినా వుంటే అవి బాబాకే తెలియాలి. మెహెరాబాద్‌లో బాబా మస్తులకు, పిచ్చివారికి ఒక స్థలంలో వేరే గదులు కట్టించి అందులో వారిని వుంచారు. బాబా యధాప్రకారంగా వారికి శుశ్రూష చేస్తూ వున్నారు. రాహూరినుంచి ధర్మాసుపత్రి తీసివేయగానే సుమారు 150 మంది రోగులు అందులో గత మూడు నెలల నుంచి ప్రతీరోజూ ఉచిత వైద్యం పొందు చున్నవారు చాలా విచారించారు. ఉచితంగా మందులు లభించడంకంటె బాబా ప్రతి రోజూ వారికి దర్శనమిస్తూ ప్రేమతో మాట్లాడుతూంటే వారికి సగంబాధ తీరిపోయేది. ఆయన దర్శనం ఇంక దుర్లభం అని రోగులు వాపోవుచున్నారు. ముప్పైమైళ్ళ దూరంవున్న చాలామంది రాహూరినుంచి మెహెరాబాద్ వచ్చి బాబా దర్శనం చేసుకోవాలని కోరుచున్నారు.

మే 11 వ తేదీన (1937) బాబా తన శిష్యబృందాన్ని పిలిచి నాసిక్‌లో యిలా ప్రసంగం చేశారు.

("ఎప్పుడూ కూడా జీవాత్మకి మాంసభరిత మయిన ఈ శరీరానికి సంఘర్షణ ఉంటూనే వుంది. ఆత్మ ఆ సంఘర్షణకి సాక్షిగా వుంటుంది. జీవాత్మ శరీరానికి అట్టే ఎదురు చెప్పకుండా సులభంగా లొంగిపోతే ఇంక అప్పుడు ఆశలేదు. శరీరం కొంత దెబ్బలాడి తరువాత లొంగిపోతే ఆశ వుంటుంది. ఆత్మే గనక శరీరాన్ని జయించిందా ఆ జయం శాశ్వతంగా వుంటుంది. కాని ఈ సంఘర్షణే సంపూర్ణత్వాన్ని కలుగజేస్తుంది. అందుచేత ఈ రెంటికీ పోట్లాట ఉండాలి.)

"ఇప్పుడు మీరు చెప్పేదానిలో బహునిజాయితీగాను అత్యంత మనఃపూర్వకంగాను ఉండాలి. కేవలం నిజాయితీతనంతో చెప్పాలి. నన్ను సంతోషపెట్టడంకోసం ఊరికే సరే అనకండి. మనం ఇపుడు ఒక పెద్ద సమస్యను ఎదుర్కోవాలి.

"వర్షాలు ప్రారంభించాయంటే ఇక్కడి నుంచి మెహెరాబాద్‌కి రాకపోకలకి వీలుండదు. రాహూరీ వద్ద వున్న నది పొంగుతుంది. ఒకమారు రుస్తుం అందులో కొట్టుకుపోయాడు. మీరు ఇండియా వాతావరణానికి ఆగలేనట్లే ఇక్కడివారు మీ దేశ వాతావరణానికి ఆగలేరు. ఒకమారు నాకు జ్ఞాపకం వుంది. డా॥ గనీ డెవన్‌షైర్‌లో ఏడు రగ్గులు కప్పుకుని బూట్లు తొడుక్కుని వేడినీళ్ళ సంచి పక్కలో పెట్టుకుని పరున్నాడు. అప్పుడు మండలిచేత ఏ పనీ చేయించలేకపోయాను. వాళ్ళకి చెయ్యా

లనే వుండేది. కాని ఆ చలికి ఆగలేకపోయేవారు. అలాగే అహమద్‌నగర్‌లో మీ అందరికీ నాకు సహాయం చేయాలనే వుంటుంది, కాని అక్కడ పరిస్థితులకు మీరు ఆగలేరేమో. అహమద్‌నగర్‌లో ఈ సౌకర్యాలుండవు. కుళాయి తిప్పగానే నీరు రాదు. ఇలాటి పాయిఖానాలు అక్కడ లేవు. భందర్దారాలో వున్నట్లు వుంటాయి. కాని భందర్దారాలో కాకా మీకు సహాయం చేసేవాడు. కాని అహమద్‌నగర్‌లోని వాతావరణం మంచిదే. త్రాగే నీరు కూడా మంచిదే. మీ కందరకు యిష్టంగానే వుంటుంది. కాని మీరు ఆగగలరా అని.

"తూర్పు పడమర దేశాలవారికి ఉభయులకి పోర్టోఫినో ఆదర్శవంతంగా వుంటుంది. డబ్బుంటే అక్కడ ఒక రాహూరీ ప్రారంభించవచ్చు. కాని అహమద్‌నగర్‌కూడ మంచిదే, మీకు సదుపాయాలుమాత్రం సున్న. మీకు ఏమివుందో ఏమిలేదో మీ సౌకర్యాలు నేను చేస్తుకూర్చుంటే నాకింకా పనిచేయడానికి స్వేచ్ఛ యేది?

"కొందరు ఆరు నెలలుందామని వచ్చారు; కొందరు ఏడాది; కొందరు అయిదేళ్ళుందా మనుకున్నారు. ఎవరయినా వారి దేశానికి వెళ్ళి మళ్ళీ రావాలనుకుంటే ఇదే దానికి మంచి సమయం. మీకు వెళ్ళాలని లేకపోతే బాబా మిమ్మల్ని బలవంతంగా పంపరు. మీ యెడల మీరు నిజాయితీగా ప్రవర్తిస్తే నాకు నాపనిలో సహాయము చేసినవారవుతారు. జాగ్రత్తగా ఆలోచించండి. అహమద్‌నగర్‌లో ఉండటానికే నిశ్చయిస్తే, వర్షాలు మొదలెట్టేలోపుగా త్వరగా నేను తగిన ఏర్పాటులు చేయవలసి వుంది. నేను చెప్పినట్లు ఇంగ్లండు పాశ్చాత్యులకు, ఇండియా ప్రాచ్యులకీని, వీరు అక్కడ వుండలేరు. కాని మీరు యింతవరకు బాగానే వున్నారు ఇక్కడ.

"నేను ఒక స్థలంలో నా పని ప్రారంభిస్తాను. ఒకచోట నిర్మాణం పూర్తయితే ఇంకోచోట నిర్మాణం ప్రారంభిస్తాను. అలాగే నాపని సాగుతూవుంటుంది. నేనున్న చోట ఇదే మోస్తరుగా జరుగుతుంది. పని ఎప్పుడూ ఆగిపోదు. అడ్డంకులూ రావు. పెండు మెహెరాబాద్ ఆశ్రమ్ తీసెయ్యడానికి ఎప్పుడూ సిద్ధంగా వుంటాడు. పని నే నెక్కడయినా చేస్తాను. నే నెక్కడ వున్నా నా పరివారం–ప్రాచ్య పాశ్చాత్య మండలి–నాతో వుండాలి. పోర్టోఫినో కాని మెహెర్‌బాద్ కాని నాకు ఏది సులభంగా వుంటుందో అది నిశ్చయించాలి. మండలికి ఇటలీ అంటే యిష్టమే. నా పని గురించి నేను ఆలోచించుకోవాలి. ఇప్పుడు ప్రయాణాలు ఎక్కువగా వున్నాయి. ప్రతీ అయిదు రోజులకి.

"నేను విశ్వవ్యాప్తంగా పని చేస్తాను. మీరు నన్ను తలుచుకుంటూవుంటే, నన్ను ప్రేమిస్తూవుంటే, నా పనిలో మీరు పాల్గొంటున్నారన్న మాట. మీకు నాతో సంబంధం వుండాలి; అదీ ముఖ్యం. ఇంజన్ లాగుతుంది. పెట్టెలన్నీ దానితో బాటే వెడతాయి. ఎందుచేత? ఇంజన్‌తో సంబంధం కలిగి వుంటాయి గనుక.

"స్వేచ్ఛ వున్నా లేకపోయినా నా పని నేను చేసుకుంటాను. అడ్డాలు లేకపోతే నా పని సులభం అవుతుంది. అందుచేత మీ జవాబులు నిజాయితీతో యివ్వండి. అహమద్‌నగర్‌లో ఆహారం ఇలాగే వుంటుంది. సేవకులుంటారు. తేళ్ళు ఎక్కువ వుంటాయి. పాములు అన్ని వుండవు. అన్నిటికంటె కష్టమయినది స్నానాలు చెయ్యడం. డా॥ నీలు మీ ఆరోగ్యాలు జాగ్రత్తగా చూస్తూవుంటాడు.

"సామరస్యం వుండాలి. సామరస్యం లేకపోతే అందరూ వెళ్ళిపోవచ్చు. ఇబ్బందులున్నా సామరస్యానికి భంగం రాకూడదు. గారెట్ అంటే నాకు యిష్టం. అతని జవాబులు దాపరికం లేకుండా వుంటాయి. సంఘర్షణ అంత మంచిది ఇంకేదీ లేదు. దానివలనే సంపూర్ణత్వం వస్తుంది. క్రింద పడినా వెంటనే లేవాలి కష్టపడుతూ వుండాలి. సంఘర్షణ వుండాలి. ఇప్పుడు ఆలోచించి మరీ జవాబు చెప్పండి. మీరు మీ ఉద్వేగాలచేత మీ జవాబులను మాననివ్వకండి.

"చాలామంది అహమద్‌నగర్ కావాలన్నారు. పోర్టోఫినోకంటె అన్ని విధాల బాగుంటే అహమద్‌నగరే అవుతుంది. జి. డబ్బు పంపాడంటే మనం అందరం పోర్టోఫినో వెడదాం. ప్రత్యేకంగా ఒక స్టీమరు మనకోసం ఏర్పాటు చేసుకుందాం.

"మరి యిప్పుడు నిజంగా వాళ్ళదేశానికి వెళ్ళిరావాలనుకున్నవారు ఇప్పుడే వెళ్ళిరండి. జూన్ నెలలో వెళ్ళి అక్టోబరులో రావచ్చు ఎవరు వెడదామనుకుంటున్నారు?

"నాకు మెహెరాబాద్ బాగా వుంటుంది. నేను మిమ్మల్ని నాకు దగ్గరగానే ఉంచుకోవాలి. కాని మీరు అక్కడవుండే అసౌకర్యాలు, ఇబ్బందులూ మీరు భరించలేరేమో అనుకుంటాను. అందరూ బలం కలవారయితే ఉండవచ్చు. అందరూ ప్రేమలో బలం కలవారే. చాలా బలం కలవారు. మీలో ఎవరికీ వెళ్ళాలని లేదన్న మాట." అన్నారు బాబా.

ఆ రోజునే (11-5-37) కొంచెంసేపు అయిన తరువాత బాబా యిలా చెప్పారు——

"ఏదయినా అలవాటులో పడినప్పుడు దాని నవ్యత్వాన్ని పోగొట్టుకుంటుంది. నీవు ప్రతిరోజూ బలహీనమయిపోయి అలా నీరసించినందుకు పశ్చాత్తాపపడితే, చివరికి నీవు పశ్చాత్తాప పడడమే నీ బలహీనత్వమవుతుంది. ప్రేమ మాత్రమే ఎప్పుడూ నవనవంగా వుంటుంది.

"ప్రశ్నించే అలవాటు చివరకు సందేహించడం ప్రశ్న వేసినవాడిమీదకే తిరుగుతుంది. వివేకానందుడు ఎప్పుడు ప్రశ్నలు వేసేవాడు–ఎందుకు? ఎందుకు? ఎందుకు? అంటూ రామకృష్ణ అతనిని ఎంతో ప్రేమించేవాడు. అందుకని జవాబు చెప్పేవాడు. ఒక రోజున విసిగెత్తి ఆయన జవాబు చెప్పలేదు. వివేకానందుడు అడిగేడు కాని జవాబు రాలేదు. ఒకనాడు అర్ధరాత్రివేళ రామకృష్ణ "నాకు ఫలానా ఆహారం తీసుకురా" అని వివేకానందునికి చెప్పాడు. ఆ సమయంలో వివేకానంద ఆహారం కనపడలేదన్నాడు. అతడన్నాడు—"ఇప్పుడు అర్ధరాత్రి 12 గంటలయింది. ఇది భుజించే సమయం కాదే" అన్నాడు. ఆ రోజునుంచి వివేకానందుడికి జవాబు చెప్పేవాడు. ఇంకో ప్రశ్న అడిగేవాడేకాదు.

"నాకు జవాబు చెప్పడం అలవాటు, అయినా మీకు నేను ప్రశ్నలు వేస్తాను. మీరు నిజాయితీతో జవాబు చెప్పండి. అని అడిగారు బాబా"

మే 12వ తేదీన ఆరవ జార్జిరాజు యొక్క పట్టాభిషేక దినము. అందరూ రేడియోలు పెట్టుకున్నారు. బాబా "అదంతా మాయ. దేశకాలములతో బంధింపబడి యున్నది" అన్నారు. అప్పుడు పాశ్చాత్యులలో ఒకడు–"బాబా! ఎడ్వర్డ్ ఇది వింటున్నాడా?" అని అడిగారు. "అవును, కాని అతడు ఏమీ ఖాతరు చేయడు. ఎడ్వర్డ్ ఇప్పుడు తన యిష్టంవచ్చినట్లు ప్రేమించవచ్చు. నా వద్దకు ఆకర్షింపబడవచ్చు. వ్యక్తిగతమయినా కాకపోయినా దివ్యప్రేమను అనుసరించినచో నా వద్దకు వచ్చినట్లే." జార్జిరాజు, ఎలిజబెత్‌రాణి గురించి చెప్తూ బాబా అన్నారు– "వారిరువురికి మంచి హృదయాలుండటం ప్రజలకి ఒక సంతృప్తి" ఆర్చిబిషప్ ఆఫ్ కాంటర్‌బరీ ఉపన్యాసం యిస్తూంటే బాబా– "మన ప్రభువయిన క్రీస్తు గురించి అందరు మాట్లాడతారు గాని ఒక్కడూ ఆయనను అనుసరించడు." ఈ కలాపం అంతా అయేదాకా పాశ్చాత్యులందరిని బాబా విననిచ్చినందుకు వారు సంతోషించారు.

మే మాసం మధ్యలో అనేక సమావేశాలు చేశారు. అందరూ చర్చలలో పాల్గొన్నారు. ఆధ్యాత్మిక విషయాలమీద ప్రసంగాలు మానేసి ముందు ఏమిచేయాలన్నది నిర్ణయించడానికి చర్చించారు. మూడు రోజులు ఈ చర్చలు జరిగాయి. చివరికి

బాబా అందరినీ తమ(బాబా) యిష్ట ప్రకారమే చేయడానికి శిష్యులు నిర్ణయించేలా చేస్తారు.

ఒకనాడు ఈ సమావేశాలలో అందరినీ ఒక నిర్ణయంచేసి వోటు వెయ్యమన్నారు బాబా అన్నారు- "అందరి భావాలు తృప్తికరంగా వున్నాయి. ఎలిజబెత్ ఎలాగూ చెప్పలేదు. ఆమె సంపూర్ణత్వం పొందిందో లేక మరణించిందో" అని తమాషాగా అని నవ్వించారు. నాసిక్ ఆశ్రమం అంత త్వరలో ఎత్తివేయడానికి ఎవరు బాధ్యులో ఎవరూ ఎప్పటికీ తెలుసుకోలేరు. ఇదంతా ఒక ఆట. బాబా యొక్క ఆంతరికమయిన పని. వారి పాశ్చాత్య శిష్యుల సహకారంవల్ల, బాబా పని ముగించడానికి వారు యిచ్చిన అవకాశాలవల్ల త్వరగా బాబా పని పూర్తిచేసి ఆశ్రమం యెత్తేస్తున్నారేమో తెలియదు.

జూన్, జూలై నెలల్లో నాసిక్‌లో ఆశ్రమం ఎత్తేవరకూ బాబా నాసిక్‌కి రెండుమార్లే రాగలిగారు. పాశ్చాత్యులతో రాబోయే దీర్ఘ వియోగానికి వారిని అలవాటు చేస్తున్నా రన్నట్లుగా వుంది. పాశ్చాత్య బృందంలో ఏర్పడిన కొన్ని గొడవల వలన కూడా బాబా అక్కడి నుంచి మకాం ఎత్తేద్దామని నిశ్చయించారు.

ఈ విషయం ఇంకోమాటు కూలంకషంగా చర్చించారు. చివరికి తేల్చుకున్న సంగతేమిటంటే నోరీనా మొత్తం అంతా పర్యవేక్షణ చేయాలని, రువానో యింటికి మానేజరుగా వుంటూ వుండాలని నిర్ణయించారు బాబా.

ఇండియాలో ఉండడమా మానడమా; ఉంటే యేమిటి? లేకపోతే యేమిటి? ఈ విషయాలన్నీ చర్చించారు. చివరికి మే 18వ తేదీన ఆఖరి సమావేశం జరిగింది. ఆ రోజున బాబా చెప్పేశారు "అహమద్‌నగరంలో పాశ్చాత్యులుండటానికి కుదరదు; వారికి ఆచరణ యోగ్యం కాదు" అని ఇటలీ, ముఖ్యంగా పోర్టోఫినో, ఇరుతెగల వారికి అనువుగా వుంటుందని చెప్పారు బాబా. ఈ లోపుగా నాసిక్‌లో వున్నంత కాలము అందరూ ఒండొరులను ఇంకా ప్రేమించడానికి ప్రయత్నించాలి. అవసరమయినచో ఇతరుల అభిప్రాయానికి లొంగిపోవాలి. ఆ విధంగా ఈ బృందంలో సామరస్యం స్థాపించాలి.

## ఆడదాని నోట్లో నువ్వుగింజ నానదు :

ఆ సాయంకాలం (మే 18వ తేదీ)మంజిల్ మీమ్ బంగాళా బయట గడ్డినేల మీద కూర్చున్నప్పుడు అందరికి ఒక చిన్న పెర్షియన్ కథ చెప్పారు. వచ్చే ఆరు

నెలలకి భవిష్యత్తుకి తగిన పథకాల గురించి చర్చించుకుంటున్నారు. ఈ మాటలన్నీ ఈ బృందానికిమట్టుకేనా అని వారు అడుగగా బాబా ఆ కథ చెప్తూ అది బహిరంగ రహస్య మన్నారు. బాబా ఇలా చెప్పారు :—

"ఆడదాని నోట్లో నువుగింజ నానదంటారు. వారు రహస్యాలు దాచుకోలేరు. ఒకడు తన భార్యను ఎంతో ప్రేమించేవాడు. ఏం వున్నా ఆమెతో చెప్తూండేవాడు. అతని స్నేహితుడు అలా అన్ని సంగతులు ఆడవాళ్ళకి చెప్పకూడదని సలహా యిచ్చాడు. దాని కతడు చెప్పాడు – "నా భార్య అందరిలాగా కాదు, ఆమె చాలా నమ్మకస్తురాలు" అన్నాడు. అందుకా మిత్రుడు "సరేలే. నేను చెప్పినట్టు చేసి ఆ పరీక్షలో ఆమె నెగ్గుతుందేమో చూడు" అన్నాడు.

ఆ భర్త యింటికి వెళ్ళి దేనికో ఎంతో భయపడుతున్నట్లు నటించాడు. వెంటనే అతని భార్య ఏమిటని అడిగింది. "నీతో ఎలా చెప్పను. అది జీవన్మరణ సమస్య" అన్నాడు. చెప్పండి అని ఆమె ఒత్తిడి చేసింది. అది చెప్పనన్నకొలదీ ఆమెకు తెలుసుకోవాలని కుతూహలము ఎక్కువైనది. చెప్పమని నిర్బంధించింది. "సరే నీకు చెప్తానుగాని అది చాలా రహస్యంగా ఉంచాలి. ఇది రాజుగారికి తెలిస్తే నా తల నరికేస్తారు తెలుసునా" అన్నాడు. ఆమె "నా ప్రాణంకన్న ఎక్కువగా మిమ్మల్ని నేను ప్రేమిస్తున్నానుకదా. ఇది ఎవరికో చెప్పి మీ ప్రాణానికి ముప్పు తెస్తానా ?" "సరే, ఈ రోజున నేను కోట ముందునుంచి వెళుతోంటే రాజుగారి బుజంలోనుంచి ఒక కాకి బయటకి వచ్చింది. ఈ సంగతి ఎవరికీ చెప్పకు." "చెప్పను" అన్నది. అతడు తన పని చూచుకోడానికి వెళ్ళాడు. సాయంకాలం అత డింటికి వచ్చేసరికి ఆడవాళ్ళు ఏదో చెప్పుకుంటున్నారు. అతనిని చూడగానే వారు "ఇదిగో ఇతడే రాజుగారి బుజంలోనుంచి 40 కాకులు వస్తూండగా చూచాడు." అతడు తన భార్యతో "నేను ఒక్క కాకి అంటే అది యిప్పుడు 40 కాకు లయింది ! బలే!" అన్నాడు.

అలాగ మన పోర్టోఫినో సంగతి మనకి రహస్యమయినా ప్రపంచానికి తెలిసి పోయింది.

చిట్టచివరకు 'కేన్స్' స్థిరపరిచారు. అది మధ్యధరా సముద్ర తీరంలో ఫ్రాన్సులో వుంది.

మే 26 వ తేదీన బాబా సాయంకాలం అనుకోకుండా నాసిక్‌కు వచ్చారు. వచ్చి వెంటనే సార్‌సెట్ బంగాళాకి డెలియా, జీన్, విల్,మాల్కాలను చూచుటకై వెళ్ళారు.

వీరు నలుగురు ఆ రోజున ఎందుచేతనో ఉదయాన్ని అల్పాహారం తీసుకుందుకు రాలేదు. డెలియాకి జ్వరం వచ్చింది.రోజంతా ఎక్కువగానే వుంది. అది హఠాత్తుగా బాబా వెళ్ళేసరికి మామూలుగా నార్మల్‌గా వుంది. వారిని చూచి బాబా "క్విక్ మార్చ్" అన్నారు. (త్వరగా నడువండి) ఆ మాట విని కొందరు వారి మకాం మార్చేస్తారు కాబోలు బాబా అని అనుకున్నారు.

నాసిక్ శిక్షణ శిబిరంలో 1937 మే నెల, 28 వ తేదీ ఉదయం బాబా అల్పాహారం తీసుకోకుండానే మండలితో కూర్చుని "ప్రేమ" గురించి ఇలా ప్రవచించారు అప్పుడు కౌంటెస్ నడీనె టాల్‌స్టాయ్ నోట్సు వ్రాసుకుంది.

ప్రేమ అంటే యేమిటి ? ఇవ్వడము – ఎప్పుడూ అడుగకపోవడము. ఈ ప్రేమ ఎలా వస్తుంది ? కృపవల్ల. ఈ కృప ఎలా కలుగుతుంది ? కృప చవుకగా కొనడానికి దొరకదు. ఎప్పుడూ సేవచేయడానికి సిద్ధంగా ఉన్నందువల్ల సేవింపబడడానికి అంటే సేవలు అందుకోడానికి ఇష్టంగా లేనందువల్ల కృప లభిస్తుంది. కృప కలగడం చాలా కారణాలవల్ల కలుగుతుంది.

1) తనకు కష్టంకలిగినా ఒకరికి సుఖం కలగాలని కోరుకోవడము.

2) ఎన్నడూ ఒకరిమీద నేరాలు చెప్పక పోవడము, నిందలు వేయకపోవడము.

3) అపరిమితమయిన సహనము.

4) దేనికీ ఆందోళన చెందకుండా వుండడము – అలా వుండడము చాలా మట్టుకు అసాధ్యము; అందుచేత ప్రయత్నించు.

5) ఒకరిలో ఉన్న సుగుణాలను ఎక్కువగా తలచుకోవడము–వారిలోని చెడ్డను తక్కువగా తలచుకోవడము.

ఈ కృప ఎలా కలుగుతుంది? పైన చెప్పినవన్నీ చేసినందువలన. ఇందులో నీవు ఒకటయినా బాగా చేస్తే మిగిలినవి అవే వస్తాయి.అప్పుడు అనుగ్రహం వస్తుంది. ప్రేమ కలిగి వుండు. ప్రేమ కలిగి వున్నపుడు ప్రియతమునితో ఐక్యత తప్పక కలుగుతుంది.

క్రీస్తు "నీ ఇరుగు వారిని ప్రేమించు" అన్నపుడు నీ ఇరుగువారితో ప్రేమలో పడు అని చెప్పలేదు.

నీవు ప్రేమించినప్పుడు నీవు ఇస్తావు. నీవు ప్రేమలో పడినపుడు నీవు కోరుతావు. నన్ను ఏ విధంగానైనాసరే ప్రేమించు. కాని ప్రేమించడం మాత్రం మానకు. ఎలాగయినాసరే ప్రేమించు. నేను పరిశుద్ధుడను. పరిశుద్ధతకు మూలమును. అందుచే నా ప్రేమాగ్ని ఏ బలహీనతలున్నా, ఏ లోపాలున్నా వాటిని భస్మం చేసేస్తుంది. నీ పాపాలను, నీ దుర్బలత్వాలను, నీ సుగుణాలను అన్నీ నా కిచ్చెయ్యి – కాని ఇవ్వడం మానకు. నాతో ఎవరయినా ప్రేమలో పడ్డా నాకు ఫరవా లేదు. వారిని నేను పరిశుద్ధుల జేయగలను. కాని ఇంకెవరితోనయినా ప్రేమలో పడితే దానిని ప్రేమ అనజాలవు. ప్రేమ భగవంతునివలె పరిశుద్ధమయినది. అది ఇస్తుంది గాని ఎప్పుడూ అడుగదు. అటువంటి ప్రేమ కలగడానికే కృప – అను గ్రహం కావాలి.

హిమాలయాలలో కూర్చుని తపస్సు చేస్తున్న పొడుగాటి గడ్డాలు కల యోగులు, అనేక సంవత్సరాల నుంచి అక్కడ సమాధిలో కూర్చున్న యోగులు– వారికి కూడా ఈ ప్రేమ లేదు. ప్రేమ అంత అమూల్యమయినది. తల్లి బిడ్డకోసం ప్రాణాలు కూడా ధార పోస్తుంది. అంతకంటె త్యాగం లేదుకదా. కాని అది కూడా ప్రేమ కాదు. ధీరులు, వీరులు వారి దేశం కోసం మరణిస్తారు. అయినా అది ప్రేమ కాదు.

ప్రేమ : నీకు ప్రేమ వున్నపుడు నీకు తెలుస్తుంది. సిద్ధాంత రూపంగా అది నీకు అర్థం కాదు. నీవు అది (ప్రేమ) అనుభవించాలి.

మజ్నూ లైలాను ప్రేమించాడు. ఇది నిర్మల ప్రేమ; భౌతికం కాదు. బుద్ధికి సంబంధించినది కాదు; కాని ఆధ్యాత్మిక ప్రేమ. అతడు లైలాను అన్నిటిలోను అన్ని చోటులా చూచాడు. ఇంక తినాలని, త్రాగాలని, నిద్ర పోవాలని అతనికి ఆలోచన లేదు. ఆమెను గురించి ఆలోచించకుండా అతనికి ఆలోచనలు ఎప్పుడూ రాలేదు. అన్ని వేళలా ఆమె సుఖమే కోరేవాడు. అతడు ఆమె సుఖపడుతుందని అతనికి తెలిస్తే ఆమెను సంతోషంగా ఇంకొకరికిచ్చి పెళ్ళి చేసేసేవాడు. ఆమె సుఖ పడుతుందని అతనికి తోస్తే ఆమె భర్త కోసం ప్రాణాలు కూడా అర్పించేవాడు. చివరకు ఆ ప్రేమ అతనిని నా వద్దకు తీసుకు వచ్చింది. అతనికి స్వార్థపు ఆలోచనే లేదు. అనుక్షణం అనవరతము ప్రియతమ యొక్క ఆలోచనే.

నీవు ప్రయత్నించినా అలా చేయలేవు. దానికి కృప కావాలి. ప్రయత్నించి నందువలన కృప కలగడానికి మార్గం ఏర్పడుతుంది.

భగవంతుడంటే ఏమిటి ?

ప్రేమ.

అనంతమైన ప్రేమయే భగవంతుడు.

1937 మే 28 వ తారీకున బాబా అందరినీ సమావేశపరచి ఒక పావుగంట ధ్యానం చేయమన్నారు. ఆ సాయంకాలం మారువేషాలు వేసే వేడుక జరిపించారు. నొరీనా ఎలిజబెత్‌లు కవలపిల్లల వలె అన్ని విధాలా ఒకేలాగ వేషం వేశారు. ఒకే రకం చీరలు కట్టుకున్నారు. వారికి మొదటి బహుమానం వచ్చింది. రెండవ బహుమానం మార్గరెట్‌కి వచ్చింది. ఆమె సోది అమ్మిలా వేషం వేసింది. డెలియాకి 'స్పానిష్ లేడీ' వేషంలో మూడవ బహుమానం వచ్చింది. రాత్రి భోజనాల ముందు వేషాలు వేసుకున్నవారు వరుసగా వారి వారి వేషాలు చూపించారు. ఐస్‌క్రీమ్, కేక్‌లు అందరూ తిన్నారు. తరువాత పురుష మండలిని అందరూ కూర్చునే గదిలోకి రమ్మన్నారు.

నాసిక్‌లో ఆశ్రమం ఎత్తివేయాలని నిశ్చయించిన తరువాత బాబా అనుమతి ప్రకారం మొట్టమొదట మార్చి నెలలోనే గారెట్ ఫోర్ట్‌ను అతని పర్యటన ముగించుకుని ఒక ప్రత్యేకమయిన పనిమీద హాలీవుడ్‌కి పంపించారు. మార్గరెట్, డెలియా, విల్, మేరీ, కిట్టీ వీరిని జూన్ (1937) లో వెళ్ళమని బాబా 'రావల్పిండి' అనే ఓడలో పంపించారు. డిసెంబరు 1936 లో వారు ఇక్కడికి వచ్చినది కూడా ఈ ఓడలోనే. తరువాత జూన్ నెలాఖరున కొలంబో మీదుగా శామ్ కోహెన్‌ను యూరప్ వెళ్ళమన్నారు. రువానో బోగిస్లావ్‌ను అదేవిధంగా జూలైలో వెళ్ళమన్నారు ఆమె తరువాత కేన్స్‌లో బాబా వద్దకి వచ్చి చేరాలి.

ఆరు నెలల పాటు పాశ్చాత్యులు బాబాతో ఉన్నారన్న మాటే కాని వారిలో ఎవరూ బాబాను ఆయన విధానాలను అర్థం చేసుకోలేక పోయారు. అగాధమయిన అవతారుని ఎవరు తెలుసుకోగలరు? కాని బాబాలోని వారి నమ్మకము, ఆయన యెడల వారి గౌరవము, ఆయనంటే వారికున్న ప్రేమ ఇనుమడించాయి. అది వారి అదృష్టము. వారియెడల బాబా అనుగ్రహము వలనే అలా జరిగింది.

బాబా ప్రేమ వారిని ఇండియాకు తీసుకువచ్చింది. బాబా ప్రేమే వారిని మరల వారి వారి దేశాలకు పంపిస్తుంది.

బాబా మండలి ఇతర ప్రేమికులు పాశ్చాత్య బృందాలు ఇండియా వదలి వెడుతూంటే వారికి స్టీమరు వద్దకు వెళ్ళి వీడ్కోలు చెప్పారు. ఇండియా వదలి

వెడుతూంటే వారికి తల్లిని వదలి వెడుతున్నట్లుగానే విచారం కలిగింది. బాబా ప్రేమికు లందరి యెడల ఒక అనిర్వచనీయమైన ఆత్మీయత ఈ పాశ్చాత్య శిష్యు లందరికీ కలిగింది.

## పదవ పాశ్చాత్య దేశయాత్ర - కేన్స్ మకాం :

1937 వ సంవత్సరంలో నాసిక్‌లో మెహెర్ రిట్రీట్ అనే బంగాళాలో సహవాస్ ఎత్తివేస్తూ అక్కడ నుంచి కేన్స్‌కు బయలుదేరి వెళ్ళారు బాబా. కేన్స్ ఫ్రెంచి రివీరాలో ప్రసిద్ధి చెందిన పట్టణం. బాబా పాశ్చాత్య దేశాలకి వెళ్ళడం ఇది పదవసారి. అప్పుడు కిట్టీ డేలీని ముందుగా పి. అండ్ ఓ. స్టీమరు రావల్పిండిలో బయలుదేరి వెళ్ళమన్నారు. ఆమెతో ఇంకా ఆ స్టీమరులో మార్గరెట్ క్రాస్కీ, డెలియా డి లియాన్, విల్ బాకెట్, మేరీ బాకేట్ ఉన్నారు. వీరంతా డిసెంబరు 1936 లో బొంబాయి వచ్చినది ఈ స్టీమరులోనే. వీరంతా లండన్ నగరవాసులు. బాబా కేన్స్‌కి వెళ్ళిన తరువాత వీరంతా బాబా వద్దకు వచ్చేయాలని ఏర్పాటు. తరువాత బాబాతో బయలుదేరదామని మాల్కమ్ స్లాస్, అతని భార్య జీన్, టామ్ షార్ ప్లీ, నడీనె టాల్‌స్టాయ్, ఎలిజబెత్ పాటర్సన్, నోరీనా మాచెబెల్లీ, నానీ గేలీ ఆమె కుమార్తె రానో గేలీ నాసిక్‌లో వేచియున్నారు.

కిట్టీ ముందుగా బయలుదేరింది కాబట్టి ఆమెకు మూడు పనులు చెప్పి పంపించారు బాబా. మొదటిది-ఆమె తల్లి చనిపోయింది కాబట్టి విదురుడయిన తండ్రిని పరామర్శించడం. (వీరి యింట్లోనే బాబా మొదటిసారి లండన్ వెళ్ళినపుడు బస చేశారు) రెండవది-ఆమెతోకూడా ఇద్దరు మంచి పనికత్తెలను కేన్స్‌కి తీసుకుని రావడం; మూడవది- నిపుణుడయిన ఒక సేవకుని కుదిర్చి వెంటగొని రావడము. సేవకుడు అన్ని విధాలా నేర్పరిగాను, మంచివాడుగానూ ఉండాలి ఈలాటి సేవకుని చూడమని బాబా మండలితో ఎన్ని రోజులనుంచో చెపుతున్నారు కాని సరియయిన వాడు ఎవరూ కుదరడంలేదు. చేరిన తరువాత, బాబాలో నమ్మకముండి శ్రద్ధాభక్తులతో పని చేసిపెడుతూ, ఆధ్యాత్మిక తత్వం కలవాడుగా ఉండాలి. అలాంటివాడు దొరకడం దుర్లభం అవుతోంది. బాబా అన్నారుట-"సేవాకార్యంలో సంపూర్ణత్వం కలిగిన సేవకుడు నేను మౌనం విరమించే ముందు లభ్యమవుతాడు" అని. వీరితో ఏమి పని చేస్తారు అని బాబాని ఒకమారు అడిగితే వారు-"భవిష్యత్తులో యువకుల మీద వీరి ద్వారా నేను పనిచేస్తాను" అని జవాబు చెప్పారుట. బాబా శరీరం త్యజించిన తరువాత ఈనాడు విమర్శించి చూస్తే ముఖ్యంగా విదేశాలలో యువకు

లెందరో బాబా అంటే త్వరగా నమ్మకం ఏర్పరుచుకుని వారిని తలుచుకుంటూ బాబా సత్యప్రేమ సందేశాలు వ్యాప్తిచేసే పని చేయడానికి నడుముకడుతున్నారు. ఇది బాబా యొక్క అంతరంగ కార్యాచరణ ఫలితమే కాక మరేమిటి ?

బాబా శిష్యమండలి నాసిక్‌లో ఉన్నవారితోను మెహెరాబాద్‌లో ఉన్నకొందరి తోను బొంబాయి వచ్చారు. అక్కడినుంచి కేన్స్‌కి ఎప్పుడు బయలుదేరేది ఎవరికీ చెప్పలేదు అందరినీ సిద్ధంగా ఉండమని మాత్రం చెప్పారు. ఆఖరి నిమిషంలో బయలుదేరండన్నారు.

1931 జూలై, 31 వ తేదీని పి. అండ్ ఓ. కంపెనీ స్టీమరు స్ట్రాత్‌నవర్‌లో 18 మందితో బాబా బయలుదేరారు. బాబా గోపికలయిన మెహెరా, మణి, నజా, ఖోర్షె ఆమె తల్లి మాసి, నీలు ఈ ఆరుగురు ఇందులో వున్నారు. పురుషమండలి వేరే ఇంకో స్టీమరులో తరువాత బయలుదేరారు. వర్షాకాలం గనుక సముద్రం కల్లోలంగా వుంది. హిందూమహాసముద్రంలోను, ఎర్ర సముద్రంలోను ప్రయాణం చేస్తూంటే. ఎండవేడిమి మిక్కుటముగా వున్నందువలన అందరికి ప్రయాసకరంగా వుంది. ముఖ్యంగా మెహెరాబాద్ కొండమీద వుంటూవున్న స్త్రీ శిష్యురాండ్రకు మరీ కష్టంగా వుంది. వారికి వికారం, తలనొప్పి, కడుపునొప్పి ఇవన్నీ వచ్చాయి. సముద్ర ప్రయాణం వారికి ఇదే మొదలు గనుక.

ఈ స్త్రీలు ఎన్నడూ పురుషులకంట పడలేదు. వారు నల్లటి కళ్ళద్దాలు పెట్టుకున్నారు. ఈ ప్రపంచపు దృశ్యాలు సాధ్యమయినంత వరకు వారు చూడకుండా వుండాలని ఘోషా స్త్రీలవలె వారి తలమీద ముసుగులేసుకున్నారు. వారి ప్రక్కనుంచి వెళ్ళేవారిని కూడా చూడడానికి వీలులేకుండా చేసుకున్నారు. వారితోవున్న పాశ్చాత్య స్త్రీలు వారికి సహాయం చేస్తున్నారు. బాబా వీరిని ఈ విధంగా పరదాలో వుంచడంవల్ల వారిద్వారా స్త్రీలోకానికి ఎంతో ఆధ్యాత్మిక లాభం సమకూరుస్తున్నానని చెప్పారు. ఈ శిష్యురాండ్రు బాబా యెడల అమితమైన నమ్మకము, భక్తి, గౌరవము కలిగివున్నారు. బాబా యొక్క ఇచ్ఛకు సంపూర్తిగా లోబడివుంటున్నారు, బాబాకి వారు ఏ విధంగా విధేయులుగా వుండాలా అనే ఆలోచిస్తారు. వారు ఏమీ బాబాను కోరరు. ఓడమీద ప్రయాణం చేస్తున్నంతసేపు వారి గదులు విడిచి వారు బయటకు రాలేదు. తెల్లవారకముందు మాత్రం అంటే అప్పటికింకా ఎవరూ లేచి యుండరు. బాబాతో డెక్కుమీద నడవడానికి బయటకు వచ్చేవారు. ఈ ప్రాచ్య స్త్రీలకి భౌతిక అవసరాల నిమిత్తం ఏమి కావాలో చూస్తూండమని బాబా మండలిలో కొందరిని నియోగించారు.

బాబాతో నాసిక్‌లో వున్నారని పైన చెప్పిన పాశ్చాత్య శిష్యులందరు, స్త్రీలు కూడా బయలుదేరారు. బాబాతో వారు పర్యటన చేయడం ఇదే మొదటిసారి. ఇంకొక విశేషం ఏమంటే బాబాతో మొట్టమొదటిసారిగా స్త్రీ మండలికూడా వచ్చారు. వీరు ఘోషా పద్ధతిలోనే ఉన్నారు. అంటే మహమ్మదీయులవలె బురఖాలేసుకునే వారని కాదు. బాబా వారిని బహిరంగంగా బాహ్య జీవితంలో ఆధ్యాత్మికంగా పాల్గొనేవరకు కొన్నాళ్ళు ఇటువంటి శిక్షణలో ఉంచారు. వారు బయటకు ఎక్కడికీ వెళ్ళడానికి వీలు లేదు. పొరపాటుననైనా పురుషులెవరికీ తగలడానికి వీలులేదు. వారిని చూడనైనా చూడకూడదు. ఎక్కడికి వెళ్ళినా బాబాతోనే వెళ్ళాలి. ఇటువంటి నియమాలతో బాబా వారిని ఎందుకు ప్రయాణం చేయించాలి. అంటే వారిని పాశ్చాత్య దేశాలకి తీసుకువెళ్ళడంలో ఆధ్యాత్మిక విశేషమేదో ఉండాలి. అది బాబాకే తెలియాలి. వారితో ప్రయాణం చేస్తున్న పాశ్చాత్య స్త్రీలు వారికి సహాయం చేస్తున్నారు.

ఒక రాత్రి బాబా నొరీనాను వారి గది బయట పక్క వేసుకుని పరుండమని చెప్పారు. ఆ గది తలుపు గాలికోసం తెరచే వుంచుకున్నారు. నొరీనా అలా బయట పరుండియుండగా ఒక రాత్రి ఎవరో ఒక పురుషుడు తప్పత్రాగి ఆమెమీద వంగుని చూస్తున్నాడు. చూచి ఆ గదిలోకి వెళ్ళడానికి సిద్ధమయాడు. త్రాగిన మైకంలో అతని గదికి దారి తెలియక ఇలా వచ్చాడని తరువాత తెలిసింది. నొరీనా వెంటనే లేచి అతనిని అటకాయించి పంపించేసింది గనుక లోపలవున్న భారతీయ స్త్రీలకి ఎ గొడవా లేకుండా సరిపోయింది.

కొందరు పాశ్చాత్యులు వున్న గదులలో కిటికీలు గట్టిగా మూయబడి సీళ్ళు వేయబడ్డాయి. అవి నీటికి అడుగు భాగంలో వుండబట్టి అలా చేయవలసి వచ్చింది. వారి గది దగ్గరగానే ఓడలో గొర్రెతోళ్ళు వుండడంవల్ల ఆ చర్మాలు కంపు కొడుతున్నాయి.

ఆ గదులలో నిద్రపట్టదు. మాల్కమ్ వున్నగది ఈ విధంగా మరీ అధ్వాన్నంగా వుండడంచేత బాబాతో చెప్పగా రెండవతరగతిలో ఇంకే గదులు ఖాళీ లేనందున మొదటి తరగతిలోకి మారండి ఆ ఎక్కువ డబ్బు నేను ఇస్తాను అన్నారు బాబా. అతనికిగాని, అతని భార్యకిగాని అది చేయడం యిష్టంలేకుండెను-ముఖ్యంగా గురువుగారయిన బాబా రెండవతరగతిలో ప్రయాణం చేస్తున్నప్పుడు వారెట్లు పై తరగతిలో వెళ్ళడానికి అంగీకరిస్తారు ? అయినా ఆ దంపతులను మొదటి తరగతి లోకి మారమని బాబా కబురు చేశారు గాని వారు మళ్ళీ వద్దని తిరస్కరించారు.

తరువాత వారి నిశ్చయానికి బాబా సంతోషం వెలిబుచ్చారు. బాహ్యంగా బాబా మాట జవదాటవలసి వచ్చిందని బాబాను క్షమించమని వారు కోరారు. అంతరంగంలో బాబా యిచ్ఛ వారు వెళ్ళకుండా వుండాలనే గనుక ఇందులో క్షమాపణకోరేదేదీ లేదన్నారు బాబా. చివరికి వారి పరుపులు తీసుకుని డెక్కుమీదకి వెళ్ళి పరుండమని బాబా అనుమతించారు. మొదటి తరగతి స్నానాలగది. పాయిఖానా కూడా వారు ఉపయోగించడానికి అనుమతి తెప్పించారు బాబా. రోజూ వాళ్ళ పరుపులు, రాత్రి ధరించే దుస్తులు క్రిందకి మోసుకురావలసి వచ్చేది.

బాబా చెప్పిన పనులలో మొదటిది మాత్రం చేయగలిగింది కిట్టీ. ఆమెకు పనికత్తెలు దొరకలేదు. సేవకుడూ దొరకలేదు ఈ సంగతి బాబాకి తెలియపరచగా ఆయన "పోనీలే నీవు కేన్స్‌కి బయలుదేరి వెంటనే వచ్చెయ్యి" అని కేబిల్ ద్వారా కిట్టీకి తెలియపరచారు.

బాబా ఆజ్ఞప్రకారం కిట్టీ ముందుగానే కేన్స్‌కి వెళ్ళి అక్కడ నోరీనా చెల్లెలయిన గీత సహాయంతో, మాడమ్ మార్వెల్ అనే యిళ్లు-కుదిర్చి-పెట్టే ఏజెంటు సహాయంతో మూడుయిళ్ళు ఏర్పాటు చేసింది. ఈ మూడూ ఒకేచోట ఒకే ఆవరణలో వున్నాయి.

బాబా వారి మండలితో స్ట్రాత్‌నవర్ అనే ఓడలో ప్రయాణం చేస్తున్నారు. ఓడ ఏడెన్ దగ్గరకు వచ్చేసరికి సముద్రంలో కల్లోలం తగ్గింది కాని ఎర్ర సముద్రంలో వేడి చాలా ఎక్కువవడమేగాక గాలి ఎక్కువై చాలా కష్టమనిపించింది. ఆ సముద్రంలో ప్రయాణం చేసిన మూడురోజులూ అలా వేడితో బాధపడ్డారు. ప్రయాణీకులంతా ఓడలో చల్లని ప్రదేశం వెతుక్కుని అక్కడకు వెళ్ళేవారు. బాబా యొక్క స్త్రీ మండలి గదులలోనే వుండి మగ్గిపోవలసి వచ్చింది. డెక్కుమీదకు వెళ్ళినవారికి మాత్రం కొంత ఉపశమనం కలిగింది. బాబా యెడల వారికివున్న ప్రేమయే అందరినీ నిలబెట్టి సుఖంగా ప్రయాణం చేయించిందని చెప్పాలి.

## నిస్వార్థ సేవ :

ఆగస్టు 7 వ తేదీన స్ట్రాత్‌నవర్ ఓడమీద వెడుతూ బాబా తమ శిష్యులనందరను పిలిచి నిస్వార్థసేవ అంటే యేమిటో ఇలా చెప్పారు.—

"భగవంతుడు అచ్చంగా తాను మానవుడు అనే చైతన్యం కలవాడు కాడు. మానవుడు తాను భగవంతుడనే ఎరుక కలిగి లేడు. భగవన్మానవుడు - అవతారుడు తాను భగవంతుడనీ, మానవుడుగా అవతరించాడనీ రెండూ తెలుసుకుని ఉన్నాడు.

అందుకని అవతార పురుషుడు ప్రభువుగానూ, అందరియొక్క బరువులను మోస్తూ ఈ విశ్వానికి సేవకుడుగానూ నిరంతరాయంగా ఉంటున్నాడు. అందరకూ సేవచేసే ఆయనకు సేవ చేయడమంటే ఈ విశ్వానికే సేవచేయడమన్నమాట.

(నిస్స్వార్థసేవ, ప్రేమ, ఈ రెండూ దివ్యమైన జంట గుణాలు. ప్రేమించేవాడు మాత్రమే సేవ చేయగలుగుతాడు. నీ ప్రియతముడైన అవతారుని సేవచేస్తే అందరిలోనూ వున్న నీ ఆత్మకే నీవు సేవచేసిన వాడవవుతావు.

ఆయన ఆశించే సేవ నీయొక్క ఆధ్యాత్మిక లాభం కొరకే. అయితే ఈ సేవ నీకు ఇష్టమయి నీ అంతట నీవుగా, హృదయపూర్వకంగా, బేషరతుగా ఏవిధమయిన ప్రతిఫలము ఆశించకుండా చేసేదిగా వుండాలి. ఆయన సేవ శరీరాన్ని, మనస్సును, ఆత్మను శ్రమింపజేసే ఒక కఠిన పరీక్ష. లేకపోతే అదే నీకు వీలుగాను, సులభంగాను ఉంటే సేవయొక్క సంపూర్ణత్వం ఎలా కలుగుతుంది ? శరీరం బాధపడుతుంది. మనస్సు వేదన అనుభవిస్తుంది. కాని ప్రభువుకి నిస్స్వార్థసేవ చేసినందువలన ఆత్మ సంతృప్తి కలిగి ఆత్మానందము అనుభవంలోకి వస్తుంది.)

ఉన్నవాడే త్యాగం చేయగలుగుతాడు. రాజు అన్నీ వదిలేసి ఒక బిచ్చగాడు అయేడంటే అది నిజమైన త్యాగం అన్నమాట. అందుచేత ఏ ప్రశ్నాలేకుండా ఏమయినా సరే అవతారుని సేవించినప్పుడే అది నిజమయినసేవ అవుతుంది. లేకపోతే అది కూలికి చేసిన పనే అవుతుంది."

మార్సేల్స్‌కి ఓడ ఆగస్టు 13 వ తేదీ శుక్రవారం చేరుకుంటుందని రెండు రోజులు ముందుగానే ఫ్రాన్సుకి ముందు వెళ్ళినవారికి బాబా తెలియపరచారు. ఓడ మార్సెల్స్ చేరుకోగానే డెలియా డిలియాన్ బాబాను శిష్యుల బృందాన్ని హార్బర్‌లో కలుసుకుని అక్కడ నుంచి వారిని రైలులో కేన్స్ స్టేషన్‌కి తీసుకువచ్చింది. కిట్టీ దేలీని ఒక బస్సును స్టేషన్‌కు తీసుకురమ్మని డెలియా చెప్పివెళ్ళింది. కాని ఆమె స్టేషన్‌కి చేరుకోవడం ఆలస్యం అయింది. అప్పటికే అందరూ ఊళ్ళోకి వెళ్ళిపోయారు. తాను ఏర్పాటు చేసిన కేపో డి మాంటె అనే బంగాళాకి వెళ్ళింది కిట్టీ. ఆ ఆవరణలోనే షెల్లీ అనే చిన్న విల్లాలో బాబా స్త్రీ మండలితో వున్నారు. బాబా కిట్టీతో ఆ యిల్లు తమకు నచ్చలేదనీ వెలుతురు చాలా తక్కువగా వుందనీ, అక్కడి నుంచి చూస్తే కనిపించే దృశ్యంకూడా అంత అందంగా లేదనీ, ముఖ్యంగా స్త్రీలకి ఏకాంతంగా వుండడానికి వీలుగా లేదనీ అన్నారు. "అయితే యేం లే. ఈ వేళ కిక్కడ వుండి రేపు ఇంకోటి చూసుకుందాం" అన్నారు బాబా.

మర్నాడు శనివారం ఉదయం ఎలిజబెత్, కిట్టీ ఇద్దరూ కలిసి ఇంకో ఏజంటు ద్వారా "కల్దానా విల్లా" అనే బంగాళా కుదిర్చారు. అది ఒక కొండమీద ఏకాంత ప్రదేశంలో వుంది. చాలా విశాలంగాను వెలుతురుగాను, ఉన్న గదులతో వుంది. దానికి అందమైన తోట కూడా వుంది. ఇది బాబాకి బాగా నచ్చింది. అందుచేత వెంటనే నొరీనా వెళ్ళి ఫ్రెంచి భాషలో విల్లా యజమానితో మాట్లాడి కావలసిన షరతులతో ఖరారునామా వ్రాయించి డబ్బు కట్టి యిల్లు అధీనం చేసుకుంది. అక్కడ ఒక ఫ్రెంచి స్త్రీ యిల్లు జాగ్రత్తగా చూస్తూ వుంటోంది. బాబా వారి పరివారమూ ఎలిజబెత్, నొరీనా, రానో, కిట్టీలతో సహా అందులో ప్రవేశించేలోపుగా ఆమె ఈ విల్లా శుభ్రం చేసింది. అందులో బాబాకు కావలసిన కుర్చీలు వగైరా కూడా వున్నాయి. ఒక గదిలో పియానో వుంది. కేవో డి మాంటెకి ఇది కొద్ది దూరంలోనే వుంది. అంటే పది నిమిషాలలో నడిచిరావచ్చు బాబాకి ప్రత్యేకంగా ఒక గది ఏర్పాటయింది. దానికి డాబా కూడా వుంది. ఆ గది అన్నిటికంటె ఎత్తుగా వుంది. ప్రతిరోజూ ఉదయాన్నే బాబా ఆ డాబా మీద ఏకాంతంగా రెండు గంటలసేపు కూర్చునేవారు. కూర్చుని ఆయన ఆధ్యాత్మికపు పని చేసుకునేవారు. అక్కడికి వెళ్ళడానికి ఇతరు లెవరికీ అనుమతి లేదు. ఒక రోజున మాత్రం బాబా అందరినీ ఆ డాబా మీద తమతో భోజనం చేయడానికి పిలిచారు. అప్పుడే నజా హడావిడిలో పాపం క్రింద ఒక పళ్ళెంలో పెట్టిన వేడి వేడి కాలీఫ్లవర్ కూరలో అడుగేసింది. అంతట నజా ఖిన్నురాలు కాకుండా బాబా అందరినీ నవ్వించేలా నవ్వేసేరు. బాబా ఇద్దరు పనికత్తెలు కావాలన్నారు గనుక హేడీ మెర్టెన్స్ అనే ఆమెకు జూరిచ్‌కి టెలిగ్రాం యిచ్చి ఐరీన్ బిల్లో అను ఆమె స్నేహితురాలిని అక్కడి నుంచి రప్పించేరు. ఈమె బాబాకి పనిలో బాగా నచ్చింది. అంతే కాకుండా ఒకనాడు ఆమె బాబాకు చక్కటి తెల్లని సిల్కు కోటు కుట్టించి బహూకరించింది. బాబా చాలా సంతోషించారు. రెండో ఆమెను లండన్ నించి రప్పించేరుగాని ఆమె బాబాకు నచ్చనందున విలియం డాన్‌కిన్‌ను కూడా యిచ్చి ఆమెను లండన్‌కి తిరిగి పంపించి వేసేరు. హెడీ మెర్టెన్స్, ఐరీన్ బిల్లోల సహాయంతో జెకోస్లోవేకియా నుంచి ఇంకొక్క పనిమనిషిని రప్పించేరు. ఆమె బాగానే చేసేది పని. ఆమె పేరు ఇల్సా. బాబాను ఎంతగానో ప్రేమించేది. కల్దానాలో ఉన్నన్నాళ్ళు ఆమె బాబాకు సేవ చేసింది.

కేవో డి మాంటెలో మిగిలిన మండలి వారంతా ఉన్నారు. రువానో బోగిస్లావ్ అనే అమెరికన్ స్త్రీ ఆ బృందానికి నాయకురాలు. ఎవరో ఒకరు అస్తమానం బాబా

దర్శనార్థం కేపో-డి-మాంటెకి వస్తూండేవారు. అందులో వివిధ వైఖరులు గల వారు ఉంటున్నారు. ఒకరి స్వభావం ఇంకొకరికి నచ్చదు. అందుకే కాబోలు బాబా కల్దానా స్వర్గమయితే కేపో-డి-మాంటే నరకం అన్నారు. ఒక ఆశ్రమ వాసంలా అందరినీ ఒక శిక్షణక్రింద వుంచి వారిచేత నియమబద్ధమైన జీవనం జీవింప చేసేవారు బాబా. ఆ సహవాస్‌లో వారి వారికున్న సంస్కారాలన్నీ పైకి ఉబికి వచ్చేలా చేసి వాటికి తగిన చికిత్సలాగ ఒక శిక్షణలో వుంచేవారు. ఈ సంస్కారాలన్నీ ఒక్కొక్కరిలోనూ నీటిమీది మంచురాళ్ళలా (నీటి అడుగున ఎక్కువగానూ పైకి కనిపించేది చాలా తక్కువగానూ) ఉంటాయి. కాబట్టి బాబా వారిలో వారికి ఏదో పేచీ లేవదీసి లోపలవున్నదంతా పైకి ఉబికేలా చేసేవారు. ఎవరి స్వభావాన్ని బట్టి వారికి అంతరింద్రియ నిగ్రహాన్ని బాబా నేర్పుతూ వుండేవారు.

బాబా ఒక పాశ్చాత్య ప్రేమికురాలు విషయంలో చాలా ఉదాసీనంగా వున్నారు. ఆమె ఒకనాటి ఉదయం బాబా ఒక్కరూ కూర్చున్నపుడు ఆయన వున్నచోటికి వెళ్ళి ఆయన ప్రక్కన మోకరించి ఆయన చేతులలో ఆమె తలను దాచుకుంది. బాబా ప్రేమతో ఆమె తల నిమిరి —

బాబా : నీవు నన్ను క్రూరుడని అనుకుంటున్నావు కదూ.

ఆమె : అవును. మీరు క్రూరులే మరీ.

బాబా : నేను తాత్కాలికంగా క్రూరునిలా వుండడం నీయెడల శాశ్వతంగా దయగా వుండడానికే. (ఆమెకేసి కొన్ని క్షణాలు దయతో చూసి) —

బాబా : ఈ బాధ నీవుపడుతున్న ఆనవాలుకూడా లేకుండా పోయే రోజు వస్తుంది. నీ ఆత్మ ఆనందంతో నిండిపోతుంది.

ఆమె : ఈ బాధపడే 'రాత్రి' చాలా దీర్ఘంగా వుంది.

బాబా : పగటి వెలుతురు వస్తోంది. వెలుతురు రాగానే నీవు భరించిందంతా వెయ్యి విధాల సరేనని అనుకుంటావు.

బాబా ఆత్మలతో పనిచేసే విధానం వివరిస్తూ అన్నారు —

("నేను నిన్ను దూరంగా తోసేస్తాను. మరల దగ్గరకు లాక్కుంటాను. మళ్ళీ దూరంగా తోసేస్తాను. తరువాత ఈ మాటు నాతో ఐక్యం చేసుకునేందుకే లాక్కుంటాను శాశ్వతంగా.")

కొత్త బంగాళాలో దిగాక బాబా శిష్యులకు తలొక గది కేటాయించి అందులోనే అక్కడున్నన్నాళ్ళు బసచేసి వుండేలా ఏర్పాటుచేశారు బాబా. ఆ ప్రకారం వారు

౹ గదిలో వారి సామానులను చక్కగా సర్దుకున్నారు సర్దుకున్నాక ఒక రోజయినా ౦దులో వుండనీయక బాబా మరల ఆ గది మార్చి యింకోగదిలోకి మారాలని చాలా ఎందిని మార్పు చేయించారు. కొంతమంది సంవత్సరంపాటు అందులో వుండేలా న్ని ఏర్పాట్లు చేసుకున్నారు. పాపం వాళ్ళకి చాలా యిబ్బంది కలిగింది. అలాటి ారికి అప్పు యింక మారనక్కర్లేదు అని చెప్పేవారు. ఆవిధంగా మూడు మార్లు యినా హారమని బాబా ఆజ్ఞాపించి మార్పించారు. బాబా వారి శిష్యులకు ఇలాగే అనేక మార్పులకి అలవాటు చేశారు. ఏ ప్రదేశంమీద ఏ వ్యాళ్ళను మమకారం కలిగేలా ేయక ఎంత సమపాయంగా సుఖంగా వున్న స్థలమయినా అతి సులభంగా విడిచిపెట్ట గలిగేలా వారికి శిక్షణ యిచ్చారు. బాబా మాల్కమ్‌కి కఠిన నియమాలు విధించారు. అతడు పూర్తిగా మౌనంగా వుండాలి; రోజు కొక్కమారె భోజనం చేయాలి; అతనికి ఈ శిక్షణ లోజూపు అలవాటు చేసుకోడానికి పనికి వచ్చింది.

కేన్స్ మకాంలో ఒక రోజున బాబా వారి పాశ్చాత్య పరివారానికి ఇలా చెప్పారు. —

"సేవ అంటే ఏదిపడితే అదికాదు. మీలో మీరు సేవ చేయడానికి ఒప్పుకోవ డము ఒప్పుకోకపోవడము అని యీ రెండూ ఉన్నాయనే అభిప్రాయం ఉండకూడదు. మీరు మీ శరీరానికి ప్రభువని అనుకోరాదు. అది మీ గురువుదే మీ శరీరము గురు సేవ కోసమే ఉన్నదని, మీరు అనుకోవాలి."

ఆగస్టు (1937)లో బాబా యందు అపారమైన భక్తి వున్న వాల్టర్ మెర్టెన్స్ జూరిచ్‌నుంచి బాబాతో కొన్నాళ్ళు కేన్స్‌లో వుందామని వచ్చాడు. ఇప్పటికే బాబా సాంగత్యం వల్ల అతనికి అద్భుతమైన అనుభవాలు కలిగాయి.

## కేన్స్‌లోవుండి బాబా చేసిన ఒక అద్భుతము :

వాల్టర్ ఒక రోజున బాబాతో అతని స్నేహితుడొకడు బెర్లిన్‌లోఉన్న ఒకామె గురించి తనకు వ్రాశాడని, (మిసెస్ డబ్ల్యూ. ఎఫ్.) పక్షవాతం వచ్చి ఆమె కదలలేక మాట్లాడలేనిస్థితిలో బెర్లిన్ ఆస్పత్రిలో ఉన్నదని, ఆమెకి బాబాలో ఎంతో నమ్మకం వుందని చెప్పాడు. ఆమె బాబా గురించి విన్నదికాని దర్శనం చేసుకోలేదు. నెల నెలకి ఆమె వ్యాధి ముదురుతున్నది కాని ఆమెకి బాబామీద వున్న అమితమైన భక్తి, విశ్వాసములు ఏమీ సడలలేదు. ఎప్పటికైనా బాబావల్ల ఆరోగ్యం చేకూరుతుందనే నమ్మకంతో వుంది ఆమె. ఈ విషయం బాబాతో చెప్పగా బాబా అన్నారు—

"అయితే నేను బెర్లిన్ వెళ్ళి ఆమెను చూచి స్పృశిస్తాను. ఆమెకు నయమవుతుంది. లేకపోతే ఆమెను ఇక్కడికే రప్పిద్దాము. ఆమెకు జబ్బు కుదురుతుంది" ఈ మాటలు అన్నప్పుడు బాబా ముఖము ఎంతో శాంతంగా వుంది కాని ఆయన చేతి వ్రేళ్ళు వేగంగా కదులుతున్నాయి. బాబాకి ఆమె పేరుగాని ఆమె ఎలా వుంటుందో గాని అతడు చెప్పలేదు.

తరువాత వాల్టర్‌కి ఒక అద్భుతమయిన అనుభవం కలిగింది. అతనికి ఒక దృశ్యం కనిపించింది. బాబా బెర్లిన్‌లో ఆసుపత్రిలోని రోగి వద్దకు వెళ్ళినట్లు, ఆమె కళ్ళు విప్పి బాబాను చూచి ఆయనను గుర్తు పట్టినట్లు, బాబా వద్ద నుంచి ఆమెకు జీవన తరంగాలు ప్రసరించినట్లు, ఆమె 'బాబా!' అని గట్టిగా అరచినట్లు తరువాత ఆమె ఎంతో సంతోషంతో పక్కమీద నుంచి లేచినట్లు ఆమెకు వున్న పక్షవాతరోగం మాయమై, ఆమెకు ఆరోగ్యం కలిగినట్లు. ఆమె నడిచివెళ్ళి బాబా పాదాలకు ప్రణమిల్లినట్లు, ఆమె బాబా! బాబా! అని తండ్రి వద్దకు బిడ్డ చేరినట్లు ఆయన వద్దకు చేరినట్లు అతనికి ఒక సినీమాలాగ దృగ్గోచర మయింది. బాబాను ఆమె ఏసుక్రీస్తని నమ్మింది.

రెండు రోజు లయిన తరువాత మిసెస్ డబ్ల్యూ. ఎఫ్. కు పూర్తి ఆరోగ్యం చేకూరినట్లు వాల్టర్‌కి వచ్చిన వార్త మూలంగా తెలిసింది. తనకు కనిపించిన విధంగానే అంతా జరిగినట్లు తెలిసింది. బాబా అనంత దయా సముద్రుడు, సర్వ శక్తిమంతుడు అని బాబాను కొనియాడాడు. బాబా బెర్లిన్ వెళ్ళకుండానే బెర్లిన్‌లో వున్న మిసెస్ డబ్ల్యూ. ఎఫ్. కేన్స్‌కి రాకుండానే బాబా కేన్స్‌లో వుంటూనే బెర్లిన్ ఆసుపత్రికి వెళ్ళి ఆమెకు ఆరోగ్యం ప్రసాదించారు. ఆయన సంకల్పిస్తే చేయలేని పని ఏముంది? ఆమె జన్మ చరితార్థ మయింది. బాబా సర్వజ్ఞుడు, సర్వ శక్తి మంతుడు అని రుజువయింది.

## మానవుడు - అవతారుడు:-

కేన్స్‌లో బాబా మకాం చేస్తున్న కల్దానా అనే బంగాళాకి బాబా దర్శనార్థం వచ్చిన ఒక పాశ్చాత్యుడు బాబాకి కొంచెం సుస్తీ చేయగా మందులు వాడడం చూచి ఈ విధంగా బాబాను ప్రశ్నించేడు—

ప్రశ్న : ఒక సద్గురువుకు జబ్బు చేయడం ఔషధాలు పుచ్చుకోవడము ఎందుకు సంభవిస్తుంది?

బాబా జవాబు : సంపూర్ణత్వ మనేదాన్ని గురించి పడమట దేశాలవారి అభిప్రాయాలకీ, తూర్పు దేశాలవారి అభిప్రాయాలకీ తేడా వుంది. సంపూర్ణత్వమంటే

పాశ్చాత్యుల అభిప్రాయం ప్రకారం మానసిక శక్తులుంటే అది పరిపక్వ దశ అని అనుకుంటారు.

ఈ శక్తుల నుపయోగించే యోగి అయినవాడు తమాషాలను చేస్తాడు. తిండి లేకుండా ఉండగలడు. నిద్ర లేకుండా ఉండగలడు. కావాలన్నప్పుడు శరీరం వదిలివేయగలడు. ఊపిరి పీల్చడం ఆపివేయగలడు — ఇంకా ఇలాటి వెన్నో చేయగలడు. ఆధ్యాత్మికంగా ఆలోచిస్తే, ఒక మామూలు మంచి మనిషి స్వార్ధం లేకుండా ప్రపంచంలో ఇతరుల కోసం పాటు పడే వాడు పైన చెప్పిన శక్తులు ప్రదర్శించి తమాషాలు చేసే యోగుల కంటె చాలా ఉత్తముడు. ఎందుచేతనంటే యోగి ఏది చేసిన వాడి స్వార్థం కోసమే చేస్తాడు. పరోపకారం కోసం చేయడు. ఒక మాయని జయించ డానికి ఇంకో మాయను సృష్టిస్తాడు. వాడి పని సద్గురువు యొక్క బోధనకు పూర్తిగా విరుద్ధము. (ప్రపంచపు బరువును తన మీదకు తీసుకొన వలసిన ఒక సద్గురువు అట్లు చేయుచున్నపుడు భౌతికంగా అతని శరీరం మీద తప్పకుండా ఫలితం ప్రతిబింబిస్తుంది. ఒక మామూలు మనిషిలాగ అతడు భౌతికంగా బాధను అనుభవించాలి.)

కృష్ణుడు, మహమ్మదు, జీసస్, సంపూర్ణులే. కర్మ ధర్మాను సారంగా శరీరధారులు గనుక వారు ఫలితాలను అనుభవించేరు. ఈ శరీర ధర్మానికి వారు బద్ధు లయినప్పటికి ఆ కర్మకు వారు అతీతులు. కావాలంటే వారికి వచ్చిన బాధలు, వచ్చిన జబ్బులు ఒక క్షణంలో పోగొట్టుకొనగలిగే వారే. సద్గురువులు మానవులను మాయను అధిగమించేలా చేయుటకు కర్మ ఫలితాల నుండి విముక్తులను చేయడం ద్వారా విశ్వమాయ యొక్క ద్వంద్వములను వారు లోబరచుకుంటున్నారు.

సద్గురువు ద్వంద్వమును దివ్య మొనర్చుటకు తన సత్యమైన అస్తిత్వము నందు లయము చేసుకొనుచున్నాడు.

రామకృష్ణ పరమహంస పుట్టకురుపుతో బాధ పడెను. కావాలంటే అతని అనంతమైన శక్తులతో దానిని బాగుచేసుకొన జాలి యుండెను జీసస్ సిలువ మీద అనేక సారులు స్పృహ తప్పెను. కాని అతడు అట్లు గాకుండ జేసుకొన జాలియుండెను. అట్లు స్పృహ తప్పుట మానవాళి యొక్క మంచికి అవసరమై యుండెను.

బాబా చేపలను, గ్రుడ్లను, మాంసమును భుజింపక యుండెను. అది తమ లాభమునకు గాక మానవ కోటికి ఆదర్శము జూపుటకే. అదే ముందు తాము మాటలాడునపుడు ఒక న్యాయమై స్థాపిత మగును.

బాబా కేన్స్ మకాములో వుండగా ఒకనాడు అక్కడ చేరిన పాశ్చాత్య మండలికి కాకాచేత ఒక ఉపన్యాసము యిప్పించారు. కాకాకి ఆంగ్లభాష అంత బాగా అభ్యాసం లేదు. అయినా బాబా అతనిచేత మాట్లాడిస్తూ ఆ వేడుక చూచి ఆనందిస్తూ వుంటారు.

కాకా ఉపన్యాసం ఈ విధంగా సాగింది :—

"సోదరీ సోదరులారా ! మన ప్రియతమ గురువయిన శ్రీ మెహెర్ బాబాతో మిమ్ములను చూచుటకు నాకు చాలా సంతోషంగా వుంది. బాబా యెడల మనకున్న ప్రేమ మనల నందరను ఇక్కడకు తీసుకొని వచ్చింది.

చాలా రకాల ప్రేమ వున్నది. కాని మూడు రకాలయిన ప్రేమను ఎల్లప్పుడూ జ్ఞాపక ముంచుకోండి.

మొదటిది - అన్నిటికంటె గొప్ప ప్రేమ - గురువు యొక్క ప్రేమ. ఈ ప్రేమ ప్రధానంగా వుండాలి. అది మన హృదయాలను లోభానికి, లాభానికి దూరం చేస్తుంది.

రెండవది - ఒకరి నొకరు ప్రేమించుకొనుట, పరస్పర సహాయము చేసు కొనుట, స్వార్థపు ఆలోచనే లేకుండా ఒకరికి సహాయము చేయుటకు సిద్ధముగా నుండుట.

మూడవది - ఒకరికి పరోక్షంగా సహాయం చేయుట. నీకు సహాయం చేయ డానికి సాధనము లేదనుకో, కానీ సహాయం చేసేవారిని ప్రయత్నించి కనుక్కో గలవు. నీవు సద్గురు సాంగత్యము చేసినపుడు నీవు ఒక ఖాళీ గ్లాసులా అయి పోవాలి. నీవు బురదతో వున్న గ్లాసు తెచ్చుకుంటే గురువు యిచ్చిన పాలు అందులో పోసి ఎలా నింపగలవు ? మనము గురువుతో నివసించునపుడు ఆయన చేసినవన్నీ మనము చేసి అనుకరించ నక్కరలేదు. కాని ఆయన చెప్పినది విధిగా చెయ్యాలి. ఉదాహరణకి - మన్ గయేతో జానేదే మత్ జానేదే శరీర్. నీ మనసులో ఏదయినా కోరిక మొలకెత్తితే పోనీలే, చెడ్డ ఆలోచన, వచ్చినట్లుగానే అది పోతుంది. కానీ నీవు ఆ ఆలోచన వెంబడే పడిపోకు, నీవు నిగ్రహించుకో, మనసు శరీరము వేరు వేరు బాణము విల్లులాగ, విల్లు లాగితే బాణము దూసుకు పోతుంది. అందుచేత బాణాన్ని నియమించు. బాబా శిష్యులను జ్ఞాపకం వుంచుకొని

ఒకరి నొకరు ప్రేమించుకొని సహాయం చేసుకుంటూ బాబా ఆదేశాలను పాటించమని కోరుతున్నాను."

బాబాకోసం యూరప్ నలుమూలల నుంచి అనేకమంది వచ్చి కేపో-డి మాంటెలో దిగారు. ఒక్కొక్కరినే వారున్న కల్దానా బంగళాకి పిలిచి బాబా వారికి దర్శనం యిస్తూండేవారు. బాబా నిర్ణయం ప్రకారమే వారంతా రావడం వెళ్ళడం-జరుగుతూ వుండేది. బాబా విశ్వకార్యంలో చాలా సేపు నిమగ్నమయి ఉండేవారు. అప్పటికి రెండవ ప్రపంచ మహా సంగ్రామం ఎంతో దూరంలో లేదు.

నాసిక్‌లో వలె గాక కేన్స్‌లో బాబా తమ శిష్యులకు ఎక్కువగా ప్రవచనాలు చేసేవారు కాదు. అక్కడ శిక్షణా యుతమయిన జీవితములో అందరూ పాల్గొనడమే ముఖ్యము. ఆ జీవితంలో ఆచరణలో బాబాను సంతోషపరచడమే ఆ శిష్యుల పరమ కర్తవ్యంగా ఉండేది. ఎవరూ కూడా బాబాను నూటికి నూరుపాళ్ళు సంతోషం కలిగించలేకుండా వుండేవారు. బాబా యొక్క అభిలాషకు చాలా దగ్గరగా ఒక్క మెహెరా మాత్రం ఆమె జీవితంలో రాగలిగింది అని బాబాయే చెప్పేవారు.

విల్లా కల్దానాలో బాబాతో వారి స్త్రీ మండలి మెహెరా, మణి, నజా, ఖోర్షెద్, వాలు, మాసే, ఎలిజబెత్, కిట్టీ, నోరీనా, రానో - ఉండేవారు. వీరు తరుచు షికారుకి వెడుతూండేవారు. అక్కడి తోటలో వివిధము లయిన ఆటలు వుండేవి. మెహెరా పియానో వాయించేది. మణి షార్టుహాండు తీసుకుని టైపు చేసేది. ఒకనాడు పారిస్ నుంచి అనితా-డి-కారో అనే ఆమె వచ్చింది. ఆమెతో ఆండ్రి అనే ఒక స్నేహితు రాలు కూడా వచ్చింది. ఈమె దుస్తులు తయారుచేసి పెట్టేది. వీరిరువురు కేపో-డి-మాంటెలో వుండేవారు. అయినా ప్రతిరోజూ విల్లా కల్దానాకు వచ్చేవారు. బాబా దర్శనార్థం ఎవరెవరు ఎప్పుడు రావాలో నోరీనా సరిచూచేది. ఎలిజబెత్ స్విడ్జర్లాండు నుంచి వచ్చిన ఐరీన్ బిల్లోతో బజారుకి వెళ్ళి ఏమేమి సరుకులు, కూరగాయలు వగైరా కావాలో అన్నీ తెచ్చిపెట్టేది. ప్రతిరోజూ ఉదయం బాబా కల్దానా నుంచి కేపో-డి-మాంటెకి వచ్చి కొద్ది గంటలసేపు గడిపేవారు. కేపో-డి-మాంటె నుంచి బాబా కల్దానాకు తిరిగి వెళ్ళడానికి ఆయన్ను ఎలిజబెత్ కారులో తీసుకుని వెడుతూండేది. బాబా అనుమతి లేనిదే మాత్రం ఎవరూ ఆ ఆవరణ వదలి వెళ్ళేవారు కాదు. ఎలిజబెత్, నోరీనాలు తప్ప బాబాను అడిగి అనుమతి పొందనిదే ఎవరూ ఎక్కడికీ బయటకు వెళ్ళరాదు. ఇండియాలో నాసిక్‌లో వీరంతా వున్నప్పుడు కూడా ఇటువంటి నియమాలే వుండేవి. ఈ స్త్రీ మండలి అంతా బాబా పిలిచినపుడు ఆయన వద్దకు వెళ్ళేవారు. బాబా మణికి ఉత్తరాలు చెపుతూంటేనో

మెహెరా ఆయనకి తల దువ్వుతూంటేనో సాధారణంగా వారందరినీ రమ్మని కూచోమంటూ ఉండేవారు. కిట్టీ, డేలీ, రానో గేలీ కలిసి ఒక పింగ్‌పాంగ్ బల్ల కొని తీసుకువచ్చారు కల్డానాలోకి. బాబాతో వారంతా అనేకమార్లు పింగ్‌పాంగ్ ఆడేవారు. కల్డానాలో వున్న పాశ్చాత్య స్త్రీలు కాక కేపో-డి-మాంటె నుంచి రోజుకొక స్త్రీని వచ్చి ఇండియానుంచి వచ్చిన స్త్రీలతో ఉండమని బాబా పిలిచేవారు. ఈ విధంగా చేయడంలో ప్రాచ్యులకు పాశ్చాత్యులకు భేదాలు తగ్గి ఒకరియెడల ఒకరికి సామరస్యం పెంపొందింపజేయాలని బాబాయొక్క ముఖ్యోద్దేశం. వారందరికీ బాబా యెడలవున్న ప్రేమ దీనిని సులభసాధ్యం చేసింది.

బాబా ఒక్కరూ కూర్చుని భోజనం చేసేవారు. కాని మండలివారు భోజనం చేస్తున్నపుడు ముఖ్యంగా అతిథులెవరైనా వచ్చినపుడు బాబా స్వయంగా వుండి వారు భోజనం చేస్తుంటే ఏమి కావాలో అన్నీ కనుక్కుంటూ ఉండేవారు. అప్పుడు కూడా అందరూ కఠినంగా శాకాహారమే తీసుకునేవారు. ఐరీన్ ఇంకో ఫ్రెంచి గ్రామీణ స్త్రీతో కలిసి శాకాహారం ఎంతో బాగా తయారుచేసి పెట్టేది.

ఎలిజబెత్‌కి హెడీకి మోటారుకార్లున్నాయి. వారు అప్పుడప్పుడు ఇతర స్త్రీలను వాటిలో షికారుకి తీసుకుని వెళ్ళేవారు. అప్పుడు బాబా భారతీయ స్త్రీలను బయటకు చూడనిచ్చేవారు. కిట్టీ కేన్స్‌లో తిరిగి తిరిగి పాశ్చాత్య స్త్రీలు ఈత లాడేందుకని ఒక కొలను కనిపెట్టింది. అందరూ వెళ్ళి ఏకాంతంగా ఆ కొలనులో స్నానమాడి వచ్చేవారు.

కేన్స్‌లో ఒకనాడు ఈ పాశ్చాత్యబృందం కొండలమీదికి షికారు వెళ్ళారు. అక్కడ వారికి విషసర్పాలు కనిపించాయి. వారు "బాబా" "బాబా" అని ఉచ్చరించ గానే వారి జోలికి పోక అవి దూరంగా తొలగిపోయాయి. ఒకమారు కేన్స్ ప్రజలు అక్కడ బాణాసంచా కాల్చేరు. ఆ వినోదం చూడడానికి ఒకతోట అద్దెకు తీసుకుని అందులో వుండి బాబా ఆయన పరివారమూ చూశారు. వారంతా ప్రదర్శనకు రెండు గంటలు ముందుగానే వెళ్ళి ఆ తోటలో కూర్చున్నారు. ఆ ప్రదర్శనం చూసి అందరు చాలా సంతోషించారు. కేపో-డి-మాంటెలో వున్న హెడి, అనిత, డెలియా, హెడి కుమార్తె అయిన ఆనా కటెరినాలను కూడా ఆ తోటలోకి పిలుచుకుని వెళ్ళారు. బాణా సంచాలో అన్నీ బాగున్నాయి. చైనావారు తయారుచేసినవి మరీ అందంగా వున్నాయి. బాబా పరివారంలో కొంతమంది అలాటివి ఇదివరకెప్పుడూ చూసియుండలేదు.

విల్ బాకెట్, మేరీబాకెట్ అనారోగ్య కారణంగా కేన్స్‌కి రాకుండా లండన్‌లోనే ఉండిపోయారు. బాబా వారినికూడా కేన్స్‌కి రమ్మని పిలిచారు. ప్రయాణానికి వారివద్ద సొమ్ము లేకపోతే బాబా ఆదేశానుసారంగా ఇతర ప్రేమికులు వారికి సొమ్ము పంపి వారిని కేన్స్‌కి రప్పించారు. ప్రియతముని మరల చేరగలిగామని బాకెట్లు ఎంతో సంతోషించారు.

స్పెయిన్ దేశస్థుడయిన ఒక పరిచారక బాలుని విలియమ్ డాన్‌కిన్ తీసుకు వచ్చాడు. కాని వీడు బాబాకి అంత అంగీకారయోగ్యంగా లేనందున కిట్టీ పారిస్‌వెళ్ళి ఇంకొక కుఱ్ఱవానిని తీసుకువస్తానంటే బాబా సరే అని ఆమెను పంపించారు. ఒక బాలుని ఎన్నుకుని వానికి ఎన్నో నచ్చచెప్పి చదువు చెప్పిస్తామనీ ఇంగ్లీషు భాష నేర్పుతామని చెప్పి ఎలాగయితేనేం కిట్టీ వానిని తీసుకువస్తే బాబా వాడు పనికిరాడని డాన్‌కిన్‌ని ఆ బాలుని పారిస్‌లో దిగబెట్టి రమ్మని పంపించేశారు.

డాన్‌కిన్‌కి ఇంకా వైద్యవిద్య పూర్తికాలేదు. అతడు ఆ పిల్లవానిని దిగబెట్టి లండన్‌వెళ్ళి అక్కడవున్న బార్ట్స్ ఆస్పత్రిలో శిక్షణపొంది కొన్ని వారాలయిన తరువాత మరల బాబాను చేరుకుంటానని బాబా అనుజ్ఞతీసుకుని వెళ్ళాడు.

మొదట వచ్చిన స్పెయిన్ దేశపు కుఱ్ఱవాడు కాలిమీద పుండు అయి బాధ పడుతుంటే డా॥ నీలుని వానికి మందు యిమ్మని బాబా చెప్పారు. వాడికి నడీనె టాల్‌స్టాయ్ పియానో వాయించడం నేర్పింది. శామ్ కోహెన్ ఫ్రెంచి, ఇటాలియన్ భాషలు నేర్పేవాడు. అనితా ఆటలు ఆడడం నేర్పేది. బాబా బృందం అంతా కేన్స్ వదిలేముందు వానిని పారిస్ మీదుగా స్పెయిన్ దేశం పంపించివేశారు.

నొరీనా మాచెబెల్లికి యూరప్‌లో అన్ని దేశాలలోనూ స్నేహితులున్నారు. ఆమె అన్ని దేశాలు తిరిగిన అనుభవం కలది; చాలా భాషలు మాట్లాడగలదు. అప్పుడు పారిస్‌లో బ్రహ్మాండమైన వరల్డ్ ఎగ్జిబిషన్ (ప్రపంచ ప్రదర్శనం) పెట్టేరు. దానికి బాబా పరివారంతో వెళదామంటే నొరీనా పారిస్‌లోనున్న కాన్సులో సైడ్స్ అనే స్నేహితురాలికి ఉత్తరం వ్రాసి బాబా బస నిమిత్తం ఏర్పాట్లు చేసిపెట్ట మనగా కాన్సులోసైడ్స్ ఆమె భర్త అల్‌ఫ్రెడో బాబాను సపరివారంగా దయచేసి వారి అతిథులుగా ఉండవలసిందని కోరారు. ఆ దంపతుల యిల్లు చాలా పెద్దదే. అది పారిస్‌లో సీన్ నది తీరాన్ని వుంది. అక్కడినుంచి ప్రపంచ ప్రఖ్యాతమైన నోటర్ డామ్ మందిరం కనిపిస్తూ వుంటుంది.

బాబా మండలితో పారిస్ వెళ్ళిరావడానికి అయిన ఖర్చులు రానో, ఎలిజబెత్‌లు భరించారు. రైలులో వెళ్ళినవారికి రైలు టిక్కట్ల ఖర్చులు మోటారులలో

వెళ్ళిన వారికి పెట్రోలు ఖర్చులు అన్నీ వారిద్దరు పెట్టుకున్నారు. మిగిలినదంతా అంటే వారి అందరి చిల్లర ఖర్చులు, దారివెంట తినుబండారాలు వగైరాల కన్నిటికీ బాబా సొమ్ము యిచ్చారు. ఉదయాన్నే 9 గంటలకు బయలుదేరి ఎలిజబెత్ తన కారులో బాబాను, మెహెరా, మణి, ఖుర్షెద్, నజా, కిట్టీలను తీసుకుని వెళ్ళింది. రానో, అనితా కలిసి మాసీని, వాలూని రైలులో తీసుకుని వెళ్ళారు. మారిటైమ్ ఆల్ప్స్ పర్వతాల గుండా వెడుతూంటే అద్భుతమైన ప్రకృతి దృశ్యాలు కన్నుల పండువుగా ఉన్నాయి. దారిపొడుగునా కొండలు, లోయలు ఎంతో రమణీయంగా వున్నాయి.

రాత్రికి లయన్స్ అనే పట్టణంలో ఒక హోటలులో ఆగారు. పై అంతస్థులో వరుసగా అందరికి గదులు అమిరాయి. మెహెరా మొదలయిన ఆడవారంతా ఒక గదిలో దిగారు. కిట్టీ పొరపాటున లోపల గడియ పెట్టనందున హోటల్ సేవకుడు టీ పట్టుకుని ఆడవారి గదిలోపలికి వచ్చేస్తే భారతీయ స్త్రీలు పురుషుడి కంట పడినందున గాభరా పడ్డారు. వాళ్ళంతా కిట్టీ తలుపు పొరపాటున గడియ వేయకుండా జార్లవేసి వుంచినందుకు కొంచెం చికాకు పడ్డారు. కిట్టీ తాను అసలే పెద్ద ప్రయాణం చేసి వచ్చిందాయె. ఈ మాత్రానికి రభస చేయడం ఎందుకు, ఊరుకోకూడదా అని ఆమె బాధపడింది. ఆమెకి తన్నేదో వారన్నారని కోపంవచ్చి అన్నం తినటం మానేసింది. ఆమె లోపల ఆకలితో బాధపడుతూనే వుంది. ఇందువల్ల బృందంలోని అందరికీ కొంత కష్టమనిపించింది. అప్పుడు బాబా ఆత్మనిగ్రహంమీద విధేయత మీద ఒక చిన్న ఉపన్యాసం యిచ్చి బాబా యెడల నున్న ప్రేమకు ఫలితంగా ఆయన్ను ఎప్పుడూ సంతోష పెట్టాలి అని కిట్టీని మందలించారు. బాబా ఎప్పుడూ శిష్యులు చేసిన తప్పులను క్షమించి ఆయన్ను సేవించే అవకాశాలను కల్పిస్తూంటారు. ప్రేమించినవారే ఆ అవకాశాలను తీసుకుని సేవించగలరు. సాధారణంగా బాబా ఎవరు ఏపని చేస్తుంటారో అది వారిని పూర్తిగా చేయనిస్తారుగాని అది వారిని చేయవద్దని ఆ పని ఇంకొకరికి అప్పగించరు. సంపూర్ణమైన నైపుణ్యంతో సేవ చేయడమనేది ఒక కళ. దానిని పూర్తిగా హస్తగతం చేసుకోవాలంటే జీవితాంతము వరకు ప్రయత్నం చేస్తూనే వుండాలి. ఇది బాబాకే అవగతం కావాలిగాని మానవ మాత్రుడికి బాగా తెలియని విషయం.

మర్నాడు సాయంకాలం 6 గంటలకు బాబా పరివారంతో ఎలిజబెత్ నడిపే కారులో ఫాంటెనెబ్లూ చేరుకున్నారు. అక్కడ రాజసౌధం ప్రక్కనే హోటలులో దిగి భోజనం చేసి కొంతసేపే విశ్రాంతి తీసుకొన్నారు. మరల అక్కడనుంచి

రాత్రి 8 గంటలకు బయలుదేరారు. పారిస్ సమీపిస్తుండగా దీపాలతో అలంకరించిన ప్లేస్-డి-లా కంకార్డ్, ఛాంప్స్ ఎలిసీస్ చూశారు. అందరూ కాన్సులో యిల్లు చేరుకునే సరికి రాత్రి 9 గంటలయింది. ఈ విధంగా రాత్రి 9 గంటలకు పారిస్ వస్తున్నామని టెలిఫోన్‌లో ఫాంటెనెబ్లూ నుంచి కాన్సులోకి చెప్పింది కిట్టీ. వీరు చేరుకున్న మరిరెండు గంటలకి రానో, అనితా వగైరా ప్రయాణం చేసిన రైలు పారిస్ చేరింది. కాన్సులో సైడ్స్ యిల్లు నాలుగు అంతస్తుల భవనం సీన్ నది ఎడమ వొడ్డున వుంది. 4వ అంతస్తు బాబాకు ప్రత్యేకముగా ఇచ్చేశారు. కాన్సులో చెల్లెలు ఆఁలిస్ అసలు అందులో వుంటూండేది. ఆమె ఇప్పుడు ఊళ్ళో లేదు గనుక ఇబ్బంది లేకుండా పోయింది. 3వ అంతస్తులో ప్రాచ్య మండలివారు ఉంటున్నారు. నోరీనా తన స్నేహితురాలయిన కాన్సులో సైడ్స్ దంపతులతో రెండో అంతస్తులో దిగింది. రానో, గేలీ వగయిరాలు, కిట్టీ, డేలీ మొదటి అంతస్తులో దిగారు.

మరుసటిరోజు ప్రాతఃకాలమున లేచి మండలితో బాబా అవసరమైన విషయాలు చర్చించారు. అందులో ఆదీ (సీనియర్)ని, బైదుల్‌ని, మహమ్మదు మస్తుని తీసుకుని కేన్స్‌కివచ్చే ఏర్పాటు చేయడం గురించినది ముఖ్యమైన విషయము-దానికయే ఖర్చులో వీలయినంతవరకు జూరిచ్ నుండి వాల్టర్ మెర్టెన్స్‌ని, హెడీని అప్పుగా పంపించమని బాబా టెలిగ్రాం యిచ్చారు. తరువాత ఆదీకి బాబా రెండు వందల డాలర్లు మాత్రం పంపుచున్నామని, మిగిలినది అక్కడ ఏర్పాటు చేసుకుని బైదుల్ సహాయంతో మహమ్మద్ మస్తుని కేన్స్‌కి తీసుకుని రమ్మని కేబిల్ చేశారు-మండలిలో కొంతమంది ఇంత ఖర్చుపెట్టుకుని మహమ్మదు మస్తుని కేన్స్‌కి తిసుకు రావడం అర్థంలేని పని అని విమర్శించారు. ఒక సామాన్య మానవుని చర్యను విమర్శించినట్లు బాబా చేసిన పనిని వారు విమర్శించారంటే బాబావద్ద వారు ఇంత కాలంవున్నా బాబాను వారు అర్థం చేసుకోలేదన్నమాటే. ఎంత బలీయమైన ఆధ్యాత్మిక కారణం లేకపోతే బాబా మహమ్మద్ మస్తుని కేన్స్‌కి ఎందుకు రప్పిస్తారు? అయినా బాబా ఏమిపని చేసినా అర్థయుక్తంగానే వుంటుందని ఈ విమర్శించిన మండలివారు సమాధానపడ్డారు.

ఉదయం 11 గంటలకి కారులో బయలుదేరి పారిస్‌నగరం అంతా తిరిగారు. కాన్సులో మేడకు ఎదురుగానే వున్న రేవులో పడవయెక్కి సీన్ నదిలో షికారు చేశారు. అప్పుడు అక్కడి ఎగ్జిబిషన్ నలుమూలలా చూశారు. మెహెరా మొద

లయిన ఆడవారు మాత్రం బాబా తమతోరమ్మని తీసుకు వెడితేగాని కదలలేదు. అయినా బాబా ప్రదర్శనం తిలకించడానికి వారికి అనుమతి యిచ్చారు. మెహెరాకు ఇరువైపులా రానో కిట్టీలు ఉండి జనంనుంచి రక్షణ కల్పిస్తూ ఆమెను తీసుకు వెళ్ళారు ప్రదర్శనలో చూచేందుకు ఏదయినా ప్రదర్శనాలకి వెళ్ళేవరకు ఆడవారి కళ్ళు నేలమీదే ఉండాలని బాబా కఠినంగా శాసించారు. అలాగే బాబా ఆజ్ఞను వారంతా పాటించారు. స్త్రీలు అటువంటి ప్రదర్శన ఇదివరలో ఎక్కడా చూచియుండలేదు. రంగు రంగుల వెలుగులలో నీరు ఎగచిమ్మే అనేక దృశ్యాలు నేత్రానందకరంగా ఉన్నాయి.

అందరూ భోజనాలకి యింటికి చేరారు భోజనాలయ్యాక కారులో బయలుదేరి ఎత్తయిన సేక్రెడ్ కోయర్ అనే స్థలానికి వెళ్ళారు.ఆ ఎత్తుమీద నుంచి పారిస్ నగర సౌందర్యం తిలకించారు. అది ఒక అద్భుతమయిన దృశ్యము. అది చూచిన తరువాత బాబా దర్శనార్థం వచ్చే అభ్యాగతులను కలుసుకునేందుకు వెంటనే అందరు కాన్సులో నైడుస్స యింటికి వెళ్ళారు.

ఆ సాయంత్రం దీపాలు వెలిగించిన తరువాత అసదృశమైన ఆ దృశ్యాన్ని ఆలోకించడానికి రాత్రి 9 గంటలకు ఐఫిల్ టవర్ ఎక్కారు. అక్కడ ఆ రాత్రి బాబా ఒక చాలా ముఖ్యమయిన ఆధ్యాత్మిక సమావేశం చేశారు. బాబా అనేక మంది గురువులను, సాధు పురుషులను సమావేశపరిచారు వారంతా 6 వ, 7 వ భూమికలలోని వారు. బాబా చేసిన ఆధ్యాత్మిక కార్యంవల్ల స్త్రీలకు ముఖ్యంగా పారిస్‌లోని ఫ్రెంచి స్త్రీలకు ఆధ్యాత్మిక ప్రగతి కల్పించారు. బాబా పనియొక్క ఫలితంగా ఫ్రాన్స్ ప్రభుత్వంవారు ఆ దేశంలో వ్యభిచారం నేరమని ప్రకటించారు. తార్పుడుతనం కూడా శిక్షార్హం అని ప్రకటించారు. స్త్రీలకు పురుషులతో సమాన ప్రతిపత్తి కల్పించారు.

ఎగ్జిబిషన్ ఆవరణలో ఆ రాత్రి కాల్చిన బాణా సంచా కూడా ఆ టవర్ మీదనుంచి చూశారు. బాబా ఐఫిల్ టవర్ ఎక్కడం యిది రెండవసారి. మొదటి మాటు 1931 సం॥రంలో డిసెంబరు 31 వ తేదీన ఎక్కి చూశారు. అదే పాశ్చాత్య దేశాలకి బాబా ప్రథమంగా రావడం. అప్పుడు బాబాతో మెరిడిత్ స్టార్, డెలియా, డి లియాన్, కిట్టీ డేవీ, మార్గరెట్ స్టార్, జిల్లా, చాన్జి ఉన్నారు.

పరివారంతో బాబా యింటికి తిరిగి వచ్చేసరికి అర్ధరాత్రి అయింది. ఒక రోజున బాబా మాంటెకార్లోకి కాసినోకి చూడటానికి వెళ్ళారు. అక్కడికి ఆయన ఆధ్యాత్మికమైన పనిమీద వెళ్ళారుగాని ఆడటానికి కాదు. అక్కడికి వెళ్ళినపుడు

క్వెన్‌టిన్ టాడ్‌కి చెందిన ఈవినింగ్ సూట్ వేసుకున్నారు బాబా. అది ధరించి నపుడు బాబా చాలా అందంగా వున్నారు. నోరీనా, క్వెన్‌టిన్‌లు బాబాతో వెళ్ళారు.

బాబా స్త్రీ పరివారంతో ఉండగా మామూలుగా ఇంకే పురుషుడు బాబా ఉన్న యింట్లో ఉండకూడదు. ఈ షరతు ఆ యింటి యజమాని ఆల్‌ఫ్రెడోకి కూడా వర్తిస్తుంది. గనుక తన యింటిలో ఉండి వచ్చిన అతిథులకు, బాబాకు కావలసినవన్నీ చూడటానికి ఆ యింట్లో వుండటంకోసం ఆల్‌ఫ్రెడోకి ప్రత్యేకంగా బాబా అనుమతి యిచ్చారు. ఒక షరతుమీద. అదేమిటంటే ఆడవారు మెట్లు దిగేటప్పుడు ఎక్కేటప్పుడు అతడు వారికి ఎదురవకూడదు. వారు లోపలకు వచ్చేటప్పుడు బయటకు వెళ్ళేటపుడు ఆల్‌ఫ్రెడో వారికి కనిపించ కూడదు. ఈ షరతుకు ఒప్పుకుని అతడు రెండవ అంతస్తులోని తన గదిలో వున్నాడు.

అందరూ ఎవరి పరుపులు వారు తెచ్చుకున్నారు. గనుక ఇబ్బంది లేకుండా పక్కలు వేసుకుని పడుకున్నారు రాత్రిళ్ళు.

ఒకనాడు మధ్యాహ్నం కాన్నులో తల్లి బాబాను దర్శించడానికి వచ్చింది. పబ్‌స్ట్ అనే ఒక సినిమా డైరెక్టరు, రోజర్ విల్లర్డ్ అనే యింకొకడు బాబాను దర్శనం చేసుకున్నారు. రోజర్ బాబా వద్దకు కేన్స్‌కి వెళ్ళి ఆయన బృందంతో కేపో-డి-మాంటెలో కొద్ది రోజులున్నాడు. ఇతడు కొన్నాళ్ళ తరువాత అనితను వివాహం చేసుకున్నాడు. ఈతనిని వివాహం చేసుకోమని అనితను బాబా ప్రోత్సహించారు. అనిత తన చమత్కారమయిన మాటలతో బాబా నవ్వించి మెప్పిస్తూ వుండేది. పారిస్‌లో వున్న 3 రోజులు బాబా తమ పరివారంతో ప్రతి రోజు సీన్ నదిలో విహారం చేసేవారు.

కాన్నులో,ఆల్‌ఫ్రెడో భార్యాభర్తలిరువురు కూడా వారి యింటిలో ఈ మూడు రోజులు బాబా తమ అతిథిగా ఉన్నారంటే అది వారి అపారమైన ప్రేమకు చిహ్నమని అది వారిరువురి మహద్భాగ్యం అని వారు భావించారు

తిరుగు ప్రయాణానికి ఇదివరకటిలాగానే కొందరు రైలులోను తమ స్త్రీ బృందంతో బాబా ఎలిజబెత్ కారులోను ప్రయాణమై పారిస్ నుండి బయలుదేరి కేన్స్ వెళ్ళారు. ఆతిథ్యం యిచ్చిన భాగ్యశాలులయిన ఆల్‌ఫ్రెడో దంపతులు యిద్దరూ శాకాహారులే. అందుకేవారు బాబాకు కావలసిన ఆహారం అవలీలగా సమకూర్చ గలిగారు. పారిస్‌నుంచి బయలుదేరి వెళ్ళేటప్పుడు బాబాకు రొట్టె, వెన్న, పళ్ళు వగైరా అన్నీ వారి కారులో ఉంచాడు ఆల్‌ఫ్రెడో. బాబా ఒక్క ముద్దే తిన్నా తమ

ఆహారం మాత్రం రాజోపచారంగా తయారుచేసి వారికి వడ్డించాలి ఎప్పుడూ కూడా దారిలో ఒక దుకాణంవద్ద కారు ఆపి బాబాకోసం కొన్ని చైనా ప్లేటు కప్పులు వగైరా కొన్నారు. బాబా ఉపయోగించే కప్పు ప్లేట్లు ప్రత్యేకంగా ఉంటాయి. అవి మరెవ్వరూ ఉపయోగించరు.

నొరీనా మాత్రం బాబా అనుమతి తీసుకొని పారిస్‌లో ఇంకా కొద్ది రోజులు ఉండటానికి దిగడింది.

దారిలో ఫాంటెనెబ్లూ అడవిలో ఆగి బాబా పరివారం భోజనం చేశారు. ఆ పరిసరాలు ఆ వాతావరణం, చాలా ఆహ్లాదకరంగా ఉన్నాయి. రాత్రికి రూయెన్ అనే పట్నంలో ఒక హోటలులో దిగి భోజనంచేసి విశ్రాంతి తీసుకున్నారు.

మర్నాటి ఉదయాన్నే లేచి ఆ ఊరిలో రుచికరమైన కేక్‌లు పొడుగాటి రొట్టెలు కొన్నారు. ఇంకా ఏవో బజారులో కొనవలసిన సరుకులు కొనుక్కున్నారు. ఎలిజబెత్ ఒక లెటర్ ఆఫ్ క్రెడిట్ నగదుగా మార్చి తెచ్చుకుందుకు రెండు గంటలు వెతికి వెతికి ఆమెకు కావలసిన బ్యాంకుకి వెళ్ళి వచ్చింది. ఆ రోజు మధ్యాహ్నం దారిప్రక్కనే కారు ఆపి బాబా, వారి బృందం అందరూ భోజనాలు చేశారు. లయన్స్ పట్నం ద్వారా కేన్స్ రాత్రి 11 గంటలకు చేరుకున్నారు. బాబా తమ పరివారంతో, అంటే పారిస్‌కి వెళ్ళేటప్పుడు ఎలా వెళ్ళారో ఆ దారినే మళ్ళి కేన్స్‌కి తిరిగి వచ్చారు.

మర్నాడు ఉదయం బాబా వారితో పారిస్ రాకుండా అక్కడ వుండిపోయిన పాశ్చాత్య స్త్రీల వద్దకు వెళ్ళి చూశారు. ఒక గదిలో బాబా ప్రవేశించేసరికి ఆయన అతీతమైన చైతన్య స్థితిలో వున్నారు. ఆయన భక్తురాలు అది కనిపెట్టి ఆయన చేయి పట్టుకుని నడిపించుకుని వెళ్ళి మంచంమీద పరుండబెట్టింది. బాబా ఒక నాలుడులా వారికేసి చూశారు.

ఆ శిష్యురాలు – ఏమిటి బాబా ఇది ? అని అడిగింది. బాబా – "నీవు సమావేశం గురించి వినలేదా" అని అడిగారు. బాబా కళ్ళల్లో ఆనందం కనబడుతోంది. కాని అది ఎంతో బాధతో కూడుకొని ఉన్నట్లుంది.

"లేదు బాబా, నేను వినలేదు" అన్నది ఆ శిష్యురాలు. ఐఫిల్ గోపురంలో ఒక చాలా ముఖ్యమైన సమావేశం జరిగిందని, అప్పటినుంచి బాబా వారి శరీరంలో ఉండడం కష్టమవుతోందని చెప్పారు. బాబా ఆయన తల ఆమె భుజంమీద వాల్చి కొంచెంసేపు విశ్రాంతి తీసుకున్నారు. అనవరతమువున్న ఆయన పనికోసం మరల

కొంత శక్తిని పుంజుకున్నారు బాబా. నానామండలి ఇద్దరు ద్వారంవద్ద వున్నారు. ఒక గంట పోయిన తరువాత బాబా యధాప్రకారం ఆయన విశ్వకార్యం చేసుకుంటున్నారు.

కేన్స్‌లో వుండగా యూరప్‌లోని అన్ని దేశాలనుంచి అనేక భాషల వారు బాబా దర్శనం చేసుకుందుకు వచ్చారు. భోజనంవేళ ఆయనతో బల్లవద్ద ఫ్రెంచి, ఇటాలియన్, జర్మన్, స్పానిష్, పోర్చుగీస్, రష్యన్, స్విస్, స్కాండినేవియన్, ఇంగ్లీష్ వారున్ను, ఇండియానుంచి అనేక రాష్ట్రాలనుంచి అనేక భాషల వారును అక్కడకు వచ్చారు. రాజకీయ నాయకులు, దౌత్యకార్యాలయాలవారు, కళ, విజ్ఞానము, మతము, వీటిలో పండితులు అనేకులు బాబావద్దకు ఆయన చేతిలో ప్రపంచ సమస్యలకు పరిష్కారం లభిస్తుందనే నమ్మకంతో వచ్చారు.

## అలెగ్జాండర్ మార్కీ :

ఇదివరలో బాబా అమెరికా వెళ్ళినపుడు ఒక సినిమా తీయడానికి ప్రయత్నించారు. ఆ సందర్భముగా అనేకమంది ఆధ్యాత్మిక మూలంతో అనేక వ్రాతలు బాబాకు సమర్పించారు. వాటిలో బాబాకు ఒక్కటీ నచ్చలేదు. తరువాత ఒక అమెరికన్ బాబా ప్రేమికుడొకడు తన స్నేహితుడయిన అలెగ్జాండర్ మార్కీ అనేవాడు కథ వ్రాయడానికి ఒప్పుకున్నాడని బాబాకు కేబిల్ ద్వారా తెలిపాడు. అప్పుడు "మార్కీయే అందుకు తగినవాడని" బాబా అంగీకారం పెలిబుచ్చారు. తరువాత బాబా లండన్ వెళ్ళినప్పుడు బాబా దర్శనంకోసం అతడు కూడా లండన్ వెళ్ళాడు. అంతకుపూర్వం బాబా గురించి అనేక మారులు మార్కీ వినియుండెను. కాని స్వయంగా చూచి యుండలేదు. మార్కీ బాబా దర్శనం చేసుకోవాలని ఎక్కువ ఆతురతగా వున్నాడు. మార్కీ జీవితంలో అనేక సంఘటనలు జరిగాయి. అప్పుడే ఒక సినిమా ఫిలిం నిర్మాణము చేయడంలో పర్యవేక్షణ చేయడం కోసం మార్కీని లండన్ రమ్మని పిలిచారు. ఈ పిలుపు లేకపోతే మార్కీ లండన్ బయలుదేరేవాడు కాదు. లండన్ వెళ్ళిన తరువాత ఫిలిం ఉద్యోగం మాట ఎలా ఉన్నా పత్రికా సంపాదకుడుగా అనేకమంది ప్రముఖ వ్యక్తులతో అతనికి పరిచయం కలిగింది. అప్పుడే బాబా దర్శనం చేసుకోవడానికి అవకాశం కలిగింది మార్కీకి. బాబా దర్శనం చేసుకున్నప్పుడు మార్కీకి అద్భుతమయిన ఆధ్యాత్మికానుభవం కలిగింది. అది లగాయితు మార్కీ బాబాని దేవునివలె పూజించడం మొదలు పెట్టాడు. అతని హృదయంలో అపూర్వము, అనిర్వచనీయము అయిన ప్రేమ వెల్లివిరిసింది. ఏమి

చేస్తున్నాడో కూడా తనకి తెలియకుండా మార్క్ లండన్ వీధులలో రాత్రులందు ఆనందనిమగ్నుడై తిరిగేవాడు.

తరువాత నాసిక్ నుండి పాశ్చాత్య ప్రేమికులు కేన్స్‌కి వెళ్ళుచున్న సమయంలో మార్క్ పారిస్‌లో వుండెను. అప్పుడు మార్క్ ఒక నాటకము గురించి పని చేయుచుండెను. దానికి కేన్స్‌లోని వాతావరణము అత్యుత్తమంగా వుంటుందని నిశ్చయించి మధ్యధరా సముద్రతీరంలోని ఒక హోటలులో ఒక గది తీసుకుని అందులో బస ఏర్పాటు చేసుకుని అక్కడికి వెళ్ళాలనుకుంటున్నాడు. లండన్‌లో బాబా దర్శనం చేసుకున్న తరువాత బాబాతోగాని వారిమండలిలో ఎవరితోనూ ఉత్తర ప్రత్యుత్తరములు జరుపలేదు జాండర్. (అలెగ్జాండర్ మార్క్‌ని స్నేహితులట్లు పిలచేవారు). అందుచేత బాబా కార్యక్రమముల గురించి గాని ఆయన కదలికల గురించి కాని అతనికేమీ తెలియదు. జాండర్ కేన్స్ చేరగానే లండన్, పారిస్‌లు అతని చిరునామాలకు తిరిగి తిరిగి వచ్చిన ఒక రేడియోగ్రాం అతని హోటలులో అతని కొరకు వేచియున్నది. అది బాబా స్వయంగా పంపిన కబురు. కేన్స్‌లో కొన్ని నెలలుండుటకు వస్తున్నానని అతడు కూడా వస్తే బాగుండునని బాబా అందులో పేర్కొన్నారు తన పని కోసమే అతనికి కేన్స్ రావాలని ఎందుకు తనకు బుద్ధి పుట్టిందో జాండర్‌కి అర్థమయింది. ఇతడు ప్రతిరోజు బాబా చెంతకు వచ్చి ఆయన పాదాలవద్ద కూర్చునేవాడు.

ఒక వారంరోజులలో జబ్బుగావున్న శిష్యులు, శిష్యురాండ్రు ఆరోగ్యమును కోలుకున్నారు వారిని బాబా వారి దేశాలకు వెళ్ళమన్నారు. ఒకరిద్దరిని నీకు ఇండియాలో వాతావరణం పడలేదు. నీవు అక్కడికి రావద్దు. వస్తే నీవు మరణించక తప్పదు. నీవు నా పని కోసం బ్రతికి యుండాలి. అని చెప్పి వారి దేశాలకు వారిని వెళ్ళిపొమ్మన్నారు బాబా.

బాబా కొందరికి ప్రత్యేకమయిన శిక్షణ నిచ్చారు. "నేను నా శరీరాన్ని కాదు. నేను ఆత్మను" అని ప్రతి రోజు గంటసేపు వ్రాయమన్నారు. దీనివల్ల క్రమంగా వారిలో ఆత్మబలం, ధైర్యం, అన్ని కలిగాయి.

అందులో జీన్ అను నామెకు బాబా ఆవగింజలంత మాత్రలున్న సీసాను యిచ్చి – "ఈ సీసాలోవి బంగారం, ముత్యం, వెండి, వీటి భస్మాలతోను భారత ఔషధులతోను నీ కోసమే తయారు చేయించాను యీ మాత్రలు. ఇవి తీసుకో. నేను వీటిని ఇండియానుంచి తెచ్చాను. ప్రతి ఉదయం పరగడుపున వెన్నతో కూడా తీసు

కోవాలి అని బాబా ఆమెతో చెప్పారు. ఆమె బాబా వద్ద సెలవు తీసుకుని తతిమ్మా వారితో అమెరికా వెళ్ళేటప్పుడు బాబాతో "నా జీవితములో ఇంత ఆనందాన్ని, బాధను కలిగించినందుకు మీకు నా ధన్యవాదాలు" అంది. "బాధ కొక్కదానికే నాకు ధన్యవాదాలియ్యి" అన్నారు బాబా. ఈ మాటల యొక్క అంతరార్థము ఆమెకు తరువాత గాని తెలియలేదు. ఎన్నో జన్మలు ఎత్తి పడవలసిన బాధలు ఈ జన్మలోనే కలిగించి ఆమె ఆధ్యాత్మిక పరిణామం చాలా త్వరితం చేసేశారు బాబా. ఆ బాధ ఆమె పడలేకుండా వున్నపుడు అది భరించడానికి తగిన శక్తిని యిచ్చినవారూ ఆయనే, అది తగ్గించిన వారూ ఆయనే. అందుచేతనే భగవదిచ్ఛ అనుకుని ఏమి వచ్చినా సంతోషంతో స్వీకరించాలి. ప్రతీ కష్టము, ప్రతీ బాధ భగవంతుని వద్ద నుంచి వచ్చిన దూతగా అది మనకు ఆయన పంపిన ఒక సందేశంగా స్వీకరించి ఆనందంతో అనుభవిస్తే ఆయన సంతోషానికి అది కారణం అవుతుంది.

ఒక వారం రోజులలో పారిస్‌నుంచి నోరీనా వచ్చింది. అప్పుడే ఇండియా నుంచి బాబా ఆఖరి తమ్ముడు, ఆదీ (జూనియర్) వచ్చాడు. బాబా, వారితో ఉన్న ఆరుగురు భారతీయ స్త్రీలు, నోరీనా. ఎలిజబెత్, కిట్టీ, రానో, విల్లా కల్డానాలో ఉంటున్నారు. మిగిలినవారు నానీ. జీన్, డెలియా, మాల్కమ్, టామ్ షార్ప్లీ, రువానో, నడీనే, మార్గరెట్ క్రాస్కి, గారెట్ ఫోర్ట్, తరువాత వచ్చిన శామ్ కోహెన్ వీరంతా కేపో-డి-మాంటేలో బస చేశారు. మిగిలిన రెండు బంగళాలలోను బాబా యొక్క పురుష మండలి వారున్నారు. వారితో కూడా యింకా విల్, మేరీబాకెట్ ఆస్ట్రియానుంచి వచ్చిన ఫిషర్‌లు, హెడీ. వాల్టర్ మెర్టెన్స్, కాన్సులో, ఆల్‌ఫ్రెడో మెర్సిడిస్-డి-అకోస్టా, మేబిల్, క్రిస్టినా, ఆథా కటెరినాలు కూడా వున్నారు.

అది 1937 సెప్టెంబరు మాసం. కేన్స్‌లో బాబా చాలా ప్రధానమైన విశ్వ కార్యం ఆధ్యాత్మికంగా చేసి వుండాలి. లేకపోతే మహమ్మదు మస్తునికూడా కేన్స్ తీసుకుని రమ్మనమని బాబా ఆజ్ఞ యివ్వరు. అప్పటికి రాహూరీలోని మస్తుల ఆశ్రమంలో ఉన్న మస్తులలో మహమ్మదే ప్రముఖుడు. ఆ కాలంలో బాబా ఎక్కడికి వెళ్ళినా మహమ్మదును వెంట పెట్టుకుని వెళ్ళేవారు. అందుకనే ఆదీకి తన శాయశక్తులా ప్రయత్నించి బైదుల్ సహాయంతో ఎలాగయినా మహమ్మదును ఇండియా నుంచి కేన్స్‌కు తీసుకురమ్మని కేబుల్ యిచ్చారు బాబా. మహమ్మదు ఏకారణంచేతనయినా రాకపోయినట్లయితే కేన్స్ మకాం రద్దుచేసి అందరినీ పంపించేసి తాము ఇండియాకు వెళ్ళిపోతానని కూడా అన్నారు. మహమ్మదులాటి మస్తును తీసుకు

రావడం అంటే మాటలు కాదు. అది చాలా కష్టమయిన పని. ఆ "పిచ్చి" వానిని సీమరులో తీసుకు వెళ్ళడానికి ప్రభుత్వ, అధికారులతో కావలసిన పనులన్నీ జరిపించు కోవడం కష్టమే. అతనికి చదవడం రాదు, వ్రాయడం అంతకన్నా రాదు. అతని ప్రవర్తన మామూలుగా వుండదు. అతడు చెప్పిన మాటలు కూడా అర్థమయేలా వుండవు, మనం చెప్పిన మాటలు వినడు. అందుకనే మహమ్మదును తీసుకు రావడం అంటే ఒక యాతన. అతనిని ఎలాగో తంటాలుపడి తీసుకువచ్చారు.

మహమ్మదు మస్తు వచ్చిన తరువాత అతని సంరక్షణ అంతా బాబా స్వయంగా చేసేవారు. అతనికి స్నానం చేయించడం, భోజనంతెచ్చి పెట్టడం, ప్రతి రోజు అతనిచేత తినిపించడం బాబాయే స్వయంగా చేసేవారు. కేపో-డి-మాంటెలోని మోటారు షెడ్డుమీద మహమ్మదుకోసం బైదుల్‌చేత ఒక గది కట్టించారు బాబా. అందులోనే ఒకమూల స్నానపుగదికూడా నిర్మించబడింది. మహమ్మదు వచ్చిన తరువాత అతని శుశ్రూష చేసేందుకు, అతనితో జరిపే ఆధ్యాత్మిక కార్యముకోసము బాబా దర్శనార్థము వచ్చే అతిథుల సమయాలుకూడా మార్పు చేయవలసి వచ్చింది. బాబా దర్శనార్థం అనేకమంది స్త్రీలు కర్లానా విల్లాకు వచ్చేవారు. రోజులు పోను పోను వీరి సంఖ్యకూడా ఎక్కువ కాజొచ్చింది. వీలయినపుడు ఆ సమయాన్ని బట్టి వారందరికి బాబా భోజనాలు గాని టీ, అల్పాహారాలు గాని ఏర్పాటు చేయించేవారు. వంటపని నజా చేస్తూండేది. ఆమెకు ఒక రోజున జబ్బు చేసింది. ఆమెకు యథా ప్రకారం ఆరోగ్యం చేకూరేవరకూ కిట్టీ ఆమెచేసే వంటపని చేస్తూండేది. ఆదీ (సీ). బైదుల్ కూడా కేపో-డి-మాంటెలో వుండేవారు. వీరికి కూడా విల్లా కర్లానా నుంచి ఇక్కడికి భోజనం పంపబడేది.

బాబా విశ్వకార్యం తీవ్రతరం అయినందువలన ఆయన శరీరానికి కొంచెం అనారోగ్యం కలిగింది. లివర్‌కి కొంచెం చికిత్స అవసరం అయింది. బాబాకి సుస్తీ చేసినపుడు మండలివారంతా వారి నడవడిలో లోపాలుంటే చక్కదిద్దుకునేవారు. అందులో లోటుపాట్లు వల్లకూడా బాబాకు చికాకు కలిగించకుండా ఉండాలని – ఆయన మీద వారికున్న ప్రేమ ఎంతటిదో చూడండి. వారంతా ఇదివరకు కంటె అన్యో న్యంగా ఎక్కువ ప్రేమ చూపించుకునేవారు. ఒండొరులు సమరసభావంతో మెలగే వారు. వారి వారి పరివర్తనచేత బాబాను ఎక్కువగా సంతోషపెట్టేవారు. ఇదంతా బాబా పనియొక్క ఫలితమే. ఒక రోజున బాబాకు కావలసిన మందుల కోసం 12 మారులయినా మందుల దుకాణాలకి టెలిఫోన్ చేశారు మండలి. ఫ్రెంచిభాష బాగా వచ్చును గనుక రానో, నొరీనాలే టెలిఫోన్‌లో మాట్లాడారు.

ఆ సమయంలోనే లండన్‌లో వున్న మేబిల్ రైయన్ అనే ప్రేమికురాలికి జబ్బు చేసింది. బాబా వద్దకు కేన్సుకి వద్దామని ఆమె ఉబలాట పడింది. బాబా కూడా రమ్మనమని కేబిల్ యిచ్చారు. ఆ ప్రకారంగా మేబిల్ వచ్చి కల్దానాలో బాబా వద్ద వారం రోజులుంది. తరువాత లండన్ నుంచి మార్గరెట్ క్రాస్కీని వచ్చి మేబిల్‌ను లండన్ తీసుకు వెళ్ళమని బాబా కేబిల్ యిచ్చారు. ఆ ప్రకారం ఆమె వచ్చి కొద్ది రోజులున్న తరువాత బాబా ఆమెతో మేబిల్‌ను లండన్ పంపించారు. మేబిల్ ఉన్నన్నాళ్ళు బాబా ఆమెతో ప్రతిరోజూ ఒక పావుగంట గడిపేవారు. ఆమె భవితవ్యం బాబాకు బాగా తెలుసు. అక్కడవున్న కొద్ది రోజులూ మార్గరెట్ ఆమెకు ఎంతో ప్రేమతో సేవచేసింది. తరువాత లండన్ వెళ్ళినాక మేబిల్ ఒక ఆపరేషన్ చేయించుకుని మూడు నెలలలో మరణించింది. ఆ వార్తతో వచ్చిన కేబిల్ బాబా అందరకు వినిపింపజేసి ఆమె నా వద్దకు వచ్చేసిందన్నారు. "మీరెవరూ చూడలేరు కాని ఆమె ఇక్కడే వున్నది" అన్నారు. ఆమె బాబావద్ద వున్న రోజులలో తరచుగా బాబా ఆమెను సంప్రతిస్తూ ఉండేవారు.

నవంబరు మాసం వచ్చింది. బాబా కేన్స్ మకాం ఎత్తేసి ఇంక ఇండియాకు వెడితే బాగుంటుందని అంటున్నారు. ఎలిజబెత్, కిట్టీ, నోరీనా, రానో, నాసీలను తమతో ఇండియాకి రమ్మంటున్నారు. రువానో పుట్టినరోజు, నజా పుట్టినరోజు ఒక్క దినాన్నే పడ్డాయి. బాబా పరివారం అందరూ కేన్స్ వదలి వెళ్ళే ఒక వారం రోజులు ముందు ఒక పెద్ద టీ పార్టీ. తరువాత ఒక విందు భోజనం కూడా ఆ సందర్భంలో చేశారు.

మెహెరా మొదలయిన ప్రాచ్య స్త్రీలు ఐరీన్ బిల్లోవద్ద కుట్టుపనులు నేర్చుకున్నారు. మేరీ బాకెట్ వద్ద నేతపని నేర్చుకున్నారు. కిట్టీవారికి పైపు చేయడం నేర్పింది. మెహెరాకి ఇదివరకే పియానో వాయించడం వచ్చు. మిగతావారికికూడా కిట్టీ పియానో వాయించడం నేర్పింది. వారికి ఆంగ్రి దుస్తులను కుట్టడం నేర్పింది. మార్గరెట్ క్రాస్కీవద్ద నాట్యంచేయడం నేర్చుకున్నారు. ఈ విద్యలన్నీ బాబా పర్యవేక్షణ క్రిందనే నేర్పడం జరిగింది. వెళ్ళేముందు విల్లా కల్దానాకి కేపో-డి-మాంటెకి ఇయ్యవలసిన చార్జీలు అన్నీ ఇచ్చివేయడానికి రువానో బోగిస్లావ్‌ని నోరీనా చెల్లెలు గీతని ఉండమని వారికి బాకిలన్నీ తీర్చమని పురమాయించారు బాబా. విల్లా కల్దానా యజమానురాలు కొంచెం పేచీకోరు మనిషి. ఆ విల్లాకి మొదట్లో ఆరునెలల అద్దె అడ్వాన్సుగా యివ్వడమే కాకుండా అందులోని కప్పులు, సాసర్లు ఇతర సామానులు

పాడయిపోతాయని ముందుగానే 50 డాలర్లు డిపాజిట్ కూడా తీసుకుంది ఆమె. ఇప్పుడు ఆ డిపాజిట్ తిరిగి యివ్వకుండా సామానులన్నీ మీ ఉపయోగంవల్ల పాడయ్యాయి. ముందున్న రీతిలోలేవు. అని ఆ యాభై డాలర్లు వాపసు చేయకుండా ఉంచేసుకుంది ఆ యింటి యజమానురాలు.

బాబా తమతో ఇండియాకి రావడానికి సిద్ధంగా వున్న ఎలిజబెత్, కిట్టీ, నానీ, రానో, నొరీనాలతో మెహెరాబాద్ కొండమీద వుంటే ఆ ఆశ్రమంలో వారు ఎదుర్కోవలసిన కష్టాలన్నీ ఏకరువుపెట్టి అక్కడికి వెళ్ళిన తరువాత వారు ఏమి ఫిర్యాదు చేయకుండా ఇక్కడే వారి నోళ్ళను కట్టివేశారు. అక్కడ ఇక్కడ ఉన్నంత స్వేచ్ఛ ఉండదని కూడా స్పష్టంగా చెప్పారు బాబా, ఎలిజబెత్, నానీ బాబాతో వెళ్ళక స్విడ్జర్లాండు వెళ్ళి 1938 ఫిబ్రవరి మాసంలో బాబా జన్మ దినోత్సవానికి సరిగా ఇండియాకు వచ్చారు. మెహెరాబాద్ కొండమీద వున్నపుడు బాబా చెప్పినది నూటికి నూరుపాళ్ళు విధేయులై అందరూ బాబా మాటలు పాటించాలని బాబా హెచ్చరించారు.

ఎలిజబెత్ స్విడ్జర్లాండు నుంచి కిప్పీ అనే కుక్కనుకూడా తెచ్చుకుంది. కొన్నాళ్ళయిన తరువాత ఆమె అమెరికా వెళ్ళవలసి వచ్చింది. అప్పుడు కిప్పీనికూడా తీసుకు వెళ్ళడమూ మళ్ళీ తీసుకు రావడము ఎందుకని ఆ కుక్కని ఐరీన్ బిల్లోకి అప్పగించి వెళ్ళింది. ఐరీన్ దానిని స్విడ్జర్లాండు తీసుకువెళ్ళి ఒక నెల అయిన తరువాత ఇండియాకు తీసుకు వచ్చింది.

బాబా ఇండియాకు వెళ్ళిన తరువాత ఎలిజబెత్ కర్ధానాలో కొన్నాళ్ళుంది. అప్పుడు కిప్పీ కర్ధానాలోని బాబాయొక్క సోఫామీద కూర్చుని 3 రోజులు సోఫా దిగకుండా అక్కడే వుండిపోయింది. అది బాబా వియోగం భరించలేక పోయింది. బాబా అంటే కిప్పీకి అంత ప్రేమ వుండేది. బాబా కూడా దాన్ని అంత దయతో అంత వాత్సల్యంతో చూసేవారు. ఆయన స్వహస్తాలతో దానికి ప్రసాదం పెట్టేవారు.

డెలియా బాబాతో వెళ్ళకుండా ఉండిపోవలసి వచ్చింది. ఆమె మళ్ళీ బాబాను ఎన్నాళ్ళకు దర్శించగలనో అని ఎంతో ఏడ్చింది. బాబాతో ఇండియాకు మెహెరా మొదలయిన భారత స్త్రీ బృందము, పాశ్చాత్య స్త్రీలలో కిట్టీ, రానో, నొరీనా వెళ్ళారు. తరువాత నడీనే టాల్‌స్టాయ్, హెడి మెర్టెన్స్, పేరిన్ బిల్లో, హెలెన్‌దాయ్ అనే స్విడ్జర్లాండ్ నుంచి వచ్చిన ఒక కళాకారిణికూడా బాబా దగ్గరకు మెహెరాబాద్ వెళ్ళారు. ఇండియాకు బయలుదేరినపుడు రానో కిట్టీలు సామానంతా సర్దేపని చేశారు.

పదిరోజులు ఈ పనికే పట్టింది. వంట సామగ్రి పింగ్‌పాంగ్ బల్ల మొదలయిన వన్నీ కట్టెయ్యాలికదా. ఈ పని బాబా బయటకు వెళ్ళినప్పుడే చేయాలి.

బాబా పరివారంతో మార్సేల్స్‌కి ఎలిజబెత్ నడిపిన కారులో వెళ్ళారు. దారిలో భోజనం చేసి మార్సేల్స్‌కి మధ్యాహ్నం 2 గంటలకి చేరేరు. రైలులో వెళ్ళినవారు ముందుగానే చేరుకున్నారు. అందరూ అలిసిపోయి రాత్రి త్వరగానే పండుకున్నారు మర్నాడు ఒక లివర్‌టానిక్కు కోసం బాబా బజారుకి పంపి తెప్పించారు.

వీరంతా ఎక్కి వెళ్లవలసిన "సర్‌కాసియా" అను క్రొత్త ఓడ గ్లాస్‌గోలో బయలుదేరి రావాలి. ఇదే ఆ ఓడకి ప్రథమ సముద్రప్రయాణం. అక్కడ ఇంజన్ మరమ్మత్తుకోసం ఆగి ఆలస్యంగా వచ్చింది. ఈ సంగతి తెలియక కొంతమంది ముందుగా రేవుకి వెళ్ళారు. ఆదీ (సీనియర్) బైదుల్ ఇద్దరూ మహమ్మదును తీసుకుని ముందు వెళ్ళేరు. స్టీమరు వచ్చిన తరువాత రాత్రి 10 గంటలకు బయలు దేరి అందరూ వెళ్ళి ఎక్కారు వారికి అందులో చాలా మంచి గదులు రిజర్వు చేయ బడి వున్నాయి. మెహెరా, మణి, ఖొర్షెద్, పైన ఒక గదిలో ఉన్నారు. ప్రక్క గదిలో కిట్టీ, నజా ఉన్నారు. దాని ప్రక్కదానిలో మాసి, వాలు ప్రయాణం చేశారు. కొంచెం దూరంలో రానో, నొరీనాలు ఒక గదిలో దిగేరు. స్టీమరులో అన్ని సౌకర్యాలు ఉన్నాయి. అది క్రొత్తగా కట్టబడిన ఓడ గనుక చాలా బాగుంది. ఉదయాన్నే 6-30 గంటలకు లేవడం, 7-30 గంటలకు అల్పాహారం, 11-30కి భోజనం, మధ్యాహ్నం 3 గంటలకు టీ, సాయంత్రం 6 గంటలకే భోజనం, రాత్రి 9 గంటలకు పరుండటం- ఇదీ బాబా వారి పరివారానికి ఏర్పాటు చేసిన దైనందిన కార్యక్రమం. ఈ మాటు ఎవరికీ ఏ జబ్బూ చేయలేదు. భోజనం అందరికి బాగా సహించింది. బాబా మహమ్మదుతోను పురుషమండలితోను ప్రతిరోజూ కొంతసేపు ఉండేవారు. మిగతా సమయాలు స్త్రీ మండలితో వుండేవారు.

ఒకనాటి సాయంకాలము పోర్టుసేడ్‌లో దిగి బాబా మండలిని షికారుకి తీసు కెళ్ళేరు. మళ్ళీ ఓడలో బయలుదేరి ఏడెన్‌కి మర్నాడు ఉదయం 5 గంటలకు వెళ్ళేరు. ఆ సాయంత్రమే కరాచీ చేరుకున్నారు. స్టీమరులో ప్రయాణం చేసేటప్పుడు ఒకరోజున యింజన్ గదిలో ఏదో పెద్ద ప్రేలుడు సంభవించి స్టీమరంతా కదిలి పోయింది. కిట్టీ, నొరీనాలు ఆడవారి రక్షణకోసం ఉన్నారు. ఈ శబ్దం రాగానే లోపలి స్త్రీలు భయపడతారేమో అని లోపలికి పరుగెత్తి చూడగా మెహెరా నిస్తరంగ

మైన కాసారంలా ప్రశాంతంగా ఉంది. బాబా మనతో వుండగా భయపడడమెందుకు? అంది. తరువాత బాబా వచ్చి మరల యింజన్‌కి ఏదో మరమ్మతు వచ్చిందని చెప్పేరు

ఎట్టకేలకు రెండు రోజులకి స్టీమరు బొంబాయి రేవుకి 1937 నవంబరు 20వ తేదీని చేరింది. బాబా స్త్రీ మండలితో పూనా మీదుగా మెహెరాబాద్‌కి తిన్నగా కారులో వెళ్ళేరు. రానో,కిట్టీ, నోర్రినాలను. పాద్రీ, అహమద్‌నగర్ నుంచి ఒక కారు తీసుకువచ్చి కలుసుకున్నాడు. వారికి పూనాలో బాబాజాన్ సమాధి, బాబా చిన్నప్పటి నుంచి పెరిగిన వారియిల్లు చూపించి బాబా మాతృదేవి షిరీన్ మాయిని ఇతర బంధువులను చూపించి మెహెరాబాద్‌కి వారందరినీ తీసుకు వెళ్ళేడు పాద్రి. మెహెరాబాద్ వెళ్ళేసరికి ఆలస్యం అయింది, బాబా అందులకు సంతోషించలేదు. ఆయన వచ్చి ఈ పాశ్చాత్య స్త్రీలను పడమట వైపున ఉన్న పెద్దగది చూపించి అందులో ఉండమన్నారు. బాబా పాశ్చాత్య శిష్యులు, శిష్యురాండ్రు వారి వారి దేశాలకు అపరటికి చేరుకున్నారు. మరో ముగ్గురు వారి యిళ్ళకు వెళ్ళి వారి తలిదండ్రులను ఇతర కుటుంబస్థులను చూచి కొద్ది రోజులుండి వస్తామన్నారు ఇండియాకి.

తరువాత డిసెంబరు 20వ తేదీ సాయంకాలము బాబా తలెగామ్ వెళ్ళారు. అక్కడ బాబా భక్తులగు ఇద్దరు సోదరుల మధ్య తగవు వస్తే ఆ రాత్రి అక్కడ వుండి వారిరువురి మధ్య సామరస్యం చేకూర్చారు బాబా. తరువాత బొంబాయి వచ్చి అక్కడ బాబా దర్శనం కోసం తపిస్తున్నవారికి దర్శనం యిచ్చారు. అనేక మంది వారి పాదాలముందు సాష్టాంగపడి నమస్కారాలు చేశారు. ఆయన స్పర్శ కోసం ఆయన చూపుకోసం వారు ఎంతో ప్రేమతో ఎదురు చూశారు. ఒక పార్సీ తల్లి తన రెండువారాల బిడ్డను తీసుకువచ్చింది బాబా పాదాల చెంతకు. ఆ బిడ్డ తరుచుగా విలవిలలాడిపోయేదట. ఆ బాధ చూడలేక పోయేవారు, బాబా ప్రోమోలను ఉండగానే ఆ బిడ్డ శాంతముగా నిద్ర పోయింది. అది ఆయన ప్రేమ ప్రభావము. కొంచెం సేపయిన తరువాత బాబా తల్లిని పిల్లని రమ్మని కబురు చేశారు, బాబా ఆ చంటి పిల్లను తమ చేతులలోకి తీసుకోగానే ఆ బిడ్డ కళ్ళు తెరచి చూచింది. బాబా శక్తివంతమైన తమ దృక్కులను ఆ బిడ్డవైపు ప్రసరించి చూశారు. ఆ బిడ్డ వదనము చిరునవ్వుతో కలకలలాడింది. ఆ బిడ్డకి వచ్చిన జబ్బు మాయమై పోయింది. ఆ తల్లి ఆనందంతో బిడ్డను ఎత్తుకుని వెళ్ళిపోయింది బాబాకు కృతజ్ఞతా వందనము లర్పించింది.

బాబా కొందరు భక్తులతో సంభాషించారు. వారిలో వారికి ఏదో సంగతి గురించి వివాదం కలిగి పెద్ద గొంతుకతో కేకలు వేసుకున్నారు-అప్పుడు బాబా వారితో-"తన చేతలను నిగ్రహించుకో లేనివాడు మానవుడు కాజాలడు" అన్నారు.

ఒక బాబా ప్రేమికుడు బాబా వియోగముచేత బాధపడుచుండగా ఆ వియోగ కాలము ఇంకా పొడిగించవలసిన అవసరం గురించి బాబా అతనికొక సందేశమును ఈ విధంగా పంపిచారు.

"నా జీవితంలో నేను ప్రతి క్షణము చెప్పరాని ఆవేదన పడుతున్నాను అందు నీవు కూడా కొంత పాల్గొనాలి. ఇది ఆఖరుభాగం. ఈ మాట నీవు నన్ను చూచినపుడు నా విశ్వాత్మను చూడగలవు——బాబా."

ఈ సందేశమును పంపుతూ ఆ శిష్యునికి భారత పర్యటన చేయవలెనని ఆహారమునకై భిక్షమెత్తి తినవలెనని చెప్పి కబురుచేశారు బాబా. ఎన్ని కష్టాలు వచ్చినా, ఎంతమంది తిట్టినా అన్నీ ఓర్పుతో భరించమని చెప్పారు. తరువాత బాబా నవంబరు ఆఖరు వారంలో బొంబాయినుంచి మెహెరాబాదు వచ్చి ఆశ్రమంలో వుంటున్నారు.

1938వ సంవత్సరంలో బాబా జన్మదినం ఫిబ్రవరి 20 వతేదీ ఆదివారంనాడు అయిందని ఆ రోజున తమ ప్రేమికులు,భక్తులు అందరూ మెహెరాబాద్ వస్తే బాబా సంతోషిస్తానని బాబా అందిరికి తెలిపారు.

నొరీనా మాచెబెల్లి ప్రస్తుతం బాబా భారతీయ శిష్యులతో మెహెరాబాద్‌లో ఉంటున్నది. బాబా డిసెంబరు పర్యటనలో ఆమె బాబాతోను ఇతర మండలితోను ప్రయాణం చేస్తుంది.

## సొరాబ్జీ దేశాయి యింట్లో :

బాబా నవసారీ కాపురస్థుడయిన సొరాబ్జీ దేశాయి యొక్క సోదరుని కుమార్తె బాపాయికిన్ని నాసిక్ కాపురస్థుడయిన మినూ దేశాయికి వివాహం కుదిర్చి తాంబూలా లిప్పించారు. బాబా బాపాయి చేతిని ఒక ఉంగరం పెట్టారు త్వరగా వివాహం చేసుకుని దంపతులు కమ్మని దీవించారు. కొంత తర్జన భర్జన అయిన తరువాత డిసెంబరు 27, (1937) తేదీన ముహూర్తం పెట్టారు. సొరాబ్జీ ఆరోగ్యం దిగజారి పోతుంది. బాబా అతని కోరికప్రకారం అవసాన దశలో

వచ్చి దర్శన మిస్తానని వాగ్దానం చేశారు. ఆ ప్రకారం వారు 1937 డిసెంబరు 22 వ తేదీ నాడు నవసారీకి బయలుదేరారు. నవసారీ వెళుతూ నిస్వార్థ సేవ గురించి తనతో వున్న శిష్య బృందంతో రైలులో మాట్లాడుతూ బాబా ఇలా చెప్పారు.

"దేవుడు దేవుడుగాను మానవునిగాను ఉన్నట్లు తెలుసుకొని లేడు. మానవుడు మానవ మాత్రునిగా నమ్ముతూ తాను నిజంగా భగవంతుడనని తెలుసుకొనీ లేడు. అవతార పురుషుడు మాత్రం భగవంతుడుగాను, మానవుడుగాను ఇద్దరి చైతన్యం పొంది వుంటాడు. అందుచేత అవతారుడు ప్రభువూ, విశ్వము యొక్క సేవకుడు కూడాను. అన్ని ఆత్మలూ సత్యంకేసి పయనింప జేసే ప్రభువూ ఆయనే. నిరంతరము మానవుల బరువును మోసే సేవకుడూ ఆయనే. అందరినీ సేవించే ఆయనను సేవిస్తే విశ్వమంతను సేవించినట్లే.

నిస్వార్థసేవ. ప్రేమ యీ రెండు దివ్యత్వం యొక్క గుణములు. ప్రేమించే వాడే నిజంగా సేవించగలడు, నీ ప్రియతమ దైవ - మానవుని నీవు సేవిస్తే అందరి ఆత్మలలో గల నీ ఆత్మనే నీవు సేవించుకున్నట్లు లవుతుంది.

ప్రభువు నీ వద్ద నుంచి రాబట్టుకునే సేవ నీ యొక్క ఆధ్యాత్మిక లాభం కోసమే. కాని ఈ సేవ ఐచ్ఛికంగాను, హృదయపూర్వకంగాను, ఏదో లాభం చేకూరుతుందని గాక నీ అంతట నీవు చేసేదిగా వుండాలి. ప్రభు సేవ చేయడం తను మన ఆత్మలకు బాధగా పరిణమించ వచ్చును. ఒకరి వీలుకోసం చూస్తేను, సులభంగా వుండడం కోసం చూస్తేను, అటువంటి సేవలో పూర్ణత్వం ఎలా వస్తుంది? అయినా, మనస్సుకి వేదన కలిగించినా, శరీరాన్ని బాధ పెట్టినా, నిస్వార్థ సేవకుడు నిజమైన తృప్తిని, ఆనందాన్ని అనుభవించగలడు. ఎవరయితే ఫలాపేక్ష లేకుండా, బహుమతి పొందాలనే ఆశ లేకుండాను భగవన్మానవుని సేవించాడో నిజముగా సేవించిన వాడవుతాడు. లేకపోతే డబ్బుకు పనిచేసే కూలీ లాగే వాడూ వుంటాడు" అని చెప్పి బాబా ప్రసంగం ముగించారు.

బాబా 1937, డిసెంబరు 22 వ తేదీనాడు రాత్రి 8 గంటలకు బాబా వారి మండలితో రైలులో నవసారీ చేరుకున్నారు. సొరాబ్జీ దేశాయి కుటుంబంవారు స్టేషన్ వద్ద స్వాగతం యిచ్చారు. కారులో యింటికి తీసుకువచ్చారు. దేశాయి యొక్క కుటుంబంలోని ప్రతివారును బాబా దర్శనం చేసుకున్నారు. దేశాయి వద్దకు వెళ్ళి చూడడానికి బాబా నొరీనా మాచెబెల్లీని తమతో రమ్మన్నారు. మండలిని

కూడా ఆయనతో తీసుకుని వెళ్ళారు. ఎడా పెడా చిత్రపటాలుంచిన పెద్ద గ్రంథాలయం హాలులో నుంచి వెళ్ళి చిన్న దీపం వెలుగుతూ వున్న జబ్బువాని (దేశాయి) గదిలో ప్రవేశించారు బాబా. బాబా వెళ్ళి మరణశయ్య మీద పరుండియున్న సొరాబ్జీ ముందు నిలబడ్డారు. కొద్ది క్షణాలయిన తరువాత బాబా అందరినీ బయటకు పంపించి వేశారు. ఆ తరువాత బాబా ఆఖరి దశలో వున్న దేశాయితో ఏం మాట్లాడారో అక్కడ ఏం చేశారో ఎవరికీ తెలియదు.

వంట యింటికి పెద్ద యింటికి మధ్య నున్న కాళీ ప్రదేశంలో భోజనాలు వడ్డించారు. పొడుగయిన టేబిల్ మీద అరటి ఆకులు వేశారు. ఆ ఆకులలో భోజనం చేశారు. పళ్ళు, మిఠాయిలు కూడా బాబాకి, మండలికి పెట్టారు. అందరు దుఃఖాక్రాంతులై యున్నారు. వాతావరణం గంభీరంగా వుంది. కాని బాబా తమ హాస్య రసంతో అందరూ నవ్వేలా చేశారు. బాబా భోజనాలు చేసిన తరువాత చప్పట్లు కొట్టి అందరినీ వెళ్ళి పరుండమని చెప్పారు. అక్షర ఫలకం మీద, ఎవరూ ఆందోళన చెందకూడదు అని బాబా అన్నారు. అందరూ బాబాని కౌగిలించుకుని వారి గదులలోకి వెళ్ళిపోయిన తరువాత బాబా మండలితో సమీపంలో వున్న ఒక అతిథి గృహంలోకి వెళ్ళిపోయారు.

మరుసటి రోజున 5–30 కే బాబా అందరినీ లేపేశారు. 7–30 గంటలకు దేశాయి కుటుంబ సభ్యులంతా వచ్చి బాబాను గ్రంథాలయ హాలులో కలుసుకోవాలని కబురు చేశారు. బాబా ఒక్కరూ వెళ్ళి సొరాబ్జీతో కొద్ది నిమిషాలు గడిపారు. బయటకు వచ్చిన తరువాత జబ్బు మనిషి వున్న గదిలోనికి ఎవ్వరూ పోకూడదని కఠినంగా ఆజ్ఞాపించారు. అతని సంరక్షణకై నియోగింపబడినవారు తప్ప.

లైబ్రరీ హాలులో కుటుంబములోని వారంతా రాగానే వారితో బాబా మాట్లాడారు. ఆ రోజున 23 వ తారీకు. వివాహ ముహూర్తంలో మార్పు వచ్చిందని 24 వ తేదీనే వివాహం అవుతుందని బాబా చెప్పారు. 300 మందికి విందు ఏర్పాటు చేసి వారికి ఆహ్వానాలు వెళ్ళటానికి సిద్ధంగా వున్నాయి. విందు రద్దు చేయించి ఆహ్వానాలు ఆపు చేయించారు బాబా. కొద్ది మంది ముఖ్యమయిన బంధువులను మాత్రం రమ్మని కబురు చేయించారు.

ముహూర్తం మార్పు విషయంలో బాబాతో కుటుంబ సభ్యులు చర్చ చేసి మొదట పెట్టిన ముహూర్తం 27 వ తేదీనే వివాహం జరిపించడానికి బాబాను వారంతా ప్రాధేయపడగా బాబా సరే అని అంగీకరించారు. ఈ మాట ప్రజలు

వచ్చి బాబాను దర్శించడానికి బాబా అంగీకరించలేదు. కొద్దిమంది ప్రేమికులు మాత్రము వచ్చి బాబాను దర్శించ వచ్చునని బాబా చెప్పారు. ఈ సంగతి మండలితో చెప్తూ – నేను మాట్లాడినపుడు నన్ను ప్రజలంతా దర్శిస్తారు. అప్పుడు వారిని ఎవరూ ఆపరు" అన్నారు.

మధ్యాహ్నానికి సొరాబ్జీకి కొంచెం జవసత్వాలు వచ్చాయి. అతడు స్వంతంగా సేకరించిన సాధువుల, మహాత్ముల ఆనవాళ్ళను, ఆధ్యాత్మిక విషయిక మయిన కాగితాలను బాబావారి మండలి చూడాలని తమ్ముని చేత కబురు పంపాడు. అందులో ముఖ్యమయినది బాబావారు స్వంతంగా వ్రాసి హజరత్ బాబా జాన్‌కి అంకిత మొనర్చిన ఒక గజల్. మండలివారు అవన్నీ చూచి సొరాబ్జీకి కృతజ్ఞత తెలిపారు.

మధ్యాహ్నం 4 గంటలకు ఒక భజన కార్యక్రమం ఏర్పాటు అయింది. బాబా యెదుట అనేకమంది గానం చేశారు వారిలో ఒక స్కూలు విద్యార్థి అయిన బాలుడు శ్రావ్యమయిన స్వరంతో పాడినది బాబా మెచ్చుకున్నారు. అతని పాఠశాల లోని అధ్యాపకుడు ఆ బాలుని తీసుకువచ్చి పెద్దవారి ముందు పాడిస్తే భీతి పోతుందని పాడించాడు. ఆ బాలుడు బాగా పాడాడు. ఈ బాలుడు పెరిగి పెద్ద వాడైన తరువాత కూడా బాబా ప్రేమికుడై ఆయనను తన సంగీతంతో రంజింప జేస్తున్నాడు.

బాబా ఒక మంచం మీద పరచబడియున్న ఒక దుప్పటి మీద కూరుచున్నారు. ఆయన భక్తులు చుట్టూ క్రింద వేయబడిన ఒక జంకానా మీద కూరుచున్నారు. సొరాబ్జీ తన తమ్ముని ద్వారా బాబాకి తన ఆఖరి కోరిక నెరవేర్చమని కబురు చేశాడు. అదేమిటంటే తాను బాబా దర్శనం చేసుకోవాలని. బాబా సొరాబ్జీని రమ్మన్నారు. గట్టి ప్రయత్నం మీద సొరాబ్జీ మంచం మీద నుంచి లేచి బాబా కూరుచున్న గదిలోకి వచ్చాడు. అతన్ని చూస్తే అతనిలో ప్రాణం వుందా అని అనుమానం కలుగుతుంది. ఉన్నాగానీ కొద్ది రోజులలోనే అది ప్రయాణం చేసి వెళ్ళిపోవడం తథ్యం. తమ్ముడి సహాయంతో నడిచి వచ్చాడు దేశాయి. బాబా యెదుటకి వచ్చాక తమ్ముడి సహాయం వదిలేసి తనంతట తానుగా బాబా యెదుట నిలబడ గలిగాడు. అతడు బాబా కాళ్ళ మీద పడ్డాడు. మరణావస్థలో వున్న సొరాబ్జీ బాబాకు సమర్పణ అవుతున్నాడు. బాబా సొరాబ్జీని ఆలింగనం చేసుకున్నారు. తరువాత సొరాబ్జీని తీసుకువెళ్ళి పరుండబెట్టమని బాబా ఆజ్ఞాపించారు.

సాయంత్రం 6 గంటల నుంచి 8 గంటల వరకు భజన కార్యక్రమము నిలుపు చేయబడింది. పార్సీల యొక్క పురోహితుని భార్య ఆమె స్నేహితురాండ్రతో బాబా దర్శనానికి వచ్చింది. ఆమె చూడడానికి చక్కగానే వుంది కాని ఆమె ముఖం మీద బాధను సూచించే రేఖలున్నాయి. ఆమె యీ విధంగా బాబా దర్శనానికి వచ్చిందంటే నవసారీలో ఆమె జాతివారయిన యితర పార్సీలు ఎంత విమర్శ చేస్తారో ఆమెకు తెలుసును. కాని దానికి ఏమీ లెక్క సేయక ఆమె బాబా దర్శనార్థం వచ్చేసింది. ఆమె భర్త తన జీవితం అంతా పార్టీల కర్మ కాండలతో గడిపాడు. అతడు వారి పురోహితుడు కదా. కర్మ కాండలంటే ఏ మతానుయాయుల కయినా ఊక వంటివి. అందులో అసలు పదార్థం మృగ్యం. ఆమె వైవాహిక జీవితం ఒకే విధమయిన కష్టాలతో కూడియుండెను. అయినప్పటికి తన భర్త యొక్క నిజమైన సహధర్మ చారిణిగా ఆమె జీవితము గడిపినది. ఆమెకు అనేక ఆధ్యాత్మిక అనుభవాలు కలిగాయి ఇప్పుడు ఇది ఆఖరిది, అతి ముఖ్యమయినది ఐన అనుభవం – మానవ రూపంలో వచ్చిన భగవంతుని దర్శించడం. దీనితో వెనకటి వేవీ పోల్చడానికి వీలు లేదు. అతులితము, అత్యున్నతము అయిన సత్యము యొక్క మూర్తిమంత మయిన బాబాను ఆమె పూర్తిగా నమ్మినది. ఆ నమ్మకాన్ని పురస్కరించుకొని ఆయన సన్నిధిలో ఆమె స్వయంగా బాబాకు అంకిత మవడం అనే ఆరాధనను గావించింది. బాబాకు ఆమె హారతి యిచ్చింది. పాత జీవితాన్ని దహించివేసి, ప్రేమతోను, త్యాగముతోను బాబాకు అంకితముతో కూడుకున్న నూతన జీవితమునందు ప్రవేశించింది. హారతి అయిన తరువాత బాబా యెదుట ఆమె సాష్టాంగ ప్రణామం చేసింది. ఆయనకు ఆత్మ సమర్పణ చేసుకున్నది. కర్పూరహారతి వెలుగుతున్న పళ్ళెం అందరికి అందించింది. దానివలన వారు కూడా వారి పాత జీవితాన్ని ఆ జ్వాలలో భస్మం చేసుకుని ప్రేమమయ, త్యాగమయ నూతన జీవితాన్ని ఆరంభించి దానిని బాబాకి అంకితం చేసుకోవాలని ఆమె ఆశయం. తరువాత ఆమె వెండి జరీతోను, ముత్యాలతోను కుట్టబడిన తెల్లని పట్టువస్త్రం బాబా బుజాలమీద నుంచి ఆయనమీద కప్పింది. ఈ వస్త్రం ఆమె, ఆమె స్నేహితురాండ్రు భక్తి శ్రద్ధలతో తయారు చేశారు. తరువాత బాబాను ఆమె "ఈ యుగానికి ప్రియతమ ప్రభువా! శ్రీ కృష్ణభగవానునివలె మీరు ఈ భూమిమీద అవతరించారు. మీరు మానవులకు ముక్తిని ప్రసాదించెదరుగాక" అని ఆమె బాబాను సంబోధించి ప్రార్థించినది.

మర్నాడు డిసెంబరు 24 వ తేదీ ఉదయం బాబా వెళ్ళిపోవాలి, సొరాబ్జీకి విశ్రాంతి లేదు. బాబా అతని గదిలోకి వెళ్ళి అతనికి సంతోషము కలిగించారు. ఆఖరిమాటుగా బాబా సొరాబ్జీని చూశారు. సొరాబ్జీ బాబా మెడలో నొక పుష్పదామ మలంకరించాడు. బయట వారెవరూ సొరాబ్జీ వద్దకు రాకూడదని బాబా ఆంక్ష పెట్టారు. కుటుంబ వైద్యుని ఆజ్ఞలను అక్షరాలా పాటించాలన్నారు. సొరాబ్జీలో జీవం హరించిపోయింది. బాబా ఏర్పాటు చేసిన వివాహం కోసమే ఊపిరి నిలిచి వుంది. బాబా ఆ రోజున వెళ్ళిపోవుచున్నందున పెళ్ళి ఇంకా 4 రోజులున్నందున ఇంటిలోనివారు అప్పటివరకు సొరాబ్జీ జీవించి వుంటాడా అని బెంగపెట్టుకున్నారు. బాబా నవసారీ వదలి, వెళ్ళేముందు ఒక ఉత్తరం సొరాబ్జీ కుటుంబానికి వ్రాసి అది 28 వ తేదీ నాడు తెరచి చూడాలని ఆదేశించారు. ఆ ఉత్తరంలో "అంతా నా యిచ్ఛ ప్రకారమే జరుగుతుంది, మీరు విచారించకండి" అని బాబా వ్రాశారు.

బొంబాయికి రైలు (24 వ తేదీ) ఉదయాన్నే 7 గంటలకే వుంది. అందరు అరగంట ముందుగానే స్టేషన్‌కి వెళ్ళియుండాలని బాబా ఆజ్ఞాపించారు. బాబాకు మధురమైన వీడ్కోలు యిచ్చారు. సొరాబ్జీ కుటుంబంవారు; విచారం వ్యక్తపరచ లేదు. 25, 26 తేదీలు దేశాయి కుటుంబం ప్రాణాలుగ్గపెట్టుకున్నట్లు గడిపారు. ఎట్టకేలకు 27వ తేదీ రానే వచ్చింది. ఆనాడు ఇదివరలో అనుకున్నట్లుసాయంకాలం గాక ఉదయమే వివాహం చేసెయ్యమని బాబా ఆదేశించారు. సొరాబ్జీ మరణశయ్య మీద వుండగానే వివాహపు మంగళ తూర్యారవాలు చెలరేగాయి. వివాహం శోభాయ మానంగా జరిగింది. నూతన వధూవరులు సొరాబ్జీ వద్దకు ఆశీస్సుల కోసం వచ్చారు. అతడు ఆనంద బాష్పాలతో బాబాను ప్రార్థిస్తూ వారిని ఆశీర్వదించాడు. పెళ్ళి అయి పోయింది. అందరికీ గుండెలు తేలిక అయాయి. పెళ్ళి అయిన 20 నిమిషాలకి సొరాబ్జీకి పిలుపు వచ్చింది. అతడు అనంతుడయిన బాబాలో శాశ్వతంగా విశ్రాంతి తీసుకోడానికి వెళ్ళిపోయాడు. బాబాకు నాగపూర్ ఈ రెండు వార్తలు-వివాహవార్త, విషాదవార్త-టెలిగ్రాం ద్వారా తెలిపారు.

నవసారి నుంచి బాబా నాగపూర్ వెళ్ళి అక్కడ బ్రహ్మండి, జస్సావాలా యింటిలో మకాం చేశారు. అప్పుడే ఒకరోజున బాబా ధర్మపేటలో ఉంటూవున్న దేశ్‌ముఖ్ అనే ప్రేమికుని యింటికి వెళ్ళి చూశారు. ఆ కుటుంబం వారందరిని దీవించి ఆనందపరచారు.

28 వ తేదీన నవసారీ నుంచి వచ్చిన టెలిగ్రాం చూసుకున్నారు బాబా. ఆ రోజున ఉదయాన్నుంచి టెలిగ్రాం వచ్చిందా అని బాబా అడుగుతూనే వున్నారు. దేశాయి కుటుంబము యెడల ఉన్న అమితప్రేమ వలన బాబా సొరాబ్జీ యొక్క మరణాన్ని అతని యింటిలో వివాహం అయేవరకు ఆపుచేశారు. టెలిగ్రాం చదవగానే బాబాకు చాలా సంతృప్తి కలిగింది. అంతా ఆయన అనుకున్నట్లు జరిగిందని, వివాహానంతరం మరణం సంభవించిందని, అప్పుడు బాబా – "సొరాబ్జీ జీవితపు గాలిపడగకి దారం తెగిపోయింది. అయినా నేను ఆ దారపుకొసను పట్టుకుని ఆ గాలి పడగను మూడురోజులు ఎగిరేలా చేశాను" అన్నారు. ఆ టెలిగ్రాం చదువుకున్నాక 'వెల్‌డన్' (బాగా జరిగింది) అని బాబా అక్షరాల పలకమీద వ్యక్తం చేశారు.

నాగపూర్‌లో మనసు చెదిరిపోయిన ఒక ఏడేళ్ళ ప్రాయపు బాలుని బాబా చూశారు. కొన్నివారాల క్రితమే ఆ బాలునికోసం వెదకి తమ వద్దకు తీసుకు రావాలని ఆజ్ఞాపించారు. బాబా నాగపూర్ రాగానే వారి భక్తులు ఆయన ఆజ్ఞను పాలించి ఆ బాలుని తీసుకువచ్చారు. బాబాను చూడగానే ఆ బాలుడు ఆయన ఒడిలోకి ఎగిరిగంతేసి కూర్చున్నాడు. ఒళ్ళోకూర్చుని బాబా మెడచుట్టూ చేతులువేసి బాబాకు దగ్గరగా చేరిపోయాడు. మామూలుగా సిగ్గుగావుండే పిల్లవాడు ఇలా చేస్తూంటే అందరికీ ఆశ్చర్యం వేసింది. ప్రతీరోజు బాబా అక్కడ ఆ పిల్లవానిని స్నానం చేయించి బట్టలు తొడిగేవారు. రాహూరీ ఆశ్రమంలో మస్తులకి సేవ చేసినట్లు ఇతనికీ చేసేవారు. ఆ విధంగా ఆ పిల్లవాని మనసును శుభ్రపరచే అవకాశం బాబా తీసుకున్నారు. ఆ స్థలం విడిచిపెడుతూ ఆ పిల్లవాని తండ్రితో ఆ బాలుని మెహెరాబాద్‌కి వచ్చే ఏప్రిల్‌లో (1938) తీసుకుని రమ్మని చెప్పి వెళ్లారు.

నాగపూర్‌లో దిక్కులేనివారిని, వికలాంగులను, నిరాశతో బాధపడుతున్నవారిని బాబా చూస్తారని వార్త తెలియగానే చాలామంది–పిల్లలుకూడా–వారిముందునుంచి వరుసలో వెళ్ళి బాబా యొక్క ఆశీస్సులు పొందారు. బాబా వారి తలమీద చేతులు పెట్టి వారందరిని దీవించారు.

మర్నాడు సాయంకాలం బాబా యొక్క దర్శనం, వారి ఆశీర్వాదం కావాలనుకున్నవారికి ఎవరువచ్చినా రానిమ్మని బాబా కూర్చున్నారు. ఒక పెద్ద హాలులో ఒక అందమయిన సోఫాలో బాబా కూర్చునివున్నారు. అందులో తలగడలు, మెత్తలు, శాలువలు, జంకానాలు ఎన్నో అక్కడ అలంకరించబడి వుండగా బాబా సోఫాలో భారతీయ సంగీతం వింటూ కూర్చున్నారు.

మరుసటిరోజున దర్శన కార్యక్రమంలో 7000 మంది ప్రజలు వరుసలో నిలబడి బాబా దర్శనం కోసం కొన్ని గంటలు వేచియుండి బాబాను కళ్లారా చూద్దామని ఆయన స్పర్శ పొందుదామని వాంఛతో బాబా వద్దకు వెళ్ళారు. బాబా వారిని బిడ్డలవలెనే ఆలింగనం చేసుకుని వారిమీద తమ ప్రేమను వర్షించారు. అదృశ్యంగానే వారికి బాబా అమూల్యమైన కానుకను ప్రేమరూపంగా యిచ్చారు. కొంతమందికి కనిపించే కానుకలుకూడా యిచ్చారు. ప్రక్కనే వున్న నారీనా జేబుతోని రూమాలును తీసి బాబా తమ చేతిలో కొద్దినిముషాలుంచుకుని (వారి స్పర్శచేత దానిని పునీతంచేసి) ఒక ప్రేమికునికి యిచ్చారు. ఒక బిడ్డను చేతులలోకి తీసుకున్న బాబా ఎత్తుకున్నారు. పరిశీలించి బాబా ముఖంకేసి చూచినవారికి ఈ భక్తుల బాధలను తీసివేసి తాము స్వీకరించినట్లు బాబా ముఖంమీద ఆ బాధలయొక్క రేఖలు గోచరిస్తున్నాయి.

కొంతసేపయిన తరువాత నాగపూరు వీడి వెళ్ళుటకు స్టేషన్‌కి వెళ్ళగా అక్కడ బాబాకు వీడ్కోలివ్వడానికి అనేక వందలమంది వచ్చియున్నారు చీకటి పడింది. రైలు వచ్చింది. "శ్రీ సద్గురు మెహెర్‌బాబా మహరాజ్‌కిజై" అను నినాదాలు మిన్నుముట్టాయి.

ఉదయాన్నే రైలు ఒక స్టేషన్‌కి వచ్చింది. అక్కడ బాబా శిష్యుడు ఒకడు ఒకకారు తీసుకువచ్చి సిద్ధంగా వున్నాడు. రైలుదిగి ఆ కారులో ఎక్కి బాబా కొద్ది గంటలలో మెహెరాబాద్ చేరుకుంటారు. కొంతదూరం ఆ దుమ్ముతో నిండిన రోడ్డు మీద వెళ్లాక బాబా హఠాత్తుగా 'నాకు ఆకలిగా వుంది' అన్నారు. ఒక మర్రిచెట్టు క్రింద కారు ఆపారు. నాగపూర్‌లో ఒక ప్రేమిక కుటుంబం కట్టియిచ్చిన రొట్టెలు విప్పి తినదామనుకుంటుండగా రోడ్డుమీద ఒక మనిషి చాలా బీదవాడు, ఎంతో బరువు మూటలను మోస్తూ బాబాకి కనిపించాడు. వెంటనే విప్పిన ఆ పొట్లాలలోని చపాతీలు, రొట్టె, వెన్న, పళ్ళు ఆ మనిషికిపెట్టి తినమని చెప్పమని బాబామండలిలో ఒకనిని ఆజ్ఞాపించి "శ్రీ సద్గురు మెహెర్‌బాబా ఇస్తున్నారు తిను" అని అనమన్నారు. ఆ విధంగానే బాబా శిష్యుడు ఆ మాటలు ఉచ్చరించి అతనికి ఆహారం పెట్టగా "ఆహా! నేను ఆయన పెట్టిన భోజనం తినడానికి ఎంత అదృష్టవంతుడను" అన్నాడు. ఈ మనిషి బాబాయొక్క ఒక ఆధ్యాత్మిక ప్రతినిధి. ఆ ప్రదేశంలో ఆ సమయానికి అక్కడ అతడు కలుస్తాడని బాబాకు తెలుసును. ఈ ఆధ్యాత్మిక ప్రతి

నిధులు బాబాను భౌతికంగా కలుసుకోనక్కరలేదు. మానసికంగా వారికి కలియిక జరుగుతూనే వుంటుంది.

బాబా మెహెరాబాద్ చేరుకున్నారు. కేన్స్‌లో బాబా మకాం ఎత్తేసిన తరువాత బాబా ప్రేమికులు ఎవరికివారు వారి వారి స్థలాలకి వెళ్ళిపోయారు. అలాగే జీన్ ఏడ్రియల్‌కూడా అమెరికా వెళ్ళింది. వెళ్ళి అక్కడినుంచి ఆమె ప్రియతమునికి ఉత్తరం వ్రాసింది.—

"ఒక నెలనుంచి మీకు ఉత్తరం వ్రాయాలని అనుకున్నాను. కేన్స్‌నుంచి వచ్చినప్పటినుంచి అలాగే అనుకున్నాను. నాలోని నిగ్రహశక్తి అడుగంటింది. ఏది వ్రాసినా అది నిష్ప్రయోజనం అనిపిస్తోంది. నా నుండి మీరు వేరేగా వుంటేకదా మీకు వ్రాయడం. మీరు నాలోనే నాతోటే ఉన్నారనీ, కేన్స్‌లో ఉన్నప్పటికంటెకూడా ఎంతో నాకు సన్నిహితంగా మీరున్నారని నాకు అనిపిస్తోంది. మీరు నాశ్వాసలాగే నాలో ఉంటే ఇంక ఎవరికి వ్రాయను, ఎందుకు వ్రాయాలి ?"—

అని జీన్ తన భావం వ్యక్తంచేస్తూ వ్రాసింది. జీన్ ఏడ్రియల్ జీవితం యువకులకు ఉత్తేజం కలుగజేస్తుంది.

1938 ఫిబ్రవరి 17 వ తేదీన అహమ్మద్‌నగర్ జిల్లాలోని పేదవారిని 500 మందిని రప్పించి వారి పాదాలు కూడా స్పృశించి బాబా తలొక లడ్డు ప్రసాదం యిచ్చారు.

బాబా పుట్టిన రోజు సందర్భంలో ఆ నెలలో తమ ప్రేమికులకు ఈ క్రింది సందేశం యిచ్చారు. —

"ప్రపంచాన్ని గాని నన్నుగాని సంతోషపెట్టడానికి మీరు మీ అంతరాత్మకి విరుద్ధంగా ఏమీ చెయ్యవద్దు. ప్రపంచం అంతా మీకు ఎదురు తిరిగినా మీకు ఏది సరియని తోస్తుందో సంకోచం లేకుండా అది చేయండి. మీ మనసు అన్ని వైపుల నుంచి వీచిన ఎన్ని తుఫాను గాలులకయినా ఆగిన రాయివలె దృఢంగా ఉండాలి. నేను అందరి కోసం ఉన్నాను."

బాబా 44 వ జన్మదినోత్సవం ఈ సంవత్సరం మెహెరాబాద్‌లో జరిగింది. ఫిబ్రవరి 19 వ తేదీ ఆదివారం మొదలుకొని 21 ఫిబ్రవరి మంగళవారం వరకు ఉత్సవాలు జరిపారు. ఈమూడురోజులూ కొంతమంది పాశ్చాత్యులుకూడా వున్నారు.

500 మంది బాబా ప్రేమికులు ఈ ఉత్సవాలలో పాల్గొన్నారు వీరు గాక చుట్టు ప్రక్కల గ్రామాల నుంచి 5000 మంది ప్రజలు వచ్చి బాబా దర్శనం చేసుకుని 21 వ తేదీన అందరికీ చేసిన విందులో భోజనం చేశారు. ఈ సంవత్సరం పార్సీ పంచాంగం ప్రకారం బాబా జన్మదినం ఫిబ్రవరి 15 వ తారీకున అయింది. అయితే బొంబాయి, పూనా, నాగపూర్, నాసిక్, నవసారీ, మద్రాస్, కరాచీ, కొల్హాపూర్ మొదలయిన నగరాలనుంచి వచ్చే అనేకమంది భక్తులకోసం 19 వ తేది నుండి ఉత్సవాలు ప్రారంభించడం జరిగింది.

బాబా పదవమారు పాశ్చాత్య దేశాలకు వెళ్ళినపుడు అయిదుగురు పాశ్చాత్యులతో మరల భారతదేశం తిరిగివచ్చారు. ఆ అయిదుగురులో ముగ్గురు స్త్రీలున్నారు- కిట్టీడేలీ, నారీనా మాచెబెలీ, రానో గేలీ. వీరుగాక ఫిబ్రవరి 15, 17 తేదీలలో ఎలిజబెత్ పాటర్సన్, నానీ గేలీ కూడా వచ్చారు. వీరంతా బాబా జన్మదినోత్సవాలలో పాల్గొన్నారు.

బాబా జన్మదినోత్సవాలకి భారతదేశం నలుమూలల నుంచి బాబా ప్రేమికులు చాలామంది వచ్చారు. ఆ వచ్చిన వారిలో స్త్రీలు నూరుమంది వున్నారు వచ్చిన వారికి స్నానాలకి వేడినీళ్ళు పెట్టించారు. అది బాగా చలికాలం గనుక మామూలు వాడకానికి కూడా వేడినీళ్ళు అవసరమయాయి. ఆడవాళ్ళకు ప్రత్యేకంగా స్నానాలు చేయడానికి, బట్టలు మార్చుకునేందుకు తడకలతో గదులు కట్టించారు. పెద్ద పందిళ్ళు వేశారు. వాటికి చాందినీలు వేశారు. ఆ పందిళ్ళలో ఎరుపు, పసుపుపచ్చ రంగుల జల్తారు అంచులతో అలంకారాలు చేశారు. మామూలుగావుండే కిరసనాయిలు దీపాలకి బదులుగా రంగు రంగుల విద్యుద్దీపాల కాంతితో ఆవరణ అంతా నిండిపోయింది బాబా శిష్యులు కష్టపడి మెహెర్‌బాద్ అంతా స్వర్గధామంలా తయారు చేశారు. ప్రదేశమంతా తోరణాలతోను, జెండాలతోను అలంకరించారు. ఇంకా వేసంగి రాలేదు గనుక మధ్యాహ్నంపూట చలిగాలి వీచింది.

ఇండియా పట్టుగుడ్డలు, ఇటలీ ముఖమల్‌లు, రష్యా అల్లిక గుడ్డలు, పెర్షియా తివాసీలు అన్నీ బాబా శిష్యులు తీసుకువచ్చి సమర్పించారు.

19 వ తారీకున పెందలకడనే లేచి అందరూ కాలకృత్యాలు తీర్చుకున్నారు. బాబా పుష్పాలతో అలంకరింపబడిన సింహాసనం మీద కూర్చున్నారు. అఖండ తేజో విరాజ మానంగా బాబా వదనం దేదీప్యమానంగా వెలిగిపోతోంది. పైన వేసిన చాందినీ బంగారు వర్ణంతో తళ తళ మెరిసిపోతుంది. పందిరి అంతా ప్రేమికులగు

స్త్రీలతోను, పురుషులతోను నిండిపోయింది. బాబాకి ఇరు ప్రక్కల ఆయన తల్లులు — జన్మయిచ్చిన తల్లి షిరీన్‌బానూ, ఆధ్యాత్మిక జనని గుల్‌మాయి — నిలబడ్డారు. బాబా పాదాలు వెండి పళ్ళెంలో ఉంచారు. ఒక వెండి పాత్రలో నుంచి పాలు, తేనె మొదలగు పంచామృతాలతో వారిరువురు బాబా పాదాలకి అభిషేకం చేశారు. వారి తరువాత మిగిలినవారు వరసగా వచ్చి అలాగే చేశారు. ఆ అభిషేకామృతం చేసి పాదాలు వుంచిన వెండి పళ్ళెంలో నుంచి ఇంకొక పెద్ద రజత పాత్రలోనికి తీసి వారి పాదస్పర్శచేత పవిత్రమయిన ఆ పంచామృతాన్ని కావలసిన ప్రేమికులకు పంచి యిచ్చారు. ఇక్కడ యిందుకోసం వచ్చిన స్త్రీలు, బాబా శిష్యులు, పాశ్చాత్యులు మాత్రమే వున్నారు.

ఈ కార్యక్రమం కాగానే బాబా ప్రేమికులందరికి లడ్డు వగైరాలతో, టీ యిచ్చారు. మెహెరాబాద్ కొండమీద బసచేసిన స్త్రీలు 7 గంటల నుంచి 10 గంటల వరకు ప్రత్యేక కార్యక్రమం ఏర్పాటు చేసుకున్నారు. నవసారినుంచి వచ్చిన గాయకులు గజల్‌లు, ఖవ్వాలీలు పాడారు. పూనా నుండి వచ్చిన ఒక గాయకురాలు తన సంగీతం వినిపించింది.

ఇది అయిన తరువాత బాబాతో అందరూ కొండదిగువకు ఊరేగింపుగా సాయిదర్బార్ అని పేరు పెట్టిన షామియానాలోకి వచ్చి చేరారు. బాబాకి ఏర్పాటు చేసిన ఉన్నతాసనం మీద ఆయన ఆసీనులయారు. ఇది బహిరంగ కార్యక్రమం. అనేక వేలమంది వచ్చారు. ఆరంగామ్ నుంచి గ్రామీణులు చాలామంది వచ్చారు. వీరందరి సమక్షంలో రెండవ మారు బాబా పాదాలు పంచామృతాలతో కడిగారు. పురుషులు, స్త్రీలు అందరు ఇందులో పాల్గొన్నారు. ఇక్కడ కార్యక్రమం పూర్తి అవడానికి రెండు గంటలు కాలం పట్టింది దారే వెళ్ళేవారుకూడా వచ్చి ఈ ఉత్సవం చూశారు. వచ్చిన వారంతా బాబా దర్శనం చేసుకున్నారు. ఈ ఉత్సవం కోసం వచ్చిన వారిలో ఒకడు అసామాన్యమయిన మనస్థితిలోనికి పోయి 'నేనొక గొప్ప వెలుగును చూచాను' అని బిగ్గరగా అరిచాడు. ఇలాగే బాబా దర్శనం చేసుకున్నాక పలువురికి పలు విధాలుగా అనుభూతులు కలుగుతాయి.

బాబా ఇంతకు ముందు నాగపూర్ వెళ్ళినపుడు బీదవాడయిన భక్తుడొకడు ఆ సమయానికి ఊరిలో లేక పోబట్టి బాబా దర్శనం చేసుకోలేక పోయాడు. అతడు ఊరినుంచి వచ్చి బాబా వచ్చి వెళ్ళారని తెలుసుకుని అయ్యో సమయానికి లేక పోయానే అని చాలా విచారించాడు. బాబా దర్శనం ఎలాగయినా చేసుకోవాలని

నిశ్చయించుకొని ఒకనాడు అతడు నాగపూర్ నుంచి మెహెరాబాదుకి కాలినడకను బయలుదేరాడు. అనేక దినాలు నడిచి నడిచి అతడు సరిగా ఫిబ్రవరి 18 వ తేదీకి మెహెరాబాదు చేరుకున్నాడు. 19 వ తేదీ మొదలుకొని మూడురోజులు బాబా జన్మ దినోత్సవాలు ఈ ఉత్సవాలకి అందుకున్నందుకు అతడెంతో ఆనందించాడు. ఆ అదృష్టశాలి బాబావారి దర్శనం చేసుకున్నాడు. ఎంతో సంతృప్తి చెందాడు. బాబా సన్నిధానంలో ఒక్క రోజయినా గడపడానికి ఎంత దూరమయినా లెక్కచేయక వచ్చారు బాబా భక్తులు చాలామంది.

ఈ 3 రోజులలో ఒకనాడు బాబా ఒక పాశ్చాత్య భక్తునితో యిలా అన్నారు.

"నా ప్రేమ మానవాళి అందరిమీద ఎల్లవేళలా ప్రసరిస్తూనే వుంటుంది. కాని ఈ రోజున అందరినీ నేను జ్ఞాపకం చేసుకుంటాను – రానివారిని కూడా."

దర్శనార్థం వచ్చిన భక్తులు బాబావారి పాదాలకు శిరస్సు ఆనించి నమస్కారం చేశారు. సంపూర్ణుడయిన పురుషుని పాదాల కెరగి నమస్కరించిన భక్తుడు తన సంస్కారాలన్నీ వారి పాదాలవద్ద వదులుతాడు. భక్తుల సమర్పణ హృదయ పూర్వకం అయినపుడు ఆ పురుషోత్తముడు వారి బాధ్యతలన్నీ తాను స్వీకరిస్తాడు. అంటే వారు వారి జీవితాలనే బాబా అధీనం చేశారన్నమాట. ఇలాటి సంపూర్ణ సమర్పణ ఎవడోకాని చేయలేడు.

దర్శనం చేసుకున్నవారు ఒక్కొక్కడు ఒక్కొక్క రీతిని బాబాకు తన భక్తిని ప్రేమను వ్యక్తం చేసుకున్నాడు. కొందరు బాబా పాదాలమీద వికసించిన పుష్పాలను ఉంచారు. ఒకడు వారి పాదాల గోళ్ళ మీద పసుపుతో పూజించాడు. మరి యొకడు ఒక పుష్పాన్ని వారి హృదయం మీద వుంచాడు. ఒకరిద్దరు స్త్రీలు బాబా ఫాలభాగంమీద పుష్పలతలువేసి తీర్చి దిద్దారు. మరియొకడు ప్రియతముని మీద పడిన గులాబిరేకులను విదిలించాడు. ఎవరికి తోచినట్లు వారు బాబాకి సేవచేశారు. కొందరు పుష్పమాలలు కట్టి తీసుకువచ్చి బాబా మెడలో వేసి అలంకరించారు.

ఈ అలంకారాలకీ, సపర్యలకీ బాబా ఓర్పువహించి ఎట్టి అభ్యంతరము చెప్పకుండా ఊరుకున్నారు.

టెంకాయలు, ఖర్జూరపు పళ్ళు, అత్తిపళ్ళు మొదలయినవి సాంప్రదాయ సిద్ధంగా ఐశ్వర్యానికి చిహ్నాలయినవి తెచ్చి బాబాకి సమర్పించారు. అవన్నీ బాబా

స్పృశించి ఆయన మరల వారికి ప్రసాదంగా యిచ్చేశారు. మల్లెల సుగంధాలు, గులాబీల సౌరభాలు ఎల్ల యెడల గుబాళించాయి.

ఆంగ్లమునందు ఇతర భాషలలోను అక్కడికి వచ్చిన భక్తులు ప్రసంగాలు చేసి వారి భక్తిప్రపత్తులు నివేదించుకున్నారు. ఆ ప్రాంతాలలో ప్రఖ్యాత వక్త అయిన అంగల్ అనే అతడున్ను, రాహూరీలో న్యాయవాద వృత్తిలో వున్న ధాకే ఫల్కర్ అనే బాబా మండలి సభ్యుడు బాబా గురించి ఉపన్యాసాలిచ్చారు. వారిరువురు బాబా యొక్క నిస్వార్థ త్యాగమయ సేవా జీవితమును గురించి వారికి ఆయన సాంగత్యభాగ్యం వలన కలిగిన అద్భుత ఆధ్యాత్మికానుభవాల గురించి మాట్లాడారు వీరి ఉపన్యాసాలు శ్రోతల హృదయాలను కదిలించి వారిని ప్రేమానందసాగరంలో ముంచెత్తివేశాయి.

బాబా జన్మదినోత్సవాలలో ఆ మూడురోజులలోనూ అందరూ ఒక దివ్యమైన వాతావరణం అనుభవించారు. అందులో కొంతమంది బాబాకి తమ జీవితాలు అంకితం చేసుకున్న భాగ్యశాలులు ఉన్నారు. వారు మానవ సహజమయిన కోరికలను. త్యాగం చేసుకున్న మహానుభావులు.

ఆ మూడు రోజులలోను బాబా వచ్చి కూర్చోగానే వారికి ఆరతితో స్వాగతం యిచ్చారు. మరల సాయంకాలముపూట బాబా వెళ్ళేటప్పుడు కూడా వారికి ఆరతి యిచ్చారు.

గాయనీమణులు, గాయకులు వారి గానంతో వీనుల విందొనర్చారు బాబాకి, వచ్చిన బాబా ప్రేమికులకు. కొందరు నృత్యాలతో అంజలు లిచ్చారు. అహమద్ నగర్ సంగీత కళాశాల విద్యార్థులు మొదటిరోజున బాబా సమక్షంలో భక్తిగీతాలు గానం చేశారు.

సాయంకాలం 5 గంటలకు బాబాలేచి కొండమీదకు (ఎగువ మెహెరాబాద్‌కి) నడచి వచ్చారు. సాయంకాలం 6 గంటలకు బాబా భక్తులకు విందుభోజనం ఏర్పాటు చేసి దిగువ మెహెరాబాదు నుంచి కొండమీదకు వారిని ఆహ్వానించారు. వంటలన్నీ కొండ క్రింద జరిపించారు గనుక పాత్రలతో కొండమీదకి భోజన సామగ్రి అంతా తీసుకువచ్చారు. బంగారు, వెండి పాత్రలతో విందుకోసం వచ్చిన వందమంది అతిథులకు క్షీరాన్నం మొదలయినవి అందిచ్చారు. సాంప్రదాయం ప్రకారం ఆకు పచ్చని అరటి ఆకులలో భోజనాలు వడ్డించారు. పెద్ద పందిట్లో మెత్తని ఆసనాలు క్రిందవేసుకుని అందరూ కూర్చున్నారు. అందరూ సంతృప్తిగా సుష్టుగా భోజనాలు

చేశారు. బాబాకూడావారితో వున్నందున వారికి మరింత సంతోషం కలిగింది. భోజనాలు చేసిన స్థలాలు బాగుచేయించిన తరువాత పందిట్లో మళ్ళీ జంకానాలు పరిపించారు.

రాత్రి ఆ పందిట్లోనే అతిథులందరూ పడకలు వేసుకున్నారు. వారు పరింకిడుటకు తెల్లటి పరుపులు, కప్పుకునేందుకు శాలువలు యిచ్చారు.

కొండమీద భోజనాలయిన తరువాత బాబావారి కేబిన్‌లోకి ప్రత్యేక సంభాషణలు కోరిన దర్శనార్థులను పిలిచి వారితో సంభాషణలు సలిపారు. మర్నాడు ఆఫీసులకు వెళ్ళ వలసిన ఉద్యోగులు ఆ రాత్రే బాబా సెలవు తీసుకుని వెళ్ళిపోయారు. కొందరు తరువాత రెండు రోజులుకూడా ఉన్నారు. పైవిధంగా సంభాషణలు చేయగా మిగిలిన వారిని బాబా 20, 21, తేదీలలో పిలిచి సంభాషణలు కొనసాగించారు.

పాశ్చాత్య ప్రేమికులు అన్ని వేడుకలలోను పాల్గొన్నారు. వీరును శ్రద్ధాభక్తులు కలిగిన ఇతర ప్రేమికులును బాబా యొక్క పుట్టినరోజునాడు వారందరికీ వ్యక్తిగతంగా భగవంతుని ప్రేమలో పుట్టినరోజుగా భావించి ఆ ప్రేమానంద సంద్రమునందు ఓలలాడారు. మూడవరోజున మహాసంతర్పణ జరిగింది.

21వ తేదీ సాయంకాలానికి ప్రేమికులందరు మెహెరాబాద్ విడిచి వారి వారి ఊళ్ళకి వెళ్ళిపోయారు.

జన్మదినోత్సవాలు తరువాత రోజులలో మెహెరాబాద్ కొండమీద బాబా సమాధి భవనానికి పైనవున్న రేకుకప్పు తీయించేసి డోమ్ కట్టించారు. తరువాత స్విట్జర్లాండు దేశస్తురాలైన హెలెన్‌దామ్ అనే కళాకారిణిచేత సమాధిభవనం లోపల గోడలమీద చిత్రలేఖనం చేయించారు. భవనం పైన నాలుగు మూలలలోను సుప్రసిద్ధమయిన నాలుగు మతాలకి గుర్తులు వేయించారు. హిందూమతానికి దేవాలయాకారంలో చిన్న మందిర రూపము, ఒక మూల క్రైస్తవ మతానికి చెందిన సిలువగుర్తు, మరియొక మూల మహమ్మదీయ మతానికి గుర్తు అయిన తార, చంద్రవంక, నాలుగవ మూల జోరోస్ట్రియను మతానికి చెందిన జ్యోతి గుర్తు నిర్మించారు. ఆ సమాధి భవనానికి ద్వారంమీద "మాస్టరీ ఇన్ సెర్విట్యూడ్"- (సేవలో పరిపూర్ణత) అని వ్రాయించారు.

బాబా 25గురు శిష్యులతో సతారా జిల్లాలోని పంచాగ్నివద్ద మార్చి 15వ తేదీ నుంచి మకాం పెట్టారు. అందులో అయిదుగురు పాశ్చాత్యులు కూడా వున్నారు. మెహెరాబాద్‌లో వున్న ధర్మాసుపత్రి, మస్తు ఆశ్రమం మొదలయినవన్నీ అక్కడ

వున్న బాబా శిష్యులే నడుపుతున్నారు. బాబా అందరికి తలొకపని అప్పజెప్పారు. మస్తు ఆశ్రమంనుంచి మహమద్ మస్తుని మాత్రం బాబా వద్ద ఉండటానికి పంచాగ్ని తీసుకువెళ్ళారు. మామూలుగా బాబా మహమ్మద్‌కి ప్రతిరోజూ స్నానం చేయించి భోజనం పెట్టడం వగైరా స్వయంగా చేస్తున్నారు. ఇదివరలో సెప్టెంబరులో ఫ్రాన్సుకి తీసుకొని వెళ్ళినపుడు మహమద్ ద్వారా అటువంటి వాళ్ళందరి మీదకూడా ఆధ్యాత్మికంగా పనిచేస్తున్నానని బాబా చెప్పినట్లు ఇప్పుడుకూడా అలాగే బాబా పని జరిపిస్తూ వుండవచ్చు.

1938 ఏప్రిల్‌తో బాబా పంచాగ్నిలో వున్నారు - మనశ్శాంతిలేక బాబా దర్శనార్థం నాగపూర్ నుంచి దేశముఖ్ భార్య సహితంగా వెళ్ళాడు. అప్పుడు బాబా వద్ద విష్ణుమాస్టరు ఇతర శిష్యులు ఉన్నారు బాబా దేశ్‌ముఖ్‌ను వులికోన వెళ్ళి అక్కడ ఒక గుహలో ధ్యానంచేస్తూ కొన్నాళ్ళుండమన్నారు తరువాత అతడు భార్యసమేతంగా ఏకాంతవాసం చేయాలన్నారు బాబా. ఆ ఏకాంతవాసం చేసేవూరు బాబా ఇదివరలో వెళ్ళని ఊరయివుండాలన్నారు. అందుచేత దేశ్‌ముఖ్ బాసిమ్ అనే గ్రామాన్ని ఎంచుకుని అక్కడ ఏప్రిల్ 25 నుండి జూన్ 25 వరకు రెండు మాసాలు సతీసమేతంగా ఏకాంతవాసం చేశాడు, బాబా చెప్పిన ప్రకారం. ఆ రెండు నెలల కాలంలోను దేశ్‌ముఖ్ మరాటీ భాషలో బాబా జీవితచరిత్ర వ్రాశాడు. ఈ పుస్తకం 1939 సం॥లో ఆదీ కె. ఇరానీచేత ప్రచురించబడింది.

బాబా ఒకమారన్నారు—

"నీటిలో మునిగి పనిచేసేవాడు ప్రత్యేకమయిన దుస్తులు వేసుకుని మునుగుతాడు. అప్పుడు ఏ విధంగా నీరు వాడివంటికి తగలదో అలాగే దివ్యప్రేమ సాధకుని ఈ మాయనుంచి కాపాడుతుంది ఈ మాయకు ముఖ్యమయిన ఏజంట్లు కామ, క్రోధ, లోభాలు. వాటిని ముందు వశపరుచ్చుకుంటేనేగాని భగవంతుని వద్దకు చేరే మార్గంలోనికి ప్రవేశించలేరు." అని చెప్పి బాబా 'అందుచేతనే హెచ్చరిక చేస్తున్నా' నన్నారు.

మెహెరాబాద్‌లో వేడి ఎక్కువగా వుండుటచేత బాబా పంచాగ్ని వెళ్ళినందున మండలి ఎంతో సంతోషించారు. అంతే గాకుండా బాబా అక్కడ ప్రత్యేకమయిన ఆధ్యాత్మికపు పని చేసుకోగలిగారు. బెబ్బులి లోయకు బయటవున్న ఒక బంగాళా బాబా అద్దెకు తీసుకున్నారు. భారతీయ స్త్రీ మండలి పంచాగ్నిలోకూడా ఏకాంతంలోనే వుంటున్నారు. అందరికీ మంచి సదుపాయాలువున్న బస ఏర్పాటుచేసి బాబా

తమ స్వంతం కోసం వంటయింటి ప్రక్కన వున్న చిన్న సామానుగదిలో ఉంటానన్నారు. దానికి కప్పు చాలా క్రిందుగా వుంది. అంటులోకి గాలి వచ్చే మార్గం లేదు. అసలు ఆ యిల్లే కూలిపోతున్నట్లుగా వుంది. అందుచేత బాబా మండలి ఆ గదిని త్వరలో బాగుచేసి బాబా ఉండడంకోసం అందంగా తయారు చేశారు.

మహమద్ మస్తు ఉండడానికి వేరే ఒక గది ఏర్పాటయింది. ప్రతిరోజూ ఆ మస్తుకి స్నానం చేయించడం, బట్టలు ధరింపజేయడం, అన్నం తినిపించడం బాబాకి ఒక పెద్ద పని అయింది.

పంచాగ్నిలో వున్నపుడు బాబా తరచుగా మైసూరు రాష్ట్రంలోని బెంగుళూరుకి, హైదరాబాద్ రాష్ట్రంలోని బెల్గామ్‌కి వెళ్ళి వచ్చేవారు. బాబా నెలకొల్పదామనుకుంటున్న విశ్వ ఆధ్యాత్మిక కేంద్రానికి స్థల నిర్ణయం కోసం ఈ ప్రయాణాలు చేశారు.

పంచాగ్నిలో ఉన్నపుడు ఒకనాడు బయలుదేరి బాబా ప్రతాప్‌గఢ్ కోటను చూడటానికి వెళ్ళారు. ఈ కోట ఛత్రపతి శివాజీ మహరాజ్ నిర్మించినది.

మెహెరాబాద్ ఆశ్రమంలో కొన్ని మార్పులు చేయడం పూర్తి అవుతున్నాయి. ఈ మార్పులు చేయడానికి వీలుగా మెహెరాబాద్ నుంచి వెళ్ళి ప్రాచ్య పాశ్చాత్యమండలి అహమద్‌నగర్‌లో బాబాతో ఆరువారాలు గడిపారు. అప్పుడే వారు పంచాగ్నినుండి వచ్చారు. బాబా అక్కడికి పాశ్చాత్యులను వేసంగిలో తీసుకు వెళ్ళారు.

ఒకరోజున బాబా మధ్యాహ్నం వారున్న బంగాళాలో తమ భక్తులందరను సమావేశపరచారు. గుజరాతీ భాషలో సంభాషణ జరుగుతూవుంది. కొంతమంది పాశ్చాత్యులకు ఆ భాషలో మాట్లాడే మాటలు అర్థం కాలేదు; కొంతసేపట్లో బాబా మండలికేసి తిరిగి "మీరు శ్రద్ధ, విశ్వాసము నమ్మకము-అంటే ఏమి అభిప్రాయ పడుతున్నారు?" అని అడిగారు. బాబాలో విశ్వాసం, గాఢమయిన నమ్మకం కలిగిన అనేకమంది ప్రేమికులు ఆ సమావేశంలో కూర్చుని వున్నారు. బాబా ఆ విధంగా అడగ్గానే ఇద్దరు పాశ్చాత్యస్త్రీలు-"మేము బాబాను ప్రేమిస్తున్నాము, అందు కోసమే ఆయన వద్దకు వచ్చియున్నాము. అందుచేత నమ్మకం ఉంటే యేమిటి? లేకపోతే యేమిటి?" అని జవాబు చెప్పారు. ఈ జవాబు నోటికి ఏదివస్తే అది మాట్లాడినట్లుగాను గర్వోపేతంగాను వుంది. వారి మాటలు పెడసరంగా వున్నాయి. కొంతసేపటికి వచ్చిన భక్తులందరు బాబా వద్ద సెలవు తీసుకుని క్రమంగా అందరూ

వెళ్ళారు. అప్పుడు ఆ యిరువురు పాశ్చాత్య స్త్రీలను చూచి వారిని బాబా చాలా తీవ్రంగా మందలించారు.— "నిజంగా మీరు అనుకున్నట్లు మీరు అభిప్రాయపడి నప్పటికీ మీకు నమ్మకాలతో పనిలేకపోయినా నమ్మకం వున్నవారికి మీరు చెప్పిన మాట గొడ్డలిపెట్టు వంటిది అవుతుందికదా. ఒక కుంటిమనిషి ఉన్నాడనుకుందాం. అతనికి ఊతగా ఒక కర్ర అవసరంకదా. అతడు తన కాలు బాగుపడకుండా ఆ కర్ర అవతల పారవేయలేడు. అలాగే విశ్వాసం కూడాను. అందుచేతనే విశ్వాసం అనేది అవసరం. అందుకే నమ్మకం వుండాలి. దేనిమీద మీరు ఊతగా అనుకుంటారో దానిమీద మీకు విశ్వాసం ఉండాలి" అని బాబా వివరించి చెప్పారు.

ఏప్రిల్ నెలలో పాశ్చాత్యులలో హెడీమెర్టిన్ అనే ఒక ప్రేమికురాలు తన దేశమునకు "కౌంట్‌వెర్డ్ అనే ఓడమీద వెడుతూ బాబాయొక్క శిష్యమండలికి ఒక సందేశాన్ని పంపింది. ఆ సందేశమిట్లున్నది —

> "మీరు బాబాను మీతోనే ఉంచుకోవచ్చుగాని నిజమైన బాబాను నాతో తీసుకుని వెడుతున్నాను. నా శరీరంతోనే నేను వెడుతున్నప్పటికి నా ఆత్మ బాబా వద్దనే ఉన్నదని మీరు బాబాతో చెప్పండి. బాబా లాగ ఈ ప్రపంచంలో ఏదీ లేదు."

బాబా ప్రేమలో ఆమె హృదయము ఎంతగా నెలకొనియున్నదో దీనివల్ల తెలుస్తోంది. — ఆమె బాబాను కొన్ని సంవత్సరాలుగా ప్రేమిస్తుంది. అనేక మారులు ఆయన పాశ్చాత్యదేశాలకు వెళ్ళినపుడు ఆయన సహవాసము చేసినది. ఇంకా ముగ్గురితో క్రిందటి సంవత్సరం జూన్‌నెలలో ఇండియావచ్చి అది లగాయతు పది నెలలు బాబాతో వున్నది. ఇప్పుడు ఆమె స్వదేశమయిన స్విడ్జర్లాండుకి బాబా ఆజ్ఞప్రకారం వెడుతోంది. ఆమె కుటుంబ బాధ్యతలను నిర్వహించడానికి బాబా ఆమెను తన దేశానికి వెళ్ళమని చెప్పారు. ఆమె కుటుంబం కోసం బాబా ఆమెను వెళ్ళమని చెప్పకపోయినచో ఆమె యావజ్జీవము బాబాతో వుండిపోవడానికి సిద్ధంగా వుండెను. అదే ఆమె కోరిక. కాని బాబా తమ శిష్యుల భౌతిక జీవితమునందు ఎంతమాత్రము వారి కర్తవ్య నిర్వహణములో లోపం రాకుండా చూస్తారు. ఎంత కష్టమయినా, ఎంతటి కఠోర నియమాలైనా ఆచరిస్తూ బాబా వద్దనే ఉండుటకు వందలాది ఆయన ప్రేమికులు ఉవ్విళ్ళూరుతూ వుంటారు. బాబాయే సర్వవిధాలా వారి జీవితాలకు మార్గదర్శకులు. హెడీ మార్టిన్ అనే ఈ

స్విట్జర్లాండు వనిత బాబాయొక్క దివ్య ప్రేమ పొందిన కొద్దిమందిలో ఒకతె. ఆమె మీద ఆయన కృప బాగా ప్రసరించింది.

మే (1938) మాసంలో బాబా జబ్బల్‌పూర్ వెళ్ళారు. అక్కడ బాబా అనేక మంది మస్తులను తీసుకురమ్మని జాల్‌భాయ్, కాకా మొదలగువారిని పంపించి రప్పించారు. బాబా స్వయంగా వారికి తమ ప్రేమతోబాటు తమ సేవను కూడా అర్పించారు.

ఒక అభివృద్ధి చెందిన ఆత్మకోసం శిష్యులతో బాబా జబల్‌పూరు నుండి తిరిగి వెడుతూ ఔరంగాబాదు వెళ్ళి అక్కడ నుంచి ఆ మస్తును అహమద్‌నగర్ తీసుకుని వెళ్ళారు. బాబాను చూచి అతడంటాడు—"నా హృదయం తీవ్రంగా మండి పోతూంది. నీవే రగుల్కొలిపావు" బాబాయొక్క సాంగత్యంలో అతని ఆత్మ మేలుకున్నదని అతనిలో బాబా ప్రేమజ్యోతిని వెలిగించారని ఆ మస్తు అన్నాడు. బాబా అతనికి స్వయంగా ఆహారం తినిపిస్తూంటే ఆ మస్తును "నీవు ఎక్కడికి వచ్చావు?" అని అడిగితే ఆ మస్తు "అల్లాకే దర్బార్‌మే ఆయా ఔర్ ఖానాఖాయా" (భగవంతుని ఆ స్థానంలోకి వచ్చాను. భోజనం కూడా చేశాను) అని చెప్పాడు.

బాబా మండ్లలో నెలకొల్పనున్న ఆధ్యాత్మిక కేంద్రము గురించి ప్రజలకు తెలియజెప్పుటకై మే 12 వ తేదీన బాబా బహిరంగసభ ఏర్పాటుచేసి అందు తన శిష్యులను మాట్లాడమని చెప్పారు. ఆ సభలో రాజకుమారి నొరీనా మాచెబెల్లి, కౌంటెస్ నడీనె టాల్‌స్టాయి, డా॥ సి. డి. దేశ్‌ముఖ్ ఉపన్యసించారు.

బాబా జబల్‌పూర్‌లో వున్న సమయంలో హరిద్వార్‌లో ఒక పవిత్ర యాత్రీకుడు బాబా గంగానది మీద ఒక వంతెనమీద నుంచి వెడుతుంటే ఆయన్ను గుర్తించాడు. బాబా భౌతికంగా వెయ్యి మైళ్ళ దూరంలో ఎక్కడో జబల్‌పూర్‌లో వున్నా ఇది జరిగింది. ఈ సంఘటన గురించి మండలి బాబాను అడిగారు. బాబా– "మీతో జబల్‌పూర్‌లోనే నేను వున్నాగానీ హరిద్వార్ నేను వెళ్ళివచ్చాను. అదే సమయంలో ఇతర చోట్లకికూడా వెళ్ళాను" అని వివరించారు.

జబల్‌పూర్‌లో ఉండగానే ఒకనాడు బాబా 'పరిపూర్ణత్వము' మీద ఒక ప్రవచనం చేశారు. —

"ద్వంద్వము లన్నిటికీ తరతమ భేదాలున్నటులే పరిపూర్ణత్వమునకు కూడా ద్వంద్వములకు సంబంధించినంతవరకు అట్టి భేదములున్నవి. చెడు – మంచి, దుర్గు

ణము – సుగుణము, దుర్బలము – బలము, ఇవన్నీ ద్వంద్వాల తరహాలు. కాని నిజంగా అవి తర తమ భేదాలయొక్క ఐక్యతయే. చెడ్డ, చెడ్డ కాదు కాని అతినిమ్న మైన మంచి మాత్రమే అలాగే దుర్బలత్వము అతి తక్కువగావున్న బలమే. పరిపూర్ణత్వంలో కూడా అసంపూర్ణ త్వంతో పోల్చిచూస్తే తర తమ భేదాలున్నాయి. ద్వంద్వాలలో నున్నపుడు ఒక పరిపూర్ణ తలో అన్ని పరిపూర్ణ తలు కలిసి వుండవు. ఒకడు విజ్ఞాన శాస్త్రములో పరిపూర్ణుడయితే ఇతడు సంగీతంలో పరిపూర్ణుడుకాడు. సంగీతంలో సంపూర్ణుడు చిత్రలేఖనంలో సంపూర్ణుడు కాడు. ఈ సంపూర్ణ తలన్నీ ద్వంద్వాల రాజ్యంలోవే. ఈ బాహ్య ప్రపంచంలోవే.

మీరు ఎప్పుడయినా పరిపూర్ణ మయిన నేరాల గురించి విన్నారా? ఉదాహరణకి ఒక హత్య జరిగిందనుకుందాము. అది ఎవరు చేసినదీ తెలుసుకోడానికి ఏ ఆనవాళ్ళూ, ఏ సాక్షులూ లేకుండాచేస్తే దానిని పరిపూర్ణ నేరం అంటారు. ఇలా నేరాల్లోకూడా పరిపూర్ణత వుంటుంది.

ఆధ్యాత్మికత్వంలో పొందిన పరిపూర్ణతద్వంద్వాల రాజ్యంలోకాదు. తరతమ భేదాలు గల పరిపూర్ణత్వాలు అన్నీ బుద్ధికుశలతమీద ఆధారపడి వుంటాయి. ఆధ్యాత్మిక సంపూర్ణత బుద్ధికి అతీతమయినది. ఆధ్యాత్మికంగా సంపూర్ణుడయినవాడు ఉన్నది భగవంతుడే అని భగవంతుడు తప్ప ఇంకేదీ లేదని తెలుసుకుంటాడు. అంతేకాదు. బుద్ధికి సంబంధించినంత వరకు ద్వంద్వాలకి సంబంధించినంత వరకు అంతా మాయ యనికూడా తెలుస్తుంది. విజ్ఞాన శాస్త్రము, కళ, సంగీతము, దుర్బలత్వము, హత్యలు, ఇవన్నీ అతనికి కలలేయగును. అతని సంపూర్ణత్వము, అతని జ్ఞానము ఒక అవిభాజ్యమయిన అస్తిత్వము. ఈ పరిపూర్ణుడు ఆధ్యాత్మిక కారణాల వల్ల తన జ్ఞానమును, తన శక్తి ఉపయోగించుకోవాలనుకుంటే అది కేవలము ఆధ్యాత్మికోద్ధరణకోసమే వుంటుంది. అప్పుడు తన విశ్వమానసమును ఆవిషయము లోనికి జొప్పించి అన్నీ తెలుసుకుంటాడు. దానికి బాహ్య ప్రకటన అవసరం లేదు. ఎందుచేతంటే అన్ని భాషలూ మానసిక పరిమితి నుండియే వచ్చాయి. అవి నోటి ద్వారానే వ్యక్తమౌతున్నాయి. అతడు అందరి మనసులూ తెలుసుకుంటాడు. అలాగే అన్నిటినీ తెలుసుకుంటాడు – విజ్ఞాన శాస్త్రము, కళ మొదలయినవి. కావలిస్తే వ్యక్తము కాని ముందే దేన్నయినా అతడు తెలుసుకో గలడు. అయితే అవసరమయినపుడే అతడు తెలుసుకుంటాడు."

ఇట్లు ప్రవచనం ముగించాక బాబా ఈ క్రింది ప్రశ్నలకి జవాబులిచ్చారు. —

ప్రశ్న : భగవద్గీతలో చెప్పినట్లు ఇంతకు ముందూ తరువాతా జన్మలున్నాయని బాబా నమ్ముతున్నారా?

జవాబు : అవును. అస్తిత్వమంతా కూడా పునర్జన్మ సిద్ధాంతము మీదనే ఆధారపడి వుంది.

ప్రశ్న : శ్రీకృష్ణప్రభువు భౌతికంగాకూడా సంపూర్ణత్వం కలిగినవాడే. మీరు కూడా భౌతికంగా సంపూర్ణులే కదా ?

జవాబు : అది అన్ని సంపూర్ణతలను కలిగి వుంటుంది. కాని వ్యక్తం చేయనవసరం లేదు. కృష్ణుడు ఆధ్యాత్మికంగా సంపూర్ణుడే. అంటే అన్నిటిలోను పరిపూర్ణత కలిగి యుండెనన్నమాట. కాని భౌతిక పరిపూర్ణత అతడు వ్యక్తపరచలేదు. అలాచేస్తే గందరగోళం ఏర్పడుతుంది. అతడు పరిపూర్ణమయిన త్రాగుబోతుగా, పరిపూర్ణ పాపాత్ముడుగా, పరిపూర్ణ వంచకుడుగా కనపడగలడు. కాని అలా చేస్తే ప్రపంచం విభ్రాంతి పొందుతుంది. అందుకు అతడు అవేమీ కనపరచలేదు. వాటిలోనే గాక అన్నింటిలోనూ అతడు సంపూర్ణుడే. అన్నిటి కంటె ఎక్కువగా అతడు సంపూర్ణమయిన దేవుడు.

ప్రశ్న : పరిపూర్ణ హంతకుడుగా కనపడవలసిన అవసరమతనికి యుండెనా ?

జవాబు : (అందుకే నే చెప్పేదీ – వారికి అవసరమైనపుడు ఈ పరిపూర్ణాత్మలు అన్నిటిలోను పరిపూర్ణత్వం వ్యక్తం చేస్తారు. నేను ఎటువంటి జీవితంలోనయినా సంపూర్ణత్వం కలిగి యుండగలను, అయితే కేవలం పరిపూర్ణత్వం చూపించడానికికాదు. ఆధ్యాత్మికోద్ధరణ కోసం అయితేనే నేను పరిపూర్ణత్వం ఉపయోగిస్తాను. సంపూర్ణత్వం దాని ఉన్నత రూపంలో అన్ని భావాలలోనూ – భోగంలో, యోగంలో, రాగంలో, విరాగంలో అన్నిటిలోనూ సంపూర్ణత్వం కలిగి వుంటుంది.)

ఈ చర్చ అయిన తరువాత బాబా ప్రధానమయిన విషయాల గురించి తమ నిరుపమాన విధానంలో వివరించి చెప్పారు. ఆ ప్రశ్నలడిగిన ఆసామీతో —

బాబా – ఇంతకీ మీకు నిజంగా కావలసింది ఏమిటి ?

అతడు – నేను ఒక సంపూర్ణ గురువుకోసం అన్వేషిస్తున్నాను. ఎవరయితే నాకు తృప్తిని కలిగించి నన్ను సంపూర్ణుని చేయగలడో అతని కోసం.

బాబా - నేను ఒక సంపూర్ణ శిష్యుడుకోసం చూస్తున్నాను ఎవరు నాకు తృప్తిని కలిగిస్తాడో వానికోసం. కాని నాకు ఒక్కడూ కనిపించడంలేదు. నీ కసలు ఏమి కావాలి ?

అతను - (కంగారు పడుతూ) నేను భౌతిక పద్ధతులద్వారా, ఆధ్యాత్మిక సంపూర్ణత్వం పొందాలి. మొదట ఆకలితో బాధపడుతున్న నా సోదర మానవులను ఉద్ధరించాలి. తరువాత ఆధ్యాత్మిక ఉద్యమం ప్రారంభించాలి.

బాబా - అవును. సరిగా చెప్పావు. ప్రజలు ఆకలితో బాధపడుతూవుంటే ఆధ్యాత్మికత్వం ఎలా బోధచేస్తావు ? వాళ్ళు వినరు. పదిహేను రోజులయాక రా. అప్పుడు నీకోసంగతి చెబుతాను. సులభమైన విషయం. - అన్నారు.

మే 15 వ తేదీన బాబా జబల్‌పూరు వదలి మెహెరాబాదుకు ప్రయాణమైనారు. బాబా శిష్యమండలి కొందరు ఒక పెద్ద బస్సులోనూ కొద్దిమంది బాబాతో కారులోనూ బయలుదేరారు. వేసంగి యగుటచే తెల్లవారుజామున 4 గంటలు మొదలు ఉదయం 10 గంటల వరకు సాయంకాలం 5 గంటల నుంచి రాత్రి 9 గంటల వరకు ప్రయాణం చెయ్యాలని బాబా నిశ్చయించుకున్నారు. దారిలో ఔరంగాబాదులో ఆగి అక్కడకు సమీపంలో వున్న ఎల్లోరా గుహలు చూసే అవకాశం పాశ్చాత్య ప్రేమికులకు కల్పించారు బాబా. వారికి ఆ గుహలను బాబా స్వయంగా చూపించారు. తరువాత బాబా ఔరంగాబాదునుంచి అహమద్‌నగర్ తిరిగి వెళ్ళారు. తరువాత అహమద్‌నగర్‌లో బయలుదేరి పూనాకి, తలెగామ్‌కి అక్కడ నుంచి లోనావలాకి వెళ్ళారు. లోనావలా బొంబాయికి 80 మైళ్ళు వుంది. అది ఒక కొండ ప్రదేశమునందున్న అందమయిన పట్నం. అక్కడ బాబా నాలుగు రోజులున్నారు, అక్కడ వాతావరణం చల్లగా వుంది. పూనా నుండి తలెగామ్ నుండి బాబా శిష్యులు భక్తులు బాబా దర్శనార్థం లోనవలా వచ్చారు.

మే 25 వ తారీకు ఉదయం లోనవలా వదలి బాబా తలెగామ్ వెళ్ళి అక్కడ అబ్దుల్ కరీం అబ్దుల్లా (రంజూ) యింటిలో అల్పాహారాలు తీసుకుని 11 గంటలకి మెహెరాబాదు చేరుకున్నారు.

1938, జూలై మాసంలో బాబా తమ కుటీరంలో మండలి వారి నందరిని సమావేశపరిచారు ఒకనాడు. ఆ సమావేశంలో ఇప్పుడు మదరాస్‌లో సంపత్తయ్యంగారి సంపాదకత్వంలో నడుపబడుతున్న మెహెర్ గెజెట్ అనే త్రైమాస పత్రికను

ఆపుచేసి దాని స్థానంలో 'మెహెర్‌బాబా జర్నల్' అనే పేరుతో ఒక మాసపత్రిక ప్రారంభించి ప్రచురించాలని నిశ్చయించి బాబా ఈ క్రింద పేర్కొన్న ఎనమండుగురిని సంపాదక వర్గంగా నియమించారు.

1. రాజకుమారి నోరీనా మాచెబెల్లీ
2. ఎలిజబెత్ సి. పాటర్సన్
3. అబ్దుల్ కరీమ్ అబ్దుల్లా
4. ఎఫ్. హెచ్. దాదా చాన్‌జీ
5. డా॥ ఎస్. అబ్దుల్‌గనీ మున్సిఫ్
6. ఎస్టెల్ (నానీ) గేలీ
7. ఆదీ కే. ఇరానీ
8. సి. వి. సంపత్తయ్యంగార్.

బాబా ఈ మాసపత్రికను అహమదునగర్‌లోనే ముద్రణ చేయించి అక్కడ నుంచే అక్టోబరు మాసం నుంచి ప్రచురణ అయే ఏర్పాటు చేశారు.

1938, ఆగస్టులో మెహెరాబాదు కొండమీద బాబా మండలి వారందరికీ ఇలా చెప్పారు. అప్పుడు కొందరు పాశ్చాత్య శిష్యులు కూడా వున్నారు.

"నేను అన్నిటిలోనూ వున్నాను. ఘనమైన వాటిలోను అల్పమైన వాటిలోను కూడా వున్నాను. అన్నీ కూడా వట్టివే. శూన్యమే. అందుచేత నేను వాటికి ప్రాధాన్యత ఇవ్వడమెందుకు? పిచ్చివారి సేవచేయడంలో నేను పొందే ఆనందము, నా మండలితో వున్నపుడు, నా ప్రతినిధులకు పని పురమాయించేటప్పుడు, నేను నా విశ్వకార్యం చేసుకునేటప్పుడు, హెడీకి కోడిగుడ్లు తెచ్చియిచ్చేటప్పుడు, మీ అందరకు వచ్చిన ఉత్తరాలు తెచ్చియిచ్చేటప్పుడు కూడా అటువంటి సంతోషమే పొందుతాను. చిన్ననాటి నుండి మనం తప్పించుకోలేము. భగవంతుడు తప్ప మిగతావన్నీ అల్పమయినవే.

మీరు ఏం చెయ్యాలంటే - విరాగం కలిగి వుండాలి. అల్పమయిన వస్తువులను ఉపయోగించండి. కాని అల్పమయినవని తెలుసుకుంటూ వాటిని వాడండి. వాటి యెడల ఆసక్తి, రక్తి కలిగి వుండకండి.

ఉదాహరణకి—కట్టించుకున్న పళ్ళు భోజనం చేయడానికి అవసరం. మీ నోటిలో వాటిని తగిలించుకుంటారు. అవి కట్టించుకున్నవని మీకు తెలుసును. నోటి నుండి వాటిని తీసివేయగలరని కూడా తెలుసు. అలా మీరు వాటిని ఉపయోగిస్తారు.

కళ్మలంతో కూడిన శరీరాన్ని నడిచే పాకీదొడ్డి అంటారు. ఆత్మను సాక్షాత్కరింపజేసుకోడానికి మనం శరీరాన్ని ఒక ఉపాధిగా ఉపయోగించాలి. ఈ దేహాన్ని మీరు తప్పించుకోలేరు. దానికి పట్టే చెమటను తప్పించలేరు. అందుచేత ఏం జేస్తారంటే ఆ చెమటను కడిగేసుకుంటారు-అంతేగాని రోజంతా దాన్ని గురించి నాకు చెమట ఎందుకు పడుతోంది? దానివల్ల ఏం లాభంలేదు-గనుక నాకు చెమట పట్టకూడదు అని ఆలోచిస్తూంటే ఏం ప్రయోజనం? నీవు తప్పించుకోలేవు కానీ నీవు శరీరం గురించి ఆలోచించకుండా విరాగంతో ఉండగలవు." అని బాబా చెప్పారు.

మెహెరాబాదులో కొండమీద రాతి పునాదితో కట్టినది ఒక పెద్ద నీళ్ళ తొట్టి (రిజర్వాయర్). అది బ్రిటిష్ సైనిక పటాలం అక్కడ ఉన్నపుడు ఉపయోగించేవారు. వాళ్ళు వెళ్ళిపోయిన తరువాత బాబా వారిపనికోసం ఈ ఆస్తి తీసుకున్నారు. 1938 వ సంవత్సరంలో ఈ రిజర్వాయిర్ పైన రెండు గదులు వేసి మేడకట్టారు. అందులోనుంచి క్రిందకి మెట్లదగ్గర రెండు ద్వారాలు పెట్టించారు. పైన రెండు గదులలోను ఒకటి సామాను గదిలా ఉపయోగిస్తున్నారు. రెండవది మామూలు పడకగది. రిజర్వాయిర్ వెనుక రేకుల వసారా వేశారు. నేల పేడ మట్టి కలిపి బాగా అలికించారు.

ఈ కట్టుబడి, యిళ్ళకి మరమ్మతు వగైరా, ఆగస్టు 25 వ తారీకుతో పూర్తి అయింది. 28 వ తారీకున బాబా మెహెరాబాదు కొండమీదకు ఈ పనులన్నీ చూచి రావడానికి వెళ్ళారు. ఆ సమయంలోనే బొంబాయినుంచి ఒక భక్తుడు ఒక బంగారు కిరీటం చేయించుకు తీసుకువచ్చి బాబాకి కానుకగా బహూకరించాడు. బాబా మెహెరాబాదులో చేసిన యిళ్ళ మరమ్మతు వగైరా బాగుందని మెచ్చుకొని ఆ పనిచేయించిన కంట్రాక్టరుకి పనివారికి, బాబా పూలదండలు వేసి సన్మానించారు. ఆ రోజునే కొత్తయిళ్ళలోకి ప్రవేశం చేయించారు బాబా. ఈ సందర్భంలో ఒక భండారా కూడా జరిపించారు బాబా. ఆ విందులో పాల్గొన్న పనివారికి అందరికి స్వయంగా ఆహారపదార్థాలు వడ్డించారు బాబా.

1938 సెప్టెంబరులో బాబా అహమదునగర్‌లో ఉంటూ మెహెరాబాద్ ఆశ్రమానికి ప్రతిరోజూ వెళ్ళివస్తూ వుండేవారు. అక్కడవున్న ఆశ్రమంలో మస్తులు పిచ్చివారు. అంతాకలిసి 35 మంది వుండేవారు. వీరందరికీ బాబా ఆధ్యాత్మిక చికిత్స చేసేవారు.

తిరిగి అందరూ మెహెరాబాద్ వచ్చిన తరువాత 1938 సెప్టెంబరు 25 వ తేదీని ఒక అసాధారణమయిన నాటకం పురుషుల ఆశ్రమంలో ఆడించారు. అసాధారణం ఎందుచేతంటే ఇందు పాత్రధారులందరూ పిచ్చివారూ, మస్తులూనూ, ఆ నాటకం పేరు రాజాగోపీచాంద్. ఈ నాటకం చూడటానికి 200 మంది ఆహ్వానితులు వచ్చారు. నాటకం ప్లీడర్ అనే బాబా శిష్యుడు నిర్వహించారు. రాజాగోపీచంద్ భగవదన్వేషణలో తన రాజ్యం సర్వస్వం వదులుకుంటారు. ఇదే ఆ నాటకంలో ఇతివృత్తం. ఈ పిచ్చివారూ, మస్తులూ అసలు ఒకరితో కలిసి ఇంకొకరు అయిదు నిమిషాలయినా కూర్చోరు. వారికి అంతపాటి స్థలంలేదు. అలాటివాళ్ళు నాటకం ఆడారంటే వారికి శిక్షణ యిచ్చిన ప్లీడర్ చాకచక్యం చాలా గొప్పది అని చెప్పక తప్పదు. వారి భాగాలు చక్కగా చెప్పడమేగాక పాటలు కూడా పాడారు ఆ నాటకంలో. వారికి శిక్షణ యిచ్చేటప్పుడు నిరంతరము బాబా యొక్క పర్యవేక్షణ వుండేది. నాటకం జయప్రదంగా నడిచింది అంటే దానికి అసలు కారణం బాబాయే.

నాటకంలో ఒకచోట ఒకపాత్రధారి నాటకంలో ఉన్నదానికి కొంచెం భిన్నంగా ఒకచోట ప్రవర్తించారు.

ఆత్మ పరమాత్మతో మొరపెట్టుకుంటోంది. అప్పుడు అందులో లేని మాటలు ఆ భక్తిపారవశ్యంలో ఇలా అన్నాడు—

"నేను నీ పాదాలకు మ్రొక్కుతాను. నా ప్రాణాలు నీకు ధారపోస్తాను. నీకోసం మరణిస్తాను!"

ఈ నాటకం జయప్రదంగా జరిగిందానికి గొప్ప విశిష్టత ఉందన్నారు బాబా.

ఈ నాటకం అయిన కొద్దిరోజులలోనే మెహెరాబాద్ కొండమీద ఆడ రోగులకు ప్రత్యేకంగా ఒక ఆస్పత్రి నెలకొల్పారు బాబా. ఒక ఆడ డాక్టరుని ఆ ఆస్పత్రిలో బాబా నియమించారు. ఆమెక్రింద పనిచేయడానికి కొంటెస్‌నడీని టాల్‌స్టాయ్‌ని మేట్రన్‌గా నియమించారు. వారికి ఇతర ప్రాచ్య పాశ్చాత్య స్త్రీలు సహాయం చేస్తున్నారు. ఆస్పత్రిలో ఇచ్చిన మందులకంటె బాబాయొక్క ప్రేమానురాగాలచేత

ముఖ్యంగా వారి ఆశీర్వాద బలంవల్లా రోగులకు ఆరోగ్యం చేకూరేది. ప్రసూతి వైద్యం చేయడానికి కూడా ఆ ఆసుపత్రిలో ఒక భాగం వుంది. అందులో మొదటి శిశువు ఒక బీదరాలికి జన్మించినది. మెహెరాబాద్‌కి 25 మైళ్ళ దూరంలో కొందరు బాబా ప్రేమికులు ఆమెను చూచి ఆమె దిక్కులేని తనానికి కనికరించి మెహెరాబాద్ కొండపైకి తీసుకువచ్చారు. ఆమెకు కలిగిన శిశువుయొక్క రోదనము విన్న వారిలో మొదటివారు బాబాయే. ఆ శిశువుకు తగిన జాగ్రత్తకోసం ప్రత్యేకంగా బాబా ఆజ్ఞలను జారీచేశారు. బాబా ఆ శిశువును తరచుగా చూచి దానితో ఆడేవాడు.

ఈ ఆసుపత్రిలో పనిచేసేవారు నిజమైన నిస్వార్థసేవ అంటే ఏమిటో తెలుసుకున్నారు. వారికి బాబా ఇలా చెప్పారు.

> "ఇతరులకి సేవచేస్తూంటే వారికి నీవేదో ఉపకారం చేస్తున్నానని అనుకోకు. వారికి నీవు సేవచేయడానికి నీకు వారు అవకాశం యిచ్చి నీకే వారు ఉపకారం చేశారు. నిజంగా, అందుకు నీవు సంతోషించాలి."

అలాటి సేవ బాబాయే తరచుగా చేసి చూపిస్తూంటారు. ఒక పరిచారకునివలె చేసే ఈ సేవలోనే ప్రభువు యొక్క గొప్పతనం ఇమిడి యున్నది. బాబా అవిచ్ఛిన్నంగా ఆస్పత్రి రోగుల మీద వారి జాలిని, కృపా రసాన్ని ప్రవహింప చేస్తూ వుంటారు.

స్త్రీ మండలి మెహెరాబాద్ కొండమీదకి తిరిగి వచ్చేసరికి వారు ఇదివరకు నివసించిన మేడమీద ఇంకొక అంతస్తు కట్టబడివుంది. ఈ రెండవ అంతస్తుమీద ఎనమండుగురు పాశ్చాత్య స్త్రీ శిష్యురాండ్రు పడక గదులు ఏర్పాటు చేసుకున్నారు. ఒకరి గదికి ఇంకొకరి గదికి మధ్య సన్నని తెరలు అడ్డువేసుకున్నారు. నాసిక్ ఆశ్రమ్‌లో వారు అనుభవించిన సుఖాలు ఇక్కడ లేవు. ఆ సదుపాయాలు ఇక్కడ లేవు. ఒకామె "ఇప్పుడే బాగుంది ఏమీ లేకపోతే" అంది నిర్లిప్తంగా.

బాబా వద్ద ఉన్న పెంపుడు జంతువులతో బాబా ఒక జంతుశాల ప్రారంభం చేశారు. వాటికి వారి మండలిని, పాశ్చాత్య స్త్రీ మండలిని రక్షకులుగా వుంచారు. ఆ జంతువులశాలలో—

ఒక గాడిద, ఒక కోతి, ఒక బాతు, ఒక పాము, ఒక మేక, ఒక మైనాపక్షి. ఒక నెమలి, ఒక లేడి, ఒక పంది, ఒక పిల్లి, రెండు కుక్కలు ఉన్నాయి. వీటికి రోజూ రెండు మాట్లు తిండి పెట్టాలి. ఈ పని బాబా ఇద్దరు పాశ్చాత్య స్త్రీలకు

అప్పగించారు. కోతిని ప్రత్యేకంగా నోరీనా సంరక్షణకి అప్పగించారు. కోతి ఎప్పుడూ ఆమెతోనే వుండాలి. ఒక్కొక్కప్పుడు అది ఆమె పక్కమీద పరుండేది కూడాను. ఇలా ఈ జంతువులను పెంచడంలో బాబా ఏదో జంతులోకానికి ఉపకారంగా ఆధ్యాత్మికంగా పని చేస్తున్నారని అనుకోవాలి.

పాశ్చాత్య శిష్యులు వచ్చిన రోజుల్లో ఒకరినొకరు కోపగించుకుంటూ కష్టాలు పెట్టుకుంటూ ఉండేవారు. అప్పుడు బాబా వారితో అన్నారు—

"మీరు ఒకరినొకరు ప్రేమించుకోలేకపోతే,
మీరు పట్టు వదలండి. అదేనా నేర్చుకోండి.
మీలో కోపం పెరిగినప్పుడు నవ్వడానికి,
లేచి నాట్యం చేయడానికి ప్రారంభించండి.
లేకపోతే బయటికి ఒక్క నిమిషం అలా వెళ్ళిరండి. మీ మనసులాని
ఉద్వేగాలు చల్లారేదాకా, ఎలాగైనా వాటిని మీరు నిగ్రహించాలి."

గతించిన దానిని గురించి ఆలోచిస్తూ కూరోవ్చవడమూ, ఎప్పుడూ విచారంగా వుండడము బాబా ఒప్పుకునేవారు కాదు. అలా వుండడం ఆయనకి అసలు ఇష్టంలేదు. అలా చేస్తూంటే వారి మనసులకి బాబా పంపించే ఆధ్యాత్మిక జీవన తరంగాలు తగలవు.

ఒకరిని జూచి ఒకరు ఓర్వలేక పోవడం అంటే అసూయపడడం బాబా గర్హించేవారు. లీలామాత్రంగా ఈ గుణం ఎవరిలోనయినా కనిపిస్తే బాబా అది వెంటనే పైకి కక్కేలా చేసేవారు. కక్కేసి ఆమెలో అది నిర్మలం చేసేవారు. క్రమంగా అడుగడుగుకీ వారిని మంచి త్రోవకు తీసుకువెళ్ళి ప్రేమయుతమయిన దివ్యజీవనంలో దింపేవారు వారిని.

ధనం కోసం తాపత్రయపడే గుణంకాని, ఆస్తి పోగుచేసుకోవాలనిగాని ఒకరిలో ఆలోచనలు బయలుదేరితే పరిస్థితులు అవి పైకి వచ్చేలా చేసేవి. అప్పుడు బాబా వారిని ఆ గుణాన్ని అధిగమించేలా చేసి వారిని ప్రాపంచిక ఆస్తుల మీద మమకారం లేకుండా చేసేవారు. బాబా అనేవారు—

"ప్రేమ కోసం మీరు అన్నీ వదిలెయ్యండి. నాదంతా మీదే. మీరు నా స్వంతమే. నా వాళ్ళని నేను చూసుకుంటాను. వారి బాధ్యత నాది."

అనేవారు. ఒక వస్తువు మీద మమకారం పెంచుకుంటే ఆ వ్యక్తి యొక్క జీవితం పరిమితమైపోతుంది. మనం చేసిన కర్మయొక్క ఫలితాల కొరకు ఎదురు

చూస్తూంటే ఆ మానవుని జీవితంలో జీవనతరంగాలు స్వేచ్ఛగా ప్రవహించవు బాబా అంటారు "మనం చేసే ప్రతి కార్యము కూడా ఒకరికి పనికి వచ్చేలా వుండాలి. ఒకరి సేవకై వినియోగపడాలి. నీకేదయినా క్లిష్ట సమస్య వస్తే ఇతరులకు ఎక్కువ లాభం ఎక్కువ ఉపకారం కలిగేదే చేయాలి. ఉదాహరణకి—మూడు పిల్లలను రక్షించేందుకు ఒక కుక్కను చంపవలసివస్తే. మీ ఆలోచన పిల్లల రక్షణకే వినియోగ పడాలి. నీవు చూపే కార్యం మీద నీ మనసును పెట్టుకొని నేనే చంపాను అని అనుకోబోకు. దాని మీద అనాసక్తంగా వుండు.

"నీవు హింసకి నీ మనసును ఈయవద్దు. అహింస గురించి నీవు ఆలోచించి బాధపడవద్దు. అవసరమయితే పోట్లాడు, కానీ నీ ఉద్దేశం పరోపకారమే ఇతరులకు సహాయ భూతంగా ఉండడమే అయివుండాలి. నీలో ప్రవహిస్తున్న దివ్య జీవనం కోసం నీవు భోజనం చెయ్యి. కాని భుజించడంలో ఉండే ఆనందం కోసం కాదు. అప్పుడే నీవు అన్ని కోరికలకు అతీతుడవు కాగలవు. ప్రేమకి మాత్రమే ఆసక్తుడవై అప్పుడు ఉండగలవు."

వారి శిష్యులను ఎల్లప్పుడు వారు బాబానే, సజీవుడయిన అవతార పురుషునే స్మరిస్తూ, ఆయనయొక్క దివ్య చైతన్యంతో ఆ విధంగా సంబంధం ఏర్పరచుకొని వుంటూ వుండాలని చెప్పేవారు బాబా.

బాబా అనేవారు—"ఎల్లప్పుడూ నన్ను గురించే ఆలోచిస్తూ వుండండి—మీరు ఏ పని చేస్తున్నాసరె, అప్పుడు మీరు క్రమేణా నేను మీద్వారా అన్నిపనులూ చేస్తున్నానని గ్రహిస్తారు. నేను కర్తని, మీరు కాదు. ఫలితాలతో మీకు పనేముంది? నేనే చేస్తున్నానని మీరు పని చేయండి."

ఈ విధంగా నిత్యజీవితములో వారికి సరియయిన అవగాహన కలిగేలా సేవలో నిపుణత్వం కలిగేలా, వారి భక్తిలో నిస్వార్థంగా వుండేలా, వారి స్వంతం గురించి ఆలోచనే లేకుండా వుండేలా, బాబా వారి శిష్యులను మలచారు. భగవన్మానవునితో ఈ విధంగా వారు చైతన్యంతో ఏకమైపోయేలా బాబా వారికి శిక్షణ నిచ్చారు.

బాబాను సేవిస్తూ వుంటే ఆయన శిష్యునికి, ఆయన భక్తునికి, ఆయన ప్రేమికునికి, బాబా యొక్క విశ్వకార్యంలో పాల్గొనే అవకాశము ఆయన యొక్క బాధను పంచుకునే అవకాశము కలుగుతుంది. కాని అలా బాధను పంచుకుంటే బాబా యొక్క బాధ కొంచెం తగ్గుతుంది కదా మనం బాధ పడినా ఆయన సంతోషి

స్తారు కదా అనే ఆలోచన ఎంతమందికి కలుగుతుంది? బాబా ఆనందమే మన ఆనందం అని అది ఒక తీయనైన బాధ అని మనం అనుకుంటేనే తప్ప బాబా చెప్పినట్లు మనం చేయలేము. ఈ విధమయిన మహోత్కృష్టమయిన శిక్షణ యిచ్చారు బాబా వారి శిష్యబృందానికి. ఈ విశ్వకార్యంలో బాబా పడుతున్న బాధ పంచుకోవడంలో తన భక్తునికి ఏదయినా బాధకలిగితే అతడు అర్థం చేసుకోలేక ఈ బాధ ననుభవించేటపుడు వాని మనస్సులో అబ్బా! బాబా ఈ బాధ లేకుండా చెయ్యరాదా అని ఆ బాధ భరించలేక అఘోరిస్తూంటే బాబా అతనిని గర్హించరు. వానికి సరియయిన అవగాహన లేకపోయిందని వానిమీద జాలిపడతారు. ఇలా బాధ పడడం ఆ ప్రేమికునికి కలిగిన మహదవకాశం అని తరువాత తెలుస్తుంది వానికి. అందుచేత బాబాను తలుచుకొంటూ ఏ బాధ అయినా ఆనందంతో అనుభవించాలి. తద్వారా మన ప్రారబ్ధ భారం తగ్గిపోతోందని గుర్తించుకోవాలి.

బాబా మస్తు ప్రయాణాలలో మస్తుల సేవచేసి వారిని పంపిస్తూ వుంటే బాబా యొక్క ప్రేమ ప్రవాహంలో ఆ మస్తులు బాగా తడిసి నూతన తేజంతో బాబావద్ద సెలవు తీసుకుని వారు వెడుతుంటే వర్షంలో తడిసి దుమ్ము అంతా కడిగివేసి నట్లయిన చెట్ల ఆకులు తళతళా ఎట్లా మెరుస్తాయో అలా వున్నారని ఒకమారు ఎలిజబెత్ పాటర్సన్ వర్ణించింది. వారి వదనాలలోని దివ్యమైన ఆ ఆనందం కప్పి పుచ్చుదామంటే అది దాగుతుందా? వారిలో అణువణువులోంచి విరాజిల్లుతోంది.

ప్రపంచంలోని అల్లకల్లోల పరిస్థితినిబట్టి యుద్ధం సంభవిస్తుందని వదంతులు వ్యాపింప జొచ్చినాయి.

1938 సెప్టెంబరు 30వ తేదీన మ్యూనిచ్ ఒడంబడిక జరిగింది. బాబా ఒక రోజున చెప్పారు—"ఫిబ్రవరిలో రానీ నవంబరులో రానీ లేక డిసెంబరులో రానీ ఎప్పుడో యుద్ధం రాక తప్పదు. దేశనాయకుల వాగ్దానాలన్నీ మరపించేలా చేయ డానికి ఏదో జరుగుతుంది. ఈ మాటు ఒక కొత్త అంశం గూర్చి తగాదా వస్తుంది. పోలెండుకో రష్యాకో సంబంధించినది. యుద్ధానికి సిద్ధమవడానికి అయిదు నెలల కాలం పడుతుంది. అలాగే నా వ్యక్తీకరణకి కూడా. యుద్ధం జరుగుతూ వుంటే అప్పుడు నేను మాట్లాడతాను. అది ఫిబ్రవరిలో ప్రారంభం అయితే నేను జూలైలో మాట్లాడుతాను.

ప్రపంచ శాంతి గురించి మాటలు చెప్తుతారు. ఆధ్యాత్మికంగా చూస్తే యుద్ధము శాంతి ఇవేమికావు. ఏదయినా ఒకటే. కాని బాహ్యంగా యుద్ధం చాలా ఘోరమయినది. ప్రపంచంలో ఆధ్యాత్మిక విప్లవం రావడానికి తప్ప నేనెందుకు యుద్ధం రానిస్తాను? అన్నారు.

బ్రిటిషు ప్రధానమంత్రి గురించి మాట్లాడుతూ బాబా—"అతడు ఈనాటి వీరుడు. అతడు మంచివాడే కాని వృద్ధుడు" అన్నారు.

మెహెరాబాద్‌లో ఉన్నపుడు బాబా విల్ బాకెట్ అనే లండన్ భక్తుడికి 1938 అక్టోబరు 31వ తేదీన ఒక ఉత్తరం వ్రాశారు. అందులో ఆయన అంటారు—

"............కొంతమందికి నా శిష్యుల ద్వారానే నన్ను తెలుసుకోవడం ఎక్కువ ఉపకారంగా ఉంటుంది. భగవంతుని మానవత్వం అందరికీ అర్థంకాదు. భగవంతుడంటే ఇదివరకే వారికి ఏర్పడిన అభిప్రాయాల వలన, మానవ రూపంలో వచ్చిన భగవంతుని అనుసరించడం ఆయనకు విధేయత చూపడం కొంతమందికి చాలా కష్టమవుతుంది....... ........"

"అందుచేత కొద్దిమందికే ఒక సద్గురువును శరీరంతో సాంగత్యం చేసే అదృష్టం కలుగుతుంది సిద్ధంగా వున్నవారందరూ ఈ భాగ్యం పొందగలుగుతారు."

ఒక రోజున లండన్ నుంచి ఒక భక్తుని వద్ద నుంచి కొంత ద్రవ్యం బాబాకు కానుకగా వచ్చింది. అది ప్రేమతో అంగీకరించి బాబా ఆ రోజునే ప్రారంభించిన ఆసుపత్రికి వినియోగించారు. ఈ సంగతి బాబా ఈ లేఖలో ఇప్పుడు వ్రాశారు —

"జీసస్ వలెనే నేను ప్రపంచమునకు కొంత పని చేయవలసి యున్నది. కాని ఐహిక ధనాలు ఏమియు నా వద్ద లేవు. అయినా భగవంతుని పని ఏ విధంగాను ఏ కారణం చేతను ఆగిపోదు. ధనం లేకపోవడం చేత పని ఆగిపోయేటట్లుగా వున్నప్పుడు ఎక్కడి నుంచో ధనం వస్తుంది. ఇప్పుడు నీ వద్ద నుంచి కొంత సొమ్ము వచ్చింది గనుక ఈ రోజున ప్రారంభించిన ఆస్పత్రికి కావలసిన పరికరాలు తెప్పిస్తాను."

బాబా వారి మండలికి ఈ సందర్భంలో యిలా చెప్పారు —

"వారంతట వారు మిక్కిలి ప్రేమతో నాకు యిచ్చిన సొమ్ము నాకు చాలా సంతోషాన్ని కలుగచేస్తుంది. దానివలన నేను బాధపడే మానవులకు చేసే సహాయం అలా వుంచండి. నేను అనంతుడను, శాశ్వతుడను. అయినా నేను కావాలని నన్ను

పరిమిత పర్చుకుంటున్నాను. అందుచేత చేతిలో డబ్బు లేనప్పుడు నా పని కూడా పరిమితము అగుచున్నది. అదే సమయంలో నేను ఎన్నుకుని నా వద్ద పెట్టుకున్న వారు నాకు సహాయం చేయడానికి ఎప్పుడూ సిద్ధంగా వుంటారు. నాకు కావలసి నపుడు నాకు ధనం ఏదో విధంగా కలుగుతుంది."

ఒక రోజున మన్మాడ్ మీదుగా బొంబాయి వెడుతూ బాబా ఆయన శిష్యుడు రైలులో కూర్చున్నారు. మన్మాడ్ రాగానే అందరూ దిగిపోయారు. వారిద్దరే ఆ పెట్టె కంతకీ వున్నారు. ఆ పెట్టె బొంబాయి వెళ్ళే దారిలో వున్న దేవలాలి స్టేషన్‌లో తీసేస్తారని వారికి తెలియదు. రైలు అధికారు లెవరూ వారితో చెప్పలేదు. వీరితో సామాను ఇంకా చాలా వున్నది. బొంబాయి నుంచి వీరు వాయవ్య రాష్ట్రానికి వెళ్ళవలసి వుంది. మిగిలిన మూడవ తరగతి పెట్టెలన్నీ చాలా క్రిక్కిరిసి వుండుటచేత బాబా ఆయన శిష్యుడు ఒక రెండవ తరగతి పెట్టెలోకి ఒక పేముబుట్టతో వెళ్ళి ఎక్కి కూర్చున్నారు. ఇంకా కొంతమంది బాబా మండలి మూడవ తరగతి పెట్టెలలో అక్కడా అక్కడా సర్దుకుందామని వెళ్ళారు. అందరూ ఎక్కారో లేదో చూడమని బాబా ఆయన శిష్యునితో అన్నారు. శిష్యుడు చూచి ఇంకా ఎక్కడానికి తంటాలు పడుతున్నా రన్నాడు అతడు. గార్డు ఈల వేస్తున్నాడు. వెంటనే దిగిపోదామన్నారు బాబా వాళ్ళు ఎక్కలేక పోయారు గనుక. బాబా దిగిపోయారు. ఆయన దిగాక శిష్యుడు క్రిందికి దూకేశాడు. వీరు దిగారు. రైలు వెళ్ళిపోయింది. కాని మిగిలిన వారంతా ఎలాగోలాగు రైలెక్కేశారు. అది వెళ్ళిపోయింది. కొన్ని గంట లయిన తరువాత గాని మళ్ళీ ఇంకో రైలు అటు వెళ్ళదని తెలిసింది. అదయినా చాలా నెమ్మదిగా ప్రతిచోట ఆగుతూ వెడుతుందట. ఇక్కడ వుండి ఏం చేస్తామని లావిట్ అని అయిదు మైళ్ళ దూరంలోని ప్రక్క స్టేషన్‌కి వెడదామన్నారు బాబా. ఒక టాంగా మాట్లాడారు వీరిరువురు లావిట్ వెళ్ళడానికి. ఆ గుఱ్ఱబ్బండి వానికి దారి తెలియక బండిని ఎక్కడికో అడివిలోకి తీసుకు వెళ్ళాడు. అదృష్టవశాత్తు అక్కడి నుంచి కొంచెం దూరంగా రైలు మార్గం కనిపిస్తుంది. ఇంక దారి తెలియదని దిగిపొమ్మన్నాడు వాడు. బాబా వాడికి మాట్లాడుకున్న కిరాయి కాకుండా ఇంకా కొంచెం వాడికి ఎక్కువ యిమ్మన్నారు. అలాగే ఇచ్చి బాబా శిష్యుడు బండి వాడిని పంపించేశాడు.

అక్కడ నుంచి బాబా, శిష్యుడు రైలు మార్గం మీద నడక ప్రారంభించారు. కూడా వున్న పేముబుట్ట బాబా మోస్తానని పట్టు బట్టారు. అది శిష్యుని చేతికి యివ్వలేదు. అలాగే ఆయన బుట్టను నెత్తి మీద పెట్టుకుని ముందు నడుస్తుంటే

ఆయన శిష్యుడు వెనకాల నడుస్తున్నాడు. అస్తమిస్తున్న సూర్యుని రశ్మి ఆయన జుట్టు మీద పడుతూంది. అందుచేత బాబా కేశాలు బంగారు వర్ణంగా మెరిసి పోతున్నాయి. ఆయన ఎత్తుకుని మోస్తున్న పేము బుట్ట కొంచెం పెద్దదే. గజం పొడుగు. రెండడుగుల వెడల్పు వుంది. ఒక రాజు కిరీటం తలను దాల్చినట్లే ఏ కష్టమూ లేకుండా అది బరువని ఆలోచన కూడా లేకుండా బాబా తన తల మీద మోస్తూ వెడుతున్నారు. బాబా వెనకాల నడుస్తున్నారు. ఆయన శిష్యుడు ముందు వెడుతున్నాడు. అతడు 5 అడుగుల 10 అంగుళాల పొడుగు ఉన్నాడు. మంచి బలిష్టంగా, ఆరోగ్యంగానే వున్నాడు. తండ్రి ఏ విధంగా తనయుని మీద బరువు మోపకుండా తన కుమారునికి ఎంతమాత్రము కష్టము కలగజేయకుండా వుంటాడో అలాగే బాబా ఆ బుట్టను మోస్తూ నడుస్తున్నారు. రాజాధిరాజుల రత్నఖచిత కిరీటాల కాంతులు తమ పాదపద్మాలకి నీరాజనాలివ్వ వలసిన పురుషోత్తముడు, ఈ బరువును తల మీద మోస్తున్నారు. బాబా యెంత అణకువ చూపుతున్నారు! కాని శిష్యుడు బాబా! నన్ను కూడా మోయనీయండి అని పలుమారు అడిగితే ఎట్టకేలకు కాదనలేక ఆ బుట్టను అతనికి యిచ్చారు. కొంత సేపయిన తరువాత ఆ బరువు మరల బాబా తీసుకున్నారు ఇలా, కొంత సేపు ఆయన, కొంత సేపు శిష్యుడు మోస్తూ వెళ్ళారు ఇంతలో లావిట్ స్టేషన్ వచ్చింది.

ఆ స్టేషన్ మాష్టరు ఒక వృద్ధుడు. అతడు షిరిడి సాయిబాబా భక్తుడు. ఎంతకాలం నుంచో మెహెర్ బాబా దర్శనం కోసం ఎదురు చూస్తున్నాడు. ఈ రోజున అతని పుణ్యం పండింది అందు కోసమే దిగిన చోట వుండక ఆ స్టేషన్‌కి వెళ్ళారేమో బాబా.

బాబా మెహెరాబాదు తిరిగి చేరుకున్నారు.

1938 నవంబరులో బాబా ఆదేశం ప్రకారం మెహెర్ జర్నల్ అనే పత్రిక ప్రచురణ ప్రారంభం అయినది. ఈ పత్రిక పని దాదా ఛాన్‌జీ, అబ్దుల్‌గనీ మున్షిఫ్‌లు చూస్తుండేవారు.

స మా ప్తం